ప్రాకృత అకాడెమీ ప్రచురణ-8

# బృహదారణ్యకమ్

డాక్టర్ తిరుమల రామచంద్ర, డి.లిట్.

ప్రాకృత అకాడెమీ
హైదరాబాద్ - 500 380.

# ముందు మాట

ఇదొక పెద్ద అరణ్యం. దీనిలో కసుక్కుమని కాళ్ళకు గుచ్చుకునే తుమ్మలూ ఉన్నాయి; పరమేశ్వరుని పూజకు పనికివచ్చే తుమ్మిపూల మొక్కలూ ఉన్నాయి. వాసనలు వెలార్చే మల్లీమతల్లికలూ ఉన్నాయి; వాసనలులేని కనకాంబరాలూ, డిసెంబర్లూ ఉన్నాయి. పత్తిగింజలలాగ పైకి కనిపిస్తూ నమిలిన కొద్దీ తేనెలు చిందే ఈనపళ్ళూ ఉన్నాయి; కరక్కాయలనే భ్రాంతి కలిగిస్తూ, పొట్టనిండా అమృతపూర్ణమైన పూర్ణంనింపుకొన్న బిక్కిపళ్ళూ ఉన్నాయి. పళ్ళు పులియజేసే, కారంతో చీదర కలిగించే పుల్లమామిళ్ళూ, మిరపలూ ఉన్నాయి. దేని విలువ దానిది; దేని రంగు దానిది; దేని రుచి దానిది; దేని వాసన దానిది.

ఈ వ్యాసాలన్నీ పత్రికలలో ప్రచురితమైనవే. వీటిని ముద్రించుకొనడానికి అనుమతించిన పత్రికా సంపాదకులకు కృతజ్ఞుణ్ని.

ఈ వ్యాస సంకలనాన్ని - బృహదారణ్యకాన్ని మిత్రులు శ్రీ వాకాటి పాండురంగరావుగారికి అంకితమిస్తున్నందుకు ఆనందిస్తున్నాను. పాండురంగ రావుగారు ఈ ప్రపంచారణ్యంలో నళినీదళగత జలంవలె ఉంటూ కర్తవ్యం నిర్వహించుకుపోతున్న కర్మయోగి. అరణ్యంలో నాటి ఋషులలాగా ప్రతిదాన్నీ ప్రశ్నించి, తర్కించి, వాదించి తత్త్వ నవనీతాన్ని వెలికి తెచ్చే తాత్త్వికుడు.

ఈ సంకలనాన్ని ముఖపత్రచిత్రంతో అలంకరించిన శ్రీ శ్వేతగారికి, చక్కగా ముద్రించిన లక్ష్మీగణపతి ప్రింటింగ్ ప్రెస్‌వారికి నా కృతజ్ఞతలు.

శ్రీముఖ భాద్రపద పూర్ణిమ,
ఆగస్టు 1993
హైదరాబాద్-380.

భాషా సేవకుడు,
తిరుమల రామచంద్ర

# అంకితం



వాకాటి పాండురంగరావుగారూ,

మీతో నా మైత్రి మీ అపరాజిత కథానిక నాటిది; తరం గడచినా అపరాజిత; ఇంకొక తరం గడచినా అపరాజితే.

మీరు దార్శనికులు. మీ దృక్పథం సజాతీయ విజాతీయ తత్త్వ గవేషణా భూషితమైన తథాపథం; సత్యపథం. ఆ విధంగా మీరు తథాగతులు. మీ గమ్యం మహత్తర సంస్కృతి సౌరభ సంభావితమైన సత్సమాజం. అది త్వరలో నెలకొంటుందా? ఏమో! నేనూ వేచి చూస్తాను.

ఆంధ్రావళి ఇప్పుడిప్పుడే మీ నవ్యదర్శనదీధితులను కొద్దికొద్దిగా కనుగొంటున్నది. దార్శనికునికి ఉండవలసిన దూరదృష్టి, సహనం, సమన్వయశీలం మీలో పుష్కలంగా ఉన్నవి. రచన మీకొక సాధనం మాత్రమే. దాని లక్ష్యం, సిద్ధి - సత్సమాజ నిర్మాణం.

అపరాజిత అయిన మన మైత్రికి ఈ నా చిన్నకానుక - వివిధ విషయ విరాజిత, స్వీకరించండి.

—తిరుమల రామచంద్ర

7

# విషయసూచిక

'రసో వై సః' కావ్య రసానికి అన్వయించదు

— ఆంధ్రపత్రిక కాళయుక్తి ఉగాది సంచిక 9

అర్ధ శతాబ్దిలో పత్రికలలో కలిగిన పరిణామం

— ఆంధ్ర సచిత్ర వార పత్రిక వజ్రోత్సవ సంచిక 16

జోస్యం నిజమా ? కాదా ?

— ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 18-5-60 23

రవీంద్రుని విశ్వమానవ మతం

— ప్రజావాహిని, చిత్తూరు, 2-6-61 30

ఒక బంగారు వర్తకుని గాథ

— ఆంధ్రప్రభ 2.9.56 37

కవి సమ్మేళనాలు, ముషాయరాలు

— ఆంధ్రపత్రిక 10.11-66 48

వీర మా మునివర్ – ఫాదర్ జోసెఫ్ బేషీ

— ఆంధ్రపత్రిక, 24-12-67 55

కావ్యాల్లోనే కానవచ్చే వసంతవిలాపం

— ఆంధ్రపత్రిక, 10-4-67 59

గాథలతో గొంతు విప్పిన తెలుగు రచయిత్రులు

— ఆంధ్రపత్రిక, 25-4-93 64

ఒకప్పుడు కేరళుల ఉగాది–ఓణం పండుగ

— ఆకాశవాణి, జమీన్ రైతు సాధారణ ఉగాది సంచిక 73

వివిధాల సంవత్సరాల పరిగణన

— ఆంధ్రపత్రిక, 29-3-68 78

కవికర్ణ రసాయనము — వాణి, శక 31-7-1891 83

భారత పాత్రలు — శ్రీ శంకరంబాడి సుందరాచారి సన్మానసభ 91

సర్కస్ కథ — ఆంధ్రపత్రిక, 23 4.1947 94

యోగమంటే ఏమిటి? — ఆంధ్రపత్రిక, 8-5-1966 98

కాకతీయుల యుద్ధ వ్యూహాలు — వాణి, 7-3-1964 111

మన పొరుగువారైన తమిళుల సంస్కృతి
— కృష్ణాపత్రిక, 14-12-1968 118
కళా బోధనలో మ్యూజియంల పాత్ర
— ఆంధ్రభూమి, 18-1-76 123
పాల్కురికి సోమనాథుని వైద్యక వైదుష్యం
— శివజ్యోతి, 1975 129
ఆంధ్రకేసరి ప్రకాశంగారూ— ఆనాటి మా మద్రాసు కుట్ర కేసూ
— ఆంధ్రప్రదేశ్, జూన్ 1972 138
జీవికోపయోగి భాష
— ఆంధ్రప్రదేశ్ అధికార భాషా ప్రత్యేక సంచిక 155
సుప్రభాత సుషమ
— శ్రీ యామిజాల పద్మనాభస్వామి దేవీసుప్రభాతం పీఠిక 160
కవులు ఎప్పుడూ అనుచరులే! — భారతి, ఫిబ్రవరి 1976 165
సోషలిస్టు పద్ధతి సమాజ వ్యవస్థలో కళ
— ఆంధ్రభూమి, 25-1-1976 170
నూతన దృక్పథం - కొమఱ్ఱాజువారు
— ఆంధ్రప్రదేశ్, నవంబర్ 1977 175
కులతత్త్వం : అప్పుడు, ఇప్పుడు
— భారతి, సెప్టెంబర్ 1966 184
సాహిత్యవ్యాప్తి : ప్రమాణాల పరిరక్షణ
— భారతి, జూన్ 1976 197
తెలుగు సాహిత్యం - గాంధీజీ
— ఆంధ్రపత్రిక, 2-10-1968 205
అనువాదం : దానిలోని చిక్కులు
— నేషనల్ బుక్ట్రస్ట్, మే 1970 211
అలీ సోదరులు —ఆంధ్రప్రదేశ్, డిసెంబర్ 1978 221
మహారాష్ట్ర కీర్తన కళ — ఆంధ్రపత్రిక, 24-9-1966 234
బౌద్ధంతో మొదలైన తెలంగాణా చరిత్ర
— ఆంధ్రపత్రిక, 2-11-1982 239
కళాపూర్ణోదయం విశిష్టత 248
"స్వప్రియం తు పరిత్యజ్య" — ఆంధ్రప్రదేశ్, జనవరి 1972 255
నేను కీర్తిశేషుణ్ణయితే.... — ప్రజాతంత్ర, 19-10-1975 259

౧

# 'రసో వై సః' కావ్యరసానికి అన్వయించదు

కావ్యనాటకాది పఠన శ్రవణ దర్శన జనితమైన రసం-శృంగారాదికం భగవత్స్వరూపమని, తదానందం బ్రహ్మానంద సబ్రహ్మచారి అని అలంకారికులు నిర్వచిస్తూ, దానికి ఉపబృంహకంగా తైత్తిరీయోపనిషత్తులోని బ్రహ్మానందవల్లి సప్తమానువాకంలోని "రసో వై సః రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"అనే వాక్యాలు ఉదాహరిస్తుంటారు. కావ్యానందమే బ్రహ్మానందమూ, బ్రహ్మానందసబ్రహ్మచారి అయితే, వేదాంతచర్చలూ, యోగానుష్ఠానాలూ, ఆత్మానుసంధానాలూ అవసరమే కావు. ఇదే సరైతే,

"అయం స రశనోత్కర్షీ
పీనస్తన విమర్దనః,
నాభ్యూరు జఘన స్పర్శీ
నీవీ విస్రంసనః కరః"

(అయ్యో ప్రియుడా మరణించావే! ఇది నీ చేయి. ఎలాంటిది? నా మొలనూలును లాగి, నా బలిసిన పాలిండ్లను నలిపి, నా పొక్కిలిని, తొడలను, పొత్తికడుపును కలయతడుముతూ కోకముడిని విప్పేది.) అని ప్రియ మరణంతో దుఃఖించిన నాయిక విలాపంవల్ల కరిగిన కరుణానుప్రాణిత శృంగారమూ బ్రహ్మానంద సదృశమవుతుంది. స్తన జఘన విమర్ద వర్ణనవల్ల కలిగే రసానందం బ్రహ్మానంద సదృశమని, ఈ రసం బ్రహ్మమో, ఆత్మో అని అంటే ఎందుకో నమ్మబుద్ధి పుట్టడం లేదు. ఇలా పోల్చడమూ, భావించడమూ గొప్ప పొరపాటనే అనిపిస్తుంది.

తైత్తరీయ బ్రహ్మానందవల్లి సప్తమానువాకంలోని ఆ భాగం ఉదాహరించి దాని ప్రసంగ పౌర్వాపర్యాలు పరిశీలిద్దాం:

"అసద్వా ఇద మగ్ర ఆసీత్। తతో వై సదజాయత। తదాత్మానగ్ం స్వయ మకురుత। తస్మా త్తత్సుకృత ముచ్యత ఇతి। యద్వై త త్సుకృతం।

రసో వై సః। రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి। కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆనందో న స్యాత్। ఏష హ్యేవానందయాతి........"

ఇది ఈ అనువాకంలోని భాగం దీని అర్థం ఇది :

"పూర్వం ఇది (జగత్తు) అసత్తుగా (అవ్యాకృత బ్రహ్మరూపంగా) వుండనది. దానినుంచి సత్తు (నామరూపాత్మక వ్యక్తం) జనించింది. ఆ అసత్తు స్వయంగానే తనను (నామ రూపాత్మక జగద్రూపంలో) రచించుకున్నది. అందువల్ల అది సుకృతం (స్వయం రచితమైనది) అని వ్యవహృతమవు తున్నది. ఈ సుకృతం నిశ్చయంగా రసమే. ఈ రసాన్ని పొంది పురుషుడు ఆనంది అవుతున్నాడు. హృదయాకాశంలో ఈ ఆనందం (ఆనంద స్వరూపు డైన ఆత్మ) లేకపోతే, ఎవరు అపానక్రియను, ప్రాణనక్రియను చేయగలరు? ఇదే వారిని ఆనందింపజేస్తున్నది....'

ఉపనిషద్వ్యాఖ్యాతలైన పెద్దలలో మొదటివారయిన శంకర భగవ త్పాదులు ఈ వాక్యాలను ఎలా వ్యాఖ్యానించారో చూద్దాం.

"....తస్మా దస్తి తద్ బ్రహ్మ సుకృత ప్రసిద్ధేః। ఇతశ్చాస్తి। కుతః? రసత్వాత్। కుతో రసత్వ ప్రసిద్ధిః బ్రహ్మణః ఇత్యత ఆహ:

"యద్వై తత్సుకృతమ్। రసో వై సః। రసో నామ తృప్తిహేతురానంద కరో మధురామ్లాదిః ప్రసిద్ధో లోకే।రసమేవాయం లబ్ధ్వా ప్రాప్యానందీ సుఖీ భవతి। నాసతః ఆనంద హేతుత్వం దృష్టం లోకే। బాహ్యానంద సాధన రహితా అప్యనీహా నిరీషణా బ్రాహ్మణా బాహ్య రసలాభాదివ సానందా దృశ్యంతే విద్వాంసః; నూనం బ్రహ్మరసః తేషామ్। తస్మాదస్తి తత్తేషా మానంద కారణం రసవద్ బ్రహ్మ।

"ఇతశ్చాస్తి। కుతః? ప్రాణనాది క్రియాదర్శనాత్। అయమపి హి పిండో జీవతః ప్రాణేన ప్రాణిత్యపానే నాపానితి। ఏవం వాయవీయా ఇంద్రియకాశ్చ చేష్టాః సంహతైః కార్యకారణైః నిర్వర్త్యమానా దృశ్యంతే। తచ్చైకార్థ వృత్తిత్వేన సంహననం నాంతరేణచేతన మసంహతం సంభవతి। అన్యత్రా దర్శనాత్।

"తదాహ - తద్యది ఏష ఆకాశే పరమే వ్యోమ్ని గుహాయాం నిహిత ఆనందో న స్యాత్ న భవేత్ కో హ్యేవ లోకేఽన్యాదపానచేష్టాం కుర్యాదిత్యర్థః। కః ప్రాణ్యాత్ప్రాణనం వా కుర్యాత్తస్మాదస్తి తద్ బ్రహ్మ యదర్థాః కార్యకారణ ప్రాణనాదిచేష్టాః తత్కృత ఏవ చానందో లోకస్య।

"కుతః? ఏష హ్యేవ స ఆత్మా ఆనందయా త్యానందయతి సుఖయతి

లోకం ధర్మానురూపం। స ఏ వాత్మా ఆనందరూపోఽవిద్యయా పరిచ్ఛిన్నో విభావ్యతే ప్రాణిభిరిత్యర్థః।...." [తైత్తరీయ శంకరభాష్యం 175-177, గీతా ప్రెస్, గోరఖ్‌పూర్.]

దీని వివరణ కూడా తెలుగులో ఇవ్వడం న్యాయం.

"....అందువల్ల ఆ సుకృత రూప ప్రసిద్ధి సత్తువల్ల; అది బ్రహ్మ అని సిద్ధమవుతున్నది. బ్రహ్మ ఇందువలన కూడ అవుతున్నది. ఎందువల్ల? రస స్వరూపం కావడంవల్ల. బ్రహ్మకు ఈ స్వరూప ప్రసిద్ధి ఏ కారణం వలన? దీనికి శ్రుతి యిలా అంటున్నది :

"ప్రసిద్ధ సుకృతమైనదంతా నిశ్చయంగా రసమే. పులుపు, తీపి అనే తృప్తిదాయకం ఆనందకరం అయిన పదార్థం లోకంలో రసమని ప్రసిద్ధం. ఈ రసాన్ని పొంది పురుషుడు, ఆనంది, అర్థాత్ సత్తు అవుతున్నాడు. లోకంలో అసత్ పదార్థం ఆనంద హేతువుగా కనిపించదు. బ్రహ్మనిష్ఠులు, నిరీహులు, నిర పేక్షులు అయిన విద్వాంసులు బాహ్య సుఖ సాధన రహితులయినా, బాహ్య రసలాభంతో ఆనందితులయిన వారివలె ఆనందితులయినట్టు కనిపిస్తారు. నిశ్చయంగా వారి రసం బ్రహ్మ. అందువల్ల రసానికి సమానంగా దానికి ఆనంద కారణమయినది బ్రహ్మ.

"ఇందువలన కూడా ఇది బ్రహ్మ. ఎందువలన? ప్రాణనాది క్రియను చూడడంవల్ల. జీవించినవాని పిండం కూడ ప్రాణ సహాయంతో ప్రాణన క్రియ జరుపుతున్నది, అపానవాయు ద్వారా అపాన క్రియ జరుపుతున్నది. ఈ విధంగా సంహతం పొందిన ఈ శరీరేంద్రియ చేష్టలు, వాయవీయ చేష్టలు నిర్వర్తింప బడుతుండడం చూస్తున్నాము. ఈ వాయ్వాది అచేతన పదార్థాల ఏకైకోద్దేశ సిద్ధికోసం పరస్పరం సంహతం (అనుకూలం) కావడం ఏదో అసంసారమైన (దేనితోనూ చేరని) చేతనం లేనిదే సాధ్యం కాదు; ఎందుకంటే, ఇలాటిది మరెక్కడా చూడలేదు గనుక.

"దీనినే శ్రుతి ఇలా చెబుతున్నది : ఆకాశంలో పరమాకాశంలో అర్థాత్ బుద్ధిరూప గుహలో మరుగైన ఈ ఆనందం లేకపోతే లోకంలో ఎవరు అపాన క్రియ చేయగలరు? ప్రాణనక్రియ చేయగలరా? అందువల్ల అది బ్రహ్మమే. దీనివల్లనే శరీరేంద్రియాల ప్రాణనాది చేష్టలు జరుగుతున్నవి; లోకానందం కూడా తత్కారణమే.

"ఇది ఎందుకు? ఎందుకంటే, ఈ పరమాత్మే లోకాన్ని దాని ధర్మాను సారం ఆనందింపజేస్తున్నది; సుఖమయం చేస్తున్నది. దీని అంతర్యమేమిటంటే,

ఆనందరూపి అయిన ఆత్మనే ప్రాణులు అవిద్యావరిచ్ఛిన్నంగా భావిస్తున్నాయి...."

దీనివల్ల 'రసో వై సః' వాక్యంలోని రసం ఆత్మ తప్ప మరొకటి కాదని స్పష్టం కదా!

అభినవ గుప్తాచార్యులు కావ్యరసం బ్రహ్మానంద రసంలోని తుంపర వంటిదిగా అవభాసించేదే కాని, బ్రహ్మానంద సబ్రహ్మచారి కాదని ధ్వన్యాలోకంలోని "యా వ్యాపారవతీ" శ్లోక వివరణలో ఇలా అన్నారు :

"....సకల ప్రమాణ పరినిశ్చిత దృష్టా దృష్ట విషయ విశేషజం యత్సుఖం, యదపి వా లోకోత్తరం రస చర్వణాత్మకం తత ఉభయోరపి పరమేశ్వర విశ్రాంత్యానందః ప్రకృష్యతే, తదానంద విప్రుణ్మాత్రావభాసో రసాస్వాద ఇత్యుక్తం ప్రాగస్మాభిః। లౌకికం తు సుఖం తతోఽపి నికృష్ట ప్రాయం బహుతర దుఃఖానుషంగా దితి తాత్పర్యమ్।" [ధ్వన్యాలోకలోచనం, తృతీయోద్యోతమ్]

"సకల శాస్త్రాలూ నిరూపించే ఐహికాముష్మిక విషయ విశేషజన్యమైన సుఖంకన్నా, లోకోత్తరమై రసచర్వణాత్మకమైన సుఖానికన్నా ప్రకృష్టమైంది పరమేశ్వర విశ్రాంత్యానందం – పరమేశ్వరునిలో ఐక్యమయ్యే ఆనందం. ఆ ఆనంద కణమాత్రావభాసమైనది రసాస్వాదనమని ఇంతకుముందు మేము అన్నాము. లౌకిక సుఖమయితే బహుతర దుఃఖ సంబంధంవలన అంతకన్నా నికృష్ట ప్రాయమని తాత్పర్యం."

ఈ వాక్యాలనుబట్టి అభినవ గుప్తాచార్యుల మతంలో రస చర్వణాత్మకమైన సుఖం లౌకిక సుఖంకన్నా ఒకమెట్టు ఎక్కువే గాని, పరమేశ్వర విశ్రాంత్యానంద సదృశం ఎంత మాత్రమూ కాదు.

కావ్యానందాన్ని గురించి అభినవగుప్తులు యింత తెగవేసి చెప్పినా జగన్నాథ పండితులు 'రసో వై సః'ను కావ్య రసానికి అన్వయించడమే కాక అభినవ గుప్తాచార్యుల మతమూ ఇదేనని అనడం ఆశ్చర్యం కలిగిస్తుంది. అభినవ గుప్తుల మతాన్ని అపార్థం చేసుకొన్నారా జగన్నాథ పండితులు? ఆయన వాద సరళిని చూస్తే అపార్థం చేసుకున్నట్టు కాక, తనవాదానికి అనుకూలంగా లాగినట్టే కనిపిస్తుంది.

"అథాస్యాం సుఖాంశభానే కిం మానమితి చేత్ సమాధావపి తద్భావే కిం మానమితి పర్యనుయోగస్య తుల్యత్వాత్।

సుఖ మాత్యంతికం య త్తత్
బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయమ్
స్థితః చలతి త త్త్వతః. (గీత 6-20)

ఇత్యాదిః శబ్దోఽ స్తి తత్ర మాన మితిచేత్, అస్త్యత్రాపి రసో వై సః రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి ఇతి శ్రుతిః, సకల సహృదయ పక్షం చేతి ప్రమాణద్వయమ్। యేయం ద్వితీయపక్షే తదాకార చిత్త వృత్త్యాత్మికా రస చర్వణోపన్యస్తా సా శబ్ద వ్యాపార భావ్యత్వాద్భాబ్దీ। అపరోక్ష సుఖాలంబన త్వా చ్చా పరోక్షాత్మికా। త త్త్వం వాక్యజ బుద్ధివత్। ఇత్యాహు రభినవ గుప్తా దార్యాః." [రస గంగాధరః - 25.27 కావ్యమాల, బొంబాయి-1939]

"[శంక] మఱి చర్వణకు సుఖాంశ భానమున్న యేమి ప్రమాణము?
[సమా] సమాధియందు యోగికి కలుగు ప్రతీతి సుఖాత్మక మననేమి ప్రమాణము? అని మేము ప్రతి ప్రశ్న చేయుదుము.

యత్రోభయో స్సమో దోషః
పరిహారోప్యపి తాదృశః,
నైకః పర్యనుయోక్తవ్యః
తాదృ గర్థ విచారణే.

అని నియమము. ఏ విషయమున వాద ప్రతివాదులకు దోష పరిహారములు సమానములో, అట్టి అర్థ విచారమువట్ల ఒకడు ఇంకొకరిని ప్రశ్నింపరాదు. ఉభయులు మిన్నకుండుట పాడి.

[శంక] సమాధి ప్రతీతికి సుఖాంశమున్నదను మాకు స్మృతి ప్రమాణము కలదు. ఎట్లన?

సుఖ మాత్యంతికం య త్తద్
బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం
స్థితః చలతి త త్త్వతః. (గీత, 6.21.)

అనంతమగు సుఖమేది కలదో అది ఇంద్రియ నిరపేక్షము, కేవల బుద్ధి గ్రాహ్యము (కేవలబుద్ధి భాసకము) అగును. ఆ విషయ జనితమగునట్టి సుఖమును సమాధియందు ఎవడనుభవించుచున్నాడో వాడు జ్ఞాని, ఆత్మ స్వభా

వము నందు నిలిచినవాడు. కావుననే అతడు తాత్త్వికరూపమునుండి చలింపడు అని భావము.

[సమా] రసచర్వణ యందును సుఖాంశభానము కలదనుమాకు గరీయః ప్రమాణము శ్రుతి ప్రమాణము కలదు.

(1) రసో వై సః, (2) రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి:- అని [తైత్తిరీయోపనిషత్తు] నిశ్చయముగా ఆ సచ్చిదానంద స్వరూపుడు ఆత్మ రసము. ఆ యాత్మ రసమును పొంది ప్రమాత ఆస్వాద్యుడే-పరమానంద స్వరూపుడే- యగును. నిజము- అని శ్రుత్యర్థము. కావ్యరసా స్వాదనమందు నాటకము చూచినట్టి కాని, శ్రవ్యకావ్యమును వినునట్టి కాని సకల సహృదయుల యొక్క ప్రత్యక్షానుభవము ప్రమాణము. అట్లే సమాధియందు ఆత్మ సాక్షాత్కార మొందు యోగీశ్వరుని యపరోక్షానుభవము ప్రమాణము. ఇట్లు ఉభయులకు కలదనుట తుల్యము. ఇది ప్రథమ పక్షానుసారము.

ద్వితీయ పక్షమందు రసచర్వణ ఏది చెప్పబడెనో, అది అనందాకార చిత్తవృత్తి. అది శబ్దవ్యాపారమగు వ్యంజనా వ్యాపారమగుటంజేసి, శాబ్ది (శబ్దబోధరూపము). వెండియు అపరోక్ష విషయీభూతము ఏయానందము కలదో అది ఆత్మరూపము. అది ఈ చర్వణకు ఆలంబము (విషయము) అగుట ప్రత్యక్షరూపము.

[శంక] శాబ్దికత్వము, అపరోక్షత్వము ఎట్లు సరిపడును? నైయాయిక మతము ఒప్పదే.

[సమా] పోనీ, నైయాయికులు ఒప్పరు గాక। వేదాంతులు ఒప్పుదురు. తత్త్వమసి అను శ్రుతివాక్యముచే జీవబ్రహ్మైక్య ప్రతీతి కలుగునప్పుడు అది అపరోక్షమును, శాబ్దమునైన జ్ఞానముగ నంగీకృతము. అట్లే సాహిత్యశాస్త్రము నందును రసచర్వణము శబ్దమును అపరోక్షమునైన జ్ఞానమని యెఱుక.

ఈ పై జెప్పినది అభినవగుప్తాచార్యపాదుల మతము. ఇది సిద్ధాంతము."

[శ్రీ ధరణికోట వెంకటసుబ్బయ్య అనువాదం పుటలు : 113-115]

జగన్నాథ పండితులు అభినవగుప్తుల ఆశయాన్ని అపార్థం చేసుకొన్నారని తోస్తుంది. ఈ శంకే శ్రీ జె. ఎల్. మాసన్, ఎం. ఏ. పట్వర్ధన్‌లకూ కలిగింది. వారు ఇలా అన్నారు :

"రసో వై సః। రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి- **Actually however this scriptual statement refers to the Atman and not to aesthetic experience. The proper meaning of the statement**

is; 'That (Atman) is surly (Nai) Rasa (Joy or Bliss). Having realised the (Atman which is) Rasa (Bliss) he becomes happy or Blissful. In the first part of the quotation it is said that having realised that Atman which is Rasa rupa or Ananda-rupa he ie, the spirutual aspirant (Sadhaka) becomes supremely happy (Anandi Bhavathi). But Jagannatha seems to have understood both parts of the quatation as referriug to Rasa to Poetry or Drama ie as referring to aesthetic experience. He understood the second part to mean; "having realised Rasa, ie. the emotional flavour, he (ie. the sahridaya or Samajika) becomes supremely happy. But we doubt very much if the quotation from the Upanishwod is capable of such interpretation."

[Santarasa and Abhinavaguptas Phisosophy of Aesthetics pp 177. 1969 BORI]

బ్రహ్మానంద స్వరూపాన్ని బ్రహ్మానందవల్లి అష్టమానువాకంలో వివరించింది. ఆ ఆనందాల పరంపరలో మానుషానందం అట్టడుగుది. అలాంటప్పుడు కావ్యానందాన్ని ఆనందాలకు శిఖరమైన బ్రహ్మానందంతో పోల్చడం ఉచితం కాదనిపిస్తుంది. దీని ఔచిత్యా నౌచిత్యాలకు సహృదయ విమర్శకులే గీటురాయి.

(ఆంధ్ర పత్రిక కాలయుక్తనామ సంవత్సరాది సంచిక)

★★

౧౬

# అర్ధశతాబ్దిలో పత్రికలలో కలిగిన పరిణామం

బ్రిటిష్ పరిపాలన ప్రాభవం ప్రోదిగా తెలుగు సారస్వతంలో పూచిన పొన్నలలో ఒకటి పత్రికా రచన. క్రైస్తవ పాదిరీలు తమ మత ప్రచారంకోసం తెలుగు ముద్రణ యంత్రాలు నెలకొల్పి, కరపత్రాలను, పుస్తకాలను ముద్రించడం ప్రారంభించారు. ఈ ముద్రణ వంగరాష్ట్ర రాజధాని (అప్పటి భారత రాజధాని) అయిన కలకత్తా సమీపంలోని శ్రీరాంపూర్‌లో మొదలై చెన్నరాష్ట్రానికి తరలి వచ్చింది.

(2) ముద్రణ సౌకర్యం లభించడంతో 19వ శతాబ్ది రెండవ పాదంలో తెలుగు పత్రికలు వెలశాయి. ఇలా వెలసిన తొలి తెలుగువారపత్రిక సత్యదూత (1835). రెండవది వృత్తాంతిని (1838). మూడవది వర్తమాన తరంగిణి (1842). ఇవి, తర్వాత వచ్చిన పత్రికలు ప్రధానంగా సారస్వత విషయాలను మాత్రమే ప్రచురించేవి. కొన్ని పత్రికలు శబ్దచర్చలమీద, ఆచార వ్యవహారాల మీద కోడిపుంజుల భారతం సాగించేవి. దీనికి ఉదాహరణ కందుకూరి వీరేశ లింగం పంతులు, కొక్కొండ వెంకటరత్నం పంతులుగార్ల పత్రికలు. అముద్రిత గ్రంథ చింతామణి వంటివి ప్రాచీన గ్రంథాలను భాగాలు భాగాలుగా ధారావాహికంగా ప్రచురించేవి.

(3) గాజుల లక్ష్మీనరసింహ సెట్టిగారు క్రిసెంట్ అనే ఆంగ్ల వారపత్రికను 1942 అక్టోబర్ 2వ తేదీని ప్రారంభించి దక్షిణభారత దేశంలో రాజకీయ చైతన్యం కలిగించారు. తెలుగులోను రాజకీయ పత్రికలు అవసరమని ప్రజలు గుర్తించారు. ఒక తెల్లదొర కడపలో ఒక రాజకీయ వారపత్రికను ప్రచురించాడు. ఇదే తొలి తెలుగు రాజకీయపత్రిక. ఇంగ్లీషు దొరతనం వారి హుకుంలు, తాఖీదుల అనువాదాలు ఈ పత్రికలో అచ్చయ్యేవి. ఒకమారు రాజప్రతినిధిగారు జారీచేసిన హుకుమును అనువాదకుడు తలక్రిందులుగా అనువదించడంవల్ల పెద్ద రభస జరిగింది. పత్రికా యజమాని తెల్లదొర కావడంతో బ్రతికిపోయాడు. ఈ ఉదంతం తర్వాత పత్రికా రంగంలో వచ్చిన మార్పు ప్రత్యేకాధికారిని

ప్రభుత్వం నియమించడం. నాటినుంచి ఈ పీడ పత్రికలకు ఏదో రూపంలో అంటుకొనే వుంది.

(4) తర్వాత స్థానికులే రాజకీయ పత్రికలు నెలకొల్పారు. ఈ విధంగా వెలువడిన తొలి రాజకీయ పత్రిక శ్రీ యక్షిణి (1863- బళ్ళారి). అంటే, తొలి తెలుగుపత్రిక వెలువడిన ఇరవయ్యేళ్ళకు గాని రాజకీయపత్రిక వెలువడలేదు. పిదప స్వదేశజన ప్రసిద్ధాభిప్రాయము (1865), లోకరంజని (1875), శశిరేఖ (1894) మున్నగు పత్రికలు వెలువడ్డాయి. వీటిలో రాజకీయాలతోపాటు సాహిత్యాది విషయాలు వుండేవి. 1885 లో భారత జాతీయ కాంగ్రెస్ అవతరణతో దేశంలో రాజకీయ చైతన్యం వ్యాప్తి చెందసాగింది.

(5) పెరుగుతున్న జాతీయోద్యమాన్ని ప్రతిబింబించడంకోసం, తెలుగువారిలో సర్వతోముఖ జాగృతికోసం, ఆధునిక విజ్ఞానాన్ని అందివ్వడంకోసం అప్పటి దేశభక్తులైన నవయువకులు పూనుకున్నారు. కాంగ్రెస్‌వాది, దేశభక్తుడు అయిన ఎ. పి. పార్థసారథి నాయుడుగారు ఆంధ్ర ప్రకాశిక అనే వారపత్రిక స్థాపించి, 25 సంవత్సరాలపాటు సంపాదకుడుగా వుండి ప్రభుత్వాన్ని నిర్భయంగా విమర్శించారు. ఈ వారపత్రిక తర్వాత కొంతకాలం వారానికి రెండు మార్లు వెలువడేది. జాతీయోద్యమ దృష్టితో వచ్చిన పత్రికలు కృష్ణాపత్రిక (1902), స్వరాజ్య (1906-రాజమండ్రి), నవయుగ (1907), ఆంధ్రకేసరి (చిలుకూరి వీరభద్రరావు 1908), సాధన (అనంతపురం.1915) మున్నగునవి. కృష్ణాపత్రికకు తొలుత కొండా వెంకటప్పయ్య, దాసు నారాయణరావుగార్లు సంపాదకులుగా వున్నారు. రెండు సంవత్సరాల తర్వాత ముట్నూరు కృష్ణారావుగారు సంపాదకులయి, ద్వితీయ యుద్ధ సమయం వరకు అవిచ్ఛిన్నంగా నిర్వహించారు. తర్వాత ఇది రెండు దశాబ్దాలు మనగలిగింది. స్వరాజ్య సంపాదకులు గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు.

(6) అప్పటికే గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయుల సేవతో సుప్రసిద్ధులయ్యారు. ఆయన సత్యాగ్రహ పద్ధతులు భారతీయులకు నచ్చాయి; ముఖ్యంగా తెలుగువారయిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వంటివారికి. గాంధీజీ అడుగుజాడలలో దేశసేవ, ఆంధ్రుల సమగ్రాభివృద్ధి ప్రధానలక్ష్యంగా వెలువడిన తొలివారపత్రిక ఆంధ్రపత్రిక. ఇది 1908 లో బొంబాయి నుంచి వెలువడినా, క్రమంగా జాతీయోద్యమం తెలుగునాట పుంజుకొనడంతో మద్రాసుకు తరలి వచ్చి తొలి దినపత్రికగా మారింది. అప్పుడు దాని సైజు అరడెమ్మీ.

(7) ఆనాడు తెలుగులో పత్రికానుభవం గలవారు లేరు; పత్రికా

పరిభాషకూడ లేదు. కనుక పత్రికకు సంబంధించిన ప్రధాన పరిభాషను వంగ భాష నుంచి గ్రహించారు - పత్రికా సంపాదకుడు, విలేఖకుడు మొదలుగా. అలాగే పత్రిక స్వరూప స్వభావాలను గురించి కూడ తెలుగువారికి ఎక్కువ పరిచయం లేదు. ఆమాటకు వస్తే నూరేళ్ళ క్రిందట పుట్టిన హిందూ పత్రికకు కూడ లేదు. అది అప్పటి లండన్ టైమ్స్‌ను అన్నివిధాల అనుకరించింది. లండన్ టైమ్స్ చాల ప్రతిష్ఠగలది; పత్రికా నీతికి పూర్తిగా కట్టుబడి వుండేది గనుక గౌరవం గల ఆనాటి తెలుగు పత్రికలు కూడ దాని పద్ధతినే అనుసరించడం సహజం. మన మొదటి రాజకీయ దినపత్రిక అయిన ఆంధ్రపత్రిక కూడ అదే వరవడిని నడిచింది. ఉదాహరణకు: వార్తలకు సాధారణంగా లేబిల్ హెడ్డింగులే ఇచ్చేవారు. అంటే - రాజమండ్రి వార్తలు, విజయవాడ వార్తలు, ఢిల్లీ వార్తలు ఇత్యాదిగా. ఈ పద్ధతి 1932 లోను కనిపిస్తుంది.

"తిరుపతి

(స్వకీయ విలేఖరి)

32 ఫిబ్రవరి 5

క్రిమినల్ లా చట్టము అరెస్టు. 6 నెలల కఠినశిక్ష. 4.2 32 తేదీ సాయంకాలము సుమారు 4½ ఘంటలకు శ్రీయుత తిరుమల రామచంద్రాచార్లు అనువారు తిరుపతి బజారువీథిలో బహిష్కరింపబడిన, చేతితో వ్రాయబడిన కరపత్రములను పంచిపెట్టిరనియు, పోలీసుస్టేషనుకు వచ్చి హెడ్‌కానిస్టేబిల్ వద్ద ఒక కాపీని కూడ ఇచ్చినట్లును తెలియుచున్నది. సదరు హెడ్‌కానిస్టేబిలు దానిని చదివి చూచుకొని వీరిని అరెస్టుచేసి స్పెషల్ రిపోర్టుతో సబ్ ఇన్‌స్పెక్టర్ గారికి సాయంకాలము 5 కు పైగా హాజరు చేసిరి. వీరివద్ద నుండిన 150 కరపత్రములను కూడ పోలీసువారు వశపరచుకొనిరి."

క్రమంగా ఆంధ్రపత్రికలో ఈ లేబిల్ హెడ్డింగులను, సింగిల్ కాలంలను విసర్జించి, విషయ ప్రాధాన్యానికి అనువుగా శీర్షికలివ్వడం ప్రారంభమయింది. తర్వాత వచ్చిన దినపత్రికలకు ఇది వరవడి అయింది.

(8) ఇది ఇలా వుండగా, తెలుగుదేశంలో వచ్చిన రాజకీయ పరిణామాలు పత్రికలలో పెద్దమార్పులు తెచ్చాయి. కాంగ్రెస్‌వారు విదేశీవస్త్ర బహిష్కరణం, సత్యాగ్రహం, సహాయ నిరాకరణం వంటి సౌమ్య సాధనాలతో విస్తృత స్వాతంత్ర్యాన్ని సాధించడంకోసం పోరాడుతూ సత్యాగ్రహులతో కారాగారాలను నింపుతున్న సమయంలో, జమీందార్లు, వారిలాటివారు బ్రిటిష్ ఛత్రచ్ఛాయలో పరిమిత స్వాతంత్ర్యం చాలునని, దాని సాధనకు జస్టిస్‌పార్టీ,

పీపుల్స్‌పార్టీలాంటి నూతన రాజకీయపక్షాలు నెలకొల్పుకొన్నారు. ఆ పార్టీలకు అధికార పత్రికలు పుట్టాయి; అవే సమదర్శిని, జనవాణిలాంటివి. ఈ పత్రికలు రాజకీయంగా ఏమి చేసినా, ఏమి వ్రాసినా పత్రికా రంగంలో పెద్ద మార్పు తెచ్చాయి. అంతవరకు తెలుగుదేశంలో వున్న రాజకీయ పత్రికలు ప్రౌఢ గ్రాంథిక భాషనో సరళ గ్రాంథికాన్నో వాడుతూండేవి. వ్యాపార ప్రకటనలకు కూడ గ్రాంథికమే. ఉదాహరణకు 1934 ఫిబ్రవరి 4 నాటి కృష్ణాపత్రిక నుంచి మూడు అంశాలు ఉట్టంకిస్తాను :–

(అ) సంపాదకీయం:- రౌండుటేబిలు. రౌండు టేబిలు తతంగమంతయు బయటపడినది. అర్ధమరేయి అరదళపు అలంకారము అడుగంటినది. పగటివేళల మసిబొగ్గుచాయ బయటపడినది. మన రౌండుటేబిలు ప్రతినిధులు లోకము నెంతకాలము మభ్యపెట్టగలరు?

(ఆ) వార్త :- భూమి తనఖా బ్యాంకులు. మదరాసు ప్రభుత్వమువారు సహకారపు భూమి తనఖా బ్యాంకులను ప్రయోజనకరములు కావించి వాని నిర్వహణమున కానుకూల్యము ఘటించుటకై మదరాసు శాసనసభలో నొక బిల్లును ప్రవేశ పెట్టుదురని ప్రకటింపబడినది.

(ఇ) అడ్వర్‌టైజ్‌మెంట్ :- క్షీరవర్ధని. శిశుపోషణకు అత్యుత్తమము. పిల్లలపాలిటి కామధేనువు. తల్లికి నూతనశక్తిని ఉత్సాహమును పుట్టించును. శిశువునకారోగ్యమును నానందమును కలిగించును. తల్లియొక్క శ్రమను తగ్గించును, తండ్రి వ్యయము తగ్గించును.

జస్టిస్‌పార్టీ, పీపుల్సు పార్టీ పత్రికలు తమ వాదాన్ని విశేష వ్యాప్తిలోకి తేవడానికి వాడుకభాషను ప్రవేశపెట్టాయి. దీనివల్లనైతేనేమి, జాతీయోద్యమోద్ధతి వల్లనైతేనేమి, జస్టిస్‌పార్టీవారు, జమీందారులు తమ వారిని కూడగట్టుకోడానికి చేసిన ప్రయత్నంవల్లనైతేనేమి వాడుకభాషలోని పత్రికకు ప్రచారం ఎక్కువ వస్తుందన్న సంగతి రుజువయింది. నాటినుంచి పత్రికా రంగంలో అప్పుడప్పుడు సరళగ్రాంథికం కనిపించినప్పటికీ మొత్తంమీద వాడుకభాష పత్రికాభాషగా రూపొందింది. పూర్తిగా వాడుకభాషలో వచ్చిన మొదటి దినపత్రిక, తెలుగులో మలి దినపత్రిక ఆంధ్రప్రభ (1988). ఆంధ్రప్రభలో భాష మొదటినుంచి చివరివరకు ఏకరీతిగాను, సరళంగాను వుండడానికి కారణం వాడుకభాషలో వెలువడే జనవాణి మూతపడడంతో అందులో పనిచేసిన నార్ల వేంకటేశ్వర రావుగారు దీనిలో చేరడం, సంపాదకులు న్యాపతి నారాయణమూర్తిగారు వ్యవహార భాషావాది కావడమూ కావచ్చు. ఈ పరిణామం వల్ల తర్వాత ఆంధ్రపత్రిక కూడ గ్రాంథికాన్ని వార్తలలో విసర్జించడం మొదలుపెట్టింది.

(9) తెలుగు పత్రికలలో ఇంతటి మార్పు వస్తున్నప్పటికీ హిందూపత్రిక మాత్రం ఏ మార్పులేక నడుస్తూ వుండేది. దాని మొదటిపుటలో వార్తలు వుండేవి కావు, వ్యాపార ప్రకటనలే వుండేవి. సంపాదకీయ పుటతో వార్తలు మొదలయ్యేవి. 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన వార్తను కూడ హిందూపత్రిక లోపలి పుటలో సింగిల్ కాలం శీర్షికతో ముద్రించింది. కాని, ఆ సాంప్రదాయికపు పట్టుదలను అది క్రమంగా విడువక తప్పలేదు. 1948 జనవరి 29న ఒక క్రూరుడు గాంధీజీని హత్యచేసినప్పుడు ఆ వార్తను సంపాదకీయ పుటలో, డబుల్ కాలం శీర్షికతో డబుల్ కాలంలో ప్రచురించింది. హిందూపత్రిక చరిత్రలో ఇదే తొలి డబుల్ కాలం. దీనిని ఆనాడు హైదరాబాద్ నుంచి అడివి బాపిరాజుగారి సంపాదకత్వంలో వెలువడుతున్న మీజాన్ దిన పత్రిక బాక్సుకట్టి ఒకవైపు ప్రచురించింది. హిందూ లాంటి ప్రతిష్ఠగల పత్రిక భారతదేశ స్వాతంత్ర్య సిద్ధికన్నా గాంధీజీ హత్యకు ఎక్కువగా చలించిపోయి ఉంటుందని అనుకోవాలిమరి! అప్పటినుంచి ఆ పత్రిక కొంతకాలంపాటు సంపాదకీయ పుటలలో వారానికొకమారు ఒక సంచలనాత్మకవార్తను డబుల్ కాలంలో ప్రచురిస్తూ వచ్చింది. అప్పటికే తెలుగు పత్రికలు, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వంటి ఇంగ్లీషు పత్రికలు స్ట్రీమర్లు, బ్యానర్లు, డబుల్ కాలాలు, ట్రిబుల్ కాలాలు, యాంకర్ కాలాలు ఇవ్వడం మొదలుపెట్టాయి. కాని హిందూ పూర్వాచార పరాయణత్వాన్ని గాంధీజీ అంతటివాని హత్య మాత్రమే తొలగించగలిగింది. కాని దానిలోను వార్తలు క్రమంగా మొదటి పుటకు పాకాయి.

(10) ఆంధ్రపత్రిక తర్వాత వచ్చిన పత్రికలన్నిటికీ ఆదిగురువయినట్లే వార్షిక సంచికలు, ప్రత్యేక సంచికలు వెలువరించిడంలోను మార్గదర్శకమైంది. ఆంధ్రపత్రిక వార పత్రికకు అనుబంధంగా 1910 లో మొదటి ఉగాది సంచిక వెలువరించింది. నాగేశ్వరరావు పంతులుగారు దాని 'విన్నపము'లో "భగవదను గ్రహము వలనను, నాంధ్ర మహాజనుల యాదరాతిశయము వలనను నీ సంచిక బహిర్గతము గాజాలినది. గ్రంథాదిని స్వకీయ విషయిక ప్రశంసను జేయుట సామాన్యము." అంటూ సాధకబాధకాలు వివరించారు. జాతీయోద్యమ సమయం లోను, స్వాతంత్ర్యానంతరమూ ఫీల్డ్ సర్వే, పేపర్ సర్వేలను కొంత ఆంధ్ర పత్రిక చేసింది. కాని, అది తర్వాత బలం పుంజుకోలేదు. వాటితోపాటే పరిశోధనాత్మక (ఇన్‌వెస్టిగేటివ్) పత్రికారచన కూడ ఆంధ్రపత్రిక చేసినా మన పత్రికా రంగంలో అది వికసించలేదు.

(11) బ్రిటిష్ పాలకులు విదేశీయులు. వారికి తమ దేశంలోను, పొరుగు

దేశంలోను తమ ప్రతిష్ఠ ముఖ్యం కనుక ప్రజాభిప్రాయానికి, దానిని తీర్చిదిద్దే పత్రికలకు కొంతకు కొంత భయపడేవారు. స్వాతంత్ర్యానంతరం మన పాలకు లకు ఆ భయం పోయింది. స్వాతంత్ర్యమనేది స్వైరవిహారమయింది. కనుక పూర్వం కల్చైనేశన్ వంటి సినిమా పత్రికలలాగే పరస్పరం బురదచల్లుకొనే పత్రికలు ఆయా నాయకుల చలవవల్ల వెలువడ్డాయి. ఇవి కొన్నే అయినా, ఈగలవల్ల జబ్బులు వ్యాపించినట్టు వీటివల్ల తక్కిన పత్రికల స్వాస్థ్యమూ దెబ్బతింటున్నది.

(12) పూర్వం వ్యంగ్య చిత్రాలు విరివిగా వుండేవి కావు పత్రికలలో. ఏ తలిసెట్టి రామారావుగారి వంటి వారు కొందరే వుండేవారు వ్యంగ్య చిత్ర కారులు. ఇప్పుడు వ్యంగ్య చిత్రాలు చిన్నవి, పెద్దవి దిన, వారపత్రికలకు తప్పనిసరి. ఒక బొమ్మ పదివార్తలపెట్టు అన్నది పత్రికా రచనా సూత్రాలలో ఒకటి. కనుక ఛాయాచిత్రాల ప్రచురణ కూడా పెరిగింది.

(13) వార్తల ప్రచురణలోను చాలమార్పులు వచ్చాయి. పూర్వం హెడ్డింగుకు, వార్తాముఖానికి (లీడ్‌కు) నియమం వుండేది. ఎనిమిదికాలాల బ్యానరుకు 84 పాయింట్ల అక్షరాలు వాడితే, దాని కింద తప్పనిసరిగా 72, 60, 48, 36, 24, 18 పాయింట్లలో ఉపశీర్షికలు క్రమంగా అవరోహణ క్రమంలో వుండాలేతప్ప మరొక విధంగా వుండడానికి వీలులేదు. అప్పటి బాడీటైపులో ప్రధానమైనవి గ్రేట్‌ప్రైమరు (జి.పి.), ఇంగ్లీషుబాడీ (ఇ.బి). 18 పాయింట్ల శీర్షిక తర్వాత జి పి.లో వార్తాముఖం (లీడ్) వ్రాసి, ఆటు తర్వాత ఇ. బి. లో వార్తలిచ్చేవారు. డబుల్‌కాలం హెడ్డింగు కింద మరొక డబుల్‌కాలం హెడ్డింగు రాగూడదనే నియమమూ వుండేది. క్రియాంత సంపూర్ణ వాక్యాలు శీర్షికలలో వుండరాదనేది మరొక నియమం. అందువల్ల నాటి ఉప సంపాదకు లకు పెద్ద పాయింట్లలో శీర్షికలకు, ఉపశీర్షికలకు వాక్యాలు స్ఫురించడం ప్రాణ గొడ్డమయ్యేది. ఇటీవల పత్రికల పుటల తీర్పులో (మేకప్పులో) మరీ పెద్ద మార్పులు వచ్చాయి: ఒకే పాయింట్లో సింగిల్‌లైన్ హెడ్డింగులూ, డబుల్ కాలం కింద డబుల్‌కాలం, ఒకేపాయింటులో నాలుగైదు వరుసల హెడ్డింగులూ మొదలయినవి. వార్తాముఖానికి ప్రత్యేకమైన టైప్ వాడడం పోయింది. ఈ పద్ధతిని మొదట ఆచరణలో పెట్టింది ఈనాడు దినపత్రిక.

(14) ఇంతవరకూ వెలువడి నిలబడిన దినపత్రికల పేరులో ఒక్క ప్రజాశక్తిలో తప్ప-అద్యంతాలలో ఎక్కడో ఒకచోట ఆంధ్రశబ్దం వుంటూనే వచ్చింది. అంతేగాక హిందూపెట్టిన వరవడి ప్రకారం పత్రికా నామధేయ మకుటం (మాస్ట్‌హెడ్) అక్షరాలు పాత ఇంగ్లీషు కాపిటల్ అక్షరాల అనుకరణ

గానో, అనుసరణగానో వుంటున్నవి. 'ఈనాడు' నామధేయ మకుటం మాత్రం తెలుగుక్షరాల గుండ్రదనం విసర్జించి చతురస్రాకారం సంతరించుకొంది. ఈ అక్షరరూపం బాడీటైపులోను వస్తే ఫోటో కంపోజింగు, కంప్యూటర్ ఆపరేటింగు సుగమమై తెలుగు పత్రికల ముద్రణలో ఇమిడిక ఏర్పడి మరింత అభివృద్ధికి వీలుంటుంది.

(15) స్వాతంత్ర్యానంతరం పద్మశాలి, చేనేతవంటి కులాలు, వృత్తుల పత్రికలు విరివిగా వెలువడ్డాయి. ఆంధ్ర వారపత్రిక తన సైజును మార్చుకుని, రాజకీయ ప్రాధాన్యాన్ని కథలకు, నవలకు అందించి పెక్కు పత్రికలకు ఆదర్శమైంది. ఒకేవిషయానికి, కేవల సాహిత్య చరిత్రాది పరిశోధనకు, ప్రాధాన్యమిచ్చే "పరిశోధన" వంటి పత్రికలూ వెలువడ్డాయి. 'పరిశోధన' సర్జనాత్మక రచనలను, వ్యాపార ప్రకటనలను నిరాకరించి కేవలం పరిశోధనకే అంకితమైన పత్రిక. ఈ నా సమీక్ష అద్దంలో కొండను చూపడం వంటిది.

(16) జననం మొదలుకొని నేటివరకూ పెక్కు విషయాలకు వరవడి పెడుతూ జాతిశ్రేయస్సే ధ్యేయమైన ఆంధ్రపత్రిక (వారపత్రిక) 75 సంవత్సరాలు నిండి వజ్రోత్సవం చేసుకొనడం ఎంతో ఆనందదాయకం. ఇది నాగేశ్వరరావుపంతులుగారి, శివలెంక శంభుప్రసాదుగారి, శివలెంక రాధాకృష్ణగారి చేతిచలవ. ఇలాగే ఈ పత్రిక శతజయింతి చేసుకుంటుందని, దానిని నేనూ చూస్తానని విశ్వసిస్తున్నాను.

(ఆంధ్ర సచిత్ర వార పత్రిక వజ్రోత్సవ సంచిక : 16_9_83)

★★

# జోస్యం నిజమా? కాదా?

అతీతంపై ఆదరణ, ఆగతంపై అనాదరం, అనాగతంపై ఆశ, ఆసక్తి మానవసామాన్య స్వభావం. ఈ స్వభావం ఒకవైపు జిజ్ఞాసగా పరిణమించి విజ్ఞానార్జనకు దారితీసింది; మరొకవైపు మనోదౌర్బల్యంగా పరిణమించి మూఢవిశ్వాసాలకు అవకాశం కలిగించింది; అనాగతంపై ఆసక్తి మరీను. ఈ ఆసక్తి ఎంత నిబ్బరం కలవాణ్ణయినా, దుర్బలుణ్ణి చేస్తుంది. ఈ దౌర్బల్యానికి చిహ్నాలే జోస్యాలు, సోదెలు, గద్దెలు, శకునాలూను. అందులోను—

జోస్యమంటే వడి ఇదికానివారు ఎవరూ ఉండరు. భవిష్యత్తు ముసుగు తొలగించి చూద్దామని ప్రతివారికీ కుతూహలమే. ప్రతివారూ తమ తమ మనస్సుల్లో ఎన్నో ఆశలు, అభిప్రాయాలూ కుక్కుకొని ఉంటారు. అవన్నీ పండ్లవుతాయా? వడపిందెలు కూడా కావేమో! కాని పండ్లు కావాలనే ప్రతివారి ఆశానూ. కనుక తమ భావానికి అనుగుణంగా ఏమాట వినిపించినా, చెవులు రిక్కించి వింటారు; అర్రులు చాచుతారు నక్షత్రతారాగ్రహసంకులమైన నభస్సు వైపు; చమ్కీదుప్పటిలాగ ఉన్న అది మనం కప్పుకోడానికే తయారయినట్టు, తమను అనుగ్రహించడానికే గ్రహాలు వెలుగుతూ వేలాడుతున్నట్టు.

ఏమిటీ చాదస్తం గ్రహాలు మనకేమో ఒరిగిస్తాయని? ఈ అనంతసృష్టిలో మన నివాసమైన భూమీ ఒక్కటి. అది తిరుగుతున్నదని; అలాగే పూలచెండ్ల వలె, నిప్పుముద్దలవలె కనిపించే గ్రహ నక్షత్రాలూ తిరుగుతున్నవని అన్నారు. బాగానే ఉంది. భూపరిభ్రమణాన్నిబట్టి, ఆ దారిని కనిపించే గ్రహనక్షత్రాలకు ఏవో సంకేతాలు పెట్టుకున్నారు. గ్రహచక్రం, రాశిచక్రం, అన్నీవున్న శింశుమారచక్రం అంతా ఒకే తిరుగుడు అన్నారు. కాబోలు అనుకున్నాము. గ్రహాలు - గ్రహాలు ఇంతింతదూరంలో ఉన్నవన్నారు. ఆహా! అన్నాము. కుజుడిలో భూమిగుణం ఉన్నదన్నారు. మన భూమివంటిదేనా? - అని అనుకున్నాము. తక్కిన గ్రహాలు జలమయాలు, ప్రాణసూచనలేమీ లేవన్నారు. ఓహో అనుకున్నాము. అంతా చెప్పి శాస్త్రమన్నారు ఇవి. అప్పుడే కలిగింది సందేహం. ఒకటీ ఒకటీ రెండూ అన్నట్టు ఇది శాస్త్రమెలా అవుతుంది? గ్రహాల పరిస్థితి తెలుసుకోవడంవరకే శాస్త్రమంటే అన్వయిస్తుంది. అవి మనకేమి సంబంధం?

అవి మనకు ఇచ్చే ఫలితమేమిటి? - అన్నప్పుడే వస్తుంది సందేహం. నిప్పును తాకితే చేయి కాలుతుంది. నేపాళం తింటే కాల్రప్రవృత్తి అవుతుంది. గ్రహాల కిరణాలు మనను తాకుతాయి. వేడి, చలువ కలుగుతాయి. అంతవరకు నిజమే. అవి మన జీవితమార్గాన్ని తీర్చిదిద్దడానికి ఎలా సహకరిస్తాయి?

గ్రహాలకు ఫలం ఉందా లేదా? - అని అడుగుతారు కదూ! ఉంది. ఎంత వరకు? సూర్యకిరణాలు తగిలితే వేడి పుడుతుంది. చంద్రుడు చల్లనివాడు. ఋతుపరివర్తనానికి ఈ గ్రహాల వేడి, చలవ ఉపయోగపడుతున్నాయనడం నిజమే. అంతవరకే వాటి సంబంధం. ఎండవల్ల ఒంటికి వేడికలిగి మన నాడీ కూటంపై దాని ప్రభావం కలుగదా! అది మనస్సుపై పనిచేయదా? అంటారు కదూ! ఒంటికి ఎండ తగిలితే చీకాకు పుట్టడం, మనస్సుకు వేసట కలుగడం నిజమే. అది శారీరక బాధ. భాగ్యాభాగ్యాలను ప్రసాదించే శక్తి ఏమీ లేదు గ్రహాలకు. వాటికి మనకు సుఖదుఃఖాలిచ్చే శక్తేమీ లేదు. ఆ శక్తిని ప్రత్యక్షంగా చూపించగలరా శాస్త్రజ్ఞులనుకుంటున్నవారు?

గ్రహాలను, నక్షత్రాలను దేవతా స్వరూపాలుగా భావించడం అది మానవుని అపరిణతదశలో బాగుంది. చీమ చిటుక్కుమన్నా భయపడేవాడు అప్పటిమనిషి. ఏది విన్నా భయమే; ఏది కన్నా భయమే; ఏది తిన్నా భయమే. ఆ భయమే భగవంతుడు. భయంతోనే అంతా నడుస్తుందనుకునేవాడు. గ్రహాలు కూడా ఎవరికో భయపడి తిరుగుతున్నాయనుకున్నాడు. అలా తిరుగుతూ తిరుగుతూ గ్రహణం మూలంగా మరుగైతే ఏమి మూడుతుందో అని మరింత భయపడి ప్రార్థనలు, దానాలు చేసేవాడు. దానమిస్తే గ్రహాలు ప్రసన్న మౌతాయా? ప్రసన్నమయ్యేట్టయితే సూర్యగ్రహం ఎండకాలంలో ఎందుకు కాలుస్తుంది? చలికాలంలో ఎందుకు వేడి తగ్గిస్తుంది? దానమిస్తే, ప్రార్థిస్తే ప్రసన్నమైనట్టు దాఖలా చూపగలరా? ఇదంతా ఆపాదించే జ్యోతిష్కుడే ఒక గ్రహమన్నారు దయానంద సరస్వతి; "యే గృహ్ణంతి తే గ్రహాః" ఏవి (దానాలు ధర్మాలు) తీసుకుంటాయో అవే గ్రహాలు అవే వ్యుత్పత్తిని బట్టి.

ఇంతే కాదు. గ్రహాలు ఆగ్రహించాయని మంత్రాలు వేరే. గ్రహాలపేర్ల పోలిక వుండేచాలు అని ఆ గ్రహాల మంత్రాలే అని మిడిమిడి జ్ఞానం కలవారు బనాయించారు. "ఆ కృష్ణేన రజసా" అనేది సూర్యానుగ్రహ మంత్రం. "ఇమం దేవా అసపత్నిగ్ం సువధ్వం" అనేది చంద్రుణ్ణి సముదాయించడానికి. "అగ్ని ర్మూర్ధా దివః కకుత్పతిః"అనేది కుజునికోపం తగ్గించడానికి,"ఉద్బుధ్యస్వాగ్నే" అనేది బుధుణ్ణి బుజ్జగించడానికి. "బృహస్పతే అతియదర్యో" గురువును గౌర వించడానికి. "శుక్రమంధసః" శుక్రుణ్ణి చిచ్చికొట్టడానికి. "శన్నోదేవీ రభిష్టయ"

శనిశాపం తప్పించుకోడానికి. "కయానశ్చిత్ర ఆభువ" రాహువురోషం తగ్గించ డానికి. "కేతుం కృణ్వన్నకేతవే" కేతువుభీతి తొలగించడానికి. అరకొర అరయదనమున్న జ్యోతిష్కుల ఈ వ్యాఖ్యానాలకు దయానంద సరస్వతి చాల కష్టపడ్డారు. ఆ కృష్ణేన అనేది సూర్యుని భూమ్యాకర్షణశక్తికి సంబంధిం చిందని, రెండవది రాజగుణ విధాయకమని, మూడవది అగ్నిని తెలిపేదని, నాల్గవది యజమాన సంబంధమైనదని, ఐదవది విద్వాంససూచకమని, ఆరవది వీర్యం, అన్నం తెలిపేదని, ఏడవది జలప్రాణ నిరూపకమని, ఎనిమిదవది మిత్రవిచారకమని, తొమ్మిదవది జ్ఞానగ్రహణ విధాయకమని ఆయన వివరించారు.

ఇంతకూ, విజ్ఞానం వికసించనప్పుడు చంద్రలోకం, కుజలోకం అంటే బాగుంటుంది. చంద్రుడు వట్టి దుమ్ముకొట్టినవాడు, గురుత్వాకర్షణ లేనివాడు, మిట్టలు, పల్లాలే వున్నవాడు అని తెలిసిన తర్వాత కూడా దేవత అంటే ఎవడు నమ్ముతాడు? దేవత కానప్పుడు, అనుగ్రహమూ అవసరం లేదు; ఆగ్రహమూ లేదు.

కుజుని సంగతీ అలాటిదే. పసిరిక కనిపిస్తున్నదట అక్కడ. ప్రాణికోటి వుందేమో అని శాస్త్రజ్ఞులు పరిశోధిస్తున్నారు. మరి దేవత ఎలా అవుతాడు? ఎర్రగా కనిపిస్తే రౌద్రాకారం, యుద్ధదేవత అన్నారు. భూమి కూడా అంత రిక్షంలో మరొకచోటి నుంచి చూస్తే ఎర్రగా కనిపిస్తుందట. దానికి కారణం సూర్యకాంతి ఏమీలేని బుగ్గిగా ఉన్న చంద్రునిమీద ప్రతిఫలించినట్టుకాక చెట్టు చేమా వుండడంవల్ల కొంత అస్పష్టంగా కనిపించడమే. కోపం వస్తే ముఖం ఎర్రబడుతుంది. రక్తం ఎర్రగా వుంది. కనుక ఎరుపు యుద్ధపురంగయింది. కుజునికి అది ఆరోపించారు.

ఈ గ్రహాల సూక్ష్మకాంతి మనమీదపడి మార్పులు కలిగిస్తాయంటారు దైవజ్ఞులు. పెద్దగా కనిపించే సూర్యచంద్రుల కాంతివల్లనే మనస్సుకేమీ కలుగదు. కలిగినా ఏమీ కాదు. క్లేశాదులే కాని మనస్సుకు సంబంధించిన సుఖ దుఃఖాలు కలుగవు. భాగ్యాభాగ్యాలు అసలే కలుగవు కదా. ఇక చిన్న గ్రహాల ఫలితాలేమిటి? ఎతావతా, జ్యోతిషం తక్కిన విజ్ఞానశాస్త్రాలవంటిది కాదని, అసలు శాస్త్రమే కాదని, శాస్త్రమనడానికి నిరూపణ ఏమీ లేదని తేలినట్టే కదూ?

అయితే ఫలితాలు కుదురుతున్నాయే? అబద్ధమనడం ఎలా? అదంతా భ్రమ. మనసులోని సహజమైన కుతూహలాన్ని, దౌర్బల్యాన్ని జ్యోతిష్కులు కనిపెట్టి, మనస్సు తెలుసుకుని, భవిష్యద్వాణి పలుకుతారు. బాగా పరిశీలించి

చూడండి. కచ్చితంగా ఏదీ చెప్పరు. చాలావరకు అవుతుందంటారు. లేకపోతే అయ్యే అవకాశాలున్నాయంటారు. కచ్చితంగా చెప్పమనండి రెండూ రెండూ నాలుగన్నట్టుగా చెప్పరు. మనకు సహజంగా భవిష్యత్తును గురించి ఉత్కంఠ వుంటుందని మొదట్లోనే అన్నాను కదూ? దానిని కొద్దిగా కెలుకుతారు దైవజ్ఞులు. దానితో మన మొగం ఇంత అయి వింటాము. ఏదో కొంత జరిగిందనుకోండి. అక్కడికక్కడే సంతోషిస్తాము; అల్పసంతోషులం.

పెద్ద పెద్దవారు చెప్పిన ఫలితాలే తప్పాయి. వశిష్ఠుడంతటివాడు రామచంద్రునికి పట్టాభిషేకలగ్నం పెట్టి చేతికి ప్రతిసరం కట్టాడు గదా! ఏమైంది? పట్టాభిషేకానికి మారు, వరుగులు తీయవలసి వచ్చింది అడవికి. జ్యోతిషం, లగ్నబలం ఏమయాయి? అంతేకాక రామచంద్రునికి ఐదుగ్రహాలు ఉచ్చస్థానంలో ఉన్నాయట. కటకంలో గురుచంద్రులున్నారట. అంతా బూటకం. గ్రహాలు చేసేదే వుంటే అంత తారుమారయ్యేదా?

భోజరాజు పుట్టినప్పుడు తండ్రికి గండమని దైవజ్ఞులు చెప్పి, ఆ శిశువును అడవిలో వదిలిపెట్టమన్నారట. మతిమంతుడైన మంత్రి ఒకడు "మహారాజా, ఎవరీ దైవజ్ఞులు? ఉదరంభరులు, మాట వినకండి" అని మందలించాడు కాబట్టే సరిపోయింది. కన్నబిడ్డడిని ఎవడైనా జోస్యులమాట విని కోల్పోతాడా?

భాస్కరాచార్యుడు మహావిద్వాంసుడు, ఆయన లీలావతి గణితం రచనకు ఆధారం కూడా ముహూర్తం తప్పిన మనఃక్లేశమేనంటారు. కన్న కూతురు తన ముహూర్తంవల్ల విధవ కాగా, కష్టపడి ఆమెపై ప్రేమకొద్దీ తన గణిత గ్రంథానికి ఆమెపేరు పెట్టాడంటారు. అంతటివాని ముహూర్త గణనం ఏమైంది?

విద్యారణ్యుడు విజయనగర నిర్మాణానికి ముహూర్తం పెట్టాడట. నేను ఫలానావేళకు శంఖం ఊదుతాను. ఆ వేళకు సరిగ్గా శంకుస్థాపన జరగాలి- అని చెప్పాడట. అంతలోగా ఎవరో దాసయ్య శంఖనాదం విని అసలు మూహూర్తానికి ముందే చేసిన శంకుస్థాపన కావడంవల్ల, సరియైన ముహూర్తంలో కానందువల్ల ఆ పట్టణం మున్నూరేండ్లకంటే వుండదన్నాడట. ఇదొక కట్టుకథ. అంత కట్టుదిట్టంగా - రాజధానిని కట్టేవారు, దాసయ్య శంఖనాదానికి మోసపోతారా? ప్రభుత్వపు ఏర్పాట్లా మరేమన్నానా? ముస్లిం మహావాహినిముందు నిలబడలేక కూలిపోయింది మున్నూరేండ్లకు విజయనగరం అనడం సబబు. దానికి లేనిపోని కథ ఒకటి అల్లారు, ముహూర్తానికి దెబ్బ తగలకుండా.

జ్యోతిషం అబద్ధమనడం ఇప్పటిది కాదు. బుద్ధునికాలంనుంచే వుంది.

అది అబద్ధమని నిరూపించే పెక్కుకథలు జాతకకథలలో ఉన్నాయి. ఒకసారి ఒక జ్యోతిష్కుడు ఒక గృహస్థుని కుమారుని చూచి ఇచ్చకానికి ఏవేవో యోగాలు చెప్పాడట. బుద్ధుడు అవన్నీ అబద్ధమని నిరూపించాడట. మరొకసారి జ్యోతిష్కుల, క్షపణకుల మాటలు నమ్మి, ఒక మూర్ఖుడు గర్భిణి అయిన తన భార్యను వదలిపెట్టగా, బుద్ధుడు వాడిని ఒప్పించలేకపోయాడు. తనకేదో గండం వుందని, భార్యను ఏలనని ఆ మూర్ఖుడన్నాడు. ఆమె అడవిలో ప్రసవిస్తే బుద్ధుడు ఆమెను సపుత్రకంగా రక్షించి, రాజు పెంచేట్టు ఏర్పాటు చేశాడట. తండ్రి ఏమీ చావాలేదు, పెట్టాలేదు. రాజాజ్ఞకు వెరచి వాడు తన పుత్రుని, కళత్రాన్ని స్వీకరించాడట. జ్యోతిషం ఏమైంది? కనుకనే వేమన మంచి ముహూర్తం పెడితే "ముండెట్లు మోసెరా?" అన్నాడు.

ఇక నాడీ గ్రంథాలు: వీటివెర్రి చాలా చాలానే వుంది జనంలో. గుడ్డేటుగా ఏవో తగులగానే జాతకుని మొగం అంతవుతుంది. నాడీ గ్రంథరచయితల గణిత చాతుర్యం, ప్రస్తారప్రజ్ఞ గొప్పవే. రోజుకు 12 లగ్నా లయితే, ఛందః ప్రస్తారం చేసినట్టుగా నిమిష నిమిషానికీ లెక్కలుకట్టి లగ్నభేదాలు, యోగ భేదాలు చూపే ప్రజ్ఞను కాదనము. ఎందుకంటే నిమిష నిమిషానికీ ఎవరో, ఎక్కడో పుడుతూనే వుంటారు. కాని, వారు చెప్పే పూర్వజన్మాల పేరు, వంశ చరిత్రలు మోసమంటే తప్పేమీ కాదు. పూర్వజన్మలో నీవు ఫలానా రాజువి అంటాననుకోండి. సాక్ష్యమేముంది? రాజువంటే పండ్లగిలిస్తాము. కోతివంటే మొగం ముడుచుకుంటాము. వంశచరిత్రలు, పేర్లు చెప్పడంలో యుక్తి వుంది. జనకమహారాజుకూతురి భర్త పేరు నీ పేరు - అంటాడనుకోండి నాడీ గ్రంథకర్త. రామునికి 50 పేర్లున్నాయి. రామమోహనరావు కావచ్చును, రామలింగేశ్వరరావు కావచ్చు, రామచంద్రయ్య కావచ్చు; దాశరథి కావచ్చు, జానకిరామారావు కావచ్చు— మరేదైనా కావచ్చు. అంతేకాక ఆయా ప్రాంతాల వ్యవహారంలో వున్న పేర్లనుబట్టి ప్రస్తరించడంవల్ల పూర్తిగా ఏ కాశ్మీర్ ప్రాంతపు పేర్లో, పంజాబ్ ప్రాంతపు పేర్లో అతకవు. పోఖ్‌రాజ్ అంటాడనుకోండి - ఏ దేవత పేరు?

నాడీ గ్రంథాలలో మరొక లోపం కూడా వుంది. గతం సరిగ్గా వున్నట్లు కనిపిస్తుంది; ఆగతం కాదు. గతం కూడా ఆ నాడీ ప్రచారకుడు వ్యాఖ్యచేస్తేనే గాని తెలీదు. ఏ కొంచెం జరిగినా అయిందని సరిపెట్టుకుంటాము. భవిష్యత్తు ఏమీ జరుగదు. ఉదాహరణకు భుజండనాడి 20 సంవత్సరాల క్రితం మహా ఋధిగా గౌరవం పొందింది. ఒక ప్రముఖుని జాతకంలో "విశాఖత్తిల్ పాంపు"

అనే మాట వచ్చింది. విశాఖా నక్షత్రంలో పాము - అంటే రాహువు వస్తే గొప్పయోగం అని వ్యాఖ్యానించాడు ఆ నాడి ప్రచారకుడు. మరొకరన్నారు ఇదేదో రాజకీయ విషయం గుప్తంగా వుందని. విశాఖపట్టణంలో పాములు ఎక్కువ అయి వుంటుంది పాములవల్ల ప్రమాదం లేకుండా జాగ్రత్తపడండని మరొకరు అన్నారు. ఇంతలో కొన్ని వారాలకు విశాఖపట్టణంలో బాంబు పడింది. అదుగో! చూచావా విశాఖ త్రిల్ పాంబు అంటే, విశాఖపట్టణంలో బాంబు అని అర్థం అని ఒకరు వ్యాఖ్యానించారు. దేనిని నమ్మడం? ఎక్కడి కక్కడే వ్యాఖ్యానం, విశేషార్థాలూను. అన్ని నాడి గ్రంథాల విషయం ఇలాగే వుంటుంది.

30 సంవత్సరాలక్రితం మాట. ఒకరితోపాటు కౌమారనాడి వారివద్దకు వెళ్ళాము. నామిత్రుని ముఖం చూడగానే మీ జాతకచక్రం రెండో ఇంటిలో శని వున్నాడండి అన్నాడు. నిజంగా శనే వున్నాడు. మా మిత్రుడు నిర్ఘాంత పోయాడు. తర్వాత జ్యోస్యుడన్నాడు గదా, మీరు వచ్చేటప్పుడు చేత్తో తాళం చెవి పట్టుకున్నారు. తాళంచెవి ఇనుము, శనికి సంబంధముంది. తాళంచెవి ధనస్థానానికి సంబంధించింది. కనుక శని మీ ధనస్థానంలో వుండవచ్చు ననుకున్నాను—అన్నాడు. ఇదేదో మనోగోచరమైన విషయం కాని, శాస్త్రరీత్యా ఎలా సమర్థించగలం?

మరికొందరు ఏంచేస్తారంటే, మనిషి లోపాలను గుర్తించి, భవిష్యత్కథనంలాగ దబాయిస్తారు. అది కేవలం మనస్తత్వ పరిశీలనం. అంతమాత్రాన భావి కాదు. మరికొంతమంది నీవు పుట్టింది కుగ్రామంలో. దక్షిణముఖంగా వుంటుంది గుమ్మం. నీవు పుట్టినప్పుడు మంచం పూర్వ పశ్చిమంగా వేసివుంది.... అని కోస్తారు. మనదేశం కుగ్రామమయం. తరంక్రితం పుట్టినవారిలో అత్యధికులు కుగ్రామాల్లో పుట్టినవారే. గదిగుమ్మం, మంచం ఎక్కడుండేవి ఎవరికి జ్ఞాపకం వుంటాయి?

దైవజ్ఞులు తమ లోపాలు కప్పిపుచ్చుకోడానికి మంచి ఎత్తు వేస్తారు. ఫలితం కలుగలేదనుకోండి నీ కర్మ అంటారు; వేదాంతులలాగ. రాజకీయాలలో పారవేమండి మీ యోగాలు-అంటే గౌరీశాపమంటారు. పార్వతీపరమేశ్వరులు ఒకప్పుడు ఏకాంతంలో వున్నారట. ఎవరో దైవజ్ఞులైన ఋషులిద్దరు దర్శనానికి వచ్చారట. అందులో ఒకరు అమ్మవారు ఇప్పుడేమి చేస్తున్నది లెక్కలుకట్టి చూద్దాం అన్నాడట. లెక్కలుకట్టగా ఆమె పరమేశ్వరుని ఆలింగనంలో వున్నట్లు తేలిందట. ఇంతలో పార్వతి వెలుపలికి వచ్చి, వారిని చూచి ఛీ

అప్రాచ్యులారా, మీ జోస్యం మండా. మీ జోస్యం ముఖ్య విషయాల్లో ఫలించక పోవాలి- అని శాపం ఇచ్చిందట.

వరాహమిహిరుడు మాత్రం ప్రపంచజ్ఞానంతో వ్యవహరించమన్నాడు జ్యోతిష్కులను. పిడుక్కూ బియ్యానికీ ఒకే మంత్రం కూడదని, కాశ్మీర్‌లో అందరూ ఎర్రటివారే. కనుక లగ్నంలో శుక్రుడున్నాడని చంద్రుడున్నాడనీ చూచి స్ఫురద్రూపి అని చెప్పకండి. నవ్వుతారు - అన్నాడు. దీనినిబట్టి ఇది విజ్ఞానశాస్త్రంవంటిది కాదని నిరూపితం కాలా?

“మనోబలం తు మాండవ్యః” అన్నారు. మనోబలం వుంటే ఈ జ్యోతిషం నమ్మనే అక్కరలేదు. రావణాసురుడు గ్రహాలన్నింటినీ పట్టుకుని కట్టివేశాడు. శని మెల్లగా తప్పించుకొని పారిపోతుంటే తన గద విసిరాడట, దానితో శని కాళ్ళు విరిగి పంగువు - కుంటివాడు అయ్యాడట. ఎలా వుందీ కట్టు కథ? జోస్యం వట్టి అబద్ధాలపుట్ట కనుక స్మృతికర్తలయిన పరాశరుడు, ఉశనస్సు, యాజ్ఞవల్క్యుడు ఆపస్తంబుడు ఈ వృత్తిని నిషిద్ధకోటిలో చేర్చారు. ఈ వృత్తి వారి ఇంట భుజిస్తే ప్రాయశ్చితమూ చెప్పారు. కనుక జ్యోతిషం శాస్త్రం కాదు; కేవలం ఊహాగానం, పరప్రతారణం అంటాను.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 18-5-60)

(ఇటీవల నాకు శ్రీవద్దిపర్తి వెంకటరావుగారు వంటి గొప్ప జ్యోతిష్కులతో సన్నిహితత్వం ఏర్పడింది. జ్యోతిషాన్ని కొట్టిపారేయలేమనే భావం కలిగింది. తి.రా. 22-6-1993.)

★★

# రవీంద్రుని విశ్వమానవ మతం

ఆకారసదృశ ప్రజ్ఞః

ప్రజ్ఞయా సదృశాగమః.

అన్నాడు వాల్మీకిమహర్షి రామచంద్రుని గుణగణాలను వర్ణిస్తూ. ఈ మహర్షి భాషితమే రవీంద్ర కవీంద్రుని బాహ్యాంతర వ్యక్తిత్వాన్ని తెలుసుకొనడానికి ఆగమమౌతుంది. 25 ఏళ్ళనాడు చెన్నపురిలో నేను ఆయనను దర్శించినప్పటి నా భావమిది.

విశ్వసౌభ్రాత్రం, విశ్వమానవత్వం, సత్యమని; విశ్వకల్యాణం శివమని; విశ్వమానవాళి - ఎంత వైవిధ్యంతో ఉన్నా-సప్తతంత్రుల వీణవలె, వేయిరేకుల కమలంవలె ప్రకృతి సౌందర్యం ఒరవడిగా మనడం, మనేటట్టు చేయడం సుందరమని - ఈ సత్య శివ సుందర త్రిరత్నాలతో విశ్వమానవాళికి మహాబోధి కలుగజేయడానికి యత్నించిన యుగపురుషుడు ఆయన.

ఈ దృష్టితోనే అతడు జీవించాడు; సహస్రమాసాలు నిండుగా జీవించాడు; ఇతరులను పునరుజ్జీవింపజేశాడు. ఆయన భావనలో జీవితమంటే ఏమిటి?

"జీవితం అంటే వస్తుసేకరణం కాదు; జ్ఞానమంటే గ్రంథాలు వల్లించడం కాదు. పంచభూతాత్మకమైన ఈ ప్రపంచం అంతటా ఏదో వర్ణించరాని ఒక మధురహస్తస్పర్శ వుంది; చెరపరాని ఆత్మీయతాముద్ర వుంది. అది ఇట్టిదని వివరించలేము. దాన్ని అనుభూతిద్వారా గ్రహించవచ్చు." అని రవీంద్రుని జీవిత నిర్వచనం.

పాండిత్యంకన్నా దార్శనికత హెచ్చు విలువైంది. దార్శనికతను సౌందర్యంతో మేళవించి జీవితంలో అనుభవించడమే రవీంద్రుని సందేశం. జనకుని జీవితం, ఇతర రాజర్షి మహర్షుల జీవితాలు మనఎదుట పరచుకొన్నట్టు కనిపిస్తుంది ఆయన జీవితం పర్యాలోకిస్తే. నిజానికి ఆత్మ సుందరరాశి. దానినిమించిన సుందరవస్తువు లేదు. కాని అది ప్రయత్నాలతో, సాధనలతో సంపాదించగల్గింది కాదు. దానికే మనమీద ఆశ పుట్టాలంటారు మన పెద్దలు.

అయినా, ఆ సౌందర్యదిదృక్ష కొరవడలేదు మానవునిలో. దాని రూపాలే

ఈ సాహిత్య సంచారాలన్నీ. అలాంటి దివ్య సౌందర్యాన్వేషణే. రవీంద్రుని లక్ష్యం - రమ్యభావన, రమ్యజీవితం.

ఈ రమ్యభావనా భావితమే అతని విశ్వమానవత. ఇది నేటి వైజ్ఞానిక యుగంలో నూతన చైతన్యస్రవంతిని ప్రవహింపజేసింది. ప్రాచీ ప్రతీచీ సంస్కృతులను, సారస్వతాలను జీవంపోసి చేవ కలిగేట్లు చేసింది. ఆయన రచనలో కనిపించేది ఇదే - విశ్వమానవత. దీనికి మూలబంధం ఆధ్యాత్మికత సువాసనలు, విశ్వకళ్యాణం. ఆధ్యాత్మిక చింతనం లేని జీవితం అపూర్ణమనే దూరదృష్టిని ప్రతిపదంలోను ప్రస్ఫుటం చేస్తాడు. నీవు, నేను అనే భేదభావం పోనాడి మనం అనే మహావాక్యం స్థాపితమయ్యే, దిగ్దిగంతాలకు వ్యాపితమయ్యే బంగారు గడియలు రానున్నవనే విశ్వాసం నూరిపోశాడు.

దీనికి కారణం ఆయనకు భారతీయత పైగల అచంచల విశ్వాసమే. ఈ విశ్వాసానికి ఆయన బాల్యంనాటి మత సంస్కరణ, భాషాసంస్కరణ, రాజకీ యోద్యమాలు ప్రోదిచేశాయి. అందువల్లనే "జనగణమన అధినాయక" అంటూ గొంతెత్తి పాడాడు. మనదేశమంటె, ఏవిధంగా చూడాలో, తను ఏవిధంగా చూచాడో - ఆయన ఒకచోట ఇలా అన్నాడు:-

"నా దేశాన్ని అర్థం చేసుకోగోరేవారు తను ఆత్మను సందర్శించి భౌతిక మైన అవధులన్నీ అధిగమించి, తేజోవంతమైన తనమణిచేత ప్రాచ్యదిఙ్మండలా న్నంతనూ శోభామయం చేసిన, శత్రుదేశాల నుంచి సైతం ఆప్తునివలె అభినం దనలందిన ఆనాటి నా సమాజాన్ని దర్శించాలి.

"నేను ఈ దేశంలో పుట్టినందువల్ల నాకు ఈ దేశమంటే ప్రేమ ఉండడం కాదు. మానవోత్తములైన భారతీయుల మహనీయ సందేశం తరతరాలుగా మానవజాతిని మహావిపత్కరమైన పరిస్థితుల నుంచి రక్షించగల్గింది. అందుకే నాకు భారతదేశమంటే స్వర్గంకన్నా మిన్న" అన్నాడాయన.

ఈ విశాలదృష్టితోనే ఆయన అతిబాల్యం నుంచే సాహిత్యారాధన సాగిం చాడు. రవీంద్రుడు మెట్టి గట్టెక్కని సాహిత్యప్రక్రియ లేదు. లేఖలు, కథలు, కావ్యాలు అన్నీ 26 సంపుటాలు. ఇవన్నీ దివ్యసౌరభ్యాలు వెదజల్లే జాంబూనద శతపత్రాలే ఈ శతపత్రాలలో కొన్నిటి రేకులు మాత్రమే మీముందు అర్పిస్తాను:

"నన్ను మరచినా నా గేయాలు జనం వాడుకుంటూనే వుంటుంది." అన్నాడు ఒకప్పుడాయన. తను వ్రాసినది, తనఎదుటే జానపదగేయంలా విశ్వజనీనమయినప్పుడు రచయితకు కలిగే రసానుభూతి అవాఙ్మానసగోచరం.

అలాంటి సన్నివేశంలో అన్నమాటలివి. గానగేయాలకు అనిర్వచనీయమైన శక్తిఉంది. మాటకు లొంగని, వాగ్గోచరంకాని వాటిని అవి అందిస్తాయి ఎవరికీ తెలియకుండా మనస్సుకు. గానం, గేయం మనజీవితంలో రంగరించుకొన్న మాటల సింగారాలు. దీనికితోడు ఆయన స్వీకరించినది శిష్ట వ్యావహారికం. పైపెచ్చు బంగదేశభక్తుల, బావుల్ భక్తయోగుల ప్రభావం కూడాను. ఛందోబంధాలు లేని ముక్త ఛందస్సు కూడా అప్పుడప్పుడు. ఇక ముగ్ధమోహనంగా ఉండడంలో ఆశ్చర్యమేమిటి? కవితా మహేంద్రపదవిలో ఆయనకు ఎవ్వరూ సాటి లేరు; ఇంద్రునికి కూడా నహుషుడు మొదలయినవారు కాంపిటీషన్‌కు వచ్చారు గాని.

"ఈ యుగంలో రవీంద్రనాథటాగూరంతటికవి మరొకడు లేడు. ఆయన గేయాలు విశ్వసాహిత్యంలో ప్రప్రథమశ్రేణికి చెందినవి. ఆయన కవితలో కవిత్వం కాక మరేదో వుంది. అతని కవితలో లిరిసిజం గేయత్వాన్ని మించినదేదో వుంది. అతని కవిత్వం అతని అంతరంగమూర్తిని వ్యక్తపరచేదే కాక, దానిని అంతకంతకు సుందరంగా వికసింపజేసే సాధనం కూడా. అతడు ఋషి. అతని అనుభూతులు ఇహపరాలకు నిశ్శ్రేణులు" అని ఒక గొప్ప విమర్శకుడన్నాడు.

కాని అతని కవిత నిగూఢమని, మిస్టిసిజం మితిమీరి దురవగాహమని పలువురు విమర్శించారు. "ప్రకృతేర్-పరిశోధన్" (సన్యాసి) దీనికి ముఖ్యోదాహరణ. సన్యాసి ధర్మానికి, సమాజానికి సంఘర్షణ. ఒక సన్యాసికి తను పెంచిన అనాథ బాలిక యెడ కలిగిన వాత్సల్యభావానికి, వైరాగ్యానికి సంఘర్షణలో వాత్సల్యం విజయిస్తుంది. ఇది పూర్తిగా ఆధ్యాత్మిక తత్త్వ భూయిష్ఠం; సర్వసంగ పరిత్యాగం కన్నా, సమాజప్రేమ సర్వోత్కృష్టమని చాటినది.

సంగీతరూపకాలను కూడా ఆయన విరివిగా ప్రచారానికి తెచ్చాడు. "వాల్మీకేర్ ప్రతిభా" ఉత్తమ సంగీత నాటకమంటారు. రవీంద్రుని నాటకాలు తెరలు, చమ్కీకోట్లు, ఆర్మోనియం, అట్టహాసాలు లేని అపూర్వ సుందరాలు. ప్రకృతి సహజమైన రంగప్రసాధనం విషయంలో అవనీంద్ర, గగనేంద్ర, నందలాల్ బోస్, సురేశ్‌కార్ వంటి మహా చిత్రకారులు ఆయనకు తోడ్పడి సహజసుందర రంగస్థలం తీర్చిదిద్దేవారు. సహజ సౌందర్యం రావడానికి వెనుక మామిడిమండలు దట్టంగా కట్టేవారట. మనపూర్వ నాటకాల్లో రంగ ప్రసాధనాడంబరం ఏదీ? వీధినాటకాల్లో గుంజలవంటి నాలుగు స్తంభాల మండపాలలో తెల్లటితెర పైకెత్తి అన్నిరసాలు, రసాభాసాలు ప్రదర్శిస్తారు.

తంజావూరు బృహదీశ్వరాలయ ఉత్సవాల్లో జరిగే గొల్లకలాపానికి, భామా కలాపానికి ఏ రంగురంగుల సెట్లున్నాయి? ఏ తెరలు, ఫోకసింగు దీపాలున్నాయి? అన్నీ ప్రేక్షకుని భావుకతపై ఆధారపడినవే. భామ కృష్ణునికి వ్రాసే ఉత్తరం గంటకైనా మూగనోముతో ముగియదే? అంతవరకు ప్రేక్షకుడు భావశబలతలతో మురిసిపోడా? ఈ రహస్యం రవీంద్రుడు ఎరుగును. కనుకనే సహజ రమణీయరంగశాల.

## నవలలు

రవీంద్రుని నవలలు కావ్యాలవంటివంటే అతిశయోక్తి కాదు. ఇతని నవలలు సమకాలిక భారతీయ సమాజాన్ని ప్రతిఫలింపజేయడమేగాక విశ్వజనీనతా సందేశమిస్తాయి.

ఈయన మొదటి నవల 1883 లో, ఆఖరుది 1934 లో మాలంచ అనేదే.

చొఖేర్‌బాలి (కంటిలో నలుసు), నౌకాడూబీ, గోరా, చతురంగ, ఘరే బాహిరే, శేషేర్ కబితా, దేగాజాగ్ తన్ పురుష్ మొదలైనవి 20 వరకూ వున్నాయి.

నవలలో వాటి సాంఘిక సమస్యలు అల్లుకుపోతాయి. గోరాలో జాతీయతకు, సాంఘిక బాధ్యతలకు నడుమ సంఘర్షణ, నాటి భారతీయ సమాజ విశ్వాసాలకు, నిజమైన ఆధ్యాత్మిక దృష్టికి మధ్య అంతరం అపూర్వంగా చిత్రించారు. గోరా సిపాయి కలహంలో మరణించిన ఐరిష్ సైనికుని బాలుడు. సనాతన బ్రాహ్మణునియింట పెరుగుతూ, సుచరితను-బ్రహ్మసమాజం అనుసరించే ఒక గృహస్థు బాలికను ప్రేమిస్తాడు. కాని ఆమె బ్రహ్మసమాజబాలిక గనుక గోరా వెనుక ముందాడుతాడు. అతని పెంపుడు తల్లి ఆనందమయి అతని జన్మవృత్తాంతము తెల్పుతుంది. అప్పటికి యెవరెవరో తెలుస్తుంది. పాఠకులకు దీనిలో రవీంద్రుడు విదేశీయులను దయతో సనాతనులు పెంచడం - భారతదేశంలో వివాహం చేసుకుని స్థిరపడడం వంటి విశ్వమానవతకు నారులు పోశాడని తెలియవస్తుంది.

ఘరే బాహిరే విదేశ వస్త్రదహనం, స్వదేశీ ఉద్యమం ముమ్మరంగా ఉన్నప్పుడు వెలువడింది. దీనిలో నాటి దేశభక్తుల వింత మనస్తత్వం చిత్రించాడు. అందువల్ల దీనిని, రవీంద్రుని పలువురు అపార్థం కూడా చేసుకున్నారు.

నా దృష్టిలో చొఖేర్‌బాలి వంటి నవల మరి లేదు. వినోదిని అనే బాలవితంతువు వినయుడనే శ్రీమంతుని మారవుపుట్టం ఎంతవరకి పొరపులు తెచ్చిందో,

యెందరిని లోబరుచుకొనడానికి యత్నించిందో, దీనిలో కథ ఎలా రాకెట్ వేగంతో నడుస్తుందో, మనస్తత్వ పరిశీలనం శతపత్ర పత్రవేధ్య న్యాయంగా ఎంత చురుకుగా అవ్యవహితంగా సాగుతుందో, చదువరులు ఏ లోకాలలో ఏ మేధా మేరువులలో ఏభావ గంభీర సాగరాలలో ఉంటారో స్వయంగా తెలుసుకో వలసిందే. రవీంద్రుడు ఆధ్యాత్మిక భావనలనే గాక భౌతికమైన వాంఛలతీవ్రతను కూడా నిపుణంగా ప్రదర్శించగలడనడానికి చతురంగలోని 'దామిని' కూడా తార్కాణం.

## కథలు

కథానికా రచనలో రవీంద్రుడు కనకశైల శిఖరం అందుకొన్నవాడు; కీర్తి ధవళగిరిని చేరుకున్నవాడు. అతని కథానికలు ప్రపంచ కథాశ్రేష్ఠాలలో అత్యుత్తమస్థాయికి చెందినవి. మూగ సుభాషిణి, కన్నతల్లికే పనికిరాకపోయిన పథిక్ చక్రవర్తి, చక్రవడ్డీతో చంపే కాబూలీవాలా కూడా మనిషేనన్న కాబూలీవాలా, యజమాని కుమారుడే తనపై ప్రేమతో తన కడుపున పుట్టాడనుకునే రామచరణ్ సానబట్టిన వజ్రాలు; పులుగడిగిన ముత్యాలు; అజరామరమైన విరజాజులు.

రాజీనామా యిచ్చి వెళ్ళిపోతున్న పోస్టుమాస్టరుపై అభిమానం పెంచుకున్న రతన్ పనికత్తె మనస్తత్వం యెంత మనోహరమైంది! సమగ్ర జీవిత పరిశీలనం ఆయన కథల్లో వున్నంతగా టాల్‌స్టాయ్ కథల్లో మాత్రమే వుంది.

ఈయన మొదటి చిన్నకథ భిఖారిణి 1883 లో వ్రాశాడట. చివరిది 1941 లో అవసానదశకు రెండునెలల ముందు. మొత్తం 80 కథలు వ్రాశారు.

## వ్యాసాలు

ఆయన వ్యాసాలు ప్రాచీన కళాసాహిత్యాలకు భావమయ వ్యాఖ్యా విలాసాలు. శాకుంతలంపై విమర్శ, వాల్మీకి, వ్యాసులపై వ్యాసాలు, యితరమైనవి ఆయన గేయాలవలెనే శాశ్వతంగా వుంటాయి.

వాల్మీకి హృదయం ఆయన అవగతం చేసుకుని పాశ్చాత్యుల భ్రాంతిని పోగొట్టారు. ఏమైనా భారతీయ విజ్ఞానానికి పాశ్చాత్యుల ధోరణిలో ఆయన చేసినంత సేవ మరొకరు చేయలేదు. ఆనందకుమారస్వామి కొంత చేశాడేమో!

లక్ష్మీకటాక్షమున్న వారికి సరస్వతి అబ్బదంటారు. దానికి మహాపవాదం రవీంద్రుడు. ధర్మగ్లాని గలిగితే "సంభవామి యుగేయుగే" అని అన్నాడు భగవానుడు. స్వభ్రమే ప్రతీచీవాహినిలో కొట్టుకొనిపోయే మన సాహిత్యం ఉద్ధరణకు అత డవతరించాడనే నా నమ్మకం.

రవీంద్రుని తెలుగువారమైన మనం అర్థం చేసుకొన్నంతగా యితరులు అర్థం చేసుకోలేదంటే ఆగ్రహించకండి. శ్రీ కాళోజీ నారాయణరావుగారు "నా గొడవ"లో

"చాపచింపు సామ్రాజ్యం
ఏదైతేం ఏదైతేం
పోటీపడి కాటులాడ."

అన్నట్లు చీటికిమాటికి పోట్లాడే మనస్తత్వం కలవారు, చిన్నదానికైనా ఆందోళన చేసే ఆశయం కలవారు అయిన కొందరు పెద్దలకు మాత్రం రవీంద్రుని సాహిత్యం అంతగా నచ్చలేదు. సంగీతం అరగంట ఓపిగ్గా వినలేనివారికి విశ్వమానవత్వంపై చర్చించే తీరిక యేదీ?

విశ్వకవి తన మేధామేరు శిఖరాల నుండి దిగి వార్ధాకు వచ్చి గాంధీజీ నాయకత్వం గుర్తించి, ఆయన ఆశయానుగుణంగా శాంతినికేతనంలో చేతి పనులు కూడా నేర్పే యేర్పాటులు చేసి ప్రజాందోళనను మన్నించగా, తెలుగు దేశంలోని కొందరు గాంధీ అనుయాయులు శాంతినికేతనం పద్ధతిని హేళన చేశారు.

బెంగాల్ కాంగ్రెసు కమిటీ మాజీ అధ్యక్షుడు శ్రీ సురేంద్ర మోహన్ ఘోష్ గారు 1932 లో తిరుచినాపల్లి జైలులో వున్నప్పుడు నన్ను రవీంద్రుని గీతాలను కొన్నింటిని సంస్కృతీకరించమన్నారు. ముప్పయియేళ్ళనాటివి 'అకేలా చలో' అనే గీతంలోని రెండు ఖండాలు మాత్రం వినిపిస్తాను:

"అకేలా చలో-అకేలా చలో
అకేలా చలో రే."

అనే ఈ గీతం అప్పుడు వంగోద్యమానికి మహోత్సాహం కలిగించింది. శ్రీ ఘోష్‌గారికి చాల ప్రియమైంది. గాంధీజీ కూడా దీనిని చాలా ప్రస్తుతించారు.

"ఏకాకీ చర
ఏకాకీ చర
ఏకాకీ చర రే.

భువనే సతతే భవతా న వదతి
భీషయమాణే విముఖే సత్యపి
పరైరథన్నిత....
ఏకాకీ చర రే.

ఝుంఝూవాతే-రజనీసమయే
నాలోకే సతి-ద్వారే పిహితే
వజ్రజ్వాలిత-వక్షపంజర
ఏకాకీ చర రే."

[ఈనెల 20వ తేదీ సాయంకాలము చిత్తూరు శారదాపీఠంలో జరిగిన రవీంద్ర కవీంద్రుని శతవార్షిక జయంత్యుత్సవములో తిరుమల రామచంద్ర గారు చదివిన వ్యాసములోని కొంతభాగాన్ని ఈ క్రింద ప్రచురించాము. మిగిలిన భాగాన్ని మరుసటి వారములో పూర్తిచేస్తాము. శ్రీ తిరుమల రామ రామచంద్రగారు జగమెరిగిన బ్రాహ్మణులు, బహుభాషాకోవిదులు, పండితులు, కవి, చక్కని విమర్శకాగ్రేసరులు కూడా. ఒక్కసారిచూస్తేచాలు ఆయనలోని గొప్పతనం - సుగుణం - స్నేహసౌశీల్యం - నిరాడంబరతలను అట్టె గుర్తించ వచ్చు. రచనలో కూడా ఆయనకున్న నైపుణ్యాన్ని ఈ వ్యాసమే రుజావు చేస్తుంది. చిత్తూరు ఆంధ్రప్రభ సంపాదక వర్గములో వారిప్పుడు పనిచేస్తు న్నారు. అడిగిందే తడవుగా అడ్డుచెప్పకుండా ఈ వ్యాసమును ముద్రించుకోవ డానికి అంగీకరించినందుకు వారికి కృతజ్ఞతను తెలియజేస్తున్నాము.

—సంపాదకుడు]

(ప్రజావాహిని, చిత్తూరు, 2-6-61)

★★

37

# ఒక బంగారు వర్తకుని గాథ

ప్రాచీన శాసనాలలో రకరకాలవి వుంటాయి. అశోకునిలాగ ఏ సత్పురుషుడో మంచి మాటలు చెప్పినవి కొన్ని; రుద్రదామునిలాగ ఏ రాజ మార్తాండుడో తన అవక్ర పరాక్రమం వర్ణించుకొన్నవి కొన్ని; చాళుక్యరాజు అమ్మయలాగ ఏ పరివార పక్షపాతో తన సేనానికి, మరొకరికీ బహూకరణలు చేసినవి కొన్ని: ఏ ఆస్తికుడో దేవకులాల ధూపదీప నైవేద్యాల కోసం గ్రామాలు దానమిచ్చినవి కొన్ని; ఏ విద్యా వినోదో పండితులను సన్మానించినవి కొన్ని ; ఏ సంఘ వ్యవస్థాపకుడో పలువురికి వృత్తులు కల్పించినవి కొన్నీని.

ఇవన్నీ రాజులవీ, దాతలవీని. మరొక రకం శాసనాలుంటాయి. అవి గురువులవి. ఈ గురుశిష్య సంబంధం పరంపరగా వస్తూ వుంటుంది. "శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర....గురుస్వాములవారు. ఫలానా, ఫలానా వారు మా శిష్యులు. వీరంతా మాకే నడుచుకోవాలి. తప్పితే రౌరవాది నరకాలు...." ఇత్యాదిగా వీటిలో ఉంటుంది. ఈ ప్రజాస్వామ్య యుగంలో ఇదంతా-అంటే ఈ గురుశిష్యభావం దౌర్జన్యంగాను, నిరంకుశత్వంగాను కనిపిస్తుంది. కాని, "మాకు గురువులు ఫలానావారు. వారు తరణోపాయం చూపించేవారు. వారి వంశీయులకందరికీ అలాటి మాహాత్మ్యం ఉంటుంది. వారిని ఆదరించాలి" అన్న విశ్వాసం ఉన్న పాతకాలంలో ఇది దౌర్జన్యంగా కనిపించేది కాదు. ఈ గురువులకు కూడా శిష్యుల నుంచి కానుకలు వగైరా కోరడంలోకన్నా ఇంతమంది శిష్యులున్నారు అని అనుకోడంలోనే ఒక సంతృప్తి—వెర్రి సంతోషం ఉండేది.

ఈ గురుశిష్య భావం పెక్కు కులాల వారికి ఉండేది; నేడు కూడా వైష్ణవులకు, శైవులకు అష్టాదశ వర్ణాలలోను శిష్యులున్నారు. పాంచాలులకు (విశ్వ బ్రాహ్మణులకు) కూడ ఇలాటి శిష్య సంతతి కొన్ని కులాలలో ఉంది. దానిని తెలిపే శాసన మొక్కటి ఇటీవల దొరికింది. దాని బాహ్యరూప మిది:

ఈ శాసనం ఇత్తడిది. ఒకే రేకు. రేకు పొడవు 10½ అంగుళం; వెడల్పు 4½ అంగుళం. రేకు ఒకవైపు శాసనం, రెండవ వైపు ఉబ్బెత్తుగా ఐదు వరుసలలో విగ్రహాలు కొన్ని చెక్కి ఉన్నాయి. (రెండు వైపుల ఫోటో ప్రతికృతులు చూడవచ్చు.)

# శాసన పాఠం

"1. స్వస్తి సమస్త
2. గుణగణాలంకా
3. ర సర్వ వాస్తు శిల్పి శా
4. స్త్ర సుజ్ఞాన పరబ్రంహ
5. నిర్మితాధార పరంజ్యోతి ప్రసంనాప
6. తారులుం ప్రతాప ప్రసిద్ధులున్ సమస్త ఆయు
7. ధ ప్రవీణులుంన్ను సృష్టికర్తను శ్రీ విశ్వకర్మ
8. దేవర జగద్గురువులుంను శ్రీమత్కాళికాదేవి కమతేశ్వ
9. రి దేవర దివ్య శ్రీపాద పద్మారాధికులయిన శ్రీ మహంమ్మే
10. రు నిర్మాణ కర్తలయిన సద్యోజాత ముఖమాశ్యేతు మను
11. విశ్వబ్రహ్మణేయుర్భవతి వామదేవ ముఖమాశ్యేతు
12. మయ విశ్వబ్రహ్మణేర్భవతి అఘోర ముఖమాస్యేతు త్వష్ట వి
13. శ్వ బ్రహ్మణె ర్భవతి తత్పురుష ముఖమాస్యేతు సిల్పి విశ్వ బ్ర
14. ంహ్మణే యుర్భవతి యీశాన్యముఖ మాశీతు విశ్వజ్ఞ బ్ర
15. హ్మణే యర్భవతి మనుబ్రహ్మ గోత్రం అశ్వలాయన సూత్ర పావ
16. కరుషి శాఖ సద్యోజాత ప్రవర మయ బంహ్మ గోత్రం సనాత
17. న గోత్రం ఆపస్తంబ సూత్రం యజుశ్శాఖ వామదేవ ప్రవర
18. త్వష్ట బ్రంహ్మగోత్రం అభవనస గోత్రం బ్రాంహ్మ్యయన సూత్ర సామ
19. శాఖ అఘోర ప్రవర శిల్పి బ్రంహ్మగోత్రం ప్రత్నసగోత్రం
20. హాదాయన సూత్రం అధర్వణ శాఘ తత్పురుష ప్రవర విశ్వ
21. బ్రంహ్మగోత్రం సుపర్ణసగోత్రం కాత్యాయన సూత్రం ప్రణవ
22. శాఖ యీశాన్య ప్రవర । స్వస్తిశ్రీ జయాభిదయ శాలివాహన శక
23. వర్షంబులు వెయ్యింన్ని నూట పదహారు అగునేటి అన్మిం న్వత్ మా
24. నేన వ్యవహారిక చాంద్రమానేన బహుధాంన్యనామ సంవత్సర కార్తీ
25. క శు దశమి సోమవారము గోలకొండ పట్నమందు మల్కివి
26. భురాం పాతా వునాడు పానుగంటి కామాక్షి ఆచారి శిలం
27. భద్రాచారి కుందనపు లకనాచారి బత్తారు భద్రాచారి ధవళె
28. శ మార్కండాచారి విరు అయిదాయి పాదానసం వారు కొ

29. మఠి బచ్చు మలిశెటిని దివారు దండుగకు వడితె ప్రాణ
30. బయాని భయపడి పాంచ్చానసం వారి పాదం పట్టుక వుం
31. టె వంనెండు వెల యెనూరూ వరహాలు దివాణం వారికి
32. యిచ్చి చరవిడిపించి వనస ము్దద లెఖగా యి మెరలు
33. చెశినారు సంవత్సరం 1 కి ఘట్ల కొలిమికి గ 1 ము
34. ద్ద కొలిమికి గ ¼ రాయి 1 కి గ ¼ పెండ్లికి ¼ వడు
35. కు గ ¼ శెల్లా యిచెచ్చేదికాని కొట్టరాదూ తిట్టరాదు
36. దివాణం వారితో చెప్పి షదాశనం చాయరాదు వా
37. నికి యివ్వకపోతె కోపం వొచ్చి పనసకత్తి పొడుచుకుం
38. టె వాని రక్తం చూస్తె వాని యిల్లు నెగదదు వానిక యివ్వ
39. నివాడు ఆరౌదయివాళ్లు వారి దారం దనసు నిజ పట్టరా
40. దు యిది యవరు తప్పించిన కాశిలో గోహత్య
41. చెశిన పాపాన పొదురు పితురు మాతులకు త
42 ప్పినదె పనసవాడు యీ వర్ణం తప్ప మరివక వర్ణము
43. ను అడుగరాదు సలివెంద్ర వుదకం యితర వర్ణం అం
44. న్నం తినరాదు యిది చతుస్సముద్ర పర్యంతరం మం
45 దుండె అయిదాయి పాంచానం వారు తప్పకుండా
46. హంసం పొశ్చం కట్లం యిచ్చి ఆకాశవాణి సాక్షి భూ
47. పతి సాక్షి హరిహరాదులు సాక్షి తప కూడదూ
48. అయిదాయి చ్చెవాలు శ్రీకాళికాదేవి కమటెశ్వ
50. రి రక్షింత్స వలెనూ."

వడ్ల కమ్మర కాశ కంచర కంసాసులను పంచాణం వారు, పంచాననం వారు, పాంచాలులు అని వ్యవహరిస్తారు. ఈశ్వరుని ఐదు ముఖాలనుంచి—పంచాననాల నుంచి పుట్టినందున ఈ పేరు వచ్చిందని ఒకగాథ. విశ్వకర్మే పంచాస్యుడు. ఆయన కుమారులు మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులని మరొక గాథ :

"మనుర్మయః తథా త్వష్టా
    శిల్పి విశ్వజ్ఞ ఏవ చ,
పంచైతే దేవ ఋషయో
    విశ్వకర్మ ముఖోద్భవాః."

అని స్కాందపురాణం నాగరఖండం పేర్కొంటున్నది. విశ్వకర్మకు

ఐదు ముఖాలు, త్రిమూర్తుల శంఖచక్రాద్యాయుధాలు ఉన్నట్టు చెక్కిన శిల్పాలూ ఉన్నాయి. విశ్వకర్మకు కుమారులు ఐదుగురు. వారికి సానగ, సనాతన, అహభవన, ప్రత్న, సువర్ణులనే ఐదుగురు కుమారులు జనించారు. వారికి మను మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞులనే వారు కుమారులని మరొక గాథ.

పంచదిక్కులతో సాక్షాత్కరిస్తున్న ఈ విశ్వమే పంచముఖమైన విరాట్‌స్వరూపం. ఆ ముఖాలు—దిక్కులు—"సద్యోజాత ముఖ మాసీత్" ఇత్యాదిగా వేదస్తుతి పాత్రమైనవి. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అనే ఈ అయిదు ముఖాలనుంచి పంచాననంవారు—మను మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞులు అవతరించారు. వీరి గోత్రాలివి: మనువు—సానగగోత్రం, అశ్వలాయన సూత్రం, ఋక్‌శాఖ, సద్యోజాత ప్రవర. మయుడు—సనాతన గోత్రం, అపస్తంభ సూత్రం, యజుశ్శాఖ, వామదేవ ప్రవర. త్వష్ట—అభవనస గోత్రం, బ్రాహ్మ్యయన సూత్రం, సామశాఖ, అఘోరప్రవర. శిల్పి—ప్రత్నసగోత్రం, హాదాయన సూత్రం, అధర్వణ శాఖ, తత్పురుష ప్రవర. విశ్వజ్ఞుడు—సువర్ణసగోత్రం, కాత్యాయన సూత్రం, ప్రణవశాఖ, ఈశాన్య ప్రవర. – అని పంచాణం వారి గోత్ర ప్రవరలు.

వీరు ప్రధానంగా శైవులు. వీరికి కామాక్షి, కాళికాదేవి, కమఠేశ్వరుడు ఇష్ట దైవాలు. వీరు అనాదిగా శాకాహారులు. కనుక ప్రాచీన బౌద్ధులలో మిగిలిన బాపతని, బుద్ధుడు ఉపదేశించిన పంచశీలను—పంచాయతాలను–అనుసరించే పంచాయనులు గనుక పంచానసులు, పంచాణంవారు అయివుంటారని సర్ డబ్ల్యు. ఇలియట్ మున్నగువారి అనుమానం.

ఈ పంచాణం వారికి పనసవారు, రుంజులవారు అనే రెండు తెగలవారు శిష్యులున్నారు. వీరు వారి ఇండ్లలో శుభకార్యాలకు హాజరయి కట్నాలు, కానుకలు పుచ్చుకుంటారు. అపర కర్మలలో తప్పెట్లు, శంఖాలు, రుంజులు వాయించి ఏవో మామూళ్ళు పొందుతారు. వీరు బేరిసెట్లను, పంచాణంవారిని తప్ప మరొక తెగను యాచించరు. రాయలసీమలోను, తెలంగాణాలోను పంచాణంవారి వివాహ సమయాలలో కాశె బిగించి, నడుముకు కాళీ విగ్రహం గల పెద్ద ఇత్తడి పతకం కట్టుకుని, విల్లు సిడెం (పతాకం), దారం మొదలయిన వాటితో హాజరుకావడం. వారి నుంచి మామూళ్ళు పొంది, సిడెం, ధనుస్సు ఎత్తి దాతలను పొగడడం, వారు ఇవ్వకపోతే ఒక బాకుతో మొండిబండవాళ్ళనే బిచ్చగాళ్ళలాగ మీచేతులు కోసుకుని రక్తం ఓడుస్తూ అహూయిత్యం చేయడం నేడూ చూడవచ్చు. వీరివద్ద విశ్వకర్మ పురాణం, పంచాణం వారి తాల్లూకు తక్కిన వివరాలు గల గ్రంథాలు ఉంటాయి. అయితే ఈ

మామూళ్ళు—వనస వర్తనలు—ఎప్పటినుంచి ఏర్పాటయాయి? ఏర్పాటు చేసిన వారెవరు?—ఈ ప్రశ్నలకు కొంతవరకు సమాధానం చెబుతుంది ఈ శాసనం. ఇదే దీనిలోని ప్రధాన విషయం.

## శాసన విషయం

మలిక్ ఇబ్రహీం కులీ కుతుబ్‌షా గోల్కొండ సీమను పాలిస్తుండగా మలిశెట్టి అనే కోమటి బచ్చు ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు చెల్లించలేదు. ఆ మీద దివాణంవారు కోపగించుకుని, ఆ శెట్టిని చెరవట్టి దండుగ విధించి తీసుకుని వెళ్ళుతుండగా దారిలో కొందరు పంచాణంవారు పానుగంటి కామాక్షి ఆచారి, శీలం భద్రాచారి, కుందనపు లకనాచారి, చిత్తారు భద్రాచారి, ధవళేశ మార్కండాచారి కనిపించారు. మలిశెట్టి వారిని బతిమాలుకున్నాడు తనను చెర నుంచి విడిపించవలసిందని. సరే వారు కనికరించి 12,500 వరహాలు చెల్లించి అయనను చెర విడిపించారు. ఆ సందర్భంలో ఈ ఏర్పాట్లు చేశారు:- పనసవారికి పంచాణంవారు సంవత్సరానికి బంగారు గట్ల పనిచేసే కొలిమి ఒకటింటికి ఒక గద్యాణం; రాతిలో వున్న ముడి ఇనుమును కరిగించిపోసే (ముద్ద) కొలిమి ఒక్కటింటికి 1/4 గద్యాణం; తూనిక రాయి ఒకటింటికి 1/4 గద్యాణం; తమ యింట్లో పెండ్లికి 1/4 గద్యాణం; వడుగయితే 1/4 గద్యాణం; ఒక శెల్లా ఇవ్వాలి. వారిని కొట్టరాదు, తిట్టగాదు. సర్కారువారికి వారిపై ఫిర్యాదుచేసి గాని, మరొకవిధంగాను అవమానించరాదు. పనసవారు తమ కట్నం ఇవ్వ నప్పుడు పంచాణం వారి ఇంట్లో కత్తి పొడుచుకుంటే, ఆ రక్తం చిందితే గాని, ఆ రక్తం చూస్తే గాని పంచాణంవారి యిల్లు అభివృద్ధికి రాదు. అలా కట్నం ఇవ్వనప్పుడు పనసవారు తాము మామూలుగా జరపే వంశక్రమ వర్ణనలు, స్తోత్రాలు చేయరాదు. పనసవారు పంచాణం వారిని తప్ప మరొకరిని యాచింప రాదు. ఇతరుల అన్నం, నీరు ముట్టరాదు. ఇది ఐదు పంచాణం శాఖలవారు వ్రాసి యిచ్చిన—పనస ముద్ర వేసి యిచ్చిన—శాసనం గనుక ఆదరించాలి. ఆదరించకపోతే కాశిలో గోహత్య చేసినట్టు. ఇది శాసనంలోని కథ.

సరే! పంచాణం వారు మలిశెట్టిని చెర విడిపించారు. ఆ సందర్భంలో పనస వారికి సంవత్సర వర్తనలు చెయడం ఏమిటి? ఈ పనసవారు ఇక్క డెందుకు వచ్చారు? వీరు మలిసెట్టిని విడిపించడంలో సహాయపడ్డారా అంటే, అదీ కనిపించదే శాసనంలో. —ఇలాటి ప్రశ్నలు ఉదయిస్తాయి. వీటిని నివా రించుకొనడానికి స్థానిక చరిత్రలు కొంత తడవాలిసి వుంటుంది.

"పనసవారు, రంజులు భేరికోమట్లను, కంసాలవారిని మాత్రం యాచి

స్తారు. గోల్కొండలో బచ్చులవారు శిస్తు బకాయి ఇవ్వని కారణంగా అరెస్టు చేయబడ్డారట. వారు దారిని పోతున్న పంచాణం వారిని చూచి, నోట్లో వుండే తాంబూలం తమ్మ వుమ్మివేసి, తమకు సహాయం చేయవలసిందిగా—తమను దివాణం వారి నుంచి విడిపించవలసిందిగా ప్రార్థించారట. పంచాణంవారు అలాగే శిస్తు బకాయి చెల్లించి, వారిని చెర విడిపించి తమకు శిష్యులుగా వుండేట్లు ఏర్పాటు చేసుకున్నారట. అప్పటినుంచి పనసవారు ఏటేటా పంచాణం వారి యిండ్లకు వస్తూ, తమ వర్తన రూకలు తీసికొని వెళ్ళుతుంటారు. వీరు కర్నూలు జిల్లాలో స్థిరనివాసం చేసే తెగవారు కారు. తరుచు తిరుగుతూ వుంటారు" అని కర్నూలు జిల్లా మాన్యుయల్‌లో వుంది. దీనిలోను పనస వారెవరో స్పష్టం కాలేదు.

మరొక స్థానిక కథ తమాషాది వుంది. పూర్వం నిజాం నవాబు కొలువులో కొందరు కోమట్లు వుండేవారు. వారు ఏదో అపరాధం చేయగా వారిని నిజాం తన దేశంనుంచి తరిమివేశాడు. రాజాగ్రహానికి గురిఅయినవారికి ప్రజలు ఆశ్రయమిస్తారా! తలకాయ పోదూ! వారికి పంచాణంవారు ఆశ్రయమిచ్చి ఆదుకొన్నారు. ఆ బహిష్కృతులే పనసవారు. రుంజవారిని శివుడు సృష్టించాడు. శివుడు రవుండాసురుని సంహరించగా, వాడు తన అవయవాలు సంగీత వాద్యాలు కావాలని, వాటిని వాయించడానికి వేరే తెగనే సృష్టించాలని శివుని కోరాడట. దానికి శివు డంగీకరించి వారిని పోషించాలని విశ్వకర్మను ఆదేశించాడట. ఆ విశ్వకర్మ సంతతివారైన విశ్వబ్రాహ్మణులు ఆ పూర్వాచారం పాలిస్తూ వున్నారు.

ఈ స్థానిక గాథలనుబట్టి ఎప్పుడో పంచాణంవారు బేరిసెట్లనో, బచ్చులనో ఆపత్కాలంలో ఆదుకొని వుంటారని, దానికి కృతజ్ఞతగా వారు వీరికి శిష్యులై వుండివుంటారని, వారిని ఇతరులు అస్పృశ్యులన్నంతగా తక్కువగా చూచారని, వారికి చెర తప్పినా సంఘపు చెర తప్పలేదని, పనసులుగా-మురికి వారుగా పరిగణించబడుతూ వచ్చారని, ఈ శాసనంలోని మలిసెట్టి కూడా ఈ విధంగా బహిష్కృతుడైన పనసతెగవాడయి వుంటాడని, కనుకనే ఈ సందర్భంలో ఈ వర్తనలు ఏర్పాటయి వుంటాయని భావించవచ్చు.

బేరిసెట్లకు, పంచాణం వారికి—ముఖ్యగా స్వర్ణకారులకు సన్నిహితత్వం వున్నట్టు వారి ఇళ్ళు, వాకిళ్ళు చూచినా తెలుస్తుంది. ఈ రెండు తెగలవారు రాయలసీమలో దాదాపు ఒక వీథిలోనే వుంటారు. కారణం స్వర్ణకారులు బంగారు పనివారు, బేరిసెట్లు బంగారు వ్యాపారులు. కనుక ఒకరి సరసన

మరొకరు నివసించడం అవసరమే. ఈ సన్నిహితత్వాన్నిబట్టే బేరిసెట్టీ, స్వర్ణకారుడూ ఒక్కడే అనే విసుర్లు కూడా పుట్టాయి. కనుక పనసవారు ఈ రెండు కులాలవారిని మాత్రమే యాచించడం కూడా ఈ సన్నిహితత్వానికి మరొక నిదర్శనం.

తమిళనాడులో బేరిసెట్లకూ, పంచాణంవారికీ గల సంబంధం తెలిపే కథ మెకంజీ రికార్డులలో కనిపిస్తుంది —

తమిళనాడులో మాందాపురి అనే పట్టణం వుంది. పంచవృత్తులు చేస్తున్న ఈ పంచాణం వారు కలిసే వుండేవారు; అన్ని లోహపు పనులు చేస్తూ బాగా సంపాదించేవారు. కలిసి కట్టుగా వుండేవారు. గనుక వీరిని చూస్తే అందరికి భయంగా వుండేది. వారు ఆ రాజును కూడ లెక్కచేసేవారు కారు. అయస్కాంతంతో కోట కట్టుకుని అందులోనే వుండేవారు. రాజుకు చాల కోపం వచ్చింది. కాని ఏమి చేయగలడు? వారి కోట అయస్కాంతంది కావడంవల్ల ఎక్కడెక్కడి ఆయుధాలు ఆ కోటకే చేరేవి. కోట కూడ చాల బలమైంది. కనుక అభేద్యంగాను, అజేయంగాను వుండేది. పంచాణం వారిని జయించడానికి రాజు ఒక యుక్తి పన్నాడు. అయస్కాంతం కోట ఎదుట మరొక కోటకట్టి పంచాణం వారిని లొంగదీయడానికి కొందరు దేవదాసీలను పెట్టాడు. సరే మనువన్నట్టు ఆడది నిప్పు, మగవాడు నెయ్యికుండ కదా! కరగక ఏమౌతాడు! ఒక స్వర్ణకారుడు ఒక దేవదాసికి లొంగిపోయాడు. ఆవిడ అతని నుంచి అయస్కాంతం కోట ధ్వంసమయ్యే రహస్యం లాగింది. మరేమీ లేదు. వరకు గడ్డి అనే ఒకరకం గడ్డి కోట చుట్టూ వేసి మంట పెడితేసరి. కోట కాలి బుగ్గి అవుతుంది. సరే ఇక నేముంది? మర్నాడే కోట కాలిపోయింది. కొందరు చచ్చారు. ప్రాణభయంతో కొందరు ఓడలెక్కి పారిపోయారు. కొందరు రాజుకు చిక్కారు. వారిని రాజు వురి తీయించాడు. గర్భంతో వున్న ఒక పంచాణంవారి పడుచుమాత్రం పారిపోయి మరొక వూరిలో ఒక బేరిసెట్టి యింట్లో తలదాచుకుంది. రాజభటులు పంచాణం వారికోసం ఇల్లిల్లూ గాలిస్తూ ఈ బేరిసెట్టి యిల్లూ గాలించారు. బేరిసెట్టి ఆమె తన కుమార్తె అని చెప్పి ప్రాణగండం తప్పించాడు. పంచాణం వారందరూ పంచత్వం పొందారు. ఈ విధంగా ఆయుధాలు, తక్కిన పనిముట్లు చేసే దిక్కే లేకపోయింది. ఒక్క పంచాణం వాడైనా బతికి వున్నాడేమో చూచిరమ్మని రాజు భటులను ఆదేశించాడు. పంచాణం వారని తెలుసుకొనడానికి ఒక పరీక్ష కూడ పెట్టాడు. ఒక వగడానికి తిరుగుడు తిరుగుడుగా మర పద్ధతిలో రంధ్రం చేసి, ఒక దారం పోచ యిచ్చి పంపారు. ఆ దారాన్ని ఆ వగడంలో కూర్చాలి. ఇదీ పరీక్ష. భటులు దేశం గాలిస్తూ ఆ బేరిసెట్టి వున్న

గ్రామానికి వెళ్ళారు. అక్కడ పంచాణం ఆయిద కుమారుడు ఆ పరీక్షకు నిలబడతానన్నాడు. వగడాన్ని చీమపుట్టపై పెట్టి, దారాన్ని చక్కెరలో అద్ది వగడం రంధ్రంలో దూర్చిపెట్టాడు. చీమలు కన్నం అటువైపుగుండా వచ్చి దారం లాక్కున్నాయి. ఈ యుక్తికి రాజు మెచ్చి, బేరిసెట్టిని పిలిపించి పిల్లవాని వివరాలు అడిగాడు. ఆ బేంసెట్టి యథార్థం చెప్పాడు.

ఈ కథలనుబట్టి పంచాణం వారికి ఒకతెగ బేరిసెట్లకు సంబంధం చాల కాలంగా వున్నట్టు తోస్తుంది. గోల్కొండ బచ్చులు కూడ బంగారు వ్యాపారం చేసే వారయి వుంటారు. వారితో వ్యాపారరీత్యాగల సన్నిహితత్వాన్నిబట్టి పంచాణంవారు వారిని ఆపత్కాలంలో ఆదుకొని వుంటారేమో।

ఈ శాసనంలో పేర్కొన్న కథ తెలుగు దేశమంతటా వ్యాప్తిలో లేనందున, తెలంగాణా కర్నూలు మండలాలలో మాత్రమే వినవస్తున్నందున చాల ఇటీవలదై వుంటుందేమో। ఈ శాసనం లిపి, శాలివాహన సంవత్సరాల సంఖ్య ఈ అనుమానానికి అవకాశమిస్తున్నాయి. శాసనంలో మల్కిభరాం పరిపాలిస్తున్నట్లు పేర్కొనబడింది. ఇచ్చిన శక సంవత్సరం సంఖ్య వెయ్యిన్ని నూట పదహారు. శాలివాహన శకానికి 78 సంవత్సరాలు చేరిస్తే క్రీస్తుశక వర్షాల సంఖ్య వస్తుంది. దీనితో క్రీ.శ. 1194 అవుతుంది. శాసన సంవత్సరం బహుధాన్య, కార్తిక శుద్ధ దశమి సోమవారం. 1194 కు ఆనందనామ సంవత్సరం కార్తిక మాసం బుధవారమౌతుంది. ఇంతకూ మల్కిభరాం పాలనకాలం క్రీస్తుశకం 1530 నుంచి 1580 వరకు. శాసనంలోని వేయిన్నినూటను వెయ్యిన్నేనూట అని దిద్దుకుంటే దానికి సరైన సంవత్సరం జయ సంవత్సరం, క్రీస్తుశకం 1594 అక్టోబరు 20వ తేదీ అవుతుంది. బహుధాన్యనే ప్రధానంగా పెట్టుకుంటే 1501 శాలివాహన శకం అవుతుంది. మల్కిభరాం పేరు స్పష్టంగా వుంది గనుక శాసనంలో వున్నట్టు వెయ్యిన్ని నూట పదహారు అనడానికి అవకాశమే లేదు. ఈ చిక్కులన్నీ చూస్తే శిల్పి ప్రచారంలో వున్న ఆచారం, కథలు బట్టి దీనిని చెక్కాడేమో అని అనుమానించడానికి అవకాశం వుంది. లేక పాత శాసనాన్ని నకలు చేయడంలో పొరపాటుపడ్డాడేమో।

లిపి విజయనగర కాలంది ఎంతమాత్రమూ కాదు. ఆ కాలం లిపిలో అప్పుడప్పుడే విడిపోయిన కన్నడ, తెలుగు వాసనలు వుంటాయి. ఆ కాలపు ఏ శాసనం చూచినా ఈ విషయం స్పష్టమౌతుంది?

ఇక భాష : శిల్పి చాల నిరక్షరాస్యుడుగా కనిపిస్తాడు. సంస్కృత శబ్దాలు ఎన్ని తప్పులతో చెక్కాడో మొదటి 22 పంక్తులు చదివితే స్పష్టమౌ

తుంది. ఇక తెలుగు మాటలు వ్యావహారికాలు గనుక పదాలు తప్పులనడానికి వీలులేదు. అయినా, పదాలగుణింతాలు, ఒత్తులూ ఎన్నో పోయాయి. పాఠకులు సులభంగా ఈ భాషను, పదాలను దిద్దుకోగలరు గనుక కొన్నిటికి మాత్రం వివరణ యిస్తే చాలు.

26వ పంక్తిలో: విభురాం పాతాణ ఇబ్రహీం పాదుషా. 32వ పంక్తిలో: పనసముద్ర-ప్రతి కులంవారికీ వారివారి శాసనాలలో ప్రత్యేక ముద్ర వుంటుంది. యి మెరలు-ఈ మేరలు, ఏర్పాట్లు. 33వ పంక్తిలో: ఘట్ల కొలిమి-బంగారు మున్నగునవి గట్లుగా పోసే కొలిమి. గద్యాణం : వరహా అనబడే బంగారు నాణెం. ముద్దకొలమి; ముడి యినుమును కరిగించే కొలిమి. 35వ పంక్తిలో: శెల్లా—పైన కప్పుకొనే పంచ. 36వ పంక్తిలో: వుదాశనం—ఉదాశీనం, ఉపేక్ష, అన్యాయం. 39వ పంక్తిలో: దనసు—ధనుస్సు; సిడ-జండా; 46వ పంక్తిలో: హంసం పాశ్యం-అంశమూ పోచ్చ. అంటే పూర్తిగా. అంశం అనేది హంశం అయింది; హంసం కూడ అయింది. హంసం అనేది బ్రౌను మిశ్ర నిఘంటువులో గ్రహించాడు. పోచను వ్రాత్తి పలకడంలో కలిగిన రూపం. ప్రతి అంశమూ పోచ్చ.

శాసనం వెనుకప్రక్క మొదటి వరుసలో కాళికాదేవి, రెండవ వరుసలో శివుడు, నంది, భృంగి, వినాయకుడు. మూడవ వరుసలో మొదటి బొమ్మ వడ్రంగం, తరిమెన పడుతున్నారు. రెండవది బంగారు పని, మూడవది కమ్మరం. నాల్గవ వరుసలో మొదటి బొమ్మ శిల్పం, ఐదవది కంచరం. చెట్టు, గుర్రపు రౌతు వీరభోగ వసంతరాయలు. కల్క్యవతారంగా వీరభోగ వసంతరాయలు వస్తాడన్న పంచాణం వారి విశ్వాసానికి సూచన. ఐదవ వరుస పనస ముద్ర, రాజలాంఛనాలు.

నాకు తెలిసిన విషయాలు, థర్స్టన్, మెకంజీ రికార్డులు మున్నగువాని కథలు పోగుచేసి ఇక్కడ పెట్టాను. సంప్రదాయజ్ఞులు యథార్థం తెలియ జేయాలని మనవి.

(ఈ శాసనాన్ని సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ కోడూరి రామమూర్తిగారు సేకరించి ఆంధ్రప్రభలో ప్రచురించాలని సంపాదకులను కోరారు. ఆంధ్రప్రభ 2-9-56.)

★★

# కవి సమ్మేళనాలు, ముషాయరాలు

కవితా పఠనాలు, కవితా విమర్శకులు మనకు పూర్వంనుంచీ వున్నాయి. కొత్త కావ్యం ఏదైనా వస్తే దానిని పండిత గోష్ఠులలో వినిపించడం, దానిపై విమర్శ ప్రతివిమర్శలు, తర్వాత మార్పులు చేర్పులు, ఆమోదముద్ర ఇది పూర్వ సంప్రదాయం. తమిళదేశంలో సంఘకాలం నుంచి ఈ సంప్రదాయం వుంది. కన్నడంలోను, తెలుగులోను 'పండిత షండంబులు, విద్వత్పరిషత్తులు' వున్నట్టు నన్నయ భారతమే తార్కాణం. అప్పటి పండితుడు అంటే కవి, రచయిత, విమర్శకుడు, శాస్త్రజ్ఞుడు అయిన వ్యక్తి. అతని ఆమోదముద్ర లేనిది ఏ రచనకూ ప్రాచుర్యం లభించేది కాదు.

ఈ పండిత మండలుల స్థానం క్రమంగా రాజుల, రారాజుల ఆస్థానాలకు వచ్చింది. రాజాదేశంతోనో, "సద్యః పరనిర్వృతి" కోసమో రచనలు చేయడం, రాజాస్థానాలలో వినిపించడం, రాజు తల ఊపితే, తక్కినవారు గంగిరెద్దులలాగ తల లూపడం సంప్రదాయమయింది. రాజుల తర్వాత జమీందారులు.

కాని, నేటి కవి సమ్మేళనాలు మాత్రం మన సంప్రదాయం కాదనే అనాలి. ఇవి మొఘల్ చక్రవర్తుల కాలంనుంచి మనదేశంలో ప్రచలితమయాయి. మొఘల్ చక్రవర్తులేమో దానిని అరబ్ పారసీకదేశాల నుంచి ఎరువు తెచ్చుకొన్నారు. దీనిని ముషాయరా అంటారు. అంటే, కవులగోష్ఠి. షాయర్ అంటే కవి. ముషాయరా కవి సమ్మేళనం. దీనికొక అధ్యక్షుడు వుంటాడు. ఇతనిని సదర్ ఇ ముషాయరా అంటారు. ఇతడా కవితా పఠనం ముందు కవితను గురించి, తత్ప్రయోజనం గురించి, నవీన వైఖరులను గురించి ప్రసంగిస్తాడు. దీనిని ఖుత్బై సదారత్ అంటారు. తర్వాత కవులు తమ తమ రచనలను చదువుతారు. చర్చలు వాదోపవాదాలు జరుగుతాయి. సమాప్తిలో ముంతజిం—కార్యదర్శి, లేక వ్యవస్థాపకుడు అభినందన వాక్యాలు చెబుతాడు. తర్వాత బర్ఖాస్త్. సమ్మేళనం పిగిపోతుంది.

ఈ కవి సమ్మేళనాలలో కవితా పఠనం శ్రావ్యంగా వుంటుంది. కవి సమ్మేళనం ఫలానారోజు జరుగుతుందని మొదటే ప్రచారం జరుగుతుంది.

ఆహూతులు, అనాహూతులు కూడ దీనిలో పాల్గొనవచ్చు. గుమిగూడిన వేలకొలది సభ్యులలో నుంచి ఎవరైనా అప్పటికప్పుడు ఆశువుగా కవితలు అల్లి చెప్పవచ్చు. విమర్శలో పాల్గొనవచ్చు. వర్ధిష్ణువులకు, బుభూషువులకు పూర్తిగా అవకాశం వుంటుంది.

ఈ ముషాయరాలలోను రెండు రకాలున్నాయి: ఒకటి తర్హీ. నియమ నిబంధనలతో ఉండేది; ఫలానా ఖాఫియాతో - అంత్యప్రాసతో, ఫలానా రదీప్‌తో-ఉపాంత్యప్రాసతో, ఫలానా వృత్తంలో, ఫలానా వర్ణనలలో ఉండాలనే నియమ నిబంధనలు వుండేది. రెండవది బేతర్హీ. దీనిలో ఎలాటి నియమ నిబంధనలూ లేవు. గద్యగంధి పద్యాలు, పద్యగంధి గద్యాలు, గేయాలు ఇష్టం వచ్చినవి చదువవచ్చు. ఇక మన సమస్యాపూరణం వంటివి కూడా వున్నాయి.

ఒకరు ఒక వృత్తంలో పాదం ఇవ్వడం, దానికి అనుగుణమైనది, వక్త్ర వివక్షితమైనది చెప్పడం ఒక పద్ధతి. ఛలోక్తిగా వికటంగా చెప్పడం మరొక పద్ధతి. ఉదాహరణకు ఒకరు ఒక షేర్ అనే ద్విపదలో ఒక మిస్రా-ఒకపాదం చెబుతాడు. దానికి మరొకరు రెండవ పాదంతో సమాధానం చెప్పి పూరిస్తాడు. అలంగీర్ చక్రవర్తి కూతురు జైబున్నీసా గొప్ప కవయిత్రి; వక్రోక్తిలోను, సమస్యాపూరణంలోను చతురురాలు. ఆమెకు ఏకవి రచనా నచ్చేది కాదు. అప్పుడు అఖల్‌ఖాన్ అనే కవి వుండేవాడు. వాడు నిరుపేద. జైబున్నీసాను ప్రేమించాడు. "ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథాః" అని అతని ఆశ ఫలించలేదు. అతడు జైబున్నీసాసమస్యలను కవితాగోష్ఠులలోను, విడిగాను మనస్సును క్షోభపెట్టే సమాధానాలతో పూరించేవాడు. బీదవాడు కావడంవల్ల జైబున్నీసాకు అతడంటే ఉపేక్ష, కొంటెగా సమాధానం చెబుతాడని కోపం. ఒకమారు ఆమె

"అజ్ హం నమీషవద్
జహలావత్ జుదాలబం,"

(నా పెదవులకి తీపి ఎలా కలిగెనో!) అనే ఒక మిస్రాను ప్రకటించి పూరించమని కోరిందట. ఎవరు ఏవి పంపినా ఆమెకు నచ్చలేదు. తుదకు అఖల్‌ఖాన్

"షాయద్ రశద్ బర్‌లబే
జైబున్నీసా లబం."

(నా పెదవులు అంటడంవల్ల ఆ తీపి కలిగెనేమో!) అని మరొక మిస్రా చెప్పి పూరించాడట. దానికి ఆమె ఆగ్రహించిందట.

మరొకమారు జైబున్నీసా తలంటుకుని ఎర్రదుస్తులు ధరించి, చంద్ర శాలలో శిరోజాలు అర్చుకుంటున్నదట. ఆ దారిని వెర్రిగా తిరిగే అఖల్ ఖాన్

"సుర్క్ పోశ్ బలబే బాం
నజర్ మీ అయద్,"

(ఎర్ర దుస్తులతో ఒక దివ్యసుందరి నా కనుల ఎదుట వచ్చింది.) అని ఒక మిస్రా చెప్పాడట. జైబున్నీసా వెంటనే

"న బజారీ న బజోరీ
న బజర్ మీ అయద్."

(బజారు కవికి బలవంతంతోనైనా, ధనంతోనైనా దివ్యసుందరి వచ్చేనా?) అని రెండవ మిస్రా చెప్పి పూరించిందట.

అరబ్ దేశంలో "రజ్మియా షాయరి" అనే ఒరొక పద్ధతి వుంది. యుద్ధ సమయంలో ఇరువాగుల వెంట కవులు వుండేవారు. ఒక పక్షం కవి ఒక కవిత గాని, ఒక చరణంగాని చెపితే, ఎదిరిపక్షం కవి దానికి సమాధానంగానో, దానిని విరిచి విపరీతార్థంగానో పూరించేవాడు. ఇది యుద్ధంతోపాటు ముమ్మరంగా సాగేది. ఈ యుద్ధరంగ కవితను "రజ్మియా షాయరీ" అంటారు. పృథ్వీరాజు యుద్ధం చేసేటప్పుడు పృథ్వీరాజ రాసో రచించిన చంద్ బర్దాయీ ఆయనతోపాటే యుద్ధరంగంలో వుంటూ, యుద్ధం ప్రత్యేకంగా చూచి వర్ణించాడట. ఈ విధంగానే విజయనగర సార్వభౌముల కాలంలోను కవి పండితులు యుద్ధరంగానికి వెళ్ళేవారని రాయవాచకం చెబుతున్నది.

స్వాతంత్ర్యానంతరం రాజరికం ప్రజలది అయింది గనుక, ప్రజా ప్రభుత్వం ఆ రాజరికపు పద్ధతులను అనుసరించడంతో, ఈ ముషాయిరాలు, తదనుబంధంగా కవి సమ్మేళనాలు పెట్టసాగింది. ఇవి రేడియోలోను వినబడడం ఆరంభమయింది. ప్రతి స్వాతంత్ర్య దినానికీ, ప్రతి జయంతికీ, వర్ధంతికీ, ప్రతి పండుగకూ, పర్వానికీ ఈ రేడియో ముషాయరాలు మౌజూదు, కవిసమ్మేళనాలు ఖరారు.

ఈ ముషాయరాలు, కవి సమ్మేళనాలు రేడియోలో వింటూ గాంధీ యుగం గడిపాము; నెహ్రూయుగం నడిపాము; శాస్త్రియుగమూ సంకీర్ణుల మయాము. ఒక కొత్తకవి పేరు వినడంలేదు. ఒక కొత్త కావ్యం పేరు కనబడడం లేదు, ఒక కొత్త సంప్రదాయం వెలువడడం లేదు. మొన్న ఉగాదినాడు (ఏప్రిల్ 66) విజయవాడ నుంచి వినబడిన ఉగాది కవి సమ్మేళనమూ, పాత వాటి కంటే ఈషత్తయినా భిన్నం కాదు.

తరవ్నరగా కనబడే సహస్ర మాసజీవులూ, షష్టిపూర్తులూ మరలా వినబడ్డారు. టీడింగ్ పల్లెవాటులవారు, పంచెకట్లులవారూ అప్పటివారే.(వారివేషం రేడియోలో కనబడలేదు; టెలివిజన్‌లేదు గనుక. వారి సవ్వడిని బట్టి ఆ వేషాలనే శ్రోతలు ఊహించుకోవచ్చు.) అవే కూనిరాగాలే, అవే విరుపులే. నవీనులలోను కొత్తవారు కనిపించలేదు. వచన గంధి పద్యాలతో విసిగించిన ఆ పాతవారే, మళ్ళీ అవే ధోరణులే.

ఇక పద్య పఠనమా? రామ! రామ! కొందరికి సంగీతం సగమెరిక. కొందరికి "పూర్తిఎరిక." పద్యాలను పాడాలా, వద్దా అనే వాదం ఎలా వున్నా, శ్రావ్యత అనేది దేనికైనా ప్రధానగుణం గదా? రసానుగుణమైనరీతి వృత్తి శయ్యా పాకవృత్తాల లక్ష్యమేమిటి? శ్రోతకు రచనోద్దేశం రుడితి ప్రబోధమై రసావేశం కలుగడం కదా! అందుకనే మనపూర్వులు సంస్కృత నాటకకారులు, తద్వ్యాఖ్యాతలు శ్లోకాలను రాగ సూచనతోపాటు, రాగాలకు కాలదేశ వర్తమానాలు నిర్దేశించారు. ఉగాది కవిసమ్మేళనంలోని కవులు వాటినేమైనా పాటించారా? ఒక్కరొక్కరి శారీరం వింటూ వుంటే ఒళ్ళు గగుర్పొడిచేది. అసలు ముషాయిరాలలో శ్రావ్యతకు కూడా ప్రాధాన్యం వుంది. గజల్, షేర్ చదివాడంటే, ఎంతో గంభీరంగా చదవడం అలవాటు చేస్తారు. తర్వాతగాని వేదికలమీద చదవరు.

ఇక్కడ మనం కవితా మూలసూత్రాల జోలికి పోవడంలేదు గాని, పఠనం శ్రోతృ శ్రోత్ర శ్రోతవ్య వివేకానికి సంబంధించింది గనుక శారీరం గురించి చెప్పవలసి ఉన్నందున, శారీరానికి ఉచ్చారణ మూలం గనుక కవితా వివేచన దిఙ్మాత్రంగా చేయడం తప్పనిసరి.

కవిత ముఖ్యంగా గద్య పద్యాత్మిక. పద్య రచనకూ, గద్య రచనకూ ఒక పెద్ద తేడా వుంది. గద్య రచన బోధపడినంత సులువుగా పద్యరచన సామాన్యులకు బోధపడదు. పదగాంభీర్యంమాట అటుంచి పద్య రచనలో భావం, వాక్యవిన్యాసం గద్య రచనలో లాగ సూటిగా, మామూలుగా ఉండక, డొంక తిరుగుడుగా వుంటుంది. కవితలో కర్త కర్మ క్రియలకు కట్టుబాటు అవసరం లేదు. అవి తమ చిత్తం వచ్చినచోటు చూచుకుంటాయి. దీనికి వైయాకరణులు అనుమతి కూడా యిచ్చారు. అందువల్ల సామాన్యులకు కవిత, అందులోను చక్షురక్షర సంయోగం లేనప్పుడు, కేవలం వినుకలిపైనే ఆధారపడినప్పుడు కొంత కషాయప్రాయం అవుతుంది.

ఈ రోజుల్లో ఆ కవితలూ, కొన్ని సరళం, మృదుళం అయి కోశగత శబ్దాల జోలికిపోక, నారికేళపాక సంకాశాలుకాక, అందరికి అర్థమయ్యే సామాన్య

భాషలో సామాన్యభావంతో వున్నాయని మనం అనుకున్నప్పటికీ, వాటిని రేడియోద్వారా శ్రోతలకు అందజేయాలంటే పఠనం ముఖ్యం. కనుక కవులు తమ పద్య పఠనంలో మరికొంత శ్రద్ధ మానవలసి వుంటుంది.

పత్రికలలో అచ్చయ్యే కవితలను పఠితలు తీరికగా ఒకసారికి రెండు సార్లు చదివి అర్థం చేసుకునే సావకాశం, తదనంతరం ఆనందించే ఆస్కారం ఉంటాయి. రేడియో శ్రోతలు అంత అదృష్టవంతులు కారు. ఎంత చెవులు రిక్కించుకుని కూర్చున్నా, కొన్ని కొన్ని పదాలు వినబడవు. విన్నదానితోనే వారు సంతృప్తిపడి, అర్థమైనంతవరకే సరిపెట్టుకొని వూరుకోవలసివస్తుంది. శబ్దతరంగాలవేగం మనస్సు వేగానికి మించిందికాకపోయినా, రేడియో కవితా రవతరంగాలను అందుకోవడం చెలి మనస్సుకూ చేతకావడం లేదు. సామాన్యుడు ఆనందించలేడు.

ఇందుకు కవులు పద్యపఠనంలో చూపే నిర్లక్ష్యమే చాలవరకు కారణం. పద్యపఠనానికి చక్కని శారీరం, దానికితోడు నిర్దుష్టమైన ఉచ్చారణరీతి అవసరం. శారీరమనేది దైవదత్తమని సంగీత విద్వాంసుల అభిప్రాయం. మన కవి శిఖామణులు మన నేపథ్యగాయన గాయనీమణులతో పోటీపడాలని కాని, శుకపిక శారికలతో స్పర్ధపడాలని కాని ఆశించలేము. పద్యాన్ని పాటగా పాడమని కోరము. అలా కోరడం భావ్యమూ కాదు.

శారీరం లేక గొంతుక 'మైకుకు' నప్పకపోతే పొమ్మనడానికి వారు సామాన్యులా? పేరుమోసిన కవిపుంగవులు! పత్రికల ద్వారా వారితో సన్నిహిత పరిచయం ఏర్పరచుకొని, వారి కంఠస్వరం ఎలాగుందో విందామని కుతూహలపడే శ్రోతలు బొంగురుగానో, చప్పగానో, అస్పష్టంగానో, నీళ్ళు నమిలినట్టు గానో, ముద్దమింగుతున్నట్టుగానో, పెద్దపులి తరుముకొని వస్తున్నట్టుగానో వినిపించే గొంతుకలు విని హతాశులవుతారు.

అయితే, శారీరం బాగులేని కవులు రేడియో ముషాయరాలకు, కవి సమ్మేళనాలకు పనికిరారా? — అనే ప్రశ్న ఉదయిస్తుంది. గొంతు బాగుండక పోయినా, నీళ్ళు నమలడాలు, ముద్దలు మింగడాలు లేకపోతే బాగుండును. స్పష్టమైన ఉచ్చారణతో భావావేశాన్ని ప్రస్ఫుటంచేస్తూ శ్రోతలను ఆకట్టుకో వచ్చు. పద్యాన్ని చదివేతీరు సరైన పద్ధతిలో వుంటే శ్రోతలు తన్మయులై కంఠస్వరంలోని కరకుదనాన్ని సహృదయతతో క్షమిస్తారు.

వయస్సుతోపాటు కవిత్వం పరిపాకానికి వచ్చేమాట నిజమైతే కావచ్చు (దీనిలో మతభేదాలు చాల ఉన్నాయి. పూర్వవయస్సు అని కొందరు, ఉత్తర

వయస్సులని మరికొందరు); కవిత ముదిరితే ముదరవచ్చు. దానిని పఠితృ సహృదయులు సహించనూవచ్చు. కాని, వయస్సు ముదరడంవల్ల కలిగే శరీరధర్మాలు మాత్రం ఎవరూ సహించరు. తొస్సెమాటలతో, నీరసంగా, వణుకుతూ పద్యాలు వినిపిస్తే శ్రోతలు ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుంటారు. దీనివల్ల కవిపై అనాదరం కలుగకపోయినా, విసుగుపుట్టడం మాత్రం తప్పదు. "ఎందుకు ఈయనకు ఈ తంటాలు! కవిత వ్రాసి ఏ పత్రికకో పంపక" అనుకుంటారు అభిమానులు. లేకపోతే మరొకరిని, విన సొంపుగా చదివేవారిని చదవమనవచ్చుగా?

పూర్వపు కవులకూ ఈ చిక్కు వుండేదే. పలువురు కవులకు వ్రాయడం చేతనయ్యేది కాదు. అందువల్ల వారు వ్రాయసకానిని, గమకిని ఆశ్రయించి వుండేవారు. వ్రాయసకాడు వారికి ఒకప్పుడు ఆరాధ్య దైవం; గమకి "మవుత్‌పీస్" వానిది కవికన్నా ఒక మెట్టు పైనే. అల్లసానివారికి కూడా ఈ చిక్కులు తప్ప లేదని కథలు చెబుతారు. అల్లసానివారు మనుచరిత్రలో ప్రవర వరూథినీ సమాగమఘట్టాన్ని కొందరికి వినిపిస్తున్నారట. "ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెద భూసురేంద్ర" అనే పద్యం చదవగా అందరూ భళాభళీ! అన్నారట. రామలింగడు లేచి "తాతా! ఎంతలు?" అంటూ నస్యం పట్టులాగ వట్టుపట్టి చూపుడువ్రేలు కొద్దిగా ముందుకు చాచి చూపాడట. అల్లసానివారి మొగం, గుండె ఇంత లయాయట.

"ఏరేం పరవాలేదులే తాతా! నేను రేపు రాయలవారి సమక్షంలో చక్కగా చదువుతాలే!" అని "ఇంతలు" అనేమాట చదివేటప్పుడు చేయెత్తి చేరెడుపట్టి ఊపుతూ చూపాడట.

అందువల్ల ప్రతి రాజస్థానాలలోను గమకికి స్థానం ఉండేది. "కవి గమకి గాయకులు" ఒక కోటిలోనివారు. ఆ గమకి కవి హృదయ స్ఫోరకంగా పద్యాలు చదివి పఠితలకు ఆనందం, కవికి గౌరవం తెచ్చేవాడు. కోపం వస్తే అపార్థం వచ్చేట్టు చదివి రసాభాసా చేసేవాడు. రామలింగడే ఒకమారు భట్టుమూర్తిపై కోపగించుకొని, వసు చరిత్రను శుద్ధ అపభ్రంశం, అశ్లీలం అన్నాడట. ఎందుకని రామరాయలు అడిగారట. ఎందుకేమిటి? మంగళాచరణ పద్యంలోనే వుంది అమంగళమంతా అన్నాడట. దాని పరీక్షకు రాత్రి దీపం వెలిగించి, దాని చుట్టూ శ్రోతలను కూర్చోమన్నాడట. తను వసుచరిత్ర తెరిచి, "శ్రీ భూపుత్రి వివాహవేళ" అనే మంగళాచరణపద్యం చదవడంలో "శ్రీభూ్బ" అని బుగ్గలు బూరించి గాలి వదలాడట. దీపం ఆరిపోయిందట. "చూచారా? ఎంత అమం

గళమో!" అన్నాడట. చదవడంలో చాలా వుంది అనడానికి ఇంతగా చెప్పవలసి వచ్చింది.

మనకవులు రేడియో కవి సమ్మేళనాల విషయంలో ముందుగా తగినంత రిహార్సల్స్ చేసుకుంటే కొందరి లోపాలు చాలవరకు సరిదిద్దుకోవచ్చు. ఏదో మొక్కుబడిగా ఎవరికి వారు ఆ సమయానికి వచ్చి కలుసుకోవడంకన్నా, ఒకటి రెండుసార్లు రిహార్సల్స్ వేసుకుని చదివితే శ్రోతలకు మాత్రమే కాకుండా తమకు మేలు చేసుకున్నవారవుతారు. కవి సమ్మేళనాలు కేవలం కులాసా కాలక్షేపాలు, పదిమందీ కలుసుకునే వేడుకలూ కాకుండా, ఆనందమనే పరమ ప్రయోజనం కోసం జరగాలి. తమవంతు ఎప్పుడు వస్తుందా అని బిగబట్టుకు కూచుని, తమవంతు రాగానే గడగడ అప్పగించే ధోరణి పోవాలి. ఇక ముషాయరాలకు వద్దాం.

ముషాయరాలలో మరొక విశేషమూ వుంది. కవి ఒక మిస్రానో, చౌపాయిలోని ఒక పాదమో చదివి అంత్యప్రాసంలో ముగిస్తే, రెండవపాదం అంత్యప్రాసం శ్రోతలు ఊహించి అందుకొని కవితో - షాయర్‌తో ఏకమై తాళం వేస్తూ పఠిస్తారు; అనువఠనం చేస్తారు. ఈ రేడియో కవి సమ్మేళనాలు కేవలం వన్‌వే ట్రాఫిక్ లాంటివి. శ్రోతలు వీటిలో పాల్గొనడానికి అవకాశం లేదు; రికార్డు సంగీతంలాగా వినడం తప్ప.

మరొక ముఖ్యమైన సంగతి వుంది. అది వ్యవస్థకు సంబంధించింది. తరంనుంచి-అంటే స్వాంత్ర్యానంతరం నుంచీ ఏకబిగిగా రేడియోలో పద్యాలు చదివే వీరు ఎవరికి ప్రతినిధులు? ఏ సంప్రదాయానికి ప్రతినిధులు? ప్రజలకా? ప్రభుత్వానికా? బహుశా కవి సమ్మేళనాలను ఏర్పాటు చేసేవారి ప్రతినిధులయి వుంటారు!

(ఆంధ్రపత్రిక, 10-11-66)

★★

# వీర మా మునివర్ - ఫాదర్ జోసెఫ్ బేషి

పద్నెనిమిదవ శతాబ్దంలో తమిళ భాషా సాహిత్యాలకు సేవచేసిన విదేశీయులలో ప్రముఖుడుగా పేర్కొనదగినవాడు రెవరెండ్ కాన్‌స్టాన్‌షియస్ జోసెఫ్ బేషి ఈయన తక్కిన క్రైస్తవ మతప్రచారకులలాగే భారతదేశానికి వచ్చినపుడు మతప్రచారంకోసం తమిళ భాషను నేర్చుకొన్నవాడు. అయినా తమిళభాషలో నిష్ణాతుడై సమకాలిక పండితులతో అవుననిపించుకొని, తమిళంలో పెక్కు గ్రంథాలు రచించి, లిపి సంస్కరణవంటి పనులు సాధించి, తమిళ ప్రజలతో వీర మా మునివర్ (వీరమహామునులు) అని గౌరవ బిరుదం పొందినట్టివాడు.

కాన్‌స్టాన్‌షియన్ జోసెఫ్ బేషి ఇటలీలో వెనిస్ రాష్ట్రంలోని కాన్‌స్టిగ్లియోన్ డెల్లా స్టెవిరీ అనే గ్రామంలో జన్మించాడు. తండ్రి కౌంట్ డాన్ గాండల్ఫ్. తల్లి ఎలిజబెత్ బేషి. జన్మదినం 1680 నవంబర్ 8వ తేదీ. ఈయన చిన్ననాటినుంచే మతాభిమానం గలవాడు. తల్లి ఈ మతాభిమానాన్ని ప్రోత్సహించింది. జోసెఫ్ బేషి 1698 అక్టోబర్ 21వ తేదీన "సొసైటీ అఫ్ జీసస్" అనే మతసంస్థలో సభ్యుడయి, 1709లో 29వ ఏట మత ప్రచారకుడుగా, పాదరీగా నియమితుడయ్యాడు. విదేశాలకు వెళ్ళాలనే కుతూహలం చిన్ననాటినుంచే వుండడంవల్ల, అందులోను మతప్రచారం చేయాలనే ఆశా మిక్కుటంగానే వుండడంవల్ల భారతదేశానికి బయలుదేరాడు.

భారతదేశం చేరిన తర్వాత దక్షిణ భారతదేశానికి బయలుదేరాడు. అప్పుడు దక్షిణభారతంలో తంజావూరులో మహారాష్ట్ర రాజులు పరిపాలిస్తున్నారు. యూరోప్‌లో ఏర్పడిన స్పర్ధలతో భారతదేశంలో బ్రిటిష్‌వారు ఫ్రెంచివారు పోర్చుగీసువారు పరస్పరం కయ్యానికి కాలుదువ్వుకుంటున్నారు ఇతర విదేశీయులు స్థానిక పాలకుల, ప్రజల ప్రాపకం సంపాదించి, ఎంతో చాకచక్యంతో మతప్రచారం చేసుకొంటున్నారు.

జోసెఫ్ బేషి 1711 మే 8వ తేదీన మదురలోని జెసూట్ మిషన్ చేరాడు. సామాన్య ప్రజలలో మత ప్రచారానికి స్థానిక భాష కావాలి. వారిని పూర్తిగా విశ్వసింపజేయడానికి వారి ఆహార వ్యవహారాలు, వేషం, ఆచారం పరిశీలించాడు. భారతీయ సన్యాసులవలె కాషాయాంబరాలు ధరించి, వారి

వలె ఆహార విహారాలు అలవరచుకొన్నాడు. తన పేరుకూడా ధైర్యనాథస్వామి అని మార్చుకున్నారు. బేషి అనే ఇటలీ భాషా పదానికి వీరుడు, ధీరుడు అని అర్థమట. అందువల్ల ఆయన ఆ విధంగా తనపేరు అనువదించుకొని తాను సన్యాసి కనుక స్వామివేషభాషలు అనుసరించడం అవసరమని నిశ్చ యించుకున్నాడు. తక్కిన విదేశీ పాదరీలు ఈ విషయంలో అదివరకే మార్గ దర్శకులుగా వున్నారు. వెంటనే స్థానిక భాష అయిన తమిళ భాషను నేర్వడం ప్రారంభించాడు. త్వరలో మత ప్రచారానికి అవసరమైన భాషేకాక గొప్ప పాండిత్యాన్ని కూడా సంపాదించాడు. భారతీయ మతప్రచారకుల స్వామి అనే పదం చేర్చుకున్నాడు. కాని, తమిళ ప్రజలు ఆయనను 'వీరమామునివర్' (వీరమహామునులు) అని గౌరవించారు. బేషి మొదట్లో తమిళ భాష నేర్చు కొనడంకోసం, మధుర తిరునల్వేలులలో చిన్న చిన్న ఉద్యోగాలు గూడా చేశాడు.

తర్వాత, తిరుచిరావల్లి ప్రక్కనవున్న ఏలాక్కురుచ్చి అనే గ్రామాన్ని ప్రథమ స్థావరంగా చేసుకొని, తిరుచిరావల్లి తంజావూరు, మధుర, రామనాథ పురం, తిరునెల్వేలి జిల్లాలలో తన మతప్రచారం చేశాడు. ఏలాక్కురుచ్చిలోనే చెక్కు సంవత్సరాలు నివసించారు. 1740 వరకు ఏలాక్కురుచ్చిలోనే వున్నాడు.

అప్పుడు తంజావూరు మహారాష్ట్ర పాలకులకు పాదరీల కార్యక్రమం అంతగా నచ్చలేదు. అందువల్ల పరమత ప్రచారం కార్యక్రమానికి, క్రైస్తవ మతం స్వీకరించినవారికి ఇబ్బందులు కలిగించేవారట. ఒకమారు తంజావూరు జిల్లా తరంగంపాడి అనే గ్రామంలోని ప్రొటెస్టెంట్లకు, కాథలిక్కులకు ఇలాటి బాధ కలిగింది. ఫాదర్ బేషి వారికి ఒకచోట రక్షణ కల్పించి, ఆ వూరికి తిరుక్కావలూర్ (రక్షణ పొందిన పురరాజం) అని పేరు పెట్టి, దానికొక స్థల పురాణం వ్రాశాడు. ఆ స్థలపురాణం పేరు "తిరుక్కావలూర్ కలంబకం."

ఫాదర్ బేషికి కర్నాటక నవాబయిన చందా సాహెబ్‌తో పరిచయం కలిగింది. అది క్రమంగా స్నేహంగా మారింది. అందువల్ల బేషి చందా సాహెబుకు దివానుగా వుండేవాడని వదంతి బయలుదేరింది. కాని, దీనికి చారిత్రకాధారాలేవీ లేవు. బేషి చందాసాహెబ్ స్నేహంతో దేశీయ క్రైస్తవు లకు, విదేశీ మిషనరీలకు చాల సౌకర్యాలు, రక్షణలు కలిగించాడు. క్రైస్తవులు తమ గ్రామాల పొలిమేరలలో గాని, తామున్న ప్రాంతం సమీపంలో గాని ఒక పెద్ద మానుకు జండా కట్టేటట్టు చందాసాహెబ్ ఏర్పాటు చేశాడు. దీనికి "కాది మరం" అని పేరు. ఇలాటి జండాలున్నట్టయితే, క్రైస్తవ గ్రామాలున్నవన్న

మాట. అలాటి గ్రామాలజోలికి ఎవ్వరూ పోరాదని చందా సాహెబ్ ఉత్తరువులు చేశాడు. చందా సాహెబ్ ఫాదర్ బేషికి "కిస్మతీ సన్యాసి" అనే బిరుదిచ్చినట్టు కూడా చెబుతారు.

1742 లో చందాసాహెబ్ పదభ్రష్టుడయ్యాడు. ఫాదర్ బేషి ఏలాక్కురిచ్చినుంచి తన నివాసం తూత్తుకుడికి మార్చాడు. 1747లో ప్రస్తుతం కేరళలో వున్న అంబలక్కాడులోని జెసూట్‌మత పరిశోధన కళాశాలను చూడడానికి వెళ్ళాడు. అక్కడ 1747 ఫిబ్రవరి 4వ తేదీన మరణించారు. అక్కడ నేటికీ ఆయన సమాధి వున్నది.

ఫాదర్ బేషి తన 31వ ఏట భారతదేశానికి వచ్చాడు. 36 సంవత్సరాలు మతప్రచారంతోపాటు తమిళ భాషకు సేవచేశాడు. తమిళ సాహిత్యంలో అప్పుడున్న అన్ని ప్రక్రియలలోను ఆయన రచనలు సాగించాడు.

బేషి రచనలలో అందరూ స్తుతించే గొప్ప కావ్యం తేంబావణి. ఇది 36 పటలాల, 3615 పద్యాల మహాకావ్యం. దీని ఇతివృత్తం సెయింట్ జోసెఫ్ జీవితం. దీనిని క్రైస్తవ ధర్మసూత్రాల, పాశ్చాత్య క్రైస్తవ సంప్రదాయ విషయాల, తమిళ కవితారీతుల సమ్మేళనం అనవచ్చు.

కిత్తేరి అమ్మాళ్ అమ్మానై అనేది ఒక చిన్న కావ్యం. ఇది తేంబావణికి అనుబంధ కావ్యం. తేంబావణిని, కిత్తేరి అమ్మాళ్ అమ్మానైను కలిపి శిలప్పదికారం—మణిమేఖలై అనే ద్వంద్వ కావ్యం వంటిదని అనవచ్చు. ఈ రెండు కావ్యాలలో భాగాలను నేటికీ పాఠశాలలోను, కళాశాలలలోను పాఠ్య భాగాలుగా నిర్ణయిస్తున్నారు.

భక్తి పాడల్‌గల్ (భక్తిగేయాలు) :— ఫాదర్ బేషి భక్తిగేయాలు తమిళ సాహిత్యంలోని వైష్ణవ శైవ దివ్యప్రబంధం, తేవారం సంప్రదాయాలను అనుసరించి, అవేనన్న భ్రమ కలిగించే రీతిగా రచించాడు. వీటిలో పండితుల మన్ననలు పొందినవి తిరుక్కావలూర్ కలంబకం, అడైక్కల నాయకిమేల్ వెన్ కలిప్పా, అడైక్కల మాలై, అన్నై అళంగల్ అంతాదివణ్ణమ్, తేకరం మొదలయినవి.

బేషికి తమిళ వచనకారులలో పెద్ద స్థానం వుంది. ఆయన తమిళ ప్రాచీన గద్య ప్రవర్తకులలో ఒకడు. ఆయన మూడు వచన గ్రంథాలు వ్రాశాడు. దానిలో ఒక్కటి వేదవిళక్కియం. దీనిలో కాథలిక్ సిద్ధాంతాన్ని, చరిత్రను లూథరన్ సంప్రదాయంవారికి వివరించబడింది. మరొక వచన గ్రంథం క్రైస్తవమత ప్రబోధమైన ప్రశ్నోత్తర రూపమైన వేదయిర్ ఒళుక్కమ్.

విద్యార్థులకోసం రెండు పాఠ్యగ్రంథాలు వ్రాశాడు. ఒక్కటి పరమార్థ గురువిన్ కదై, ఒక హాస్యకథ. ఒక సరళ వ్యాకరణం తొన్నూల్ విళక్కం.

మిషనరీలు తమిళం నేర్చుకోడానికి వీలుగా లాటిన్‌లో మూడు తమిళ వ్యాకరణాలు వ్రాశాడు.

తిరుక్కురళ్ ప్రథమ ద్వితీయ భాగాలను లాటిన్‌తో అనువదించాడు.

తమిళంలో వర్ణక్రమానుసారంగా తొలిశబ్దకోశం రచించిన ఘనత ఫాదర్ బేషికే లభించింది. దానిపేరు చతురకారాది.

బేషి తమిళ లిపి సంస్కరణకు కూడా పాటుపడ్డారు. తమిళ తాళపత్రాలలో ఎ. ఏ, లకు, ఒ ఓ లకు పూర్వం భేదం లేకుండా వ్రాసేవారు. దానికి ఆయన స్పష్టమైన సంకేతాలు ఎ కు కింద అడ్డగీత, ఏ కు కింద సుడి ఇచ్చి ఉచ్చారణ భేదాన్ని పాటించేట్టు చేశాడు. దీనికి పలువురు పండితులు ప్రతిఘటించగా, పెద్ద సభచేసి వారందరినీ ఒప్పించాడట.

కేవలం శబ్దాడంబర కవితతోనే సంతృప్తిపడేవారిని ఆయన తన వ్యాకరణంలో ఉదాహరించి ఆక్షేపించినట్టు పండితులు చెబుతారు.

ప్రజల మేలుకోసం ఆయన వైద్యశాస్త్ర గ్రంథాలు కూడా వ్రాసినట్టు చెబుతారు. వీటిలో ముఖ్యమైనవి వైద్దియ మురై, జీరమెఘహు. కాని, ఇవి లభించడం లేదు. వీరమామునివర్ మాత్తిరై (వీరమాముని మాత్ర) అనే మాత్ర మాత్రం నేటికీ వాడుకలో ఉంది.

ఫాదర్ బేషీ తమిళ సాహిత్యంలోని ప్రతి రంగంలోను కృషి చేశాడు; కొన్నిటికి మూలపురుషుడయ్యాడు. ఆయన సేవకు కృతజ్ఞతగా మదురలోని పండితులు, అభిమానులు ఒక మహాసభను సమావేశపరచి సన్మానించారు. ఆ మహాసభలో ఆయనకు "వీరమామునివర్" అనే బిరుదు ఇచ్చారు.

ఫాదర్ బేషి కృతజ్ఞత తెలుపుతూ, "నేను నా పేరును ధైర్యనాథన్ అని అర్థానుగుణంగా మార్చుకున్నాను. మీరు వీరమామునివర్ అని నన్ను అన్నారు. ధైర్యనాథులన్నా వీరుడన్నా ఒక్కటే. ముని అనేది నేను సన్యాసిని గనుక సరిపోయింది. బాగుంది. అది స్వామి అన్నదానికి పర్యాయంగా గ్రహించాను. మాముని—మహాముని— అని మీరు గౌరవించారు. నేను మహామునిని కాను. సామాన్యమునిని, మీ గౌరవానికి కృతజ్ఞుణ్ని" అన్నారని పండితులు చెబుతారు.

(మద్రాసు మెరీనా బీచిలో పోలీసురేడియో ఎదుట రోడ్డుకు ఆవల ఫాదర్ బేషి శిలావిగ్రహం ప్రతిష్ఠించినప్పుడు వ్రాసిన వ్యాసం.)

(ఆంధ్రపత్రిక, 24.12.67)

★★

# కావ్యాల్లోనే కానవచ్చే వసంతవిలాసం

మానవునికి ప్రకృతి విలసనాలకు మించిన అలంబనోద్దీపన విభావాలు లేవు; ప్రకృతి ప్రభావానికి మైమరచిపోయేవాడు. ఈ ప్రకృతి ప్రలోభాన్ని గుర్తించే మన కవులుగూడ ప్రకృతిని, దానిలో కలిగే ఋతుపరివర్తనాన్ని వేలంవెర్రిగా వర్ణించారు. సృష్టికి మూలకారణమూ, అనంతానందసంధాయి అయిన వసంత ఋతువును గురించి చెప్పనక్కరలేదు. తెలుగువారి తొలి కవిత అనదగిన గాథా సప్తశతిలో వసంత సంరంభం చూచి వెర్రెత్తిపాడిన గోపిని సామియకవి ఇలా వర్ణించాడు:

మహుమాస మారుఅహఅ
మహుఅర ఝంకార ణిబ్బరే రణ్ణే,
గాఅఇ విరహ క్ఖరాబద్ధ
పహిఅ మణ మోహణం గోపీ. (2-28)

సురభి సమీరాహత బం
భర నాదము నిండు నడవి బాంధుల మనసుల్
కరగగ బాడుచునున్నది
చిర విరహపుబాట గొల్ల చిన్నది కంటే.

(శ్రీ రా. అ. కృ శర్మ.)

వసంతమాసం ఎలాటి వనులకైనా ఒడికట్టేట్టు చేస్తుంది. నిగ్రహించుకోడం కష్టమని దేవరాయుడనే మరొక కవి ఇలా అన్నాడు :

సచ్చం భణామి బాలఅ
ణత్థి అసక్కం వసంతమాసస్స,
గంధేణ కురవఅణం
మణం పి అసఇత్తణం ణగఅ. (3-19)

చిన్నవాడ నిజము చెపెద వినుము వ
సంతమాసమున కసాధ్యమేది?
కాని, కురవకముల గంధంబు మూర్కొన్న
గూడ దాని నడత కీడు వడదు.

(శ్రీ రా. అ. కృ. శర్మ.)

వసంత ఋతువుతో వైరెత్తిన పాండురాజుకథ అందరూ ఎరిగినదే. శయ్యాపథ్యం అవసరమని వైద్యులు ఎంత చెప్పినా అతడు తట్టుకోలేక పోయాడు. వసంతుడు తన సకల బలాలతోను ఎత్తివచ్చాడు.

"కమ్మని లతాంతములకు మ్రొక్కనసి వచ్చు మధు
వమ్ములనుగీత నినదమ్ము లెసగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధిముకు
ళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు వించె ననిశమ్ము సుమనోభా
రమ్ముల నశోక నికరమ్ములును జంపక చ
యమ్ములును గింశుక వనమ్ములును నొప్పెన్."

(భారత—అది. 5—138)

ఇంతటి వసంత కల్లోలంలో పాండురాజు వంటివాడు ఎలా నిలవ దొక్కుకోగలడు? మాద్రిని జంటగా బాసటయై నిలవమన్నాడు. అపథ్యం చేశాడు. అసువులకే ముప్పుతెచ్చుకున్నాడు. అప్పటి వసంతాటోపాన్ని నన్నయ భట్టారకుడు అత్యపూర్వకంగా చిత్రించాడు. ఆ వర్ణన చదివి మనకే తలతిరుగు పోతున్నది కదా! ఆ పరిస్థితిలో చిక్కుకున్న మానవ మాత్రుడేమవుతాడు!

రామరాజభూషణుడు విజయనగరకాలంలో అంతో ఇంతో కలవారి వసంత వినోదాలను

లలనాజనా పాంగ వలనా వసదనంగ
తులనాభికా భంగదోః ప్రసంగము
అలసానిల విలోల దళ సాసవరసాల
ఫలసాదర శుకాలపన విశాలము
అళినీ గరుదనీక మలినీ కృతధునీ క
మలినీ సుఖిత కోక కుల వధూకము
అతికాంత సలతాంత లతికాంతర నితాంత
రతికాంత రణతాంత సుతనుకాంతము

అకృత కామోద కురవకావికలవకుల
ముకుల సకల వనాంత ప్రమోద చలిత
కలిత కలకంఠ కుల కంఠ కాకలీ వి
భాసురము ఒల్చు మధుమాస వాసరంబు. (వసు-ఆ. 1—126)

అని లలిత సుందరంగా చిత్రించాడు. ఈ సీసం చదువుతుంటే వసంత డోలిక లలో వూగతున్నట్లే వుంటుంది. ఎవరో చాటుకవి వసంత విశిష్టతను భంగ్యం తరంగా వ్యాజ నిందారూపంగా ఇలా వర్ణించాడు:

జాజి ఒకటియే కాని సకల కుసుమ
విసర సంపదచే నొప్పె వసుధయెల్ల
విరహినే కాని ధరణిపై వివిధ జనుల
సంతసము నందజేసె వసంత వేళ.

(చాటుపద్య రత్నాకరం - శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు)

ఇక నేటికవులను గురించి చెప్పనే అక్కరలేదు. ప్రతివారు ఋతు రామణీయకాన్ని గురించి, అందులోను వసంతశోభను గురించి వర్ణించినవారే సాంప్రదాయిక రీతినో, ఆధునిక దృక్పథంతోనో. కాని.......

ఈ ఆవేశాభిమానాలు అటుంచి వాస్తవదృష్టితో, విషయైక పరాయణతతో సత్యగవేషణ విచికిత్సతో చూద్దాం. ఋతువులు — ముఖ్యంగా వసంతఋతువు, నేడు మనను అనుగ్రహిస్తున్నాయా? పంచాంగమో, పెద్దలో నిర్దేశించిన ఏ వుత్సవానికి ప్రకృతి కరుణా కటాక్షం ప్రసరిస్తున్నది? చూడగా మనకు రెండే ఋతువులు — ముఖ్యంగా తెలుగువారికి — గ్రీష్మ వర్షఋతువులు. పర్జన్యుడు పంతగించాడా, ఒకే ఋతువు — గ్రీష్మం.

పట్టణాల్లో-కృత్రిమ జీవిత శకటాలు దొర్లిపోయే పట్టణాల్లో ఋతువులను మరచిపోయారు జనం. కోడికూతతో పోటీపడి కూసే మిల్లు సైరను గళానికి అదిరిపడి లేచి, ఆదరా బాదరాగా కాలకృత్యాలు ముగించుకుని, రెండు-రెండే రెండు మెతుకులు కొరికి కదిలిపోతున్న బస్సులను వదలక పట్టుకుని పుష్పక విమానం ఎక్కినంత ఆనందపడి, సూర్యుడు అస్తమించినమీదట అలసిసొలసి ఇల్లు చేరుకునే 'యంత్ర'మానవులకు ఋతువులు, కాలాలు లేవు. వారికి హెచ్చుగా జ్ఞాపకం వుండేవి ఉషస్సు, రాత్రి. ఉషస్సు అనగానే ఋగ్వేదకాలపు అరుణారుణ సుషమారాశి అనుకునేరు. కాదు. సైరను ఉషస్సు. రాత్రేమో అప్పటి కాళరాత్రే.

పల్లెటూళ్ళ పరిస్థితి కూడా పట్టణాలకు తీసిపోవడం లేదు. జీవన దృక్పథమే మారిపోవడంతో ప్రకృతి కూడా కుపితురాలయిందేమో! ఉగాది వేళకు మామిడిపూతకాలం గదా. ఆవకాయకాయలు సిద్ధమవుతున్నాయి. చూతాం కురాస్వాదకషాయ కంఠంతో పుంస్కోకిలం కూజితాలు వినబడడం లేదు. మధుపమ్ముల జుమ్మనే నినదమ్ములు వినిపించవు. వేపపూత ఎప్పుడో రాలిపోయి

కాయలు బలిసి వుంటాయి. ఎర్రటి ఎండలు కొట్టడంవల్ల భూమి బీటలువారి వుంటుంది. చెట్టు చేమ మోడువారిపోయి వుంటాయి. లతాంతశోభ ఎక్కడా కనిపించదు. శుకపిక శారికారవాలు వినిపించవు. ఆకలితో అటమటించే జనం ఆర్తనాదాలు, పశువుల అంబారవాలు వినిగిస్తాయి. ప్రకృతి సహకరించనందున పండుగల సంబరం కాని, వుత్సవం వుత్సాహం కాని వుండవు.

ఋతుప్రయుక్తమైన, ఋతుపరివర్తన ప్రయుక్తమైన మనపండుగలకు కాలక్రమంగా ఋతువుల సంబంధం లేకపోవడం ఈనాడే కాదు పూర్వమే వుంది. ఇదేమిటీ వైపరీత్యమని వారూ తికమకపడ్డారు. కాని ఎలాగో సంప్రదాయనుసారంగా పండుగలు, పర్వాలూ, జపపుకొనేవారు. ఇంతలో కొందరు మేధావులు, జ్యోతిర్వేత్తలు ఈ వైపరీత్యాన్ని పరిశీలించి సమన్వయ పరచడం ప్రారంభించారు. చంద్ర, సౌర మాసాల సమన్వయంతో కొంత సర్దుబాటు చేసుకోగలిగారు. కాని దీనికి కారణం పరొక విషయమని పరిశోధన చేయగా తెలిసింది. వసంతవిషువత్తు మారడంవల్ల మన ఉగాదివంటి పండుగలకు, ఋతువులకూ పొత్తు కుదరడంలేదని తెలిసింది. వసంత విషువత్తును సంవత్సరాదిగా నిర్ణయించుకున్నప్పుడు ఉగాది వసంతఋతువుకాలంలోనే రావాలి కదా! రామాయణ కాలంలో వైశాఖజ్యేష్ఠ మాసాలమధ్యవున్న వసంతవిషువత్తు భారత కాలంలో చైత్ర వైశాఖమాసాలమధ్యకు కదలివెళ్ళింది. అంటే భారతకాలంలో వసంతవిషువత్తు మృగశిరలో వచ్చి, తర్వాత కొన్ని శతాబ్దాలకు అశ్విన్యాదికి కదలి వెళ్ళిందన్నమాట. వరాహమిహిరాచార్యులు క్రీస్తుశకం ఐదవశతాబ్దంలో వున్నవాడు; తనకు కొన్ని శతాబ్దాలకు పూర్వం వసంతవిషువత్తు అశ్విని నక్షత్రానికి కదలిపోవడం గుర్తించాడు. వేదాంగజ్యోతిషకాలంకన్నా ప్రాచీనమైన బ్రాహ్మణాలకాలంలో వసంతవిషువత్తు కృత్తికా నక్షత్రంలో సంభవించడం పరిశీలించాడు. తన కాలంలో అది (వసంతవిషువత్తు) అశ్విన్యాదిలో వుండడం, అది ప్రాచీనమైన దేవమానానికి ప్రారంభమయిన ఉత్తరాయణ పుణ్యకాలానికి మొదలుకావడమనే సంప్రదాయాన్నిబట్టి అదే వసంతకాలమని, వసంతవిషవత్తే నవవత్సరారంభకాలమని నిర్ణయించి, మాస ఋతు సామరస్యం సాధించాడు. అప్పటినుంచి చైత్రమాసంలోనే ఉగాదిపండుగ చేసుకుంటున్నాము.

అయినా, నేడు మన ఉగాదివంటి ఋతుపరివర్తన ప్రధానపర్వాలకు ఋతువులకు సంబంధం లేకపోతున్నవి. దీనికి కారణం, శింశుమారచక్రం ఏడాదికి 50 న్నర వికలలు ప్రకారం వెనుకకు తిరుగుతుంది. సూర్యచక్రం 360 డిగ్రీలు పరిభ్రమించడానికి 50 వికలలు శేషం వుండగానే విషువత్కాలం

సంభవిస్తున్నది. ఈవిధంగా 72 సంవత్సరాలకొక డిగ్రీ ప్రకారం విషువత్కాలం 23 డిగ్రీలు వెనక్కు వచ్చి, వసంతవిషువత్తు ఉత్తరాభాద్రా రెండోపాదం చేరింది. అంటే రెండునెలలముందే వసంతకాలం ప్రారంభమై, మనవండుగ వేళకు గడిచిపోయి గ్రీష్మం పుడుతున్నది. కనుక వరాహమిహిరునిలాగ మనం కూడా పంచాంగ సంస్కరణ చేసుకోవలసి వుంది. దీనిని గుర్తించి భారత ప్రభుత్వం పంచాంగ సంస్కరణం కొంత చేసింది. కాని మాస ఋతు సమన్వయం అంతగా జరిపినట్టు అనిపించదు.

(ఆంధ్రపత్రిక, 10-4-67)

★★

# గాథలతో గొంతువిప్పిన తెలుగు రచయిత్రులు

వేదకాలంలో లబ్ధప్రతిష్ఠలైన విదుషీమణులలో ఎవరు మనవారో, ఎవరు పెరవారో చెప్పలేము కాని, రెండువేలేండ్ల క్రితం తెనుగుగడ్డపై సంకలితమైన తొలి కవితాకదంబం గాథాసప్తశతిలో కానవచ్చే కవయిత్రులలో పలువురు మనవారని నిస్సంశయంగా చెప్పగలం. వారి గాథలలోని కోమల శృంగారం, సరస హాస్యం, జీవితం పండించుకొని పరమార్థం పిండి చెప్పిన నిత్యసత్యాలు - ప్రపంచంలో ఏ ఉత్తమ కవితాస్థాయికైనా తీసిపోనివి - మనను ఆహా అనేట్టు చేస్తాయి.

"ఎండు మ్రాని యండకు జేర చ
ప్పట్లు సరచి నగిరి పాంథజనులు
తమ్ముజూచి బెదరి దాని యాకుల పండ్ల
పగిదినున్న చిలుక లెగిరిపోవ." (1-210)

అని అణులచ్చి వర్ణించగా, బెజ్జాదేవి

"ఇంద్రచాపంపు గొడుపుతో నెత్తిపొడువ
నొప్పి నోర్వక బిట్టుగ రొప్పుచుండు
మొగిలనెదు కారుదున్న కడుపునను వెడలి
వ్రేలుచుండెడు ప్రేగు గాబోలు మెరుపు!" (1-436)

అని వర్షామేఘాన్ని తను అనుదినం చూచే కారుదున్నతో ఉత్ప్రేక్షించింది.

"దొరతనంబు తమది నెరపక, దాసులు
బోలె నలుకగొన్న వేళ దేర్చు
వారె ప్రియులు సుమ్ము వనితల, కొరులెల్ల
బనికిరాని వట్టి భర్తలంతె." (1-69)

అని ప్రణయోపనిషద్రహస్యం మాధవీదేవి ఉపదేశించగా, రోహాదేవి

"ఎవని వదలిన జీవంబు నవసి చనునొ
యతని నపరాధియయ్యు నోదార్పవలయు;
ఊరు గాలుచు బొలి వోవుచున్నగాని
అగ్గినొల్లని వారెవ్వ రతిన చెపుమ." (1-126)

అని పతిని తను ఉదయం లేవగానే రాజవేసే నిప్పుతో పోల్చి ఎంతటి ధర్మమో — మనుధర్మ వచనంకన్నా గొప్పది — చెప్పింది. ఇంతటి ఉన్నత ధర్మపీఠం నుంచి ఉపదేశించిన ఈమే

"పండుగకు దంచుచుండిన పిండి యెగిరి
తెల్లబారిన చనుదోయి తెరవకదిగొ
మోము తెలిదమ్మి చాటున గోముదేరు
కలికి రాయంచ కవవోలె గానవచ్చె."

అని కోమల శృంగారం నిత్య జీవితంలో అనుదినం జరిగే ఘటనతోనే మధురంగా చెప్పింది. అణులచ్చి స్వభావోక్తి మరీ సూటిగా, సహజ మధురంగా ఉంది కదూ!

"ఎందుమఱ్ఱి మ్రాని యందను జేరి చ
ప్పట్లు సరచి నగిరి పాంథ జనులు,
తమ్ము జూచి బెదరి దాని యాకుల పండ్ల
వగిదినున్న చిలుక లెగిరిపోవ."

చిలుకలు కూర్చుంటే ఆకులు, పండ్లు ఉన్న మఱ్ఱిమానులాగే కనిపించింది పాంథులకు; అది మోదని వారికి తెలియదు. వారు నీడకోసం వచ్చే వేళకు చిలుకలు ఎగిరిపోయాయి. ఎంత మోసపోయాము — అనుకుని వారు చప్పట్లు కొడుతూ నవ్వుకున్నారట. ఎంత చక్కగా పరిశీలించింది ఈ కవయిత్రి! (ఈ అనువాద పద్యాలు శ్రీ రాళ్ళపల్లివారివి.)

ప్రాకృతాభాషా కవయిత్రుల తర్వాత వెయ్యేళ్ళకుగాని తెలుగు కవయిత్రుల తేనె పలుకులు వినిపించలేదు. ఆ పలికిన రెండు తేనె పలుకులు ఒక మహావీరునికి బల్లెపు ములుకులయాయి. మనుమసిద్ధి సేనాపతి ఖడ్గతిక్కన రణరంగం నుంచి పారి వచ్చాడు. ఆయన పత్ని చానమ్మకు చచ్చినంత అవమానమయింది. భర్తను అవమానించదలచి స్నానానికి సీమంతినీ యోగ్యమైన ప్రసాధన సామగ్రి పెట్టినదట. అతడు విస్తుపోయాడు. అప్పుడు

"పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెందున్?
ముగు రాడువార మైతిమి,
వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్."

అన్న మాటలు వినిపించాయి మరుగునుంచి. అంతటి సేనాని విని పూచుకు

న్నాడు. భోజన సమయంలో అతనికి విరిగిన పాలు వడ్డించిన తల్లి ప్రోలమ్మ, పాలెందుకు విరిగిందనే ప్రశ్నకు

"అసదృశముగ నరి వీరుల
వస మీరగ గెలువలేక పంద్రక్రియ న్నీ
వని వైచి తిరిగి వచ్చిన
వసులున్ విరిగినవి తిక్క। పాలున్ విరిగెన్."

అని మరొకటి వడ్డించింది.

ఈ వీరపత్ని, వీరమాతల వలుకులతో ప్రారంభమైన తెలుగు కవిత తాళ్ళపాక తిమ్మక్క చేతిలో

"నీలాలవంటి యా నెలత నెరికురులు
వాలారు కొనుగోళ్ళ వడి చిక్కుదీసె."

నని ఆమె వర్ణించినట్లు సొబగులు తీర్చుకొని, మొల్ల, మోహనాంగి, తుక్కాదేవి, తిరుమలాంబ, రంగాజమ్మ, ముద్దుపళని, తరిగొండ వేంగమాంబ మొదలైనవారి సేవలు పొంది 19వ శతాబ్దికి కొత్త సొరులు సంతరించుకొన్నది.

అంతవరకు పద్య రచన, స్తోత్ర ప్రాయమైన విన్నపాల వచన రచన, యక్షగాన నాటక రచన సాగించిన మహిళల కృష, విదేశ పాలనతో ఏర్పడిన విదేశ సాహిత్య సంబంధంతో కొత్త రెమ్మలు వేసి కొత్త పువ్వులు పూచింది. వ్యాసాలు, చరిత్రలు, ఖండకావ్యాలు, కథలు, కథానికలు, నవలలు మొదలయిన వివిధ సాహిత్య ప్రక్రియలకు శ్రీకారం చుట్టారు మహిళలు – మొదటి బంతి కొటికలపూడి సీతమ్మగారిది.

20వ శతాబ్ది ప్రారంభమయ్యే వేళకు అటు ప్రాచీన ప్రబంధ ధోరణిలోను, ఇటు నవీన పద్ధతిలోను మహిళల రచనలు వెలువడ నారంభించాయి. అలాటి వారిలో కాంచనపల్లి కనకమ్మ, గుడిపూడి ఇందుమతీదేవి, చిల్కపాటి సీతాంబ, నందిపాటి శేషాంబ మొదలైనవారు అగ్రగణ్యులు. కర్నూలు జిల్లా కోవెలకుంట్ల తాలూకా నందిపాడు వాస్తవ్యురాలయిన శేషమాంబ పట్టాభి రామాయణము, మిత్రవిందా వివాహము, తులశీ మహత్త్వము మొదలయిన నాటనాలు, రంగేశ శతకం మొదలయిన శతకాలు రచించారు; శ్రీ జయదేవ చరిత్రమనే మూడాశ్వాసముల ప్రబంధము రచించారు. 1924 లో ముద్రితమైన శ్రీ జయదేవ చరిత్రలో పద్య రచన

"పుడమితలేశ నీవు గను
పుణ్యము గోరెదవేని సంతతం

బెదవక సాధు వర్గమున
కెల్ల ముదంబున నన్నవస్త్రముల్
గడువడి నిచ్చి పంపుచును
గల్మష చిత్తము లేక దేహము
న్విడిచెడి నంతకు న్హరిని
వేడుకతోడ భజింపుచుండుమా।"

అని అతిసరళంగా నడుస్తుంది.

హిందూసుందరి స్థాపకురాలైన శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారితో ప్రారంభమైన పత్రికా రచయిత్రీ పరంపర అనసూయ పత్రికా సంపాదకురాలైన వింజమూరి వెంకటరత్నమ్మ మొదలయిన వారితో అవిచ్ఛిన్నంగా, అద్వితీయంగా కొనసాగింది. పత్రికా రచన, పత్రికా సంపాదకత్వం దేశ సేవ, సంఘ సేవగా పరిగణితం కావడంవల్ల పలువురు విదుషీమణులు పత్రికా రచనను చేపట్టి సంఘ సంస్కరణ మహోద్యమానికి సోమిదేవమ్మలయారు. ఈ పత్రికా రచనలో లేఖలు విశిష్టంగా పేర్కొనదగిన ప్రక్రియగా అప్పుడు వెలుగొందినవి. వాటిలో వసంత లేఖలు, శారద లేఖలు పేర్కొనదగినవి.

శ్రీమతి వరలక్ష్మమ్మగారిలాగే సేవాసాధనంగా సాహిత్యాన్ని చేపట్టిన ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, పొణకా కనకమ్మ, జొన్నలగడ్డ శారదాంబ మొదలయినవారు పలువురు సార్థకజన్ములు.

"కాన బండిన పండు లక్కరకు రాక
ఎండి తమయంత బడిపోవుచుండునట్లు
ధర్మయుక్తంబు గానట్టి ధనచయమ్ము
లూరకే కాలగతి బోదె శారదాంబ."

అనేది శారదాంబ, గిడుగు లక్ష్మీకాంతమ్మ గార్లు జంట కవయిత్రులుగా రచించిన పెక్కు రచనలలోని "లక్ష్మీ శారదా సుభాషితములు" లోనిది. ఇది

"దానం భోగో నాశః
తిస్రో గతయో భవంతి విత్తస్య."

అనే భర్తృహరి వాక్యానికి మెరుగులు దిద్దినదని నేను భావిస్తున్నాను.

దేశ సేవ, సంఘసేవ, సంస్కరణ మొదలైన దృక్పథాలతో ప్రయోజనాత్మకంగా ఒకవైపు రచనలు పుంఖానుపుంఖంగా వెలువడుతుంటే, కవితా శిల్పానికి ప్రాధాన్యమిచ్చే రచనలూ మరొకవైపు మొలకెత్తాయి. వీనికి శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి

"అన్యదేశాల సంచార, మన్య దాస్య,
మొక్క భార్యకు నేవురు నొప్పు మీర
భర్తలై పాండవులు కీర్తి ప్రబలియుంట
వ్యాసకవి సార్వభౌము నిర్వ్యాజకరుణ."

అనే ఒక్క వక్రోక్తిని ఉదాహరిస్తే చాలుననుకుంటాను.

"చారు సుకర్ణ కల్పిత వి
శాల వినూత్న రసాల మంజరీ
పూరిత వంజరీకృత క
పోల విరాజిత గోపికా మనో
హారుని గాంచి............"

శిల్పదృష్టికి ఇది వీరి మరొక మచ్చుతునక. ఈ అందచందాలను పుట్టపర్తి కనకమ్మ మరింత పుణికి పుచ్చుకున్నది. ఆమె హంపి విరూపాక్షుని ముంగిలి "రాతి రథమును"

"కలవోలి కలలోని
వలపు టచ్చర వోలి
అచ్చరల మనసులో
నాకాంక్షలను బోలి
నడువవలె రథమా !
కాలమే స్తబ్ధమై
కనుల విచ్చుక చూడ
కృష్ణరాయల కీర్తి
కాంత నాట్యములాడ
నడువవే రథమా !"

అని కోరారు. మల్లికార్జున పండితారాధ్యుని కాలాన పానుగంటిలోని కలుకోడి కూసి, కలుపొన్న పూసి, కలుతేరు కదలిపోయేలాగ కనకమ్మ పలుకులతో విఠలరాయని కలుతేరు కదిలితే ఎంత బాగుండును ! ఏమో ! చరిత్రగతి చక్రనేమిక్రమం !

పాశ్చాత్యుల కాల్పనిక కవితా ప్రభావం దేశమంతటా పడినట్టే తెనుగు నాట తెలుగు భాషపైన పడింది. భావ కవిత్వమనే కవితా శాఖ మొలచి చిగిర్చింది. మహిళలూ భావ కవితలు ఆలపించారు. వాటిలో తొలి ఆలాపనలు

తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, చావలి బంగారమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మమ్మ మొదలయిన వారివి.

"మలయ పవనుడు పారిపోయె
మాధవీ మృదు సౌరభము గొని
విలువలేని చలువ కాన్క
లిచ్చినాడు గదమ్మ నీకు
గరళమగునో కట్టకడకు
వేచియుండుము వేగపడక
కాచియుండుము మాలతీ!"

అని విశ్వసుందరమ్మ అన్యాసక్తుడైన ప్రియునికై వగజెందే మాలతిని సమాశ్వాసించగా,

"పక్షులు పలుకకే పడియుండినాయి
వృక్షాలు చూచుకు వూరుకున్నాయి
తనవెంట పడుతున్న తరుణిజూడ డిదేమి
పోతున్నాడు తాను పొంగులో కాలుననుు."

అని ప్రేమను తిరస్కరించి పోయే వేదాంతి పొగరు కనుల గట్టిందారు చావలి బంగారమ్మగారు. శ్రీమతి వట్టికొండ విశాలాక్షిగారు

"పండు రే యెండలో
నిండు హృదయమ్ములో
కైత నల్లెదు కవులు
కరిగి నీరై పోరె!
చందమామా రావె
జాబిల్లిరావె యని
పసిపాప నాడించు
పడతు లేమైరో కద!
చిట్టి పాపా యెంత
చిందులు ద్రొక్కునో
కవు లెంతగా నిన్ను
కతినొక్కు లాడుదురో!
తొలగిపో తొలగిపో."

అని వెన్నెలకు అడ్డు వచ్చే జలదాన్ని మందలించారు.

ఇంతటి తెనుగుక్షేత్ర మాగాణంలోను అరపా దరపా సంస్కృత కవితావాణి వినిపించకపోలేదు. దీనికి దృష్టాంతంగా శ్రీమతి ఎ. కోమలమ్మగారు "భారత సంప్రార్థనము"ను చెప్పవచ్చు.

"భారత తావక మృదువద పంకజ
సంతత చింతన రతి మమలాం
క్రూర తరారి సమూహ నిషూదన
సముచిత బలయుత ధృతిమతులామ్.

తావక జయజయ గీతాగానే
కర్ణ మనోహర కంఠరవం
మోహక కవితా లింగిత వటుతర
కోమల తర వాణీ విభవమ్.

తావక బంధన తోదన శక్తిం
త్వత్సుప్రీత్వ స్థాపన యుక్తిం
కరుణా మంజుల సంతతి వత్సల
యాచే సవినయం అయి దేశ మే."

రాజకీయాల ప్రభావం పడిన రచనలూ కొల్లలుగా వచ్చాయి ఈకాలంలో.

"చైత్ర వైశాఖ మాస వాసంత శోభ
ధనిక లోకంపు విశ్రామ ధామమయ్యె
శ్రావణాషాఢ నిబిడ వర్షా నిశాత
మస్సు పేదకు మృత్యుధామమ్మె యయ్యె."

అని శ్రీమతి వర్మా జానకీదేవి విచారించగా, శ్రీమతి దొప్పలపూడి అనసూయా దేవిగారు

"గువ్వన చప్పరించుచును
గ్రోలగ వీలగు పాత్రలందు నీ
కవ్వటి కవ్వదే పతన
మై ప్రవహించును వెచ్చ వెచ్చగా,
నివ్వను నీళ్ళు లేక, ఇట
నిల్చెడి నెన్మిది జాములందు నీ
కెవ్వటి కాకలౌనా యపు
డెల్ల ననున్ గడు తొందరించుచున్."

అని "పాలు"ను పసిబిడ్డ లందరికీ గ్రోలనిచ్చి నాటి అనసూయలాగ విశ్వ మాతృత్వం నెరపుకున్నారు.

ఇటీవల కథానిక, నవల తక్కిన అన్ని సాహిత్య ప్రక్రియలను అణచి వేసి పైకి వెల్లుబుకుతున్నవని తోస్తుంది. కథానికా రచయిత్రులు, పలువురు పరిగణించదగినవారు కనిపిస్తున్నారు. ఈ కథానికలకు, నవలలకు వార, మాస పత్రికలు ప్రోత్సాహిస్తున్నాయి. అటు చెకోవ్ ఇటు ఓహెన్రీ పద్ధతులలోను, దేశవాళీ తీరు తీయాలలోను కథలు వ్రాస్తున్నారు. పలువురు మహిళలు, మగవారిని త్రోసిరాజంటున్నారన్నా అతిశయోక్తి కాదు.

ఈ రంగాలలో శ్రీమతులు కొమ్మూరి పద్మావతీదేవి, ముప్పాళ్ళ రంగనాయకమ్మ, మునిపల్లె సరోజినీదేవి, యద్దనపూడి సులోచనారాణి, వాసి రెడ్డి సీతాదేవి, తురగా జానకీరాణి, కోడూరి కౌసల్యాదేవి, అచ్యుతవల్లి, మందరపు లలిత, పద్మ, వేదుల మీనాక్షి, ద్వివేదుల విశాలాక్షి, పవని నిర్మల ప్రభావతి, ఆచంట శారదాదేవి, రామలక్ష్మి ఆరుద్ర, భానుమతి రామకృష్ణ మొదలయిన వారిని పేర్కొనవచ్చును. ఒక్క పాత్రను – అందరి దృష్టిని సహజంగా ఆకర్షించే అత్తగారి పాత్రను వ్యంగ్య భూయిష్ఠంగా చిత్రించిన భానుమతిగారిని ప్రత్యేకంగా ప్రశంసించాలి.

కుమారి మందరపు లలితగారు గణిత శాస్త్రంలో ఎం. ఎ. పట్టం పుచ్చుకున్నా, కథానికా రంగంలో పండిస్తున్న పంట సాటిలేనిది. ఇటీవల ధారావాహికంగా వెలువడిన ఆమె నవల "ఐదు రెళ్ళు" బహు పాఠకామోదం పొందింది.

కథలు కాక కేవలం వ్యాసాలలో మహిళా లోకానికి విజ్ఞానం కలుగ చేస్తున్న శ్రీమతులు మాలతీ చందూర్, ఇల్లిందల సరస్వతీదేవిగార్ల కృషి దశాబ్దానికి పైబడినది. చీరకట్టు మొదలు, చిత్త సంయమం వరకు ఎవరూ చెప్పందే ఇతరులు ఎలా నేర్చుకొంటారు? శ్రీమతి మాలతీచందూర్ సూదిలో దారం గుచ్చడం మొదలు, తాజాగా వెలువడిన నవల పరిచయం వరకు సకల విషయాలు తోటి సోదరీమణులకు తెలుపాలని అహమహమికతో, అపేక్షతో రచన సాగిస్తారు.

ఇంతటి కథానవలోద్యానం ఒకవంక గుబాళిస్తూ అమృత ఫలాలు ఇస్తుంటే, మరొకవైపు కందమూల కౌద్దాలికులలాగ పరిశోధన ప్రవణలూ ఉన్నారు. ఈ రంగంలో చరిత్ర తెలియని చరితార్థులను తెలుపడానికి ఉద్యమించిన శ్రీమతి బాణగిరి రాజమ్మ, శ్రీమతులు వారణాసి యశోదాదేవి,

సరోజినీదేవి, పూటుకూరులక్ష్మీకాంతమ్మ, నాయని కృష్ణకుమారి మొదలయిన వారు స్తవనీయులు.

మానవులు మానినుల ప్రవృత్తినిబట్టి, వివిధ కాలాలలో వివిధ సాహిత్య ప్రక్రియలు రూపొందుతూ వ్యాపిస్తూంటాయి. గాథతో ప్రారంభమైన మహిళల రచనాధ్వరం నేడు కథలో పర్యవసితమైంది. కథ నేటి మానవ సమాజపు, మానవ ప్రవృత్తుల ప్రతిబింబం, పూర్వపు ఖండ కావ్యానికి సదృశం. ఇక నవల మహా కావ్యం వంటిది. ఈ రెండింటితోనే మనం భావ సమైక్యానికి కృషి చేయవలసి ఉన్నది అని పలువురు విమర్శకుల మతం.

ఏమైనా, నేడు ఆంధ్ర రాజధానిలో తొలిసారిగా సమావేశమవుతున్న అఖిల భారత రచయిత్రుల సమాఖ్యావారు నవభారతంలో రచయిత్రుల బాధ్యతా ప్రతిపత్తులను గురించి చర్చించి, నిరంతర గౌరవ ప్రతిపత్తులు పొందుదురు గాక!

[శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ఆంధ్ర రాజధానిలో 1965 ఏప్రిల్ 25 న అఖిల భారత రచయిత్రుల మహా సభను ప్రారంభించిన సందర్భంలో వ్రాసిన వ్యాసం. ఆంధ్ర పత్రిక 25.4.93.]

★★

# ఒకప్పుడు కేరళుల ఉగాది - ఓణం పండుగ

మానవజాతి సంస్కృతి చరిత్రలో కాలమానం విధవిధాలుగా కనిపిస్తుంది. మాస పరిగణనా, దానినిబట్టి సంవత్సర పరిగణనా అనాదిగానే ఏర్పడినా, సంవత్సరానికి ఎన్ని నెలలు, నెలకు ఎన్ని వారాలు అనే లెక్క విధవిధాలుగా వుండేది. అలాగే సంవత్సరాది, కూడ విధవిధాలుగా వున్నట్టు వివిధజాతి చరిత్రలు తెలుపుతున్నాయి. ఈ మార్పునకు జ్యోతిర్జ్ఞానం, శీతోష్ణ పరిస్థితి, ఇతర విషయాలు కారణం కావచ్చు. ఒక ఋతుక్రమ పద్ధతికి అలవాటుపడిన ప్రజలు మరొక ప్రాంతానికి వలసపోయినప్పుడు, అక్కడి శీతోష్ణ పరిస్థితి, పరిసరాలు భిన్నంకావడంవల్ల ఋతుపరిగణనలో మార్పులు చేసుకొనడం అనివార్యమయింది.

వ్యవసాయం ప్రధానవృత్తి అయిన తర్వాత నాట్లువేయడం కోతలు, విషువత్తులు మొదలయిన వాటినిబట్టి సంవత్సర పరిగణన మారుతూ వచ్చింది. దీనివల్ల మనదేశంలోని వివిధప్రాంతాల ప్రజల పండుగలు, పబ్బాలు, ఉత్సవాలు, వ్రతాలు మారుతూ వచ్చాయి. ఒకప్పుడు దక్షిణాపథంలో భూమధ్య రేఖ సమీపప్రాంతంలో వసంతఋతువు - సంవత్సరారంభం అశ్వీజ కార్తీక మాసాలలో వచ్చేది. ఈ నూతన వర్షారంభదినం సూర్యాస్తమయం తర్వాత తొలిసారిగా కృత్తికానక్షత్రం కనిపించినదినం. అది దాదాపు నవంబరు 1వ తేదీ ప్రాంతం అయ్యేది. కృత్తికానక్షత్రం మేనెల 4వతేదీనుంచి అక్టోబర్ చివరివరకు సూర్యునికి ముందే అస్తమిస్తుంది. ఈ కృత్తిక సంవత్సరం ఉదయం లేక రాత్రినుండి ఆరంభమయ్యేది. అప్పటికింకా మాసపరిగణన లేదు; వారాల లెక్క. ఐదునాళ్ళ కొకవారం. 72 వారాలయితే సంవత్సరం. రెండే ఋతువులు అయనాలలాగ. నవంబరు నుండి ఏప్రిల్ వరకు 36 వారాలు ఒక ఋతువు, మే నుండి అక్టోబర్ వరకు 36 వారాలు మరొక ఋతువు.

ఈ సంవత్సర పరిణగన నేటికీ దక్షిణార్ధగోళంలో చాలా జాతులలో అలవాటులో వుంది. భారతదేశంలో గుజరాతీలు కార్తీకపూర్ణిమను నూతన సంవత్సరాదిగా, తమ వ్యాపార సంవత్సరాదిగా పరిగణిస్తారు. ఇది ఒకప్పుడు నైరృతి ఆసియా అంతటా, యూరోపులోను ఆచరణలో వుండేది.

తర్వాత మృగశిర నక్షత్రానికి ప్రాధాన్యం వచ్చింది. దీనికి కారణం ప్రజల జీవితంలో మార్పు. జనానికి విల్లులు తయారుచేసుకొనడం, వేటాడడం తెలిశాయి. దానికే సూర్యుడు జింక అని, ఆ జింక ధ్రువనక్షత్రం చెప్పినట్టు తిరుగుతుందని, దానిని మృగశిర వేటాడుతుందని కథలు కల్పించారు. ఈ మృగశిరను కొంతకాలానికి రుద్రుడన్నారు. ఈ సంవత్సరం ఫాల్గుణ పౌర్ణమి నుండి ప్రారంభమయ్యేది.

అప్పటికి ఋతువుల సంఖ్యకూడ మారింది- మూడు ఋతువులు-వసంత, గ్రీష్మ, శిశిరాలు రుద్రుని మూడు కన్నులు.

సంఘంలో మరికొన్ని మార్పులు వచ్చాయి. వేట, వ్యవసాయంలో పశుపోషణ ప్రధానమయినప్పుడు పశువుల గర్భధారణ పదినెలలు కావడం, ముఖ్యంగా ఆవులు పదినెలలు చూలుతో వుండడం మొదలయినవి సంవత్సర పరిగణకు వుపయోగపడ్డాయి. దానితో 10 నెలల సంవత్సరం ప్రారంభ మయింది. తొమ్మిది రోజులు వారం, అలాటి మూడు వారాలు నెల; ఈ వార పరిగణన నేటికీ నవరాత్రాలలో నిలచివుంది.

సంఘంలో గుర్రానికి ప్రాధాన్యం వచ్చిన తర్వాత, సంవత్సర భావన గ్రహనక్షత్ర స్వరూపకల్పనా మారిపోయాయి.

కొంతకాలానికి ఆర్ద్ర, పునర్వసు నక్షత్రాల ప్రాధాన్యం ఏర్పడి ఎనిమిది రోజుల మూడువారాలున్న 15 నెలలతో సంవత్సరం లెక్కించడమూ జరిగింది. ఇది సూర్యుడు మిథునరాశిలో వున్నప్పుడు, జ్యేష్ఠ పూర్ణిమలో ప్రారంభ మయ్యేది.

ఇలాటి అతిప్రాచీనమయిన సంవత్సరారంభకాల చిహ్నమే కేరళుల ఓణం పండుగ. మన పూర్వులకు, ప్రపంచంలో అన్ని జాతులకూ కూడా మాస పరిగణనకు సులభమయిన పద్ధతి చంద్రగతి. పూర్ణిమనుండి పూర్ణిమకు నెల లెక్కకట్టేవారు. దీనినిబట్టే చంద్రుడు దేవత అయ్యాడు. కాని, సూర్యునిబట్టి ఋతుచక్రం ఏర్పడుతున్న సంగతిని జనం గ్రహించిన తర్వాత సూర్యుడే దేవుడయి చంద్రుడు గౌణమయ్యాడు. అయినా, కొన్ని పూర్ణిమలు పండుగలుగా, ప్రాచీనాచారాలకు గుర్తుగా మిగిలిపోయాయి. పశ్చిమ సముద్రతీర ప్రాంతంలో అలాటి ఈ ఆచారం రకరకాల పేర్లతో నిలచివుంది. కేరళలో ఓణం రూపంలో నేటికీ నిలచివున్నది యీ ఆచారమే.

ఓణం అనే పదం ఒక నక్షత్రానికి పేరయిన సంస్కృతపదం శ్రవణం నుంచి పుట్టినట్టిది. శ్రవణం, శ్రోణం, ఓణం - ఇది పరిణామక్రమం.

భారతదేశంలో అస్సాం తర్వాత ఎక్కువ వర్షపాతం గల ప్రాంతం కేరళ ప్రాంతం. ఆషాఢ శ్రావణ మాసాలలో వర్షం బాగా కురిసి నీరు వెల్లువలై పారుతుంది. ప్రకృతిలోని ప్రధాన సంఘటన అదే గనుక, దానితోపాటె సంవత్సర పరిగణన ఏర్పడింది. అంటే వానకాలంనుంచి మరొక వానకాలానికి సంవత్సరం. ఈ వానకాలంలో ప్రధానమయిన పర్వం శ్రావణ పూర్ణిమ. శ్రవణ నక్షత్రంలో వచ్చే పూర్ణిమకావడంవల్ల దీనికి యీ పేరు. ఈ నెలకు కూడా యీ పేరు వచ్చింది.

ఈ పూర్ణిమనాడు పశ్చిమకోస్తాలోని కొంకణ ప్రాంతం ప్రజలు తమకు అపార జలాన్నిచ్చి ఆదుకుంటున్న ఇంద్రవరుణుల ప్రత్యక్ష రూపుడయిన సముద్రుణ్ణి కొబ్బరికాయలు సమర్పించి పూజిస్తారు. అక్కడివారు దీనిని నరియల్ పూర్ణిమ అంటారు.

కేరళలో జాతిమతభేదం లేకుండా ఆచరించబడే పండుగ ఓణం. ఇది సౌరమానం ప్రకారం శ్రావణమాసంలో శ్రవణ నక్షత్రం వచ్చేరోజున ఆచరించడం నేటి ఆచారమయింది; మొదట్లో ఇది శ్రావణపూర్ణిమనాడే ఆచరింపబడినప్పటికి. నేడిది యీ విధంగా ఆచరింపబడుతున్నది- శ్రావణమాసంలో శ్రవణనక్షత్రానికి పదిరోజుల ముందుగా హస్తానక్షత్రంనుంచే పండుగ ఆచరణ ఆరంభమవుతుంది; శతభిషతో సమాప్తమవుతుంది. భాద్రపదంలో ఆశ్లేష మఖలలోను జరగడమూ కద్దు.

కేరళంలో వైశాఖంలో ఆరంభమయిన వాన శ్రావణమాసంలో ఆగుతుంది. అందరూ ఆనందంగా వుంటారు. కొన్ని పంటలు కోతకు వస్తాయి. ముఖ్యంగా కొబ్బరిచెట్లకు కాపుకాలం. జనం సంతోషంతో పూజలు జరుపుతారు; ఇంత వానలు కురిపించి, తమకు పంటలు పండించినందుకు ఇంద్రునికి.

హస్తానక్షత్రంనాడు పిల్లలు ఊరివెలుపలికి పోయి రకరకాల రంగు రంగులు పూలు తెచ్చి, పేడతో ఇంటిముంగిలి అలికి, పూలను గుండ్రంగా పేర్చుతారు. ఇలా ఉత్తరాషాఢ వరకు తొమ్మిదినాళ్ళు తొమ్మిది పూలవర్తులాలు చేస్తారు. శ్రవణ నక్షత్రంనాడు సూర్యోదయానికి ఏడున్నర గడియల ముందు ఇంట్లోవున్న వయసువచ్చిన పిల్లలు, యువకులు, యువతులు శిరస్నానం చేసి, ముంగిటిలో మొదటి పూవుల గుండ్రంలో మహాదేవుని పూజిస్తారు.

మహాదేవుడంటే, శివుడనుకొనేరు; కాదు. కేరళలోని తిరుక్కాల్‌కరై అనే క్షేత్రంలోని విష్ణువు. ఇతనిని మహాదేవుడంటారు. ఈ మహాదేవుని ఆకారాన్ని గోపురాకారంగా మట్టితో తీర్చి, ఆకుల్లో పెట్టి గుండ్రంగా అమర్చిన

పూవులరాశిలో పెట్టి పూజిస్తారు. ఈ విధంగా తొమ్మిది గుండ్రాలలోను పూజి స్తారు. పూవులలో నింపివేస్తారు- ఆ మట్టి గోపురం కనిపించకుండా. పిదప ఒక విడియాకులో అరై అనే బియ్యపు అట్టు, కొబ్బెరకోరు నైవేద్యం పెట్టి నమస్క రిస్తారు. దీనినే ఓణం కొళ్ళల్-ఓణం ఆచరణ-అంటారు.

సాయంకాలం స్త్రీలు, పురుషులు రకరకాల ఆటలు ఆడుతారు. కైకొట్టి కళి అనేది ఆడవారు ఆడే ముఖ్యమయిన అట. ఇది చప్పట్లు చరుస్తూ మనవారు గొబ్బిపాటలు పాడుతూ ఆడే ఆట వంటిది. పురుషుల ఆట ఓణ త్తల్లు. అనగా ఒకరి నొకరు తోసుకొని బలప్రదర్శనం చేయడం. తలమైప్పందు, వారు, కిళయన్‌తట్టు అనే ఆటలు కూడా ఆడుతారు. తలమైప్పందు అనేది తలతో బంతిని కొడుతూ నేటి వాలీబాల్‌లాగా ఆడేఆట. వారు అనేది పగ్గాలు లాగి బలప్రదర్శనం చేయడం.

ధాన్యపు కంకులు, కొబ్బరిమట్టలలోని లేతఆకులు, పూవులు పురుషులు తలపాగాలలోను, స్త్రీలు సిగలలోను ధరిస్తారు.

ఈ ఓణం పండుగ ఆచరణనుబట్టి ఇది పంటలకోత పండుగ అని, వర్షర్తు పండుగ అని స్పష్టమవుతుంది. మన సంక్రాంతిలాగే కేరళ ప్రజలు దీనిని ఆచరిస్తారు. కేరళులకు సంక్రాంతి అంత ముఖ్యం కాదు. ఒకానొకప్పుడు ఈ ఋతువులోనే కేరళలోను, తక్కిన పడమటికోస్తా, కన్నడ, కొంకణ ప్రాంతాలలోను సంవత్సరం ఆరంభమైనా, ఆ ఆచారం సమసిపోయి, సంవత్స రాది సౌరమానం ప్రకారం మేష సంక్రమణంతో ప్రారంభమయి నేడు స్థిర పడింది.

కేరళంలో యీ పండుగను గురించి ఒక ఐతిహ్యం వుంది. వామనావ తారంలో విష్ణువు త్రివిక్రముడయి బలిచక్రవర్తిని అణచివేసినప్పుడు, బలిచక్ర వర్తి విష్ణువును కోరుకున్నాడట తను సంవత్సరానికి ఒకమారు శ్రవణ నక్షత్రంనాడు పాతాళంనుంచి భూమిపైకి వచ్చి తన ప్రజలను, దేశాన్ని చూచిపోవడానికి అనుమతి యివ్వమని. బలిచక్రవర్తి ఏటా వచ్చిపోయే దినం గనుక యీనాడు బలిచక్రవర్తి సంస్మరణగా యీ పండుగ జరుపుకుంటు న్నారు- అని. కాని ఈ ఐతిహ్యానికి, పండుగకు ఏమీ అతకడం లేదు. ఇది ప్రాచీనమయిన ఇంద్రపూజ, తర్వాత వరుణపూజ. ఇంద్రుడు తర్వాత విష్ణువయ్యాడు. దానిని నేడు విష్ణుపూజకు జోడించారని తోస్తుంది.

ఇంద్రుని పూర్ణిమనాడు పూజించడమనే ఆచారం వ్రతవిధిగా వున్నట్టు హేమాద్రి పండితుడు చతుర్వర్గ చింతామణిలో తెలిపాడు. మన పండుగల పూర్వపద్ధతిని క్రోడీకరించిన తొలి పుస్తకం చతుర్వర్గ చింతామణి.

దానిలో శక్ర, ఇంద్ర పూజావిధులు చాల చెప్పబడ్డాయి. ఆశ్వయుజ పూర్ణిమనాడు శచీదేవీయుతుడైన శక్రుని పూజచేయడం ఒక పద్ధతి. ప్రతి పూర్ణిమనాడు ఇంద్రుని పూజించి, 30 మంది దంపతులను సన్మానించడం ఒక పద్ధతి. ఒక భాద్రపద పూర్ణిమనుంచి మరొక భాద్రపద పూర్ణిమవరకు వరుణుని పూజించడం మరొక పద్ధతి. ప్రతి పూర్ణిమకూ ఏదో విశిష్ట వ్రతవిధి వుంది.

చాంద్రమాన భాద్రపద పూర్ణిమ, సౌరమానం ప్రకారం శ్రావణపూర్ణిమ అవుతుంది. ఈనాడు వరుణేంద్రులను పూజించాలని వ్రతాలు వుండడం మనం పరిశీలిస్తే, ప్రకృతి ప్రసాదించే వర్షానికి తనిసి, ఆకాలపు పూవులతో ప్రకృతిని, అనగా వరుణేంద్రులను ఆరాధించి, వారికి నూతన ధాన్యంతో తయారు చేసిన అపూపాలు, ప్రధానఫలమయిన కొబ్బరికాయకోరు నైవేద్యమిచ్చి తన్మయులు కావడమనే ప్రాచీనాచారం యీ విధంగా నిలచిందని తోస్తుంది.

తర్వాత విష్ణుపూజ—ఇంద్రుని తమ్ముడు ఉపేంద్రుడు విష్ణువు గనుక దీనిని జోడించబడి వుంటుంది.

కేరళంలోని తిరుక్కాల్కరై క్షేత్రంలోని విష్ణువుకు ఇంకా ప్రాధాన్యం ఏర్పడుతుందని, తిరుపతిలోని తిరువేంకటనాథుడు అక్కడికి ఏ యుగంలోనో వెళ్ళిపోతాడని మరొక ఐతిహ్యం కేరళలో వుంది. దీనినిబట్టి కూడా, విష్ణుమతం వ్యాపించిన తర్వాత ఓణానికి బలిచక్రవర్తిగాథ అతికించారనడం స్పష్టం.

నేడు మేష సంక్రాంతే సౌరమానం ప్రకారం కేరళదేశంలోను సంవత్సరాది అయినా, ఒకప్పుడు శ్రావణపూర్ణిమతో ఆరంభమయ్యేదనడానికి ఓణం తార్కాణం.

[ఆకాశవాణి, మద్రాసు, జమీన్ రైతు సాధారణ ఉగాది సంచిక-1970]

★★

78

# విధవిధాల సంవత్సర పరిగణన

భారతదేశం జానెడు బెత్తెడు దేశమా? అతి విస్తారమైన దేశం. శీతోష్ణ స్థితులా విధవిధాలు. నీరు గడ్డకట్టి బండబారి, నెలలతరబడి కరగని ప్రాంతాలూ వున్నాయి; నిరంతరం నెగళ్ళు వేసినట్టు ఎండలు మండే ప్రాంతాలూ వున్నాయి. ఎన్నో జాతులు వచ్చాయి; ఇక్కడి ప్రకృతి మంగళాశీర్వాదాలు పొందిన పిదప, మరొకచోటికి కదలలేదు; తమదే ఈ దేశమన్నట్టుగా స్థిరపడి పోయాయి. భాషలు చూద్దామా? పూర్వపు మానవుల ముఖయంత్రాలు, ఏ అదృశ్య శక్తితో కదిలాయో గాని, అంతో ఇంతో ప్రాచీన సాహిత్యం వున్నవే కొన్ని పదులు. ఆచార వ్యవహారాలు ఆలోచిస్తే, అనాదిజాతులు మొదలు ఆధునిక నాగరికత వరకు అసంఖ్యాకాలు. అందువల్ల మన పండుగలు పబ్బాలు విధవిధాలుగా వుండడంలో వింత ఏమీ లేదు. వింత ఏమిటంటే, ఇంత వైవిధ్యం లోను, దీనిని మించిన ఆసేతు శీతనగం ఏకతాభావన అనాదినుంచే యుగపదంతర్వాహినిగా ఎలా వుంటున్నదా అన్నదే!

ఈ వైవిధ్యాలలో ఒకటి, మన దేశజాతుల కాలమానానికి పరీక్షా ప్రాయమైనట్టిది సంవత్సర పరిగణన. ఈ సంవత్సర పరిగణన, సంవత్సరాది ఎన్ని తీరులుగా వుండేవో కనుగొనడానికి నేడు దేశంలో సంవత్సరాది పండుగ రకరకాలుగా వుండడమే తార్కాణం.

సంవత్సరాదిలో విభేదానికి కారణం వసంత, వర్షా, శర, హేమంత ఋతువులు, విషువత్తులు, అమావాస్యా, పౌర్ణమాసులు, మరి కొన్ని ఆచారాలూను.

దక్షిణాపథంలో ఒకానొకప్పుడు భూమధ్యరేఖ ప్రాంతంలో వసంత ఋతువు నవంబర్ – డిసెంబర్ నెలలలో వచ్చేది. అంటే, వసంత విషువత్తు బట్టి. అందువల్ల ఆరు నెలలనుంచే నూతన వర్షారంభం. ఇది కూడా వసంత విషువత్తును లెక్కకట్టి గుర్తించడం తెలియకముందు కృత్తికా నక్షత్రం సూర్యాస్తమయం తర్వాత తొలిసారిగా కనిపించిన నాటినుంచి. ఇది దాదాపు నవంబర్ ప్రారంభం. కృత్తికా నక్షత్రం మే 1 వ తేదీనుంచి అక్టోబర్ చివరి

వరకు సూర్యునికి ముందే అస్తమిస్తుంది. నవంబర్ నుంచి మే వరకు సూర్యుని తర్వాత అస్తమిస్తుంది.

కృత్తిక కనిపించడంతో లెక్కలు కట్టడంవల్ల ఈ కృత్తికా సంవత్సరం ఆరంభం ఉదయంనుంచి కాక రాత్రి నుంచే ఆరంభమయ్యేది. అప్పటి కింకా మాస పరిగణన లేదు. వారాల లెక్కే. వారానికి ఐదునాళ్ళు. 72 ఐదు నాళ్ళ వారాలయితే ఒక ఏడు. నవంబరు నుంచి ఏప్రిల్ వరకు 36 వారాలు. మే నుంచి అక్టోబరు వరకు 36 వారాలు. రెండే ఋతువులు. వసంత ఋతువు, వర్షాఋతువు. ఇది భారతదేశంలో అతి ప్రాచీనమైన సంవత్సర పరిగణన. మనకు నేడు తమిళులలో కనిపించే కృత్తికా నక్షత్ర వ్రతాలు, కార్తికేయ వ్రతాలు ఈ సంవత్సరానికి సంబంధించినవే. కృత్తిక ఆరు గుంపుల నక్షత్రం గనుక దానినుంచే షడాననుని రూపకల్పన. ఈ కృత్తిక సంవత్సరాది నేడు ప్రపంచంలో ఇతర ప్రాంతాలలోను ఆచరణలో వుంది. కాని, తమిళులు సౌరమాసం అనుసరించిన తర్వాత సంవత్సరాది మారినా, కార్తికేయోత్సవం మాత్రం ప్రత్యేకంగా మిగిలిపోయింది. దానికి పూర్వకాలపు చాతుర్మాస్య చిహ్నమైన భిక్షాటనం, కావడి మోత మొదలయినవన్నీ చేరి విచిత్రంగా పరిణమించింది. మనదేశంలో గుజరాతీలకు కార్తిక పూర్ణిమ సంవత్సరాది. దక్షిణార్ధ గోళంలోని పెక్కు జాతులలో ఈ కృత్తికా సంవత్సర పరిగణన నేటికీ అలవాటులో వుంది. నైర్ఋతి ఆసియా అంతటా, యూరోప్‌లోను ఇది ఒకప్పుడు సంవత్సరాది.

ఈ కృత్తికకు రాశి రోహిణి. అగస్త్యుడు — అగస్త్య నక్షత్రం కృత్తికకు మార్గ దర్శకం. వర్షఋతువు సమాప్తిని, నీరు తేరుకొనడాన్ని సూచించే నక్షత్రం అగస్త్య నక్షత్రం. అగస్త్యోదయంతో వర్షర్తు కలుషితమైన నదీజలం తేరుకుంటుంది. అగస్త్య నక్షత్రం దక్షిణ ధ్రువంలో అత్యుజ్జ్వలమైనట్టిది. తమిళులకేకాక దక్షిణార్ధగోళమంతటా కూడా అగస్త్య నక్షత్రానికి ప్రాధాన్యం రావడానికి కారణం నాలుగు నెలల ముసురుతర్వాత ఉజ్జ్వలంగా అగస్త్యుడు కనిపించడం వల్లనే.

ఈ సంవత్సరం రెండు భాగాలుగా విభక్తం కావడం కూడా ఆరునెలలు పంటలు పండడం, మరి ఆరు నెలలు పండకపోవడం ఎంతోకాలం చూచి చూచి లెక్కలు కట్టడం వల్లనే.

మృగశిరనుబట్టి మరికొందరు లెక్కలు కట్టడం ప్రారంభించారు. ప్రజల జీవితాలు మారాయి. జనంలో విల్లంబులు సిద్ధపరచుకొని వేటాడడంతో

నిపుణత కలిగింది. సూర్యుడు ఆకాశంలో ధ్రువనక్షత్రం చెప్పినట్టుగా తిరిగే జింక అని, దానిని మృగశిర వేటాడుతున్నదని కథలు బయలుదేరాయి. ఈ మృగశిర కాంతకాలానికి రుద్రుడయ్యాడు. ఈ మృగశిరా సంవత్సరం ఫాల్గుణ పౌర్ణమి నుంచి ఆరంభ మయ్యేది.

అప్పటికి ఋతువులు కూడ మూడు అయ్యాయి:— వసంతం, గీష్మం, శిశిరం. అవే రుద్రుని మూడు కన్నులు. మొదటిది వసంతం, రెండవ ఫాలంలో వుండేది గీష్మం, మూడవది అసలు రెండవది శిశిరం — చల్లనిది. ఇవి సృష్టి లయానుగ్రహాలకు చిహ్నాలు.

సంఘం ఎంతో మారింది. జనంవృత్తులు మారాయి. పశుపోషణ, వ్యవసాయం బాగా అలవడినప్పుడు, పశువులు, ముఖ్యంగా ఆవుల చూలు పది నెలలు కావడం మొదలయినవి సంవత్సర పరిగణనకు ప్రోదిచేశాయి. పది నెలల సంవత్సరం అలవాటయింది. ఆ సమయంలో తొమ్మిదినాళ్ళ వారం. మూడు వారాలు నెల. ఈ తొమ్మిదినాళ్ళ వారం పద్ధతి నేటికీ మన నవరాత్రులలో మిగిలింది. ఈ సంవత్సరం శరద్విషువత్తుతో ప్రారంభమయ్యేది. తర్వాత దీనికి, సౌరమాసానికి సంవాదం కల్పించడానికి నెలల లెక్కలు మారాయి.

సంఘంలో గుర్రానికి ప్రాముఖ్యం వచ్చిన తర్వాత, సంవత్సరం, సంవత్సర భావన, గ్రహ నక్షత్ర స్వరూప కల్పన క్రమంగా మారాయి. సూర్యుని రథాన్ని పదకొండు గుర్రాలు లాగుతున్నాయనే కథలు, దానినిబట్టి కొన్ని క్రతువులు పదుకొండు నెలలు చేయాలనే కట్టుదిట్టాలు ఏర్పడి, పదకొండు నెలల సంవత్సరం ఆచరణలోకి వచ్చింది.

కొన్ని ప్రాంతాలలో ఎనిమిదినాళ్ళ వారాలు, అలాటి వారాలు మూడయితే నెల అని, అలాటి నెలలు పదిహేనయితే సంవత్సరమని ఆచారమయింది. ఆర్ద్ర, పునర్వసు నక్షత్రాల ప్రాధాన్యం కలిగి సూర్యుడు మిథునరాశిలో ప్రవేశించినప్పుడు, ఈ సంవత్సరం అలవాటయింది.

మరొక ప్రాంతంలో 17 నెలలకు సంవత్సరం ఆచారంలోకి వచ్చింది. ఈ నెలలకు వారాలు మూడు. వారానికి దినాలు ఏడు. మొత్తం సంవత్సరానికి 357 దినాలు. దీనితోపాటు చాంద్రమాన సంవత్సరమూ అలవాటులోకి వచ్చింది. దీనికి 13 నెలలు. 357 నాళ్ళ సంవత్సరానికి ఒకవారం చేర్చి 364 దినాలు లెక్కకట్టారు. ఋతువులు ఐదు. ఈ సంవత్సరం జ్యేష్ఠ పూర్ణిమతో ప్రారంభ మయ్యేది.

ఈ వైవిధ్యం మన దేశంలోనే కాక వ్యవసాయం, సంసార జీవనం ప్రధానంగా వున్న అన్ని దేశాలలోను అనాదినుంచి వుంది.

క్రీస్తు పూర్వం రోమక రాజ్యంలో శని ప్రధాన గ్రహగౌరవం పొందు తున్నప్పుడు ఆ గ్రహ సామ్రాజ్యవైభవం సూచించే శాటర్నలియా అనే ఉత్సవాలు మకర మాసంతో జరిగేవి. రోమన్ చక్రవర్తి జూలియస్ సీజర్ జనవరిని సంవత్సరాది నెలగా నిర్ణయించడంవల్ల ఈ సంవత్సరాది ఉత్సవాలూ, శాటర్నలియా పుత్సవాలూ కలిసి, జనవరి నెలంతా వినోదంగా గడిపేవారు. బూతు పాటలు, చేతలు విపరీతంగా వుండేవి. క్రీస్తు నిర్యాణం తర్వాత క్రైస్తవాచార్యుల నిష్ఠవల్ల ఈ బూతులు పోయాయి. జూలియస్ సీజర్ సంవత్సరాది నిర్ణయం చేసిన 16 వ శతాబ్ది వరకు యూరోప్‌లోని పెక్కు దేశాలలో సంవత్సరాది రకరకాలుగా — మార్చిలోను, డిసెంబర్‌లోను, జూన్ లోను జరిపేవారు. 16 వ శతాబ్ది తర్వాత యూరప్ అంతటా జనవరి 1 అని స్థిరపడింది - స్కాట్‌లెండ్‌లో 1600 లోను, ఇంగ్లండులో 1752 లోను.

చైనావారు మనలాగే చాంద్రమానులు. వారికి పన్నెండు నెలలు పన్నెండు చంద్రులు. ఒక్కొక్క చంద్రునికి ఒక్కొక్క పేరుందట. పక్షాలకు, గంటలకు కూడా వేరే వేరే పేర్లున్నాయి. మొదటి నెల వసంతఋతువు. వసంత ప్రారంభానికి "లీచున్" అని పేరు. ఈ వసంతం మొదటి నెల 7 వ రోజు నుంచి 10 వ రోజు వరకు వుంటుంది. వసంతోత్సవం మూడవ నెల ప్రారంభంతో జరుపుతారు. ఇది చలికాలం గడిచిన తర్వాత 108 నాళ్ళకు వస్తుంది. దీనిని ఛింగ్‌మింగ్ అంటారు. ఇంత లెక్క సారాంశ మేమిటంటే మార్చి ప్రారంభంలో సంవత్సరాది. చాంద్ర మానం గనుక కొత్త నెలవంక, శుద్ధ పాడ్యమితో నూతన వర్షారంభం. మనం అధిక మాసాలు చేర్చి చాంద్ర సౌరమానాల వారాను సర్దుకొన్నట్టే చైనావారూ అధిక మాసాలతో సర్దుకుంటారు.

వారి పక్కనేవున్న జపాన్‌లో సంవత్సరాది జనవరి 4 వ తేదీన. 3 వ తేదీ రాత్రి మంచి కలగన్నవారు అదృష్టవంతులని వారి నమ్మకం. పూజీ పర్వతాన్ని కలలో చూచినవారు ఆ సంవత్సరమంతా భాగ్యశాలులుగా వుంటారని వారి విశ్వాసం. జపాన్‌వారు ఆనాడు మన అరిసెల వంటివి చేసి సూర్యచంద్రులకు నివేదిస్తారు.

లంకలోని వెడ్డా జాతివారు సంవత్సరాదినాడు కొత్త బియ్యంతో రొట్టెలు తట్టి, అట్లుపోసి ఇష్ట దైవాలకు నివేదిస్తారు.

అమెరికా ఖండంలోని వివిధ దేశాలలో సంవత్సరాది రకరకాలు. మెక్సికోలో పూర్వం ఫిబ్రవరి 2 వ తేదీన సంవత్సరాది. అజ్‌టెక్ అనే ఆదిసు

జాతి సంవత్సరాది ఫిబ్రవరి నెలలో. రెడ్ ఇండియనులు, ఇరాక్వోయిలు ఫిబ్రవరిలోను, ఎస్కిమోలు, కాలిఫోర్నియాలోని కొన్ని తెగలు జులైలోను, హోలీ అనే తెగ నవంబరులోను సంవత్సరాది జరుపుకుంటాయి.

ఇలా ఎన్నిమార్పులు జరిగినా, ఎన్నిజాతులు, ఎన్నితెగలు, ఎన్ని మతాలు, ఎన్ని ఆచారాలు వున్నా భారతదేశం నవరత్న మణిహారంలాగ, రంగు రంగుల పూలదండలాగ, ఇంద్రధనుస్సులాగ సొబగులు కురిపిస్తూ వుండడం చూస్తే ముచ్చటగా వుంటుంది.

(ఆంధ్రపత్రిక, 29-3-68)

★★

# కవికర్ణ రసాయనము

తెనాలి రామకృష్ణుడు, అతని భార్య ఒకనాడు వాదులాడుకుంటు న్నారట. మీ నోరే మీకు పగండీ — అని ఆమె అంటున్నదట. రామకృష్ణుని కుమారుడు అతనికంటే ఘనుడు. సమయానికి యీ పద్యం చదివాడట :

కాకేమి తన్ను తిట్టెనె?
కోకిల తనకేమి ధనము కోకొమ్మనెనే?
లోకము పగయగు పరుసని
వాకున, చుట్టమగు మధుర వాక్యము వలనన్.

ఆ పద్యం విని రామకృష్ణుడు అదిరిపడ్డాడట.

మరొక కథ కూడా ఉంది. కృష్ణరాయలవారు ఒకనాడు తమ కూతురు మోహనాంగితో చదరంగ మాడుతున్నారట. ఆట మంచి పట్టులో ఉంది. కృష్ణరాయల మంత్రి ఏనుగులమధ్య మోహనాంగి బంటొకటి చిక్కుకుంది. ఆమె ఆలోచనలో పడింది. ఉద్ధతులమధ్య పేదల కుండ దగునె? - అని అప్రయత్నంగా ఒక పద్యపాదం ఆమె నోటినుంచి వెలువడింది. కృష్ణ రాయలు, ఏమిటమ్మా ఆ పద్యం? పూర్తిగా అను తల్లీ— అన్నారు. ఆమె కొంచెం సంకోచించింది. అయినా....

ఒత్తుకొని వచ్చు కటికుచోద్వృత్తి జూచి
తరుణి తనుమధ్య మెచటికో తలగిపోయె
ఉండెనేనియు కనబడకున్నె యహహ?
ఉద్ధతులమధ్య పేదల కుండదగునె?

ఎవరిదమ్మా యీ పద్యం?— అని అడిగారు రాయలవారు. ఆమె సంకుసాల నరసింహ కవిగారిదండీ అన్నది.

రాయలవారికి చప్పున స్ఫురించింది. ఆ వృద్ధకవి ఆయన తండ్రి అన్నమాచార్యులలాగే కావ్యం నరాంకితం చేయని కటోరుడని జ్ఞాపకం వచ్చింది.

ఔను. సంకుసాల నరసింహకవి....

> నరగుణాంకితమయ్యెనే సరసకృతియు
> దూష్యమగు శునిదృతిగత దుగ్ధమట్లు
> హరిగుణాంకితమయ్యెనే నసమకృతియు
> హారసూత్రంబు గతి హృదయంగమంబు.

అని నమ్మినవారు. నరాంకితమైన కావ్యం కుక్కతోలుతో చేసిన తిత్తిలో పోసిన పాలులాంటిదట. ఈ నమ్మకం కలవాడు కనుకనే ఈయన తన ఇష్టదైవమైన శ్రీరంగనాథునికి అంకితంగా – కవికర్ణ రసాయనము – అనే ఆరాశ్వాసాల కావ్యం వ్రాశాడు. పైన పేర్కొన్న రెండు పద్యాలు దీనిలోవే. ఈయన తన కావ్యం....

> జ్ఞానప్రౌఢ మహాకవీశ్వర వచస్సంస్తూయమానుండు ల
> క్ష్మీనాథుండు మదల్పలౌక్య రచనాస్వీకర్త గాకుండునే
> నానాభూపతులెల్ల గానుకలు రత్నశ్రేణు లర్పింపగా
> ధానా ముష్టిముచుం గుచేలు కరుణన్ ధన్యాత్ముగా జూడదే?

అని సంతృప్తి పడ్డారు.

నరసింహ కవి తన కృతిలో తన వంశాది వివరాలు ఏమీ చెప్పుకోలేదు. శ్రీ మద్భట్ట పరాశర దేశికేంద్ర చరణసరసీరుహ సేవకోప సేవక....అనిమాత్రం చెప్పుకొన్నారు. క్రీస్తుశకం 1586 నాటికి భట్టపరాశరుని శిష్యుడయిన మట్ల రామయ్య శాసన మొకటి కనిపిస్తున్నది తిరుపతి దేవస్థానం శాసనాలలో. కనుక నరసింహకవి కూడా ఆ కాలంవారో, కొంచెం ముందువారో అని అనుకోవచ్చు.

> చిన్నన్న ద్విపద కెరుగును
> పన్నుగ పెదతిరుమలన్న పదముల కెరగున్
> ఎన్నగ దరమే నరసిం
> గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్.

అనే చాటువునుబట్టి అన్నమాచార్యుల ప్రథమ కళత్ర సంతానమైన నరసింగన్న 1536 నాటికి పరమవృద్ధుడయి వుంటాడనుకుంటాను. అన్నమయ్యగారు సహస్రమాస జీవి. నరసింగన్నను అలాగే అనుకుంటే 1450 మొదలు 1530 ప్రాంతం వరకు ఉండడం అసంగతం కాదు. కవికర్ణ రసాయనంలోని అంతస్సాక్ష్యం కూడా ఈయన కాల నిర్ణయానికి సహాయపడుతుంది.

కవికర్ణ రసాయనం ఆరు ఆశ్వాసాల కావ్యం. ఈ కవి వుద్దేశం విశిష్టాద్వైత సంప్రదాయాన్ని, అందులోను వేదాంతదేశికులవారు ప్రవర్తింప

జేసిన వడగల సంప్రదాయాన్ని ప్రచారం చేయడం. కాని, మొదట్లోనే వేదాంతోపదేశం ప్రారంభిస్తే ఎవరూ చెవిలో వేసుకోరు. కామిగాక మోక్షకామి గాడు అన్నది సామాన్య సూత్రం. అందువల్ల మొదట శృంగారాన్ని గుప్పించి చతుర్విధ పురుషార్థాలలో మోక్షానికి తక్షణ పూర్వ భావి అయిన కామపురుషార్థాన్ని వర్ణించిన మీదట మోక్ష పురుషార్థ కథనం మనస్సుకు ఎక్కుతుందని ఆయన భావించారు. అందువల్లనే ఈయన మొదటి నాలుగాశ్వాసాలు శృంగార సంభరితం చేశారు. తర్వాతి రెండింటిని వైరాగ్య నిర్భరం చేశారు. వేదాంత దేశికుల సంప్రదాయం తెలుగు సాహిత్యంలో మొట్టమొదట సంపూర్ణంగా సమగ్రంగా సాక్షాత్కరించినది ఈ కావ్యంలోనే. అన్నమాచార్యులవారు తాము వేదాంత దేశికుల సంప్రదాయం వారమని చెప్పుకున్నారు. ఆయన పదకవితా పితామహుడైతే ఈయన పద్యగద్య శ్రేణులలో విశిష్టాద్వైత వడగల సంప్రదాయాన్ని ప్రతిష్ఠించారు.

వైష్ణవులకు రంగనాథుడు ముఖ్యదైవతం. ఈ క్షేత్రం మాంధాత కాలం నుంచి వుందని, ఇక్ష్వాకుల పూజలందుకున్న రంగ విగ్రహాన్ని రామచంద్రుడు విభీషణునికి దానం చేశాడని, అది కారణాంతరాలవల్ల చోళదేశంలో వుండిపోయిందని వైష్ణవుల ఐతిహ్యం. శ్రీరంగంలో నిలిచిపోయిన రంగశాయి

> పరితః ప్రాంతపరీత సహ్యతనయా బాలానిలాసేవ్యముల్
> పరిమాణ ప్రథమాన పూగకుహళీ ప్రాదుర్భవామోదముల్
> సరసాభ్రంకషనారికేళ నిబిడ చ్ఛాయంబు లీ చంద్రపు
> ష్కరిణీ పుణ్యసమీపదేశములు శక్యంబే విసర్జింపగన్

అన్నారు. ఈ కవి తనకు అభిమతమూ, వైష్ణవులకు అగ్రేగణ్యమూ అయిన శ్రీరంగాన్ని కవికర్ణ రసాయం పీఠికలో వర్ణించారు.

కవి విశిష్టాద్వైత సంప్రదాయ ప్రకారం ప్రపన్నుడు గనుక తన గురువర్యుని తప్ప మరొకరి సంగతి చెప్పుకోలేదు. ఈ కావ్యం వంటి దానిని పరిణత వయస్సులో తప్ప చెప్పడం, వేదాంత సంప్రదాయం కదళీ పాకంగా వివరించడం సాధ్యం కాదు. ఈ కారణాలన్నిటినిబట్టి ఈ కవి శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు భావించినట్టు 15వ శతాబ్ది ప్రారంభంనుంచి వున్నవాడు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారన్నట్టు అన్నమాచార్యుల కుమారుడూ కావచ్చునని నా నమ్మకం. ఉత్తర వయస్సులో చెప్పిన కావ్యం కావడంవల్ల సమకాలిక కవుల అనుసరణలు కనిపిస్తాయి. అప్పుడు పోటీలువడి అందరూ ఇలా జరిపినవారే.

కవి కర్ణ రసాయనాన్ని నరసింహకవి శృంగార వైరాగ్యాలకు సమ ప్రాధాన్యమిస్తూ వ్రాశారు.

యతి విటుడు గాకపోవుటెట్లస్మదీయ
కావ్యశృంగార వర్ణనాకర్ణనమున
విటుడు యతిగాకపోరాదు వెస మదీయ
కావ్యవైరాగ్య వర్ణనాకర్ణనమున.

అని ఈయన చేసిన ప్రతిజ్ఞలో ఎంతమాత్రమూ అతిశయోక్తి లేదు.

దీనిలోని వస్తువు మాంధాతృ చరిత్ర. యువనాశ్వుడు సాకేతపురాధీశుడు. అతడు సంతానం కోసం ఇంద్రయాగం చేశాడు. అతనికి మాంధాత పుట్టాడు. మాంధాత యుక్తవయస్కుడయిన తర్వాత యువనాశ్వుడతనికి పట్టంకట్టి రాజధర్మోపదేశం చేసి వానప్రస్థానికి వెళ్ళుతాడు

మాంధాత తండ్రి ఉపదేశం ప్రకారం ధర్మయుక్తంగా పరిపాలన చేస్తూండగా అతనికి దిగ్విజయకాంక్ష కలిగింది. ఒక శరత్కాలంలో దండు వెడలి దేశాలన్నీ జయించినమీదట, స్వర్గం మీదికి వెళ్ళుతాడు. అతడు సురగిరివర వరసరోర్వీతమున దండు విడిసి యుండగా రావణుడు మాంధాత వద్దకు దూతను పంపి శరణు వేడమంటాడు. మాంధాత దూతను వెడల గొడతాడు. మాంధాత, రావణుడు ద్వంద్వయుద్ధం చేస్తారు. శివుడు అడ్డుపడి వారిద్దరినీ గొప్పవారని చెప్పి మాంధాతకు త్రిభువన విజయఫలం అనుగ్రహించి పోతాడు. మాంధాత హిమనగం ఎక్కి, అక్కడి నుండి మేరునగమెక్కి స్వర్గానికి వెళ్ళి ఇంద్రపూజితుడై సాకేతానికి తిరిగి వెళ్లుతాడు.

ఇలా వుండగా, కుంతలదేశపతికి విమలాంగి అనే కుమార్తె వుంటుంది. ఆమె....

కుందనపు కమ్మవలపుం
జెందురు చందమున దెల్ల చెరకున వండై —

నటువంటిది. ఆమె చిత్రపటాన్ని ఇద్దరు చిత్రకారులు సాకేతానికి వచ్చి మాంధాతకు చూపుతారు. అతని చిత్రాన్ని ఆమెకు అందజేశారు. ఇద్దరికీ పరస్పరం ప్రేమ కలుగుతుంది. పెద్దలకు రాయబారాలు వెళ్ళుతాయి. ఇద్దరికీ వివాహం జరుగుతుంది.

చొక్కపు జల్లిమీద నిరుసూరెల గుండలరత్నములాయి
న్మొక్కర ముత్తియంబు గల ముద్దియ ముద్దుమొగంబె చూడగా
జుక్కల రాణివాసములు చుట్టును గొల్వ బుధుంగుమారు చే
రక్కున గ్రుచ్చి యెత్తుకొని యాడెడు రాజును బోలె నత్తరిన్

ఉన్న విమలాంగితో వరమసుఖాలు నిరాఘాటంగా అనుభవిస్తూండగా ఒకనాడు వశిష్ఠాదిమునులు మాంధాత సభకు విచ్చేస్తారు. అప్పుడు మాంధాత వారిని తన పూర్వజన్మ వృత్తాంతం అడుగుతాడు. అతడు పూర్వజన్మలో విష్ణ్వాలయ సేవ చేయడంవల్ల ఇంత గొప్పజన్మ, వైభవం కలిగాయని వశిష్ఠులవారు చెబుతారు.

హరిసమీప ప్రదీపిక ఆరకుండ
నొజ నవనీత తైలంబు వోసి నీవు
నిజవటముచించి ఈ వదంతియును వత్తి
యోజితముచేసి వెలిగించె....

అని వివరిస్తారు. పిదప.... అట్టి చతుర్విధ ఫలంబులకు భగవత్సేవాచరణం బొకండు సాధనంబగుట వివిధాఖిల కర్మంబులు భగవత్సేవాచరణ రూపంబుగా గావించి మనుమతం బొనరించుము అని చెప్పి, కర్మస్వరూపము, ఉపాస్యబ్రహ్మ స్వరూపము, వేదవేదాంత పురాణస్వరూపము, ఉపాసకుని స్వరూపము, విరుద్ధ శ్రుతి సామరస్యము, భగవద్విగ్రహస్వరూపము, భగవదవతార రహస్యము, ప్రపన్నస్వరూపము, భక్తియోగస్వరూపము, రాజ్య సంసారరూపము, మోక్షావ తరణము నిరూపిస్తారు.

ఎవ్వండ? నెందుండి యెచటి కేమిటికి? నే బద్ధుండనైతి నే బంధనమున?
గారణం బెయ్యది? కారణకణమెద్ది? ఎద్దికారణజన్మ మేది కాదు?
ధర్మమేదేది? యధర్మంబు నేనిప్పుడెందు వర్తించెద నెందునిలువ
నేది కృత్య? మకృత్యమెయ్యది గుణసంతశిష్టమెయ్యది? దోషదుష్టమెద్ది

యను వివేకంబులేక ప్రాయమున గ్రొవ్వి
పశువువోలె కామోదరపరుడు నరుడు
సంచరించుచు నజ్ఞాన సంభవంబు
నధికతరమైన దుఃఖంబు ననుభవించు.

అని విశదీకరించి వశిష్ఠుడు మహర్షి మాంధాతకు అష్టాక్షరిమంత్రం ఉపదే శిస్తాడు. మాంధాత గ్రీష్మ వర్షా హేమంతాలలో విష్ణువునుగూర్చి తపస్సు చేస్తాడు. ఇంద్రుడు భయపడి అప్సరసలను పంపుతాడు; అతని తపస్సు చెడుపడానికి. వారు సకల తుచ్ఛశృంగార చేష్టలూ చేస్తారు. కాని, మాంధాత చెక్కుచెదరలేదు.

యోగసమాధి చాలి నృపయోగికులాగ్రణి యంత దివ్య కాం
తాగమనప్రయోజనము నాత్మనెరింగి బలాధికల్పితో

ద్యోగముగూర్చి నవ్వోలయ నొయ్యన కాంతిసుధానిధానమై
తీగలువారు పార్శ్వగతదృష్టిదగం గలయంగ జూచినన్.

వారంత అతనికి శిష్యులైపోతారు. ఇక ప్రయోజనంలేదని ఇంద్రుడు బ్రహ్మతో ఆలోచించి గురువు అనుజ్ఞతో వైకుంఠానికి వెళ్ళి మొర పెట్టుకుంటాడు. అక్కడ దివ్యమంగళ విగ్రహుడైన నారాయణుడు ప్రత్యక్షమై ఇంద్రునికి అభయమిచ్చి మాంధాతకు ప్రత్యక్షమవుతాడు. మాంధాత....

ఉల్లము చల్లనయ్యె మొదలూదె మనోరథముల్ జగంబుపై
నొల్లమి పుట్టె చేరుగడనొందితి ని శుభదివ్యవిగ్రహో
ల్లసనావలోకన సుధోదధిలోపల నోలలాడుచుం
దొల్లిటివాడ గావు నను దోయరుహేక్షణ సంతసించెదన్.

అంటాడు. నారాయణుడు....

కువలయేశ్వరచంద్ర నీ కోరినట్ల
మోక్షమంటావతంబైన మునివరైక
దుర్లభాస్మత్పదాంబుజోద్భూతభక్తి
గలుగు నీకింత నా యనుగ్రహమువలన

అని అనుగ్రహిస్తాడు. మాంధాత చాలకాలం రాజ్యమేలి, చివరకు మోక్షం పొందుతాడు.

ఏదో పూర్వకథాధారంగా కొంత రంజకమైన శృంగారంతో తమ సిద్ధాంతాలు చెప్పడం అప్పటి కవులందరి లక్ష్యమూ గనుక ఈ కథలోను వస్త్వైక్యమనే ప్రశ్నే లేదు.

యతి విటుడు కాకపోవుటెట్లస్మదీయ కావ్యశృంగార వర్ణనాకర్ణనమున.... అన్న ప్రతిజ్ఞ ప్రకారం ఋతువర్ణనలలోను, విమలాంగి వర్ణనలోను వనవిహారం, పుష్పావచయం, జలక్రీడలు, అంధకారం, జారవిటీవిటులు, వేశ్యలు, మధుపానగోష్ఠి మొదలయిన ఘట్టాలలో శృంగారం కళ్ళెం సడలించిన గుర్రంలాగే కదం తొక్కింది. తక్కిన ఘట్టాలవర్ణనలు సహజసుందరాలు. పుత్రులులేని యువనాశ్వుని ఆవేదన ఎంత హృదయవిదారకం!

ముంగిట నాదుపుత్రు డతి మోదమునందుచు దేలగంట వే
గం గరయుగ్మమెత్తి చిరుగంతులతో వెదయేడ్పుతోడ డా
యంగ జెలంగి యెత్తికొని యక్కున జిక్కగ జేర్చి ముద్దుమో
మం గమియార మద్దిడుట ముజ్జగమేలుటగాకయుండునే.

అని ఊహించాడు కవి. కాళిదాసూ యిదేవిధంగా బాధపడుతాడు.

అనుకరణలు అనుసరణలు, ఛాయలు అకాలంకవులకు సహజం. వాటిని మనం మొదటి కవికన్నా తర్వాతి కవి ఎంత అందంగా చెప్పాడు అని చూడాలిగాని కాపీకొట్టాడని కాదు.

ఈయన తన పరమాచార్యుడైన వేదాంత దేశికులవారిని చాలాచోట్ల అనుసరించారు. ఆయన మాటలే సంగ్రహించుకొన్నాడు. ధానాముష్టిముచుం గుచేలు గరుణన్ ధన్యాత్ముగా జూడడే.... అనే పాదం వేదాంతదేశికుల వైరాగ్య పంచకమనే స్తోత్రంలోని ఒక శ్లోకపాదం. ధానాముష్టిముచే కుచేల మునయే దత్తేస్మ విత్తేశతాం... అనేదాని అనువాదం. దీనిని శ్రీ అనంత కృష్ణశర్మగారు తరం కింద చెప్పారు. శ్రీరంగ దివ్యగృహశృంగారోజ్జ్వల దీప.... అనేది శ్రీరంగహర్మ్యతలమంగళదీపరేఖాం అనే శ్రీస్తుతి భాగానికి అనువాదమే. మాంధాత హిమాలయం ఎక్కిన ఘట్టంలోని

హేలమెయిన్మహీరమణు డెక్కెను నిశ్చల నమ్రదేవతా
సాలము కందరస్థసురచారణదంపతిగాన కేళివా
చాలము తుంగశృంగతటసక్తమణీపునరుక్త తారకా
జాలము పారిజాతవనసంస్థితిమూలము హైమశైలమున్.

అనే పద్యం పెద్దన.... అట జని కాంచె.... పద్యాన్ని జ్ఞాపకపరుస్తుంది.

ద్వితీయాశ్వాసంలో యువనాశ్వుడు మాంధాతకు చెప్పిన నీతిలో అంగ పంచక, ఉపాయ, సహాయ స్వరూపం, దేశకాలవిభాగస్వరూపం మొదలయినవి సమకాలిక రాజనీతికి దర్పణాలు. కాకేమి తన్ను తిట్టెనె? అనే పద్యం ఈ నీతి ఘట్టంలోదే.

ఈ కవి గొప్ప విద్వాంసుడు. వేదాంతి గనుక ప్రౌఢప్రయోగాలూ చాల చేశారు. స్ఫుటిత, ఐకటిక, అజనిక, పౌనఃపున్య, నశ్యనైకస్సమగ్ర, శకులకులవంటివి. ఇక జాతీయాలు, లోకోక్తులు కోకొల్లలు. మందబుద్ధులకొక నియమంబు గలదె, వాడుదల బట్టు, చెరకు పన్నిదమాడు, నుయ్యో గొంతో యని యాందోళించువారి కగునే తెపవల్, నఖముఖ సాధ్యమునకు బరశు సంగ్రహము, కలవాడెవ్వడు జెడడు, నేతిబీరకాయ, శుభస్య శీఘ్రం, పత్రం లేని ఋణం... ఇలా ఎన్నైనా చెప్పవచ్చు. ఈతని కావ్యం నిజంగా కవికర్ణ రసాయనమే.

తప్పు గల్గెనేని తార తీర్చి రసజ్ఞు
లస్మదీయ కవిత ననుమతింతుర్షు

ఇంచుటలుక గలిగెనే దీప్తి ప్రేయసి
నుల్లమున వరింపకోర్తు రెట్లు?

అని ఈ కవి పీఠికలోను....

కవితా విచక్షణత గల
కవికంఠ విభూషణముగ గైకొనవలయుం
గవివర నృసింహవిరచిత
కవికర్ణరసాయనమను కావ్యము దీనిన్.

అని కావ్యం చివరను ఈ కవి సవినయంగా చెప్పుకొన్నాడు. మనం దీనిని అవిధంగానే గ్రహిద్దాము.

[వాణి, శక 31-7-1891]

★★

# భారత పాత్రలు

భీముడు అనగానే మనకొక మహా బలసంపన్నుడయిన వ్యక్తి, కండలు తిరిగిన కాయంతో ప్రత్యక్ష మవుతాడు. వందమంది నేటి ఈశ్వరరావులో, కింగ్‌కాంగ్‌లో అతనిముందు బలాదూర్. ధర్మరాజు అనగానే, శాంతి, దాంతి, వివేచన శక్తి ఉట్టిపడుతూ, ఎంత పెంకె ఘటాన్నయినా నచ్చజెప్పే ఆలోచనా శృంఖలలతో ఒప్పారే వ్యక్తి మనకు గోచరిస్తాడు. కృష్ణుడు అనగానే, మహా మేధావి, గొప్ప కింగ్‌మేకర్ ప్రత్యక్షమవుతాడు. నేటి మహారాజకీయ ప్రజ్ఞా వంతులు వానికి దిగదుడుపు. ఇలాగే తక్కిన ఇతిహాసిక వ్యక్తులందరూను. దీనికి కారణం వ్యాసుని చేతిచలవే

వ్యాసు డొక ప్రపంచమే సృష్టించాడు. అతడు చెప్పినవారు అంతకు ముందున్నవారో, కారో ! కాని, వారిని కన్నులగట్టేట్టు చూపినవాడు అతడు. భారతమంతా వ్యాసుని స్వకపోల కల్పనమని, వేదంలోని కొందరు వ్యక్తుల పేర్లను తీసుకొని, తన సమకాలిక, పూర్వకాలిక సంఘ సంస్కృతిని క్రోడీక రించి వ్యాసుడు భారతం చెప్పాడని, అప్పటి వివిధ విజ్ఞాన వాహినులకు సాంకే తిక రూపాలే దానిలోని ఉపాఖ్యానాలని శ్రీ కావ్య కంఠుల వారన్నారు. అది నిజమే కావచ్చు. కాని, మనకు నేడు భారతం నిజం. ఆ ప్రాతలన్నీ అక్షరాలా నిజం. మనకే కాదు. ఆగ్నేయానియాలోని ప్రజలందరికీ అది నిజం. మహా భారత రామాయణాలు తమ దేశంలోని పూర్వకథలేనని జావావాసులు, సుమాత్రా జనులు, బలిద్వీప ప్రజలు భావిస్తే, మనకు విడ్డూరంగా వుంటుంది. కాని, వారికి నిజం.

ఇతిహాసాల కథన కౌశలం అలాంటిది. చరిత్ర చిత్రణం అలాంటిది. ఇతిహాసపాత్రలు ఏ లోకానికి వెళ్ళినా కనుక్కోగలం. మనం — అంటే నేను — నరకానికి వెళ్ళుతాననుకోండి. యముణ్ని గుర్తుపట్టడానికి కష్టమేమీ ఉండదు. యముని మహిషపులోహ ఘంటలు ఖణేల్మంటాయి.

ఇతిహాస పాత్రలను, ఉపాఖ్యానాలను తర్వాతి వారు ఎంత రసవం తంగా మలచినా, పాత్రలలో గట్టిపోలికలు చెప్పలేక పోయారనో, చెప్పినవి సరిగా గుర్తుపట్టడానికి వీలులేనివనో అంటే మన్నించండి. కాళిదాసు శకుంతల

తపోవనంలో ఉంటే గుర్తు పట్టగలనుగాని, ఇంద్రప్రస్థానికి వస్తే గుర్తు పట్టలేక పోయాను. వ్యాసుని శకుంతల ఎక్కడికి వెళ్ళినా, గుర్తు పట్టగలను. ప్రమద్వరను, దేవయానిని గుర్తుపట్ట గలను. యయాతి గట్టిగా పట్టుకుంటే నలిగి పోయిన దేవయాని చేయికందు కూడా నాకు కనిపిస్తుంది. వరూధినిని గుర్తు పట్టలేను. ప్రాంచద్భూషణ బాహామూలరుచితో పాలిండ్లు పొంగారినా కనుక్కోలేను. గిరికను అసలే గుర్తుపట్టలేను.

ఇతిహాసాల కల్పనలు, పాత్రలు మనజాతి మనసులలో హత్తుకొని పోతాయనడానికే ఇంతగా మనవి.

ఇతిహాసాల గొప్ప కల్పనలు మొదలయినవి మానవజాతి వికాసానికే తోడ్పడగలవనే నమ్మకం నాకుంది. అవి మన ప్రగతికి ప్రతిబంధకాలు కావనే నమ్మకమూ నాకుంది. ఆధునికులకూ అవి ఉపాదేయాలే. ముఖ్యంగా బాలుల లేలేత మనసుల్లో మన సంస్కృతికి మూలకందాలయిన ఇతిహాసగాథల నారులు పోయడం – నేటి విజ్ఞానంతోపాటు అవసరం. అలాటి మహోద్యమానికి పూనుకున్నారు మిత్రులు శ్రీ శంకరంబాడి సుందరాచార్యులుగారు.

శ్రీ సుందరాచార్యులుగారిని నేను చిన్ననాటినుండి ఎరుగుదును. అప్పటి వీరి ఔద్ధత్యంలో సహస్రాంశం కూడా మనకు ఇప్పుడు కనిపించదు. వీరు అంబర వీథుల్లో విహరించేవారు. దిగిరాను దిగిరాను అని మొండితనం చేసేవారు. వీరికితోడు కపిస్థలం శ్రీరంగాచార్యులనే మరొక కవి కమ్మని కవితా వాసనలు గుమ్మని తిరుపతిని కప్పేవి. సుందరాచారిగారి స్వభావంలోని ఔద్ధత్యం కవితలో నేడు కొంత మిగిలింది.

కవిత వీరిని చిన్ననాడే వరించిందంటే నమ్మండి. కవిత పరమాత్మ సాత్మ్య. పరమాత్మ ఎవరెంత ప్రయత్నించినా, సాక్షాత్కరించదట. తనే అర్హుణ్ణి వరిస్తాడట, అనుగ్రహిస్తాడట.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన,
యమేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్.

అలాగే కవిత కూడా స్వయంగా అనుగ్రహిస్తే కాని స్వస్వరూపం వివరించదు. అంతమాత్రాన యితరులు యత్నించరాదని కాదు. అయత్న సహజ ప్రవృత్తికీ, యత్నప్రవృత్తికీ భేదం ఉంటుందని చెప్పడమే నా తాత్పర్యం.

శ్రీ సుందరాచార్యులుగారు చిన్ననాడు ఉబుసుపోకగా పాడిన 'మా తెల్గు

తల్లికి మల్లె పూదండ' గేయం నేడు ఆంధ్ర మంతటా దాదాపు ప్రతి యింటా చల్లని కాంతులు, తెల్లని వాసనలు నింపుతున్నదంటే, వీరి జన్మ కృతార్థమనే అనాలి. రవీంద్రు డన్నాడు — నేను పోయినా, నా పాటలు వంగ ప్రజలు పాడుకుంటారు — అని. ఇది నిజం. గానం గేయం అవినాభావ సంబంధం గలవి. దానిపై ప్రజల మనసు మొగ్గినా, వారి నాలుకపై అది కలకాలం నాట్య మాడుతుంది. చిన్ననాటినుంచి వీరు కవితా యజ్ఞం కొనసాగిస్తున్నారు. ఆ యజ్ఞ ఫలాలు ఎన్నో ఉన్నాయి — నా స్వామి, గీతాంజలి అనువాదం, ఎన్నో స్వతంత్ర ఖండికలు. వాటిలో సుందర భారత మొక్కటి.

భారతం మనకందరికీ ఉపాదేయమని ఇదివరకే మనవి చేశాను. దానికి మించిన కల్పన, ఆకాశమంత కల్పన, పృథివి అంత కథ, మరొకటి లేదు. ఇలా అంటే కార్య కారణభావ జిజ్ఞాసువు అయిన వర్తమాన కాలంలో వెర్రివా డవుతాను. కాని, నేను జంకను. అంతమాత్రాన తక్కినవి వ్రాయరాదు, చదువరాదు, చూడరాదు, వినరాదు అని కాదు. దాని ప్రాశస్త్యం నిరుపమాన మనడమే నా ఆంతర్యం.

[1963 లో శ్రీ శంకరంబాడి సుందరాచారి సన్మానసభలో చెప్పిన మాటలు]

★★

94

# సర్కస్ కథ

సర్కస్ అనగానే సంతోషించని వారు ఎవరుంటారు? పిల్లలకంతా ఆనంద తాండవం. సర్కస్ తమ తమ వూరికి, తమ పేటకు వస్తుందంటే ప్రతివారూ ఆనందించేవారే. సర్కస్‌డేరాలు మోసుకుని వస్తున్న బళ్ళు, గంభీరంగా నడిచే ఏనుగులు, సింహాలు మొదలయిన క్రూరమృగాలున్న పంజరాల బళ్ళు, వస్తాదులు, అందరినీ నవ్వించే హాస్యగాళ్ళు - సర్కస్ బృందం రాక ఏ ప్రాంతానికైనా నూతన కళాకాంతులనే తెస్తుంది.

మనదేశంలో కోడిరామమూర్తిగారి సర్కస్ గురించి వినని వారుండరు. ఆయన చూడడానికి మామూలుగా కనిపించినా ప్రాణాయామం చేసి నిలబడితే, సీతాదేవికి స్వస్వరూపం ప్రదర్శించిన పవమానసుతునిలాగ భయంకరంగా కనిపించేవాడట. రొమ్ముమీద ఏనుగును ఎక్కించుకునేవాడని, బ్రిటిష్‌వారు ఏటా జరిపే బైసన్‌ఫైట్‌ను శాశ్వతంగా ఆపివేస్తామనిమాట యిస్తే ఆ వృషభంతో తను పోరాడి దానిని పడగొడుతానని సవాలు చేశాడని చెప్పేవారు. అలాగే తారాబాయి సర్కస్ కూడా చాల విఖ్యాతి పొందిందే. తారాబాయి తన శిరోజాలకు బండరాళ్ళు కట్టి ఎత్తేవారు. మగ వస్తాదులతోను కుస్తీలు పట్టి గెలిచేవారు. పరశురాం సర్కస్, కమలా త్రీరింగ్ సర్కస్, దేసల్ సర్కస్ లోగడ చాల పేరుపొందినట్టివి. విదేశాలలో రష్యన్‌సర్కస్, అమెరికన్ వారి గ్రేట్‌సర్కస్ మొదలయిన అపూర్వమైనవి; అద్భుత సాహసోపేతమైనవీని.

ఒకరకం బలప్రదర్శనాలు, పందేలు మొదలయినవి మనదేశంలో అనాదిగానే వున్నట్లు తోస్తుంది. మల్లయుద్ధ రంగస్థలాలు, ప్రదర్శనశాలలు, విచిత్ర మృగపక్షి సంగ్రహం మొదలయినవి పూర్వుల అభిరుచిలోను వున్నట్టు రామాయణ భారతాలలో నిదర్శనాలున్నాయి. బుద్ధుడు విశాలమయిన మైదానంలో తన ధనుర్విద్యా ప్రదర్శనం, తక్కిన విద్యల ప్రదర్శనం జరిపినట్టు లలితవిస్తరంలో వివరంగా వుంది

సర్కస్ అనే మాటకు కూడా మొదట్లో రంగస్థలమని, ప్రదర్శన స్థలి అనే అర్థాలే వుండేవి. సర్కస్ అంటే వలయాకారంగానో అర్ధచంద్రా

కారంగానో నిర్మించిన రంగస్థలమని, విశాలప్రదర్శనస్థలమని అర్థం. ఇలాటి రంగస్థలాన్ని కాన్సస్ అనే దేవుని పేరుతో రోమనులు క్రీస్తుకుపూర్వం 329 లో నిర్మించినట్టు చెబుతారు. ఈ విశాల ప్రదర్శశాలలో రథాలు, గుర్రాలు పోటీలు చేయడానికి అవకాశం వుండేదట. ప్రతి పండుగకు, ఉత్సవానికి ఇలాటి పోటీలు జరిగేవట. రథాలను తోలేవారు, గుర్రాలపై స్వారీచేసేవారు బానిసలు. తర్వాత రోములో రోమన్ సేనాపతి ఫ్లెమినియస్ పేరున క్రీస్తుపూర్వం 221 లో ఇలాటి రంగస్థలం కట్టారు. దానికి సర్కస్ ఫ్లెమినియస్ అని పేరు. తర్వాత రోమన్‌చక్రవర్తి కాలిగులా క్రీస్తుశకం మొదట శతాబ్దంలో "సర్కస్ నెరోనిస్" అనే రంగస్థలం నిర్మించాడు.

ప్రాచీన ప్రాచ్య పాశ్చాత్య ప్రదర్శన స్థలాలలో అందరూ - స్త్రీలు పురుషులూ జతలుగా చేరి పోటీలు చూటడం, సంతోషంతో కేకలు వేయడం మొదలయినవన్నీ నేటిలాగే వుండేవేమో! కాని ఇప్పటి సర్కస్‌లో లాగా తిర్యఙ్మనుష్య సాహసచర్యలు కలగలువుగా లేవు. నేడు మనం ఆనందిస్తున్న సర్కస్ ప్రదర్శనం పుట్టుకమాత్రం చాల ఇటీవలిది – అంటే 18వ శతాబ్ది చివర.

18వ శతాబ్దం చివర ఇంగ్లాండులో ఫిలిప్‌యాన్‌ట్లే అనే సాహసికుడు వుండేవాడు. ఇతడు గుర్రాలమీద రకరకాల ఫీట్లు చేసేవాడు. ఇతడు, డుక్రో అనే బలప్రదర్శకులు, గుర్రాలు మొదలయిన జంతువులను వెంటబెట్టుకుని వెళ్ళడం, ప్రదర్శనాలు జరపడంతో నేటి సర్కస్ ప్రారంభమయింది. తర్వాత హెంగల్, స్వాంగర్స్‌వంటి బ్రిటిష్‌సర్కస్ కంపెనీలు, రిక్కెట్స్ పూడ్‌వంటి అమెరికా కంపెనీలు పుట్టాయి. రిక్కెట్సు కంపెనీ జార్జివాషింగ్టన్ ఎదుట ప్రదర్శనాలు జరిపిందట.

అయితే నేటి సర్కస్‌కు మూలవిరాట్టనదగిన ఫిన్స్ కాపులోర్ బర్నమ్ అనే మేధావి సర్కస్‌ను అపూర్వంగా తీర్చిదిద్దాడు. ఇతనిని గురించి ఎన్నో కట్టుకథలు గూడ బయలుదేరాయి. ఈయన 1810 లో అమెరికాలో పుట్టాడు. తండ్రి ఏదో దుకాణదారు. కుమారునికి తండ్రి వృత్తి నచ్చలేదు. చిల్లరమల్లర పనులేవో చేసి, సత్వర ధనసంపాదన మార్గమైన లాటరీలు నడిపాడు. తర్వాత "హెరాల్డ్ ఆఫ్ ఫ్రీడం" అనే వారపత్రిక నడిపాడు. ఏదో తప్పువార్త ప్రకటించడంవల్ల శిక్ష పొందవలసి వచ్చింది. కనుక పత్రిక మూసివేసి, ప్రదర్శనలు ప్రారంభించాడు. జాయ్స్‌హెథ్ అనే ఒక నీగ్రో వృద్ధురాలిని తన జట్టులో చేర్చుకుని ఆమెకు 160 సంవత్సరాలని, జార్జివాషింగ్టన్‌కు నర్సుగా వున్నదని చెబుతూ దేశమంతా తిరిగి ప్రదర్శనాలిచ్చాడు.

ఆవిడకు 70 సంవత్సరాలేనని రుజువయింది. ఆవిడ 1836 లో మరణించింది. తర్వాత బర్నమ్ ఒక మరుగుజ్జును చేర్చుకున్నాడు. ఒక ప్రదర్శనానికి 1000 డాలర్ల విచిత్ర వేతనంతో ఒక గాయకుని నియమించుకున్నాడు. అతని జట్టులో ఇంద్రజాలికులు, వస్తాదులు, బలప్రదర్శకులు రకరకాలవారు వుండేవారు. వింత వింత జంతువులు, మృగాలతో 1857 లో అతడు "ప్రపంచంలో మహత్తర ప్రదర్శనం" అనే పేరుతో సర్కస్ నడిపాడు. అతడు 1891 లో మరణించాడు. అప్పటినుంచి సర్కస్ నేటి స్వరూపంలో ఆబాల వృద్ధుల్ని ఆనందపరుస్తున్నది.

పాశ్చాత్య సంప్రదాయంతో మనదేశంలో వ్యాపించి పేరు పొందిన సర్కస్ కంపెనీలను కొన్నిటిని పాఠకులు మొదట్లోనే చదివారు. ప్రస్తుతం మనదేశంలో ప్రేక్షకులను దిగ్భ్రాంతులను చేసే గొప్ప సర్కస్ "జెమిని సర్కస్."

జెమిని సర్కస్ ఒకచోటునుంచి మరొకచోటికి తరలివెళ్ళుతుంటే, ఒక వూరు, ఒక అరణ్యంతోసహా తరలివెళ్ళుతున్నట్టే వుంటుంది. రైలుప్రయాణం చేయడమంటే యాభైకి పైగా వాగనులు కావాలి. 150 మంది ప్రచారకులు వున్నారు. డేరా విస్తారం 1,05,800 చదరపుటడుగులు. ఈ సర్కస్ కంపెనీలో వున్న మృగాలకు, జంతువులకు శిక్షకుడు శ్రీ "మూమూ" షంషేర్ అలీ. ఈయన క్రింద 20 ఏనుగులు, 35 అరబీగుర్రాలు, నాలుగు జీబ్రాలు, ఆరు ఒంటెలు, 30 సింహాలు, 10 పెద్దపులులు, నాలుగు చిరుతపులులు, ఆరు ఎలుగుబంట్లు, నాలుగు చింపాంజీలు, 16 రకాల వానరాలు, రెండు కణుజులు, ఆరు గాడిదలు, ఆరు నారాయణపిట్టలు, 12 కొంగలు, 15 గ్రామసింహాలు, ఒక గొరిల్లా, ఒక నీటిగుర్రం ఉన్నాయి. శ్రీ షంషేర్‌అలీ వంగరాష్ట్రంలోని మిద్నపూర్ జిల్లాలో జన్మించాడు. చిన్నతనం నుంచి పశువులను పెంచడం, వాటిని ఆడించడం అతనికి సరదా. మొదట్లో తను కుక్కలకు శిక్షణ యిచ్చేవాడు. తర్వాత గుర్రాలను పెంచాడు. గుర్రాలను అదుపులో పెట్టడం చాల కష్టం. ప్రస్తుతం ఇతడు నీటిగుర్రానికి శిక్షణ యిస్తున్నాడు. నీటిగుర్రం ఈ సర్కస్ విశిష్టత.

ఈ నీటిగుర్రం పేరు గణేశ్. దీనికి రోజుకు మూడుమణుగుల బంగాళా దుంపలు ఆహారం. ఎప్పుడూ నిద్రపోతూ వుంటుంది. ఇది సర్కస్‌లో చేసే పనేమీ లేదు. నీటిలో నుంచి పూగుతూ వచ్చి ఒక్కమారు రింగుచుట్టూ తిరిగి కొండగుహ వంటి తన నోటిని ఒకమారు తెరచి ప్రేక్షకులకు చూపుతుంది.

గొరిల్లా పేరు "కింగ్‌కాంగ్" శేర్ల తరబడిపాలు, తేనె తాగుతూ వుంటుంది.

ఈ సర్కస్‌లో మరొక ప్రధానాంశం— ప్రదర్శకులలో 90 శాతం కేరళవాసులు; అందులోను తెల్లిచ్చేరి వాస్తవ్యులు. అయినా దేశంలోని ప్రతి రాష్ట్రంవారూ దీనిలో వున్నారు. ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించే బఫూను శ్రీ పటేల్ మహారాష్ట్రుడు. సర్కస్ కంపెనీ నిర్వాహకులు శ్రీయుతులు కణ్ణన్, శంకర్, సహదేవన్. వీరు గూడ చాల విద్యలలో ఆరితేరినవారు. ఇంత సరంజామా, ఇంతటి నిపుణుల సమూహం, అన్నిటికీ మించి, ఉభయచరమైన నీటిగుర్రం వంటి అపూర్వ జంతువు వున్న "జెమిని సర్కస్" ప్రదర్శనం అద్భుత ప్రదర్శనం కాక ఏమవుతుంది!!

[ఆంధ్రపత్రిక, 23–4–1967]

★★

# యోగమంటే ఏమిటి? యోగాచార్యుడు శ్రీ బి. కె. ఎస్. అయ్యంగారితో గోష్ఠి

యోగం అంటే ఏమిటి? యోగాసనాలంటే ఏమిటి? ఈ రెండు విషయాలను గురించి మనదేశంలోనే కాక, విదేశాలవారిలో కూడా కొన్నిరకాల అపోహలు ఉన్నాయి. విదేశాలకన్నా మనదేశంలో ఈ అపోహలు అధికం.

యోగం అంటే గడ్డం పెంచుకోడం, కాషాయవస్త్రాలు ధరించడం మొదలయిన వాటికింద పరిగణితం అవుతున్నది. యోగాభ్యాసాన్ని మొగ్గల కింద జమకడుతున్నవాళ్ళు, సర్కస్ 'ఫీట్ల' కింద లెక్కవేస్తున్నవాళ్ళు వున్నారు. యోగాభ్యాసం అంటే కొంతమంది మేకులు మింగడం, గాజు ముక్కలు నమలడం, భూమిలో పాతించుకొని వుండడం మొదలయినవని అనుకుంటున్నారు.

యోగాభ్యాసనంవల్ల ఏవో శక్తులు వస్తాయని, వాటితో లోకాన్ని ఏమో చేయవచ్చునని కొందరు ప్రలోభనం చెందడం కూడ వుంది. వశీకరణశక్తులు వస్తాయి, బొందెతో అంతర్గ్రహయానం చేయవచ్చునని అనుకునేవాళ్ళు కూడ వున్నారు.

కాని, యోగం అంటే ఇదేమీ కాదు. యోగం అంటే ఆరోగ్యంగా బతకడం; జీవితానికి ఒక లక్ష్యాన్ని, ప్రయోజనాన్ని సాధించుకొనడం; శరీరాన్ని, మనస్సును సమరసస్థితిలో ఉంచుకొనడం. ఇందుకు అయిన సాధనే యోగాభ్యాసం. మనదేశంలో ఈ శాస్త్రంలో దక్షులు శ్రీ ముచ్చుకుంట తిరుమల కృష్ణమాచార్యులుగారు. వారివద్ద శ్రీ బి. కె. ఎస్. అయ్యంగార్ ఈ విద్యను అభ్యసించారు.

శ్రీ అయ్యంగారుతో గోష్ఠి కొంత కష్టమైన విషయం. అదీ యోగాన్ని గురించింది. ఆయన యోగ శాస్త్రంలో నిష్ణాతులు. మహా పండితులు. 'లైట్ ఆఫ్ యోగ' అనే ఉద్గ్రంథాన్ని రచించారు. నేను అనధికారిని. ఏదో చదువుకున్నా ఆచరణలో పెట్టిన వాడిని కాను. పైగా ఆయన ఆసనాలు వేయడంలో మహానిపుణులు; 600 ఆసనాలు వేస్తారు. ఇవన్నీ తెలియడం కష్టం. అందుచేత

ముందుగానే యోగ శాస్త్రాన్ని మనసార రోమంథం చేసుకుంటూ వెళ్ళవలసి వచ్చింది. ఎప్పుడో చదివిన సంగతులు ఆయెను!

శ్రీ అయ్యంగారు కడ్డీలాంటి మనిషి. ఆయనను చూడగానే కొట్టవచ్చినట్టు కనిపించేది ఆయన నుదురు. నేను వెళ్ళడం తడవుగా ఆయనే పలకరించారు. ఆయనకు గురువులూ, బావగారు శ్రీ ఎం. టి. కృష్ణమాచార్యులుగారు నాకు సన్నిహితులు. ముందు సంభాషణ ఈ సాన్నిహిత్యంతో ప్రారంభమయింది. కొంచెం ఆగి నేనొక ప్రశ్న వేశాను. "అయ్యా, పాశ్చాత్య దేశాల్లో అక్రోబాట్సు శిల్పంగా వృద్ధిపొందింది కదా! వాటికీ మన యోగాసనాలకూ తేడా ఏమిటి?" అన్నాను. అక్కడి నుంచి గోష్ఠి యోగ శాస్త్రంలోకి, యోగాసనాలలోకి వెళ్ళిపోయింది.

పతంజలి యోగ సూత్రాలు నిర్వచించారు. యోగాన్ని గురించి చెబుతూ "యోగః చిత్తవృత్తి నిరోధః అన్నారు. అంటే, చిత్త వృత్తులను నిరోధించడమే యోగమన్న మాట. దేనినుంచి నిరోధించడం?" శ్రీ అయ్యంగారు ఈ ప్రశ్నకు చక్కని సమాధానం చెప్పారు.

శరీరమూ, మనస్సూ ఉన్నాయి. ఈ రెండూ ఒక ద్వంద్వం; చీకటి వెలుగు లాగ, సుఖము దుఃఖమూ లాగ. ఇచ్చట శరీరం ప్రబలమైతే, మనస్సు దుర్బలమవుతుంది. మనస్సు ప్రబలమైతే శరీర ప్రాబల్యం దుర్బలమవుతున్నది. ఇప్పుడు చిత్తవృత్తులను నిరోధించడం ఎట్లాగు? శరీరం లేకుండా మనస్సు లేదు. మనస్సు లేక శరీర వ్యాపారం లేదు. ఈ రెండూ ప్రధానమైన ద్వంద్వాలు. చిత్తవృత్తి నిరోధమంటే, శరీరాన్ని కాదనడం కాదు. శరీరాన్ని, మనస్సును సమస్థితిలో వుంచడం. ఆయన మాటలివి: "శరీరం, మనస్సు ఎప్పుడూ సంఘర్షణ పడుతున్నట్లు వుంటాయి. ఇక్కడ ఈ రెంటికీ సంవాదం లేని స్థితి విద్యమానం అవుతున్నది. ఈ స్థితిని ఉపశమింపజేసి, శరీరానికీ, మనస్సుకూ సంవాదాన్ని సాధించడం యోగం. ఈ సంవాదం సాధించినప్పుడు మనస్సుకు నిశ్చలస్థితి, లేక శాంతి లభిస్తుంది. Yoga is to live in the tranquility of the mind." మనస్సు బహువిధ సాత్త్విక భావాల వలన, ప్రకోపాల వలన తాడితం అవుతూ ఉంటుంది. ఆ మనస్సును తెలుసుకొని, దానిని ప్రశాంత స్థితికి తెచ్చుకొనడం ఎట్లా? ఈ ప్రశ్నకు శ్రీ అయ్యంగారు సమాధానమిది: "శరీరం అంతర్యాన్ని (depth) తెలుసుకోండి. ఈ శరీరంతో ఏమి చేయవచ్చునో తెలుసుకోండి. ఈ తెలుసుకొనడానికి ఆసనాలు మార్గం."

ఈ విషయాన్ని శ్రీ అయ్యంగారు ఇట్లా వివరించారు. "ప్రతి ఆసనానికి ప్రయోజనం వుంది. ఈ ప్రయోజనమూ, ఈ ఫలితమూ మనస్సు మీద పని

చేస్తాయి. ఇది స్వస్థ ధర్మం కలది. ఒక అక్లిష్టమైన ఆసన విశేషంతో మనస్సును స్వస్థాభిముఖంగా ప్రభావితం చేయవచ్చు. ఆసనాల ద్వారా మనో నైశ్చల్యం ఎంతటిదో లేక మనస్సు పొందుతున్న ప్రశాంత స్థితి ప్రమాణం ఎంతటిదో తెలుసుకొనవచ్చును. అంటే శరీరానికీ, మనస్సుకూ సాధించవలసిన సంవాద దశా విశేషం ఆసనాల మూలంగా విదితమవుతుంది. ఈ సంవాదం సాధించడానికి ఈ ఆసనాలు ఉపాయం."



వీరభద్రాసనం

ఇది నేను వేసిన మొదటి ప్రశ్నకు ప్రత్యుత్తరం కాదు. నవ్వుతూ ఈ విషయం జ్ఞాపకం చేశాను. ఆయన కూడా నవ్వారు. అంతలో తీక్ష్ణులయ్యారు. "అక్రోబాట్స్‌కు, ఆసనాలకు తేడా వుంది. అచ్చట శరీరాన్ని ఆయా ప్రక్రియలకు అనుకూలమయ్యేట్టు వంచడమే కాని, మనస్సంబంధమైన విషయం లేదు. శరీరాన్ని యమించడమేకాని, ప్రాణాన్ని యమించడం లేదు. అంటే, యోగాసనాలు మైనస్ ప్రాణాయామం ఈక్విల్‌టు అక్రోబాట్స్ కావచ్చు. అక్రోబాట్స్‌లో శరీరం ప్రధానం. ఇచ్చట అంటే యోగంలో శరీరమూ, మనస్సూ రెండూ ప్రధానం.

"ప్రాణాయామం లేకుండా ఆసనాలు, యోగసాధన ఉండవు. ఇది చాలా ముఖ్యమైన విషయం. ఇప్పుడు ఒక ప్రత్యేకమైన ఆసనం వేయాలంటే అందుకు అవసరమైన సంకల్పాన్ని ముందు సాధించాలి. తర్వాత అందుకు అనుకూలంగా మనస్సును వంచాలి. ఎంతవరకు ఆ ఆసనానికి అభిముఖంగా మనస్సును వంచుతామో, ఆసనాన్ని సాధిస్తున్నామో, అంతవరను మనస్సును జయించినట్టు, శరీరాన్ని చెప్పినట్టు వినిపించినట్టు అవుతున్నది. అంటే,

శరీరానికి మనస్సుకూ వున్న సంఘర్షణను అంతమేరకు ఉపశమింపజేసినట్టు అవుతుంది. ఈ ద్వంద్వాల మధ్య వున్న అసమ స్థితిని తొలగించి, సమస్థితిని సాధించడమే అనగా, మనోలయం పొందడమే యోగం. శరీరానికి, మనస్సుకు సమస్థితి ఏర్పడినప్పుడు, సంవాదం కుదిరినప్పుడు, అవి ఏకత్రస్థితాలై, శరీరం వున్నది కూడా లేకపోతున్నది; మనస్సు వుండి లేనిదవుతున్నది. అంటే, సమాధి స్థితిని పొందడమని అర్థం. ఇదే మనోలయం. ఈ స్థితిని సాధించడానికి యోగాసనాలే మార్గం. అన్ని ఆసనాలూ వేయాలి. శరీరాన్ని మరచిపోవడానికి ఆసనాలే మార్గం. అప్పుడే మీ మనస్సు, శరీరం ఏకమవుతున్నవి. రెండూ తాత్త్వికంగా లయాన్ని చెందుతున్నాయి. అంటే, వ్యవహారంలో శరీరమూ వున్నది మనస్సూ వున్నది. పరమార్థంలో ఈ రెండూ లేవు."

"ఈ ప్రయోగం ప్రయోజనం ఇట్లా వ్యక్తిమాత్ర పరిమితమా; అంతకంటే విశాలమా? అనగా, యోగానికి వ్యక్తి ప్రయోజనంకాక సమష్టి ప్రయోజనం, సాంఘిక ప్రయోజనం ఏమైనా ఉందా?" ఇది నన్ను చాలా కాలంగా వేధిస్తున్న ప్రశ్న. ఈ ప్రశ్న వేశాను. శ్రీ అయ్యంగారు కొంచెం ఆలోచించారు. యోగానికి, యోగాసనాలకు సాంఘిక ప్రయోజనం లేదన్నారు. "ఎవరికి వారు ఈ ఆసనాల ద్వారా లభించే ఆనందాన్ని అనుభవించవలసిందే కాని, అది ఇంకొకరికి సంక్రమింపజేసేది కాదు." అన్నారు.

"అణిమాద్యష్ట సిద్ధులను గురించి పతంజలి చెప్పకున్నాడు. అవి సంఘం మీద ప్రతికూలమో, అనుకూలమో అయిన ప్రభావాన్ని చూపించవచ్చు గదా? అసలు పతంజలి చెప్పిన ఈ అణిమాద్యష్ట సిద్ధులు వున్నాయా?" ఇచ్చట శ్రీ అయ్యంగారు తమ అనుభవం గురించే మాట్లాడారు. ఆ సిద్ధులు వున్నాయి. కాబట్టే పతంజలి చెప్పారు అన్నారు. అయితే ఇప్పుడు మనకవి సాధ్యమా అంటే, కాలంలోను, సాధన విషయంలోను వచ్చిన వ్యత్యాసాలను పేర్కొన్నారు. పూర్వం కుర్రవాడు ఉపనీతుడు అయ్యేవేళకే యోగంలో సుశిక్షితుడై వుండేవాడనీ, ఈ కాలంలో మనకు దానిని గురించి తెలియడమే కాని, ఆచరణ అన్నది లేదని, అటువంటి ఆచరణ వుంటే ఆ సిద్ధులు లేవని అనలేమని అన్నారు. "అదికాక, యోగం లక్ష్యంలో వైయక్తికమైంది. వైయక్తికమైన సాధన విశేషంవల్ల సాధించిన సిద్ధులను పతంజలి పేర్కొని వుండవచ్చు. అంతేకాని, సమూహం మీద ఇవి సాధ్యమైన విషయాలు కావు. ఎవరికి వారు సాధించవలసిందే కాని సమష్టిగా అందరికి అబ్బేది కాదు." అన్నారు.

ఈ సందర్భంలోనే ఆయన ఇంకొక మాట అన్నారు. అది ప్రకాశ

వరణం అనే మాట. అనగా ఏమిటి? యోగం వుంది. దానిని సాధన చేస్తున్నాము. అందువల్ల అది మనకు ఎరుకను కలిగిస్తున్నదా? లేదా? ఇదే ప్రశ్న. ఇంగ్లీషులో శ్రీ అయ్యంగారు "Whether it (Yoga) is giving the light or not? That is the question." ఇది అసలు విషయం. అంటే బ్రహ్మసాక్షాత్కారానికి యోగం మార్గం అవునా కాదా? అన్నది ప్రశ్న. శ్రీ అయ్యంగారు అవుతుంది అన్నారు. "అయితే మీకు అయిందా?" అని అడిగాను. "అయింది. అయితే అది క్షణికం. కాని వివరించలేను. రెండు మూడు సార్లు అటువంటి అనుభవం కలిగింది. అది చెప్పడం కష్టం. చెప్పగల్గితే అది ఆ స్థితే కాదు. ఇందులో తెలియకపోవడం లేదు. తెలియడమూ లేదు. నేను వున్నాను, నేను లేను. అది అనిర్వచనీయమైన స్థితి. మాటలతో చెప్ప డానికి కాదు." శ్రీ అయ్యంగారు మాటలు నాకు తైత్తిరీయంలోని "యతో వాచో నివర్తంతే. అప్రాప్య మనసా సహ" మొదలయిన మంత్రాలను జ్ఞాపకం తెచ్చాయి.



పార్శ్వకుక్కుటాసనం

"ఇంతటి సమస్తం మీద యోగసాధన సాధ్యమా? యోగంతో మనస్సు శ్రీ దేకాలను తగ్గించుకోవచ్చు. ఆసనాల ద్వారా శరీర వ్యాధులను, అవి ఎంత

గూఢాలైనవైనా నివారించుకోవచ్చు. జ్ఞాపకశక్తి లేనివారున్నారు. వారికి ఈ ఆసనాల ద్వారా జ్ఞాపకశక్తి ఏర్పడేట్టు చేయవచ్చు. పుంస్త్వం లేనివారికి ఆసనాల ద్వారా పుంస్త్వం చేకూర్చవచ్చు. మహాకామికి కామాన్ని యోగాసనాల శిక్షణతో శిక్షించవచ్చు. ఇవన్నీ సాంఘిక ప్రయోజనాలా? అంటే చెప్పలేము. ఆయా వ్యక్తులకు ఆయా క్లేశాలున్నాయి. అవి వైయక్తికాలు. అతడు చేసిన సాధనం వల్లనే ఆ క్లేశం నివారించడం సాధ్యం. ఈ సాధన అందరిలోను ఒకే విధంగా ప్రవర్తించదు. ఆ మనిషిని బట్టి, ఆ మనిషి క్లేశ లక్షణం బట్టి యోగాసన శిక్షణను గరపవలసి వుంటుంది. ఇది వ్యక్తిలో పరిణామాన్ని తెచ్చేదే కాని, సంఘంలో కాదు. అయితే పరోక్షంగా దీనిని సాంఘికం అని కూడా అంటే అనవచ్చు. ఇది నా మాట. ఎందుచేతనంటే వ్యక్తుల యొక్క కూడికే సంఘం కాబట్టి." అన్నారు.

"ఏ ఆసనం ఏ క్లేశం మీద పనిచేస్తుంది?" అని ప్రశ్నించాను. "అది నా రహస్యం" అన్నారు శ్రీ అయ్యంగారు. అంటే, ఇచ్చట రహస్యానికి ప్రతిభ అని అర్థం చెప్పుకోవాలి. "ఏ రకమైన ఆసనంతో ఏ ఒకానొక క్లేశాన్ని పొందుతున్న వ్యక్తిని శిక్షించవచ్చో, అది మాత్రమే తెలిసే విషయం ఆ వ్యక్తిని చూసినప్పుడు కలుగుతుంది. అంతేకాని, ఒకే రకమైన క్లేశం మీద ఒకే రకమైన ఆసనం అందరిలోను పనిచేస్తుందనడానికి వీలులేదు" అన్నారు.

"యోగము ఆచరణసిద్ధమూ, అనుభవైక వేద్యమూను. మానవునికి దైహికం, మానసికం, నైతికం అయిన స్వస్థతను యోగం చేకూరుస్తుంది. అసలు విషయం ఏమిటంటే, యోగమే స్వాభావికమైన జీవన పద్ధతి. పతంజలి దానికి పారిభాషిక పదాలతో శాస్త్రస్థాయిని కలిగించాడు. ఇందుకు జీవితంలో ఇప్పుడు కూడా దృష్టాంతాలు చూపించవచ్చు. యహూదీ మెనుహిన్ ఉన్నారు. ఆయన నాకు శిష్యుడు. అంటే నావద్ద యోగ సాధనలో శిక్షణ పొందారు. మీకు తెలుసు మెనుహిన్ విశ్వవిఖ్యాతుడైన వయొలినిస్టు. వయొలిన్ మీద తను పలికించదలచినదంతా పలికించాలంటే, ప్రత్యేకమైన ఆసనాలు అవసరమని ఆయన అనుభవం మీద గ్రహించారు. మెనుహినే నాతో ఒకసారి ఇట్లా అన్నారు: 'పూర్వం నాకు వయొలిన్ మీద ఏమి వాయించాలో తెలుసు. ఇప్పుడు ఈ అభ్యాసం చేసిన తర్వాత ఎట్లా వాయించాలో తెలిసింది.' దీనికి కారణం వుంది. యోగాభ్యాసం వల్ల మనిషికి కొన్ని ముఖ్యమైన లక్షణాలు అబ్బుతాయి. అవి ఇవి: ఒకటి శరీర సంయమనం, రెండు ఇంద్రియ సంయమనం, మూడు మనస్సంయమనం, నాలుగు జ్ఞాన సంయమనం, ఐదు ఆత్మసంయమనం. ఈ

సంయమాలవలన మెనుహిన్ వయొలిన్ వాదన విద్యలో పూర్వం కంటే ఎక్కువయిన శిల్పాన్ని సులభంగా ప్రదర్శించడం సాధ్యమై వుంటుంది. వట్టి గాత్రం కాక, ప్రాణాన్నే పోసి పలికిస్తారన్న మాట.

"ఇంకొక విశేషం కూడా వుంది. ఈ యోగాభ్యాసం వల్ల ప్రయత్న శైథిల్యమూ, ఆనంద సమాపత్తీ సమకూరి వస్తున్నాయి. అంటే ఇక్కడ వాయులీన వాదనం ఈ విధంగా వుండాలన్న ప్రయత్నం లేదు. దాని అంతట అది స్వాభావికంగా అతని వేళ్ళలో కూర్చుంటుంది. సంయమనం వల్ల ఏ వేలును ఎంత ఒత్తవలెనో, ఏ నరం కదల్చవలెనో మొదలయిన ఆంగిక ప్రక్రియలు ప్రయత్నంవల్లకాక, వాని అంతట అవే స్వాభావికంగా జరిగి పోతున్నాయి. అనగా ఒక్కమాటలో ఆ విద్యలో అతను సిద్ధి పొందాడని అర్థం."



వృశ్చికాసనం

సంగీతంలో మెనుహిన్ ఏ విధంగా సిద్ధిని సాధించారో అదే విధంగా శ్రీ అయ్యంగారు యోగంలో సిద్ధిని సాధించారు. ఆయనకు యోగం ఒక కళ,

శాస్త్రం, తత్త్వం కూడా. ఈ విద్యను ఆయన శ్రీ ఎం. కృష్ణమాచార్యుల వద్ద అభ్యసించారు. అయితే లోకంలో చాలామంది యోగాభ్యాసం చేసినవారు ఉన్నారు. కాని, శ్రీ అయ్యంగారికి వున్న దీక్ష గాని, కాష్ఠ కాని అందరికీ వున్నట్టు తోచదు. ఇందుకు బహుశా ఈయన కోలారు జిల్లా బేలూరులో పుట్టడం ఒక కారణం కావచ్చు. బేలూరు హొయసళుల రాజధాని. శిల్పాలకు పుట్టినిల్లు. ఆ శిల్పులు గూడ యోగశాస్త్ర, యోగాభ్యాస నిష్ఠాతులనే అంతా విశ్వసిస్తున్నారు. వారి యోగశక్తి శిల్పాలుగా రూపాంతరం చెందింది. శ్రీ అయ్యంగారు ఆ వూరిలో పుట్టినవారు, ఆ వూరిలో పెరిగినవారు, ఆ శిల్పాలను చూచినవారు, ఆ గాలిని పీల్చినవారు కావడంచేత యోగశాస్త్రం కళగా ఆయన మనస్సు అంతరాంతరాలలో నెలవుకొని వుండే వుంటుంది.

శ్రీ అయ్యంగారు 1918 లో బేలూరులో (కర్ణాటక రాష్ట్రం) జన్మించారు. అప్పుడు ప్రపంచమంతా ఇన్‌ఫ్లుయంజా మహామారిలాగ వ్యాపించి వుంది. "చిన్నప్పుడు నేను నీరసంగా ఈసురోమంటూ, బానలాగ కడుపుతో వికారమైన ముఖంతో, వ్రేలాడదీసుకున్న పూచకాళ్ళు చేతులతో చూడ ఘోరంగా వుండేవాడిని" అన్నారు ఆయన. ఆయన తండ్రిగారు మామూలు ఎలిమెంటరీ పాఠశాల ఉపాధ్యాయుడు. ఉద్యోగంనుంచి విరమించిన తర్వాత 1922 లో బెంగుళూరుకు వచ్చి స్థిరపడ్డారు. 1926 లో ఆయన మరణించారు.

ఈ చిక్కులవల్ల, మలేరియా, టైఫాయిడ్, క్షయ వీటివల్ల శ్రీ అయ్యంగారు చదువు సరిగా సాగలేదు. మొదట ఆరోగ్యం కుదుర్చుకుందామని, "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని నిశ్చయించుకుని, మైసూరువెళ్ళి శ్రీ యోగాచార్యులు, శ్రీ తిరుమల ఎం. కృష్ణమాచార్యులవద్ద (ఆయనవారి బావగారు) యోగం నేర్చుకోడానికి వెళ్ళారు.

అప్పుడు ఆయన ఛాతీ వెడల్పు 20 అంగుళాలు. తూకం 70 పౌండ్లు ఆట. రెండుసంవత్సరాలపాటు మైసూరు యోగశాలలో యోగాభ్యాసం, ఆసనాలు అభ్యసించారు. 1936 లో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయారు. అప్పటికి ఆయన జీవితలక్ష్యం ఏమిటో ఒకవిధంగా స్పష్టం అయింది. యోగాసనాలను నేర్పడానికి ధార్వాడకు వెళ్ళారు. అక్కడ యోగవిద్యా బోధనకు నారులుపడ్డాయి. ఆయనపేరు కొంత పాకింది. 1937 లో పూనాలోని కళాశాల, పాఠశాలలవారు విద్యార్థులకు యోగసనాలు నేర్పడంకోసం ఆయనను ఆహ్వానించారు. మూడు సంవత్సరాలపాటు అక్కడ యోగవిద్య నేర్పారు; 300 మంది విద్యార్థులకు, 40 మంది విద్యార్థినులకు నేర్పారు.

తర్వాత స్వంతంగా ఒక యోగ పాఠశాల స్థాపించారు. 1940 నుంచి 46 వరకు చాల గడ్డురోజులు. పగలు రెండణాల అటుకులు తిని, రాత్రిళ్ళు మంచినీళ్ళు తాగి పడుకునేవారు. అప్పుడప్పుడు విద్యార్థులు ఆయనకు సహాయం చేసేవారు. ఆయనకు నడిచే అలవాటు బాగా వుంది ఆయన ధార్వాడనుంచి పూనా పట్టణానికి రాకముందు రెండు అణాలు పొదుపు చేసుకొనడానికి హుబ్బళ్ళి నుంచి ధార్వాడకు 15 మైళ్ళు నెలరోజులపాటు నడవలసి వచ్చింది. అలా పొదుపుచేసిన డబ్బుతో పూనా చేరారు.

క్రమంగా విద్యార్థుల సంఖ్య ఎక్కువయింది. ఆయన కళాశాలలలోను పాఠశాలలలోను, అంతర్జాతీయ సమావేశాలలోను-కాన్సర్ పరిశోధన, వైద్య మహాసభ, శరీర వ్యాయామ మహాసభ, అంతర్జాతీయ శాకాహారుల మహాసభ వంటివి — యోగవిద్యా ప్రదర్శనాలు జరిపేవారు.

1952 కు శ్రీ అయ్యంగార్ కీర్తి బొంబాయి రాష్ట్రమంతటా ఉత్తమ యోగ విద్యాచార్యుడుగా వ్యాపించింది. ఆ సంవత్సరమే ఆయనకు ప్రపంచ విఖ్యాత వయొలిన్ విద్వాంసుడు శ్రీ యహూదీ మెనుహిన్‌తో పరిచయం కలిగింది. తక్కిన మరికొందరు ప్రపంచ ప్రముఖ వ్యక్తులతోను పరిచయం కలిగింది. 1954 లో శ్రీ మెనుహిన్ రెండవసారి భారతదేశానికి వచ్చినప్పుడు శ్రీ అయ్యంగార్ యోగ విద్యాబోధనకు సంతోషపడి ఆయనను యూరప్ దేశాలకు ఆహ్వానించారు. శ్రీ అయ్యంగార్ 1953 నుంచి ప్రతివారాంతంలోను బొంబాయిలో యోగాసన కక్ష్యలు ఏర్పాటు చేశారు. పాఠశాలల్లోను, కళాశాలలలోను యోగవిద్యను నేర్పే ఏర్పాట్లు చేయించారు. నేడు రెండు పాఠశాలలలో నిర్బంధంగా యోగవిద్య బోధించబడుతున్నది. ఆయన విద్యార్థులకు, ఆయన పెద్దకుమార్తె విద్యార్థినులకు యోగశిక్షణ ఇస్తున్నారు.

ఈ యోగవిద్య సైనికాధికారులదృష్టిని కూడా ఆకర్షించింది. జనరల్ శ్రీ నాగేశ్, మేజర్ జనరల్ హబీబుల్లా మొదలయినవారు ఈయనవద్ద యోగాసనాలు నేర్చుకున్నారు. పూనా సమీపంలోని కడక్‌వాస్లలో వున్న నేషనల్ డిఫెన్స్ అకాడెమీలోని విద్యార్థులకు ఈయన పెక్కేండ్లు యోగవిద్య నేర్పారు.

సోవియట్ మాజీ ప్రధాని బుల్గానిన్ ముందు ప్రదర్శనలు జరిపారు. మాజీ ప్రధాని కృశ్చేవ్ ఇక్కడికి వచ్చినప్పుడు డిఫెన్స్ అకాడెమీని కూడా దర్శించారు. అక్కడ వివిధ సైనిక విషయాలను అధికారులు కృశ్చేవ్‌కు వివరించారు. "ఇవన్నీ మాకు కొత్తవి కావు. ఇంతకన్నా ఎక్కువ సైనిక సామగ్రే



కందాసనం

మాకు వుంది. మీ స్వంతంది, మీది అని చెప్పుకోగలది, మాకు కొత్తది అయిన విషయం మీరు చెప్పగలరా? చూపగలరా?" అని కృశ్చేవ్ ప్రశ్నించారు. వెంటనే మేజర్ జనరల్ హబీబుల్లా "ఉంది" అన్నారు. "నన్ను పిలిపించారు. యోగ విద్యా ప్రదర్శనం చేశాను. నా శిష్యులతో చేయించాను. కృశ్చేవ్ చాల సంతోష పడి, తమకు తెలియనిది, జాతీయమైంది అని ప్రశంసించారు." అని అయ్యంగార్ అన్నారు.

1956 లో న్యూయార్క్‌లోని హాన్‌లెన్‌సెన్స్ సంస్థ శ్రీ అయ్యంగార్‌ను అమెరికాకు ఆహ్వానించింది. 1960 నుంచి అమెరికాకు ఏటా వెళ్ళి వస్తున్నారు. అక్కడ, లండన్‌లోను, ఈయనవద్ద యోగవిద్య నేర్చుకున్నవారు దానివ్యాప్తికి కృషి చేస్తున్నారు. ఉచితంగా యోగవిద్య నేర్పుతున్నారు; ఈయన శిష్యులు కొందరు యోగ విద్యా బోధనను వృత్తిగా పెట్టుకుని, పారిస్, బ్రస్సెల్స్ మున్నగు విదేశ రాజధానులలో కేంద్రాలు పెట్టుకుని నడుపుతున్నారు.

బెల్జియం దవేజర్‌రాణి – 84 వ ఏట ఇటీవల శ్రీ అయ్యంగార్‌ను బ్రస్సెల్సుకు పిలిపించుకుని యోగవిద్యను నేర్చుకొన్నారు. మరణించేవరకు కూడ క్రమం తప్పక అభ్యసించేవారు.

ఒక యహూదీ మెనుహినే కాక, పలువురు ప్రముఖ గాయక గాయనీ మణులు క్లిఫ్సోల్డ్ కర్జన్, మాల్ స్కుజిన్‌స్కా, జీనా బచోర్, లేలీక్రాన్స్ వంటి వారు ఆయన శిష్యవర్గంలో చేరి ఎంతో శ్రద్ధతో యోగం పట్టుకున్నారు. శ్రీ మెనుహిన్‌కు యోగమన్నదే, యోగాచార్యులన్నదే ఎంతో ప్రేమ, సాన్నిహిత్యం

ఏర్పడ్డాయి. "నా కుమారుడు 15 సంవత్సరాల వాడున్నాడు. వాడికి ఏవిషయం లోను ఆసక్తి లేదు. మెనుహిన్ వాడిని ఒకసారి 'సంగీతంలో ఆసక్తి-ఉందా?' అని అడిగారు. 'ఉంది' అన్నాడు నా కుమారుడు. 'జంత్రమా గాత్రమా?' అన్నారు మెనుహిన్. 'జంత్రం- వయొలిన్' అన్నాడు కుర్రవాడు. మెనుహిన్ అతనికి ఒక వయొలిన్ బహుమానకరించారు. దానితో వాడి దృక్పథమే మారింది.



బెల్జియం డవేజర్ రాణి ఎలిజబెత్ 1960 చేసిన శ్రీ అయ్యంగార్ కాంస్య విగ్రహం

ఉదాసీనత, స్తబ్దత పటాపంచలై పోయాయి. వయొలిన్ సాధన చేయడం ప్రారంభించాడు. రోజుకు 5 గంటలసేపు వాయిస్తాడు. ఇప్పుడు వాడు వాయించే వేగం మామూలుగ ఆ వృత్తిలో వున్నవారు పలువురికి లేదేమో! అది మెనుహిన్ వరప్రసాదమే. మా అబ్బాయిని బొంబాయిలో పరిచితులందరూ 'యహూదీ!' అనే పిలుస్తారు" అన్నారు శ్రీ అయ్యంగారు.

శ్రీమతి అల్డస్ హక్స్లే, మదాం స్కాల్‌విల్లీ వంటి ప్రముఖురాండ్రు ఆయనవద్ద యోగవిద్య నేర్చుకున్నారు. మదాం స్కాల్‌విల్లీ (రోమ్) నాలుగుసార్లు ఆయనను రోముకు పిలిపించుకున్నారు. యూరపులో దాదాపు 800 మంది యోగవిద్య నేర్చుకొన్నారు. భారతదేశంలో దాదాపు 4000 మంది శిక్షణ పొందారు.

శ్రీ అయ్యంగార్ తరచు వాషింగ్టన్, న్యూయార్క్, లండన్, పారిస్, బ్రసెల్స్, జెనీవా, బెర్న్, జూరిక్ మొదలయిన నగరాలలో ప్రదర్శనాలు జరిపారు.

బి. బి. సి. న్యూస్ సర్వీస్‌లోను, టెలివిజన్ సర్వీస్‌లోను పెక్కుసార్లు ప్రసంగాలు, ప్రదర్శనాలు జరిపారు. బెల్జియంలోను- టెలివిజన్‌లో ప్రదర్శనాలు జరిపారు.

డాక్టర్ రాజేంద్రప్రసాద్, మార్షల్ బుల్గానిన్, కృశ్చేవ్, శ్రీమతి విజయలక్ష్మి పండిట్, శ్రీ బి. డి. ఖేర్, డాక్టర్ మెహమ్మద్ హట్టా, సి. డి. దేశ్‌ముఖ్ మొదలయిన ప్రముఖుల ఎదుట ప్రదర్శనలు జరిపారు. శ్రీయుతులు జిడ్డు కృష్ణమూర్తి, జయప్రకాశ్ నారాయణ్, దిలీప్‌కుమార్‌రాయ్ మొదలయిన ప్రముఖులు, అధికారులు, న్యాయవాదులు, రాజనీతిజ్ఞులు, విద్యావేత్తలు, వ్యాపార నిపుణులు యోగవిద్యలో ఈయన శిష్యులు.

శ్రీ అయ్యంగారు తమ విద్యను దరిద్రనారాయణ సేవకు వినియోగిస్తున్నారు. 1963 లో భారత దేశక్షామ నివారణనిధికి లండన్‌లో 150 స్టెర్లింగులు, పూనా వరద బాధితుల నిధికి 850 స్విట్జెర్లెండు ఫ్రాంకులు సేకరించారు.

1964 లో శ్రీ అయ్యంగార్ యూరోపియన్ శిష్యులు ఆంధ్రప్రదేశ్‌లోని రాయగిరి గ్రామానికి సహాయం చేయదలచి, 450 స్టెర్లింగులు సేకరించి వారణాసి సర్వోదయమండలి ద్వారా పంపారు. నిరుడు వారు శ్రీ అయ్యంగార్ జన్మస్థలమైన బేలూరుకు సహాయం చేయదలచి 650 స్టెర్లింగులు సేకరించి సర్వోదయ మండల్‌కు పంపారు. ఆ గ్రామంలో 5-16 మధ్య వయస్సుగల పిల్లలు వందమంది ఉన్నారు. వారికోసం ఒక పాఠశాల నెలకొల్పదలచారు. దాని భవనానికి 12 వేల రూపాయలు అవుతుందని అంచనా వేశారు. ఈ డబ్బు కూడా క్రమంగా యూరోప్‌లో సేకరించబడుతుంది. భవన నిర్మాణ కార్యక్రమం సాగుతున్నది.

శ్రీ అయ్యంగార్ యోగాసన ప్రదర్శకులు, ప్రచారకులు మాత్రమే కాక, వాటిని శాస్త్రీయంగా రంజకంగా వివరించగల మహావక్త; సుందర

మైన శైలిలో చెప్పగల ఉత్తమ రచయిత. ఆయన రచించిన 'లైట్ ఆఫ్ యోగ' అనే ఉద్గ్రంథాన్ని లండన్‌లోని జార్జ్ ఎల్లెన్ అండ్ అల్విన్ లిమిటెడ్ కంపెనీవారు ఈ సంవత్సరం ప్రచురించారు. 600 యోగాసనాల ఫోటోలతో వున్న ఈ ఉద్గ్రంథం వెల 60 రూపాయలు. దీనిలో యోగవిద్యకు సంబంధించినదంతా వివరంగా ఉల్లేఖించబడింది. పూర్వ యోగ పుస్తకాలలో చెప్పిన ఆసనాలన్నీ చూపుతున్నారు. ఈ గ్రంథం ఆసనాల సర్వస్వం అనవచ్చు. ఏ ఆసనం ఏ అవయవం మీద, ఏ అంగభాగం మీద పనిచేస్తుందో ఈ పుస్తకంలో వివరించారు.

"నేను 30 సంవత్సరాలుగా యోగ విద్యాభ్యాసం చేస్తున్నాను. ఎనిమిది గంటలు శిక్షణ ఇస్తున్నాను. రోజూ మూడు గంటలపాటు యోగాసనాలు పునశ్చరణ చేస్తున్నాను.

"యోగమనేది కళ. అదొక శాస్త్రం. అదొక తత్త్వం కూడా. సమ్యక్ జీవితానికి, సమ్యగ్విచారానికి ఇది వెలుగుబాటలు తీరుస్తుంది" అన్నారు శ్రీ అయ్యంగార్.

ఎంతో వికాసంతో, ప్రకాశావరణంతో ఆయనకు నమస్కరించి సెలవు పుచ్చుకున్నాను.

(ఆంధ్రపత్రిక, 8-5-1966)

★★

# కాకతీయుల యుద్ధ వ్యూహాలు

యంత్రాలతో జరిగే యిప్పటి యుద్ధాలతో పోల్చినప్పుడు పూర్వపు యుద్ధాలు వట్టి వెర్రి చేతలుగా కనిపిస్తాయి. కాని, యుద్ధానికి కారణమైన మనస్తత్వం నాడూ నేడూ మారలేదు. మానవుని మత్తెక్కించే అరిషడ్వర్గం, సంఘంలోని వివిధ వర్గాలు, మత్స్యన్యాయంగా చిన్న సంఘాన్ని పెద్దసంఘం లోబరచుకొనడం, సంఘనియమోల్లంఘనం, అశాంతి, ధైర్యసాహసాల ప్రదర్శనం, వాంఛ, రక్షణ దృష్టి, రాజ్య విస్తరణాశ — మొదలయినవి యుద్ధాలు చెలరేగడానికి ముఖ్యకారణాలు.

సంఘం స్థిరపడి, ఆస్తిపాస్తుల వ్యవస్థ ఏర్పడిన తర్వాత, నాయకుడు అనే పద్ధతి ఏర్పడిన పిదప దండమనేది పుట్టింది. నాయకుడు, రాజు దండధరుడయినాడు. తన మండలాన్ని, జనాన్ని రక్షించుకొనడానికి రాజు జాగరూకుడు కావలసి వచ్చింది. బలాలు సమకూర్చుకొనడం, కోటలు కట్టుకొనడం, ఆయుధాలు నిర్మించుకొనడం మొదలయిన ఏర్పాట్లు పుట్టాయి. అదే యుద్ధతంత్రం.

అన్నిటికీ మనకు వేదం మూలమైనట్టు యుద్ధతంత్రానికీ వేదమే మూలం. వేదంలో దేవాసుర యుద్ధాలు అసంఖ్యాకాలు. ఇంద్రుడు ఆదర్శ వీరుడు. యజుర్వేద సంహితంలో ఆయుధ నిర్మాణం ఎలా జరిగేదో చెప్పబడి ఉంది. సైన్యంకూడా మొదట పదాతిదళం, రథాలు తర్వాత గజాయూథం, అశ్వవాహిని ఏర్పడినట్టు ఐతరేయ బ్రాహ్మణం చెబుతున్నది. రథి ఒక చిన్న సైన్యంతో సమానుడు. రథి, మహారథి, అతిరథి ఉత్తరోత్తరం మహావీరులు. వీరి నిర్వచనాలు భారతంలో ఇలా ఉన్నాయి.

> ఆత్మానం సారథిం అశ్వాన్ స్వసైన్యం రక్షితుం క్షమః,
> ప్రహర్తా పరసైన్యానాం యుద్ధశాస్త్ర విశారదః.
> యుద్ధశాస్త్రేషు నిపుణః స రథిత్వేన సమ్మతః.

తనను, సారథిని, గుర్రాలను, తన సైన్యాన్ని రక్షించుకొంటూ పరసైన్యాలను చంపేవాడు రథి.

ఏకో దశ సహస్రాణి యోధయేద్యశ్చ ధన్వినామ్,
పూర్వోక్తలక్షణైర్యుక్తః పార్థివస్యాపి రక్షకః.
మహారథీ స కథితో యుద్ధశాస్త్ర విశారదః.

రథి లక్షణాలు ఉంటూ, ఒక్కడే పదివేలమంది విలుకాండ్రతో యుద్ధంచేస్తూ రాజును కూడా రక్షించేవాడు మహారథి.

అమితాన్యోధయేద్యశ్చ పూర్వోక్తగుణ సంయుతః,
విజ్ఞేయోతిరథీ నామ్నా శస్త్రాస్త్ర నిపుణస్సదా.

మహారథి లక్షణాలతోపాటు అసంఖ్యాకులయిన సైనికులతో పోరాడేవాడు అతిరథి.

రాజనీతి భారతంలో ప్రసక్తానుప్రసక్తంగా వున్నా, ఒక శాస్త్రంగా రూపొందింది మనుస్మృతితోను, కౌటిల్యుని అర్థశాస్త్రంతోను. అర్థశాస్త్రం తర్వాత సహస్రాబ్దాలపాటు ఆదర్శమైంది, దానిలోని ప్రధానాంశాలను టూకీగా చెప్పడం అప్రస్తుతం కాదు.

కోటలేని రాజు విషంలేని పామువంటివాడు. కనుక కోటలు నిర్మించుకోవాలి. ఈ కోటలు—దుర్గాలు-తొమ్మిది రకాలు:— స్థలదుర్గం, వనదుర్గం, జలదుర్గం, గిరిదుర్గం మొదలయినవి. అన్నిటిలోను గిరిదుర్గం శ్రేష్ఠం. స్థలదుర్గమైతే సముద్రతీరంలోనో, నదీతీరలలోనో పద్మాకారంగా 8, 12, 16 ద్వారాలలో కట్టడం శ్రేయస్కరం.

ధర్మవిజయం, అసురవిజయం, లోభవిజయం అని మూడు రకాల యుద్ధ విజయాలు. మొదటిది న్యాయమైనది. తర్వాతవి రెండూ కూటయుద్ధాలు. అసుర విజయమంటే క్రౌర్యంలో చంపివేయడం, లోభ విజయమంటే ధన లోభంతో. ధర్మ విజయమనేది జయం పొందిన తర్వాత ఉదారతతో ప్రవర్తించటం. కనుకనే, ఒకడు ఒకనితోనే పోరాలి. కవచంకలవాడు కవచం లేనివానితో పోరరాదు; సైన్యంగలవాడు సైన్యంగలవానితోనే పోరాలి; సమబలులతోనే పోరాడాలి; విషలిప్త బాణాలు వాడరాదు; క్షతగాత్రుని చంపరాదు, ధనుస్సు లరిగినవానితో పోరరాదు; రాజు రాజుతోనే పోరాలి; చిన్నపిల్లలను వృద్ధులను చంపరాదు; స్త్రీలను చంపరాదు; వెనుకనుంచి కొట్టరాదు; నోటిలో గడ్డిగరచి శరణువేడినవానిని చంపరాదు; పరుగెత్తేవానిని చంపరాదు; తరుమరాదు; దప్పిగొన్నవానిని, ఆకలిగొన్నవానిని చంపరాదు— అనే సూత్రాలు ధర్మవిజయదృష్టిలో ఏర్పడ్డాయి.

## ఆయుధాలు

ఇక ఆయుధాలు: అర్థశాస్త్రం, ధనుర్వేదం, అగ్నిపురాణం మొదలయినవి ముక్త అముక్త ముక్తాముక్త యంత్రముక్త అనే ఆయుధాలు తెలిపాయి. ముక్తమంటే ఈటెలు, బల్లేలు, బాణాలు మొదలయిన విసిరివేసేవి. అముక్తమంటే విసిరివేయకుండా చేతిలోనే పట్టుకొని పోరాడేవి. ముక్తాముక్తాలు చక్రంవంటివి. యంత్రముక్తాలు వడిసెల, గొట్టాలు మొదలయిన వాటితో విసిరేవి. ధనుస్సులను తాటిబద్దలు, వెదురుకర్ర, కొమ్ములతో చేసేవారు. వెదురుతో చేసినది శ్రేష్ఠం.

కౌటిల్యుడు మందుగుండు సామగ్రినికూడా తెలిపాడు. భగ్గునమండే కర్పూరం, గుగ్గిలం, బొగ్గులు, తుత్తినాగం మొదలైనవాటిని కలిపి గొట్టంలో పెట్టి తోసే ఆయుధాలను అగ్నిధారణం, క్షేప్యాగ్నియోగం, విశ్వాసహాతి అని మూడురకాలుగా తెలిపాడు. తుపాకి మందును అరబ్బులు భారతదేశంనుంచే నేర్చుకున్నారని సర్ ఎం. ఎం. ఇల్లియట్ అనే చరిత్రకారుడు చెప్పడం సబబే. నాశదీపిక అనే మరొక ఆయుధాన్ని కౌటిల్యుడు తెలిపాడు. ఇనుపపొడి మొదలయినవి కలిపి ముద్దలు చేసి కాల్చి గొట్టంద్వారా విసరడం అన్నమాట. అయినా, ఈ అగ్ని ఆయుధాలు భారతదేశంలో ఎందుకో అభివృద్ధి కాలేదు.

అముక్తకాలలో వజ్రం, ఇష (చేతికత్తి), పరశు, గోశిరస్సు (రెండు కొమ్ముల పరశువు) కుంతం, ప్రాసం, పినాకం, గద, ముద్గరం, శీరం, ముసలం, పట్టిసం (పదునైన బల్లెం) మౌష్టికం (పిడిబాకు) మయూఖం, శతఘ్ని మొదలయినవి ముఖ్యమైనవి.

కవచాలకు రకరకాల మృగాలతోళ్ళు ధరించేవారు. లోహకవచాలు ధరించేవారు. వీటిని గురించి ఇంతగా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, కాకతీయుల కాలానికి కూడా ఈ వ్యవస్థేమీ మారలేదని తెలుపడానికే. కాకతీయుల నాటి శిల్పాలనుబట్టి, సాహిత్యాన్నిబట్టి వారి యుద్ధతంత్ర వ్యూహరచన కొంచెంగా తెలియ వస్తున్నది.

## కాకతీయులు

కాకతీయులు క్రీస్తుశకం 1050 నుంచి 1350 దాక మూడువందల సంవత్సరాలు భారతభూమిలో పెద్ద భూభాగాన్ని పాలించారు. మొదటి ప్రోలరాజు, త్రిభువనమల్లబేతరాజు, రెండవ ప్రోలరాజు, రుద్రదేవుడు, మహాదేవరాజు, గణపతిదేవ మహారాజు, రుద్రాంబ, ప్రతాపరుద్రుడు — వరుసగా పాలించినారు. కడపటి ప్రతాపరుద్ర చక్రవర్తి మహావీరుడు. ఢిల్లీ సుల్తానులు ఎన్నో దండయాత్రలకు తట్టుకొన్నా, తుదకు 1323 లో ఘియాజుద్దీన్ తుగ్లక్ కుమారు

దయిన అల్లాఉద్దీన్ ఖానుకు బందీగా చిక్కినాడు. దానితో కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. అప్పటికి కాకతీయ సామ్రాజ్యం ఉత్తరాన కల్యాణకటకం నుండి దక్షిణాన కంచివరకు, తూర్పున సింహాచలం వరకు వ్యాపించి ఉండేది.

## గిరిదుర్గాలు

గిరిదుర్గం ప్రధానమని, శ్రేష్ఠమని నమ్మక మున్నందున కాకతీయులు గిరిదుర్గాలను నెలకొల్పి బలపరచినారు. వరంగల్లు, రాయచూరు, భువనగిరి, రాచకొండ, మొదలగు గిరిదుర్గాలు ఆకాలంవే. గణపతిదేవుడు ఓరుగల్లుకోటను నిర్మించగా, రుద్రమదేవి కోటగోడ లోపలిభాగాన మెట్లు కట్టించింది. దీనివల్ల శత్రువులు దుర్గం ముట్టడించినప్పుడు లోపలివారు సులభంగా కోటపైకి ఎక్కి శత్రువులపై ఆయుధాలు ప్రయోగించడానికి వీలయ్యేది, ఈ రాతి కోటకు వెలుపల అగడ్త తవ్వించి, దానికి వెలుపల మట్టికోట కట్టించింది. పుట్టకోటకు, రాతికోటకు నాలుగు గవనులు, ఎనిమిది దిడ్లు పెట్టించింది. కోట రక్షణకు కోట కొమ్ముకు ఇద్దరు, బురుజుకు యాభైమంది, గవనికి ఐదువందలమంది, దిడ్డికి నూరుగురు రక్షకభటులు ఏర్పాటు చేసింది. ఈ మట్టి కోట బల్లేలతో పొడిచినా పెగిలేది కాదు, ఫిరంగి గుండ్లకూ పెచ్చులు రాలేది కాదు.

కాకతీయులకు చతురంగ సైన్యం సమృద్ధిగా ఉండేది. చతురంగ సైన్యంలో ధనుర్ధారులు హెచ్చు. 'నవలక్ష ధనుర్ధరాధినాథే పృథివీం శాసతి వీరరుద్రదేవే.' అని విద్యానాథుడు అనే కవి వర్ణించినాడు. ఈ నవలక్ష సైన్యం సామంతులవద్ద, సరిహద్దులను కాపాడే సేనాపతి నాయంకులవద్ద ఉండేది; అవసరమైనప్పుడు సమరానికి సిద్ధమయ్యేది, రణభండాగారికుడు, యుద్ధ మంత్రాంగ మండలివారు ఉండేవారు. రణనీతి, రాజనీతి ఎరిగిన సంధి విగ్రహికులు ఉండేవారు. గజసాహిణి, అశ్వసాహిణి మొదలయిన సేనా నాయకులు ఉండేవారు. నగర పాలకుడుగా నీతియుగంధరుడనే బిరుదుపొందిన నాగయగన్న మంత్రి నియమితుడయాడు.

ఆయుధాలు లోగడ చెప్పినట్లు తోమర, కౌక్షేయక, ముసుండ, కార్ముక, గదా, కుంత, పట్టి సాదులని విద్యానాథుడు తెలిపాడు.

> విను మినుమును, రాగి యిత్తడి కంచు
> పెట్టిచేసినయట్టి బిరుదులు గలవు
> కుంతములును గండ్ర గొడ్డళ్ళు గదలు
> ముసల ముద్గరములు మొసలకటార్లు

చక్రతోమరములు ఖడ్గ సంఘంబు
ఛురికలు బాణముల్ శూలచయము........

మొదలయిన శస్త్రాస్త్రాలు ధరించేవారని పల్నాటి వీరచరిత్ర తెలుపు తున్నది. ఈ ఆయుధాలు అప్పటి శిల్పాలలో కనిపిస్తాయి.

ముట్టడికి బయలుదేరడం పెద్ద కోలాహలం.
బృంహమాణగజాకీర్ణా హ్రేషమాణ హయాకులా,
సంక్రీడత్స్యందనా క్ష్వేళభటా రుద్రవినిర్గమాః.

ఏనుగులు ఘీంకరిస్తుండగా, గుర్రాలు సకిలిస్తుండగా, రథాలు ఆడుతున్నట్టుగా సాగిపోతుండగా, భటులు – పదాతి సైన్యం – కేకలు వేస్తుండగా దండయాత్ర జరిగేది. అని విద్యానాథుడు ప్రతాపరుద్రుని సైన్యస్థితిని వర్ణించాడు. ఘీంకారాలనే ఉరుములతో, ఏనుగులనే కారుమేఘాలు శత్రు రాజుల భార్యల బాష్ప వర్షాలకు కారణమయాయని విద్యానాథుడు చెప్పడంవల్ల ప్రతాపరుద్రుని సైన్యంలో ఏనుగుల సంఖ్యకూడా హెచ్చే.

ఉద్యద్బృంహిత గర్జితైః ద్విపఘటా కాదంబినీ డంబరైః
క్షోణీభృత్కటకోపరోధపటుభిః సద్యః స్ఫురద్దిక్తటాః,
ప్రావృట్ సంభ్రమశంసినో రిపువధూ బాష్పోద్భవం దుర్దినం
కుర్వంత శ్చలమర్తి గండనృపతేః జైత్రప్రయాణోద్యమాః.

ఈ ఏనుగు దండుతోనే నదులు దాటేవారు, బల్లకట్టుతోనూ నదులు దాటేవారు. సమర్థులయిన ఇంజనీర్లు బల్లకట్లను వరుసగా నిలిపి, సైన్యమంతా దాటించేవారు.

కోట దారిపొడుగునా అంచెలు అంచెలుగా భేరీ గృహాలో, చెట్లకు భేరీలు కట్టో ఉండేవి. శత్రువు ఆచూకీ తెలియగానే ఒక కొసనుండి ఈ నగారామోత వినిపించేది. ఈ మోత అంచెలు అంచెలుగా రాజధాని రక్షకులకు తెలిసేది. వారు అప్రమత్తులై ఉండేవారు. అప్పుడు కోటరక్షణకు తగిన ఏర్పాటు చేసి, ప్రతి వీరుడు వీరతాంబూలం స్వీకరించి, యుద్ధయాత్రకు బయలుదేరే వైనం నాచన సోముని హరివంశం నుంచి తెలుస్తున్నది:

కోటసింగారించి, కొత్తళంబుల నెల్ల
  నట్టళ్ళు పన్నించి, యాళువరుకి
పంపికప్పు పెట్టించి, పైకొమ్మ లెగయించి
  గండుమాలము పనికొయ్యగూర్చి

అగడిత లీతనీ రలవడ ద్రవ్వించి,
వెలిజుట్టును వెదురు వెలుగుబెట్టి
దంచనంబులు దద్దడంబులు నెత్తించి
వలుగాడి తలుపులు బలువు చేసి

కాళెములు పెట్టి కొంకులు బద్దపరులు
కత్తి గొంతంబు రొడిసెళ్ళు గర్తళములు
నారసములును విందులు నగరిలోన
బెట్టి పెట్టుడు నడు నెట్టి మట్టిలావు.

ఈ సైన్యం వెంట గొన్నెనలు, పటకుటీరాలు, బల్లాకి పెట్టెలు, మందాలు, తమ్మవడిగెలు, బొక్కసాలు, బోనకావళ్లు, పల్లకీలు మొదలయినవి తీసుకుని వెళ్ళేవారు.

పూర్వం సేనాధ్యక్షుడు, సాహిణులు, నాయకులు మొదలయిన క్రమ పద్ధతిలో సైన్యవ్యవస్థ ఉన్నా సైనికులలో క్రమశిక్షణ అంత లేదేమోననిపిస్తుంది. కాకతీయులు గొప్ప సంఘసంస్కర్తలు గనుక తమ సైన్యంలో పద్దెనిమిది కులాలవారికీ పదవులు, కరణాలు, నాయకంరాలు ఇచ్చి, అసూయలు లేకుండా చేశారు.

సైనికులకు తగిన దుస్తులు ఉండేవని రాయచూరు కోటలోను, ఇతరత్ర గల శిల్పాలవల్ల తెలుస్తున్నది. రొమ్మునుంచి నడుమువరకు కవచం వంటిది, నేటి నిక్కరులాటి చల్లడం, నడుముకు కాసె, తలకు పాగా, లేక శిరస్త్రాణం— ఇవి పదాతి సైనికుని దుస్తులు.

కౌటిల్యుడు వ్యూహరచన ప్రకారాలు పెక్కు చెప్పాడు. గజానీక రథానీక మిశ్రానీకాలనేవి ఏనుగులు గుర్రాలు రథాలు విలుకాండ్రు మార్చి మార్చి నిలబెట్టడంతో ఏర్పడేవి. యుద్ధంలో, కోటముట్టడిలో సమయానుకూలంగా అపసరణం, వామనం, పర్యుపాసనం, అవమర్దనం వంటి జిత్తులు చూపేవారు. దండయాత్రలోను, ముట్టడిలోను దారి సన్ననిదైతే సూదిలాగా వరుసగా వెళ్ళడం - సూచీవ్యూహం, దారి వెడల్పయితే మొసలి నోరుతెరచినట్టు ఇరువైపుల వెళ్ళడం-మకరవ్యూహం, శత్రుసైన్యం చొరరాకుండా గరుడపక్షి రెక్కలు విదల్చుకొని ఎగిరినట్టు నాలుగు కొసలు దీరి నిలబడడం-గరుడ వ్యూహం మొదలయిన వ్యూహాలు పన్నేవారు.

యుద్ధంలో ఓడినా, ఓడించినా, మరొక సందర్భంలోను సంధులు జరిగేవి. ఇవి నాలుగురకాలు: మిత్రసంధి ఇది స్పష్టమైన సంధి. హిరణ్య

సంధి బంగారిచ్చి చేసుకొనే సంధి. భూమిసంధి భూభాగం అప్పగించడం. కర్మ సంధి సైన్యాన్ని, బొక్కసాన్ని ఉమ్మడిగా వాడుకునే సంధి. ఈ సంధులు శాశ్వతంగానూ, తాత్కాలికంగాను జరిగేవి. అనవస్థిత సంధి. కాలసంధి తాత్కాలికమైనవి; స్థావరసంధి స్థిరమైనది. ఈ సంధి చేసుకొన దానికి సూచకంగా యుద్ధసమయంలో కొమ్ము ఊదేవారు. దీనిని ధర్మధార అనేవారు.

## ఫిరంగి ప్రయోగం

కోట ముట్టడించినప్పుడు బురుజులపైనుండి నిప్పులో కరిగిన వేడి ద్రవం పోయడం, రాళ్ళు ఒడిసెలతో రువ్వడం, గుండ్లు దొర్లించడం మొదలయిన పనులు జరిగేవి. మహమ్మదీయులు వరంగల్లును ముట్టడించినప్పుడు ఉభయ పక్షాలు తుపాకులను ప్రయోగించినట్టు చరిత్ర నిదర్శనాలున్నాయి. తుపాకి మందుతో ఫిరంగుల ప్రయోగం తొలిసారిగా భారతదేశంలో వరంగల్లుపైననే జరిగింది.

కాకతీయులకు తూర్పుతీరాన గొప్ప ఓడరేవులుండేవి. వాటిలో మోటుపల్లి ఒకటి. గణపతిదేవుడు ఓడదొంగలనుంచి దేశీ విదేశీ బేహారులను రక్షించడానికి ఎన్నో కట్టుబాట్లు చేశాడు.

ఇంత సైన్యం, ఇంత బలమైన కోటలు, ఇంత పరాక్రమం ఉన్నా కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమైనదంటే ప్రధాన కారణాలు కాలానుగుణమైన యుద్ధపరికరాలు, యుద్ధనీతి లేకపోవడం, ధర్మయుద్ధమనే పిచ్చితో కూటనీతిని గ్రహించకపోవడమూను. మనకు రాజు ముఖ్యం. రాజుపైనే అంతా ఆధారపడి ఉండేది. దేశం మొదలయినవి ముఖ్యం కాదు. నాయకుడో, సేనాపతో, రాజో మరణిస్తే చెల్లాచెదరయ్యేది సైన్యం. రాజు పడిపోతే రాజ్యం పతనమైనట్లే. ముస్లిముల పద్ధతి అది కాదు. వారికి మనకన్నా క్రమశిక్షణ, సామూహిక పద్ధతి, కూటనీతి హెచ్చు. వారు ఒకరకం ఒంటి గుర్రంబండ్లు సిద్ధపరచి, దాని చక్రాలకు కత్తులు వరుసగా బిగించి, పదాతిబలాల లోపలికి విసురుగా తోలేవారు. ఆ బండ్లు అడ్డంగా కొన్ని వందలమందిని నరుక్కుంటూ చొచ్చుకొనిపోయేవి. ఈ రథాలు మన రథాలుకన్నా గొప్ప విజయం చేకూర్చేవి. సామంత పద్ధతి, నాయంకరం కూడా కేంద్ర ప్రభుత్వానికి ముప్పు తెచ్చేవి.

[వాణి, 7-3-1964]

★★

# మన పొరుగువారైన తమిళుల సంస్కృతి

[తమిళులకు, మనకూ కూడా మొదటి వారయిన ద్రావిడులు ఇప్పుడు మద్రాసు రాష్ట్రమనబడే ప్రాంతంలో మొదటి నుంచీ వున్నవారేనా? ఈ ప్రశ్నకు సమాధానంగా, ద్రావిడులు గుంపులు గుంపులుగా పశ్చిమాసియా ప్రాంతం నుంచో, తూర్పు మధ్యధరా ప్రాంతంనుంచో సహస్రాబ్దాల క్రితం సముద్ర మార్గంగా దక్షిణభారతానికి వలసవచ్చి వుంటారని తమిళ చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు ]

భారతదేశం ఒక నవరత్నమాల. నవరత్నాల రూపురేఖలు, కాంతి వీచికలు పైకి వేరువేరుగా కానవచ్చినా వాటినొక కానరాని బంగారుతీగ ఒక్కటిగా కలిపి, వాటి కాంతిపుంజాలను మంజులతమం చేస్తున్నది. భారత దేశం ఒక వివిధానేక పుష్పదామం. పుష్పాల ఆకార విశేషాలు, సౌరభ వైభవాలు వేరు వేరయినా వాటిని అపూర్వాదృశ్య సూత్రమొక్కటి గుదిగుచ్చి, వాటి పరిమళ ప్రాభవాన్ని దిగంతాలకు వ్యాపింపజేస్తున్నది. అయినా, ఈ నవరత్నమాలలోని రత్నాల రామణీయకాన్ని, ఈ పుష్పదామంలోని పుష్పాల కమనీయతను విడివిడిగా తెలుసుకొని ఆస్వాదించడం మన మనస్సును మరింత వికసింపజేసి, అనితర సులభమయిన ఆనందం కలుకజేస్తుంది: ఏకతాభావనను పటుతరం చేస్తుంది.

ఈ నవరత్నమాలలో మనకు సన్నిహితమైంది తమిళగ మనే ఇంద్ర నీలం. తమిళులు, మనము, కన్నడులు, కేరళులు, మరికొందరు ఒక చెట్టులోని పెక్కు కొమ్మలు. ఒక పుట్టనుంచి వెలువడిన పెక్కు గుంపులు. మనం సహస్రాబ్దాల క్రితం మొదలునుంచి విడిపోయాము; ఇతర సంస్కృతులను అంట్లు కట్టుకున్నాము; అంటుమామిళ్ళలాగ కొత్త పసిమి, మిసిమి సంపాదించు కొన్నాము. తమిళులు పెక్కు కారణాలవల్ల మొదలులోని గుణగణాలను కోల్పోక ఇతర సంస్కృతుల తాకిడికి తట్టుకొని, వాటిలోని మేలిమిని జీర్ణం చేసుకొని నిత్యనూతనంగా వికసిస్తూ వైయక్తికతను నిలబెట్టుకున్నారు.

మనం ఎప్పుడో మొదలునుంచి చీలిపోయినా చరిత్ర తెలిసినప్పటినుంచి రాజకీయంగాను, సాంఘికగాను మనకు తమిళులతో సంబంధాలు వుంటూనే

వున్నాయి. ఈ సంబంధాలు తమిళ సాహిత్యంలో అతిప్రాచీనమైన సంగం కాలంనుంచి ప్రారంభమై పల్లవులతోను, చోళులతోను బలపడి, విజయనగర సార్వభౌములతో విస్తరించాయి కనుక మనం తమిళ సంస్కృతిని రేఖా మాత్రంగా తెలుసుకొందాం.

సంస్కృతిని నిర్వచించడం చాలకష్టం. అందువల్ల ఒకవర్గం బాహ్య స్వరూప చేష్టలు, ఆభ్యంతరస్వభావాభిరుచులు, రాజకీయ సాంఘిక వ్యవస్థలు, సాహిత్యరీతులు, లలితకళావికసనాలు, ఆధ్యాత్మిక భావనాచింతనలు, మత సంప్రదాయాచారాలు ఇత్యాద్యనేకవిషయాల సుందరసమామ్నాయం సంస్కృతి అనుకుందాము. ఇలాటి సంస్కృతి సహస్రాబ్దాలు గడిస్తేగాని రూపుదిద్దుకోదు. ఈ దృష్టితో తమిళ సంస్కృతిని చూద్దాము.

ఈ తమిళులు ఎవరు? వీరికీ, మనకూ కూడా మొదటివారయిన ద్రావిడులు ఇప్పుడు మద్రాసు రాష్ట్రమనబడే ప్రాంతంలో మొదటినుంచీ వున్నవారేనా? ఈ ప్రశ్నకు సమాధానంగా ద్రావిడులు గుంపులు గుంపులుగా పశ్చిమాసియా ప్రాంతంనుంచో తూర్పు మధ్యధరాప్రాంతంనుంచో సహస్రాబ్దాల క్రితం సముద్రమార్గంగా దక్షిణభారతానికి వలసివచ్చి వుంటారని తమిళ చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. మౌర్యుల కాలానికి ముందుగానే తమిళప్రాంతంలో చేర చోళ పాండ్య రాజ్యాలనబడే మూడురాజ్యాలు ఏర్పడినట్టూ చరిత్ర తెలుపుతున్నది. ఈ రాజ్యాలకు అప్పటి ప్రాక్ పశ్చిమదేశాలతో నౌకావ్యాపారం కొనసాగేది. క్రీస్తుకు మూడు శతాబ్దాలకు ముందు నుంచి క్రీస్తుశకం నాల్గవ శతాబ్దం వరకు వున్న రాజకీయ సాంఘిక పరిస్థితులను సంగం సాహిత్యము తెలుపుతున్నది.

ఈ సంగం కాలాన్ని జ్ఞాతాజ్ఞాతకవుల కవితల సంకలన కాలమని అన వచ్చు. నిజానికి ప్రతి సాహిత్యంలోను ప్రాచీనతమకాలం సంకలనకాలమే దీనికి వేద, గాథాసప్తశతీ, బౌద్ధ పిటికాలు వంటి వాటిని ఉదాహరణలుగా చూపవచ్చు.

సంగం అంటే పండితమండలి. ఇలాటిసంగం తమ కాలంలో మధురలో వున్నట్టు రెండువేల సంవత్సరాలకు పూర్వం మనదేశానికి వచ్చిన మెగస్థనీస్, టాలమీ వంటి విదేశీయులు తెలిపారు. ఈ సంగం కాలంలో వైదిక సంప్ర దాయంతోపాటు జైన బౌద్ధ సంప్రదాయాల ప్రాభవం, ఆర్య ద్రావిడ సంస్కృ తుల సమ్మేళనానికి ప్రయత్నం కనిపిస్తాయి.

ఈ సంగం సాహిత్యంలో ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు అనేవి రెండు ప్రధాన

వర్గాలు. ఎట్టుత్తొగై అంటే ఎనిమిది సంకలనాలు; పత్తుప్పాట్టు అంటే పది పాటల సంకలనాలు. ప్రతి కవితాసంకలనం చివర సంకలనకర్త పేరు, కాలం పరిస్థితి మొదలయిన వాటి ప్రస్తావన ఉంటుంది.

ఈ సంగం సాహిత్యంలో ప్రధానంగా రెండు విభాగాలు: ఒకటి అగం- ఆత్మాశ్రయ కవిత; రెండవది పురం - అన్యాశ్రయ కవిత. ఎట్టుత్తొగైలో మొదటిది నిట్రిణై ప్రకృతి వర్ణనాత్మకం. రెండవది కురందొగై. మూడవది ఐంగురనూరు. నాల్గవది పదిట్టుపాట్టు. ఐదవది పరిపాడల్. ఆరవది కలిత్తొగై, ఏడవది అగనానూరు. ఎనిమిదవది పురనానూరు. ఈ అన్నీ చాలవరకు అప్పటి రాజుల, సామంతుల యుద్ధాలను, ఇతర రాజకీయ సంప్రదాయాలను, విదేశాలతో వ్యాపార సాహారాలను, విష్ణు స్కందాది దేవతా విశ్వాసాలను తెలుపు తున్నాయి. పత్తుప్పాట్టులో పది పెద్ద కవితలున్నాయి.

ఇప్పటివరకు లభించిన సంగం సాహిత్యం మొత్తం దాదాపు 30 వేల పాదాలున్న 2300 కవితలు. సంగం సాహిత్యంలో వైదికసంస్కృతి సాహిత్యాల భావాలు ఆదర్శాల ప్రభావం కనిపిస్తున్నా, సంస్కృత పదజాలం చాల తక్కువ. ఈ కవితలు రాజప్రాసాదాన్ని, బ్రాహ్మణగృహాన్ని, సెంబడివాని గుడిసెను, యుద్ధాలను, శృంగారాన్ని, దేన్ని వర్ణించినా, సమానోత్సాహంతో, శ్రోతల హృదయాలలో సరాసరిగా ప్రవేశించేటట్టు వుంటాయి.

తమిళులలో తొలి వ్యాకరణమైన తొల్‌కాప్పియం ఈ సంగం చివరి దశలోనిదని, శిలప్పదిగారం, మణిమేగలై అనే మహాకావ్యాలు సంగం అనంతర కాలమువని పండితుల నిర్ణయం.

సంగంకాలం తర్వాత, మధ్యకాలం తర్వాత, తమిళ సాహిత్యాన్ని ముంచెత్తినవి శైవవైష్ణవ భక్తిప్రవాహాలు. శైవభక్తులు నాయనార్లని, వైష్ణవ భక్తులు ఆళ్వార్లని ప్రసిద్ధిపొందారు. ఈ నాయనార్లు జైనుల త్రిషష్టి శలాకా పురుషులలాగ అరవత్తుమూవరు - అరవైముగ్గురు. వీరిలో ముగ్గురు అప్పర్, జ్ఞానసంబందర్, సుందరమూర్తి చాల ప్రముఖులు. వీరు తమ స్తోత్రాలలో శ్రీశైలం, కాళహస్తివంటి తెలుగు క్షేత్రాలనూ ప్రస్తావించారు. వీరి భక్తి స్తోత్రాలు తేవారం అని పేరు పొందాయి. వైష్ణవుల ఆళ్వార్లు పదిమంది, ఆండాళ్, మధురకవి అనేవారు కలిసి పన్నిద్దరు. వీరి స్తోత్రాలు దివ్యప్రబంధం అని పేరు పొందాయి.

తమిళ దేశంలో శివకేశవారాధనలు అంతకుముందునుంచే వున్నా, శైవ వైష్ణవ భక్తులతో, ఆచార్యులతో ప్రపత్తి - శరణాగతి అనే నూతన సంప్ర

ణాయం ఏర్పడింది. వైదికమైన, ఔపనిషదమైన ఆధ్యాత్మిక భావనను ఈ ప్రవృత్తితో సమన్వయించడంతో దేశమంతా వైష్ణవ ప్రపత్తి సంప్రదాయం వైదికభావనకు నూతనార్థం కల్పించి వ్యాప్తి చెందింది. ఈ సమన్వయ ప్రవర్తకులు రామానుజాచార్యులు.

తమిళ కావ్య సాహిత్యం సౌందర్య పరాకాష్ఠను అందుకున్నది చోళుల కాలంలోనని అంటారు. ఈ కాలంలో జీవక చింతామణి, కంబ రామాయణం మొదలయిన మహాకావ్యాలు వెలువడ్డాయి. విజయనగర కాలంలో విదేశ మతాన్ని ఎదుర్కొనడం ప్రధానం కావడంవల్ల వర్ణాశ్రమ ధర్మానికి ప్రాధాన్యం కలిగింది. దానితో మత ప్రచారకులు, వక్తలు, ఆచార్యులు పిళ్ళె లోకాచార్యులు, వేదాంత దేశికులు వంటివారు అవతరించారు. నాయకరాజుల తర్వాత క్రైస్తవ మత ప్రభావంతో వచన రచన వికసించింది.

లలిత కళారంగంలో తమిళులకు గొప్పచరిత్ర వుంది. క్రీస్తు పూర్వం బ్రాహ్మిలిపిలో తమిళ శాసనాలున్నాయి సంగసాహిత్యంతో గొప్ప ప్రాసాదాల, నాట్యసంగీతాల ప్రస్తావన వుంది. కాని అవన్నీ ఎలా రూపుమాసిపోయాయో తెలియదు. అయితే, మనకు 7వ శతాబ్దంనుంచి పల్లవుల వాస్తునిర్మాణాలు కనిపిస్తున్నాయి; మహాబలిపురంలోను, కంచి మొదలయినచోట్లా. ఇవి చాలవరకు కొండలను, కొండలవంటి పెద్ద గుండ్లను తొలిచి నిర్మించిన ఆలయాలు. పనమలై మొదలయినచోట్ల, చిత్తణ్ణవాసల్‌లోను పల్లవుల చిత్రాలు ఉన్నాయి. ఈ పనమలై దేవాలయంలో అపూర్వ సుందర పార్వతీ విగ్రహాన్ని తొలిసారిగా కనుగొని, నకలుచేసే శాశ్వతకీర్తి ఒక తరంకింద శ్రీ కోడూరి రామమూర్తి అనే తెలుగు చిత్రకారునికి లభించింది.

చోళుల కాలంలో విగ్రహాలపోత కూడా మహోన్నతస్థితిని అందుకొంది. నటరాజ విగ్రహం దీనికి తార్కాణగా చెప్పవచ్చు. పల్లవుల తర్వాత చోళుల కాలంలో, ముఖ్యంగా రాజ రాజ, రాజేంద్రచోళుల కాలంలో దేవాలయమొక వ్యవస్థగా స్థిరపడింది. దేవాలయమంటే, సకల విద్యలకు కూడలి, విశ్వవిద్యాలయంవంటిది. వేదశాస్త్ర పురాణాది వ్యాసంగం, శిల్పవాస్తు శిక్షణ, నాట్య సంగీతాభ్యాసం - వీటన్నిటికీ అది ఆటపట్టు.

విజయనగర సార్వభౌములు ఈ దేవాలయాలను సంస్కృతికి కోటలుగా తీర్చారు- గొప్ప గోపురాలతో, మహామండపాలతో ఉన్నత ప్రాకారాలతో అవి మహానగరాలవలె విరాజిల్లాయి. నాయక రాజులు ఈ సంప్రదాయాన్ని కాపాడి అభివృద్ధి పొందించారు. మధురలోని తిరుమలనాయకుని మండపం దీనికి తార్కాణం.

సంగీతం గురించి చెప్పనక్కరలేదు. సంగం అనంతర సాహిత్యంలోని ప్రముఖ కావ్యమైన శిల్పప్పదికారంలో వివిధ సంగీత నృత్యనాట్యాలు, జానపద రీతులు తెలుపబడ్డాయి. పల్లవరాజు ప్రథమ మహేంద్రవర్మ కాలంలో రుద్రాచార్యుడనే గొప్ప నాట్యవేత్త వున్నట్టు పుదుక్కోట శాసనం తెలుపుతున్నది. గోపాలనాయకుడనే సంగీత విద్వాంసుడు అమీర్‌ఖుస్రో ఆహ్వానంపై ఉత్తర భారతావనికి వెళ్ళినట్టు చరిత్ర చెబుతున్నది. నాయక రాజులకాలంలో రఘునాథనాయకులు, వేంకటమఖి, త్యాగరాజులవారు వంటివారు అవతరించి దాక్షిణాత్య సంగీతాన్ని తారాపథానికి తీసుకొని వెళ్ళడం అందరికీ తెలిసిందే.

వీటన్నిటినీ సింహావలోకనం చేసినప్పుడు మనకు కలిగే అభిప్రాయం ఏమిటి?

ప్రతి యుగంలోను, ప్రతి దశలోను తమిళులు తమ విశిష్టతతోపాటు యావద్భారతదృష్టితో సంస్కృతి సమన్వయానికి ప్రయత్నించారని స్పష్టమవుతున్నది. తిరువళ్ళువర్ చెప్పిన యాదుం ఊరే, యావరుం కెళిర్ - దేశమంతా నా ఊరే, అందరూ నా ఆత్మీయులే అనే విశ్వజనీనసూక్తిని తమిళులు ఎప్పుడూ మననం చేసుకుంటున్నట్టే తోస్తుంది.

అందువల్లనే భారతదేశం నవరత్నమాల అని, వివిధానేక పుష్పదామమని అన్నాను.

[కృష్ణా పత్రిక, 14-12-1968]

★★

# కళాబోధనలో మ్యూజియంల పాత్ర

నేను పెరిగింది హంపీ పరిసరాలలోని కమలాపురంలో. విజయనగర చక్రవర్తులు తమ రాణుల అలంకరణకోసం, దేవతల పూజలకోసం కమలాలు పూయించేవారట మా ఊరి చెరువులో; కనుకనే మా ఊరికి కమలాపురమనే పేరు వచ్చిందట. మా ఊరు పొలిమేర దాటగానే మాకు నిత్యం కనిపించే దృశ్యాలు నర్తకీమణుల వివిధ భంగిమలు చెక్కిన ద్వార తోరణాలు, వేలాది సైనికులు కదంతొక్కుతూ యుద్ధానికి వెళ్ళుతున్నట్టు చెక్కిన శిలాఫలకాలు వాటి శిల్ప సౌందర్యం కాని, కళారహస్యంగాని తెలియకపోయినా వాటి ఎదుట నిలబడి చూస్తుంటే, ఏదో అనిర్వచనీయానందం మనస్సును ముంచెత్తేది.

అక్కడి ద్వారతోరణాలు, శిథిల దేవాలయ గోపురాలు, భిన్నరూపాలయిన మూర్తులు, వీరగల్లులు, రాణుల స్నానాగారాలు, గజాశ్వశాలలు — ఒక్కటేమిటి నాకు ఎన్నో విషయాలు చెబుదామని వేచి ఉన్నాయా అనిపించేది. ఉద్దాన వీరభద్రప్ప – ఆకాశమంత పొడువెదిగిన వీరభద్రమూర్తి – విజయనగర రాజులు, ప్రజలు, వారి కళల ఔన్నత్యాన్ని తెలుపడంకోసమే అంత ఎత్తున ఎదిగి, నిలబడి ఉన్నాడా అనిపిస్తుందేది నాకు. ఆకాశమంటే విరూపాక్షస్వామి దేవాలయ గోపురం, తుంగభద్రగట్టున చక్రతీర్థ సమీపాన ఏకాండంగా వున్న బృహచ్ఛిలాఫలకంపై కిష్కింధావాసులను అనుగ్రహించడానికా అన్నట్టు నిలబడిన రామసీతా లక్ష్మణాంజనేయుల సుందరమహోన్నత విగ్రహాలు మాత్రం నాలో భక్త్యావేశాన్ని కలిగించేవి. ఇది చిన్ననాటి స్థితి.

కౌమారదశలో మద్రాసులో మ్యూజియం చూడడం సంభవించింది అదృష్టవశాత్తు. అక్కడి అమరావతీ గ్యాలరీలో సిద్ధార్థుని మందహాస సుందరమైన ముఖం, మెడవరకు విరిగిన విగ్రహం ఉంది. దానిముందు గంటల తరబడి నిలబడినాను. సిద్ధార్థుని ఆవేదనను, వైరాగ్యాన్ని ఆ మందహాసంలో చూడగలిగాను. పక్కనే మహాప్రస్థానం దృశ్యం; పరిజనం నిద్రిస్తున్నారు, ప్రక్కనే యశోధర నిశ్చింతగా శయ్యపై పడి ఉన్నది, వల్లెవాటు సవరించుకొని అంతఃపురం వదలిపోతున్న సిద్ధార్థుడు, మరి కొంతదూరంలో తపస్సుతో చిక్కి శల్యమై, పేగులు, పక్క ఎముకలు కనిపించే విధంగా ఎముకల గూడైన

సిద్ధార్థుడు, బుద్ధుడైన సిద్ధార్థునికి పరమాన్నం నివేదిస్తున్న సుజాత, మృగ దావంలో తొలి సందేశం, సత్యం ప్రవచిస్తున్న బుద్ధుడు, భిక్షకై శుద్ధోధనుని కడకు వస్తున్న తథాగతుడు- ఇలా ఎన్నో దృశ్యాలు.

చరిత్ర జ్ఞానం ఎంతో కొంత కలిగింది గనుక ఈ విషయాలు తెలుసు కోగలిగాను. ఆ మాత్రం చరిత్ర జ్ఞానమున్న ఎవరైనా ఈ సంగతులు గ్రహి స్తారు.

ఈ జ్ఞాన సముపార్జనకు మూలమేమిటి? కళాకారుని కౌశలం. ఒక ప్రాంతంలోని మారుమూల కళాఖండమే ప్రేక్షకునికి ఎంతో ఆనందం కలిగించి నప్పుడు, కళా భాండారం, కళాదేవత నర్తనశాల అయిన మ్యూజియంను గురించి చెప్పనక్కరలేదు.

మ్యూజియం అంటే. మనకు ఏదో చచ్చిన జంతువులు, పాత తుక్కు పట్టిన వస్తువులు నిలవచేసే శాల అనే అపోహ ఎందుకో! మద్రాసుకు వెళ్ళే తెలుగు వారంతా పూర్వం మ్యూజియంను చచ్చిన కాలేజీ అని, జూయ లాజికల్ పార్కును బ్రతికిన కాలేజీ అని వ్యవహరించడం ఈ దష్టితోనే. మ్యూజియంలో బ్రతికినవేవీ ఉండక పోవడం కూడా ఈ భావాన్ని బలపరచి ఉంటుంది.

మ్యూజియంలో తిరుగుతున్నంతసేపు, పూర్వజన్మలు జ్ఞాపకం వచ్చినట్టు, పాత వారితో ముచ్చటిస్తున్నట్టు, పాత యుద్ధాలు, వైభవాలు, పతనాభ్యుత్థా నాలు తిలకిస్తున్నట్టు, ఎవరెవరో వీరులు, తమ త్యాగాన్ని, పరాక్రమాన్ని చూపడానికి మన ముందు వేచి ఉన్నట్టు, ఏవేవో వర్ణ చిత్రాలు పాతకాలపు మన వైభవాన్ని విలాసాన్ని వినోదాన్ని చూపుతున్నట్టు, ఏ రాణి వాసపు వాస నలో గుబాళిస్తున్నట్టు, శాసనాలు మన పురాచరిత్రను వేనోళ్ళ చాటుతున్నట్టు తోస్తుంది. ఇంత సజీవమైన మ్యూజియం చచ్చిన కాలేజీ ఎలా? నిజానికి....

మ్యూజియం అనే పదం గ్రీక్ భాష నుంచి ఉత్పన్నమయినదని, మ్యూజ్ అంటే కళా స్థానదేవత, అలాటి దేవతల అధిష్ఠానం, పీఠం మ్యూజియ మని మ్యూజియాలజీ నిపుణులయినవారికి ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ఒక విధంగా ఈ మ్యూజియంలో మన దేవాలయాలలాగ ఒకప్పుడు సకల కళలకు అధిష్ఠానాలుగా ఉండేవని మనం భావించవచ్చు. మనకు గురుకులాలు, దేవకులాలు ఉన్నాయి. ఒక విద్యార్థి తనకు కావలసిన చదువులన్నిటినీ ఆ గురుకులంలో చదువవచ్చు. గురుకులమంటే, గురువుల సమూహం. ఒక్కొక్క గురువు ఒక్కొక్క విద్యలో ఆరితేరినవాడయి ఉండేవాడు. అట్లే దేవకులం

కూడ దేవతల సమూహం. ఎవరికి ఇష్టమైన దేవతను వారు కొలవవచ్చు. ఇలాటిదే మ్యూజియం.

ఈ విధంగా వివిధ విద్యలకు, కళలకు అధిష్ఠానమైన మ్యూజియంలు, ఈజిప్టు పరిపాలకులైన టాలమీల కాలంలో కేవలం విచిత్ర వస్తు సంగ్రహాల యాలు కావడం, వారి వస్తు సంగ్రహణేచ్ఛ వల్లనే. దానినుంచే అజాయబ్ ఘర్ అనే హిందీలో వ్యవహారం ఏర్పడింది.

మనదేశంలో దేవకులాలు కాక, ప్రాచీన వస్తువుల సంగ్రహాలయాలు ఉన్నట్టు మనకు భాసుని ప్రతిమానాటకం సాక్ష్యమిస్తున్నది. ప్రాచీన కాలంలో పాశ్చాత్య రాజులు, రాజన్యులు చేస్తున్నట్టే మనరాజులు, రాజన్యులుకూడ తమ వినోదంకోసం వివిధ శాలలు నిర్మించుకొనినట్టు మహాభారత, హరివంశాలలో చిత్రశాలల, ఆయుధ శాలల, అలంకరణ శాలల, సంగీత శాలల ప్రస్తావన లున్నాయి. కాని ఇవన్నీ ప్రజాసామాన్యం ఎప్పుడుబడితే అప్పుడు చూడడానికి వీలులేదు. వారే తమ పట్టాభిషేక దినోత్సవంలోనో, వివాహాది శుభసమయాల లోనో జనానికి అంటే తమ ఆప్తులకు — తమ వైభవ స్ఫోరకంగా చూపించే వారు. అవి వారి సౌందర్య దృష్టికి, వైభవ ప్రాభవాలకు దృష్టాంతాలుగా ఉండేవి. ఆ వస్తువుల సేకరణకూడ ఏ నిర్దిష్ట దృష్టితోగాని, పద్ధతితోగాని జరిగేది కాదు.

కనుక నేటి మన మ్యూజియాల చరిత్ర — పబ్లిక్ మ్యూజియంల చరిత్ర- 18 వ శతాబ్ది మధ్య అంటే 200 ఏళ్ళ నాడు ప్రారంభమైంది. ఈ దశలోనే లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియం 1753 లోను, ఫ్రాన్స్‌లోని లూవర్ మ్యూజి యంవంటి ఎన్నో మ్యూజియంలు ఏర్పడ్డాయి.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం యూరపులోను, అమెరికాలోను, ఇతర దేశాలలోను మ్యూజియంల చరిత్రలో నూతనయుగం ప్రారంభమైంది. కొత్త మ్యూజియంలు ఎన్నో బయలుదేరాయి. పాత మ్యూజియంల పునర్నిర్మాణం జరిగింది. ఆరుబయలు మ్యూజియంలు నెలకొన్నవి— స్కాండి నేవియన్ దేశాలలో. ఇలాటివి క్రమంగా ఇతర యూరోపియన్ దేశాలలోను వ్యాపించాయి.

మనదేశంలో ఒక విధమైన మొదటి పబ్లిక్ మ్యూజియం బెంగాల్ ఏషియాటిక్ సొసైటీవారిది. ఇది మార్గదర్శకంగా మద్రాసు లిటరరీ సొసైటీ 1851 లో ఒక మ్యూజియం స్థాపించింది. 1894 లో బెజవాడలో ఏర్పడింది. సాలార్‌జంగ్ మ్యూజియం గురించి నేను చెప్పనక్కరలేదు.

ఇరవైయవ శతాబ్దంలో ప్రబోధ యుగం ప్రారంభమై పురాతత్త్వశాఖ స్థాపన అయిన ప్రారంభంలో పురాతత్త్వశాఖ వారు వివిధ ప్రాచీన చారిత్రక స్థలాలలో మ్యూజియంలు నెలకొల్పడం, స్వాతంత్ర్యానంతరం జాతీయ మ్యూజియం నిర్మాణ ప్రణాళిక ఏర్పడడం, 1949 ఆగస్టులో రాష్ట్రపతి భవనంలో జాతీయ మ్యూజియం బీజప్రాయంగా ప్రారంభం కావడం, కలకత్తా ఇండియన్ మ్యూజియం, సాలార్‌జంగ్ మ్యూజియం జాతీయ మ్యూజియంలుగా శాసనంద్వారా ప్రకటించడం మ్యూజియం చరిత్ర విశేషాలు.

ఈ మ్యూజియంలు విషయ భేదాన్నిబట్టి కళల మ్యూజియంలు, పురావస్తు మ్యూజియంలు, ప్రకృతి మ్యూజియంలు, చరిత్ర మ్యూజియంలు. జానపద మ్యూజియంలు — అని వివిధవిధాలుగా ఏర్పాటు చేయవచ్చు; ఏర్పాటయీ ఉన్నాయి.

నన్నయ "నుతజల పూరితంబులగు నూతులు నూరిటికంటె" ఒక నడబావి మేలని, అలాంటి నడబావులు నూరిటికంటె ఒక్క క్రతువు గొప్పదని, అలాటి క్రతువులు నూరిటికంటె ఒక సుతుడు మేలని, అలాటి నూరుమంది సుతులకంటె ఒక సూనృత వాక్యము మేలు అని అన్నాడు. అలాగే నూరు మాటలకన్నా ఒక ప్రేక్షణకం గొప్పది. ప్రేక్షణకమంటే చూడదగినది-నాటకమైనా, నృత్యమైనా, శిల్పమైనా, చిత్రమైనా. చూచిన ఒక వస్తువు నూరుమాటలు చెప్పలేని దానిని చక్కగా చెబుతుంది. అందులోను జనసామాన్యానికి కళను బోధించడానికి ప్రేక్షణకంవంటి సాధనం మరొకటి లేదు. మ్యూజియం కూడ ప్రేక్షణకం వంటిదే, సామాన్య ప్రేక్షణకం కాదు; మహాప్రేక్షణకం.

కళా సంప్రదాయం తెలియడానికి మ్యూజియమంత మహత్తర స్థానం మరొకటి లేదు. ఆయా చరిత్ర స్థలాల ప్రాంతాలలో మనం ఒక కళాస్వరూపమే చూడగలం. మ్యూజియంలో వివిధ కళావస్తువులు సంగ్రహించబడి ఉంటాయి గనుక వాటిని చరిత్రగతిలో ఆనుపూర్విగా తెలుసుకోవచ్చు.

మనకు స్పష్టంగా తెలిసిన కళ బౌద్ధకాలపు కళ. భారత రామాయణాలలోను, గాథాసప్తశతివంటి అతి ప్రాచీన కవితలలోను చిత్ర శిల్ప విషయాలు మొదలైనవాటి ప్రస్తావన ఉన్నా, వాటి కళా సంప్రదాయమేమిటో తెలియదు కాని, అప్పటికే బౌద్ధ వైదిక కళల సమ్మేళనం జరిగింది గనుక, అది అప్పటమైన భారతీయ సంప్రదాయ కళ అని అంటాను.

ఈ సంప్రదాయంలో జీరాడే వల్లెవాటులోని రేఖలు, చక్కని చిబుకాలు, ఎత్తికట్టిన కేశపాశ పద్ధతులు, బెదరిచూచే మృగ సముదాయం భంగిమలు,

అంతఃపుర కాంతల హొయలు. ఇవన్ని ప్రజలకు అప్పటి భారతీయ కళా సంప్రదాయాన్ని ఎంతో చక్కగా బోధిస్తాయి.

అజంతా కళా సంప్రదాయం ఆగ్నేయాసియాకే ఒరవడి పెట్టింది. శ్రీలంకలోని సిగిరియా ఆ సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకొంది. అజంతా చిత్రాలలోని చీరకట్టు సింగారాలు, కేశాలంకరణలు, ప్రసాధన విధానాలు జనానికి కళామయ జీవితాన్ని బోధిస్తాయి. అజంతాలో వెలుగునీడల ఛాయలు రాకపోలేదు. సముఖ దృశ్యంకన్నా, పార్శ్వ దృశ్యానికే ప్రాధాన్యమిచ్చిన మన కళాకారులు రేఖలకు, దిట్టంగా వర్ణ లేపానికి ఎక్కువ విలువ నిచ్చారే గాని, వెలుగునీడలకు ప్రాధాన్యమివ్వలేదు.

రేఖను ఆచార్యుడు, రూపాన్ని కళా ప్రియుడు, అలంకరణను స్త్రీలు, రంగును ప్రజాసామాన్యం ఇష్టపడుతుందని విష్ణుధర్మోత్తరకారుడు అంటాడు. కళాకారుని కౌశలమంతా రేఖతో వ్యక్తమవుతుంది. నిజానికి వర్ణం, వర్ణసంయోగం జనం కనులకు విందుగా ఉంటుంది. తర్వాత రూపం చూస్తాడు. తర్వాతగాని రేఖా విన్యాసంలోని విలాసంపై దృష్టిపోదు. పోయినా దానిని గ్రహించలేడు.

అజంతాకు ముందు, ఆ కాలంలోను దేవతలు, మహాపురుషులు మన కళాకారుని లక్ష్యమయినందున, కళను శాశ్వతం చేయడం, వచ్చే తరాలవారికి భద్రంగా అందివ్వడమూ అతని ఉద్దేశం గనుక, గుహలు, కొండలు, పెద్ద గండ శిలలు కళాద్రవ్యాలయ్యాయి. అప్పటికే, ఆకాలంలోనే, రాజ ప్రాసాదాల లోకి, ధనవంతుల విలాస గృహాలలోకి ఏదో రూపంలో కళ ప్రవేశించింది. శాశ్వతత్వానికి క్రమేపి బలం తగ్గింది. చిత్రఫలకాలు, చిత్రపటాలు సిద్ధమయాయి. రాజునుబట్టి, ప్రాంతాన్నిబట్టి కళాసంప్రదాయం మారింది; శైలిమారింది. రాజులు గద్దె దిగిన కొద్దీ ప్రజల జీవితం వస్తువయిన జానపదకళ, పెద్ద యెత్తున చిత్ర లేఖనాదులు విస్తరించటం మొదలైంది. ఆయా ప్రాంతాల పాలకుల పద్ధతులను బట్టి రాజస్థానీ సంప్రదాయం, జమ్ముశైలి, కాంగ్డీశైలి, విజయనగరశైలి, నాయక రాజులశైలి, మొగల్‌శైలి మొదలైన శైలులు ఏర్పడ్డాయి.

ఇంతగా పెక్కుపాయలుగా పారిన కళాశైలులు ఒక్కచోట చూడగల స్థలం మ్యూజియం తప్ప మరొకటి కాదు. కనుక మ్యూజియం కళాలక్ష్మికి రెండవ విశ్రామ స్థలం. ప్రజలు — కళాభిరుచిగల ప్రజలు — కళలను సులభంగా గ్రహించి జీవితాన్ని కళామయం చేసుకొనడానికి, ముందుతరాలవారిని

సభ్యులుగా, సహృదయులుగా చేయగల కళను ఆకళించుకొనడానికి, కళను స్వోపయోగంగాను, ప్రజోపయోగంగాను చేసుకొనడానికి విశాలాభ్యసన, పున రభ్యసన మందిరాలు మ్యూజియంలు.

ఎవరు ఈ మాటను ప్రచారం చేశారో కాని, మ్యూజియం – విద్యా సరస్వతికి, కళాభారతికి విలాసభవనమైన మ్యూజియం – నిజంగానే సకల లలిత కళలకు స్వయంబోధక విశ్వవిద్యాలయమైంది. ఈ విశ్వవిద్యాలయంలో ప్రవే శించండి. ఇక్కడ చిత్ర, మూర్తులతోపాటు వివరణ పత్రాలు, మార్గదర్శక బృందాలు మీకు సకలం బోధిస్తాయి. వినోదం కోసం వెళ్ళిన మీరు వినోదంతో పాటు విజ్ఞానంతో – విజ్ఞాన భరంతో, మెరిసే కళ్ళతో, నవ్వే మనస్సుతో ఊహలుచిందే మేధతో తిరిగివస్తారు.

(సాలార్‌జంగ్ మ్యూజియం వారోత్సవంలో జనవరి 11 న డాక్టర్ ఎన్. రమేశన్ అధ్యక్షతన జరిగిన గోష్ఠిలో మ్యూజియంపట్ల ప్రజాస్వామ్య దృష్టితో చదివిన వ్యాసం.)

[ఆంధ్రభూమి, 18.1.76]

★★

# పాల్కురికి సోమనాథుని వైద్యక వైదుష్యం

ఆంధ్ర సాహిత్యంలో ఉత్పాద్యశాఖకు మూలపురుషులలో రెండవ వాడయిన పాల్కురికి సోమనాథుని వైదుష్యం బహుముఖం. అతని బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలు తెలుగుభాషకు తొలివిజ్ఞాన సర్వస్వాలన్నా అసత్యం కాదు. డాక్టర్ యశోదారెడ్డి ఉత్పాద్య సాహిత్యశాఖా ప్రవర్తకునిగా నన్నెచోడుని పేర్కొన్నారు.[1] కాని నిజానికి కుమారసంభవకథ కూడ పురాణోక్తమే. కనుక ఒక విధంగా నన్నెచోడుడు తన రచనను ప్రాచీన వస్తువును గ్రహించే కావించినాడు. కాని, సోమనాథుని వస్తువు, రచనా విధానమూ మౌలిక మైనవి. సోమనాథుడు దాదాపు తనకు రెండు మూడు తరాలనాటి అప్పటమైన తెలుగు కన్నడ నాడుల వస్తువును స్వీకరించినాడు. బసవన పాదాలవంటి ద్విపదతో - తాను సృష్టించిన నూతన ఛ్ఛందస్సుతో - రెండు మహత్తర రచనలు కావించినాడు[2] గనుక అతనినే నేను ఉత్పాద్య సాహిత్యశాఖకు మూల పురుషునిగా పేర్కొనడానికి సాహసిస్తున్నాను.

సోమనాథుడు బసవపురాణ, పండితారాధ్య చరిత్రలలో తన విజ్ఞాన వైభవాన్ని వెదజల్లినాడు. డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారన్నట్టు అతడు కేవలం కవి కాదు[3]; పరమత ఖండనం, స్వమత స్థాపనం, వాటికి కావలసిన వైదుష్యం, అన్నిటినీ మించి ప్రజాసామాన్యంలో పాతుకుపోవడానికి దేశీయ ఛ్ఛందస్సులో దేశీయ రీతిని కవిత చెప్పడం అవసరమన్న రహస్యం తెలిసిన లోకజ్ఞుడు. అందువల్లనే సహజ కవితా కామనీయకంతో పఠితలను తన్మయులను చేస్తూ, నెమ్మదిగా మత ప్రవచనలను చేస్తాడు. తక్కిన శాస్త్ర పాండిత్యంతో పాటు అతడు వైద్యశాస్త్ర వైదుష్యాన్ని ప్రమాణాలు ఉదాహరించకనే, ప్రామాణికంగా తెలిపి, వైద్యవరులనూ ఆశ్చర్యచకితులను చేస్తాడు. వ్యాధి,

1. ఆంధ్ర సాహిత్య వికాసము, 1 వ భాగము: డాక్టర్ యశోదారెడ్డి.
2. పరిశోధన సోమనాథ సంచిక.
3. పండితారాధ్య చరిత్ర పీఠిక-పు. 86 - (ఆంధ్రపత్రిక ప్రతి)

తన్నిదానము, తచ్చికిత్స, తదుపచార ప్రక్రియలు, లోకంలోని అలవాట్లు మొదలయిన వాటిని గురించి సోమనాథుని వివరణలు చదువుతున్నప్పుడు, అతని పరిశీలన పరమావధిగా కనిపించి అతడు మహావిషగ్జ్ఞణి అనిపిస్తుంది.

కాంచీపురంలో నాట్యనమిత్తండి అనే మహా శివభక్తుడు ఒకనాడు ఏకామ్రనాథుని సేవించడానికి వెళ్ళుతాడు. దేవుని దివ్యతనువు వంకలు వోయి వెదరూపుగా కనిపించగా, వాయుదోష మనుకుంటాడు. "వాయు తైలంబు గూర్చి యౌషధము లెనయంగ వండు"తాడు. ఈ వాయుతైలంతో పురహరునికి మర్దనంచేసి,

"తవిలి యా వావిలి చివుళు లుమ్మెత్త
చివుళులు దక్కెడ చివుళు లాముదము
చివుళులు వండిన జిల్లెడాకులును
నివియాదిగా మందులన్నియు గూర్చి
చెచ్చెర దనువెల్ల సేకంబు సేసి
పొచ్చెంబులే కిసుక పొట్లాల గాచి,
పుచ్చుచు నరచేత వెచ్చజూపుచును"[1]

ఉపచారాలు చేస్తాడు. ఆముదపాకులు మొదలయిన వాటిని వెచ్చబెట్టి కాచడం, ఇసుకపొట్లాలు వెచ్చజేసి కాచడం, అరచేతులు రాచి కాపడమివ్వడం వైద్యక గ్రంథాలలో చెప్పిన స్వేదన తాపనాది ప్రక్రియలే.

చేటల వేమయ్య గొప్పభక్తుడు. చేటలు అల్లి, అల్లించి బండ్లపై వేసుకొని ఊరూర తిరిగి అమ్మి, దానివల్ల వచ్చిన లబ్ధితో జంగమార్చన చేస్తుంటాడు. అతనిపై దయ కలిగిన ఒక రససిద్ధుడు రసఘుటిక సిద్ధపరచి అతనికి తెలియకుండా, అతని పాదాలకడ పెట్టి వెళ్ళుతాడు. దానిని ఎవరో దొంగలిస్తారు. వేమయ్య పరిస్థితి ఎప్పటిలాగే వుంటుంది. సిద్ధుడు తిరిగివచ్చి తన రసఘుటిక ఇమ్మంటాడు. వేమయ్యకు ఆ సంగతి తెలియదు కాని శివుని స్మరించి,

"అలదిన, నిజలలాటాంకిత ఘర్మ
జల మిశ్రిత విభూతి నలచుచు ఘుటిక
గావించి యతనిచే గ్రక్కున బెట్టి"

నాడట.[2] ఈ సిద్ధుడు

---

1. బసవ పురాణం-వా.శి.ప్ర. 196
2. పండితారాధ్య చరిత్ర - ఆంధ్రపత్రిక ప్రతి 1.482

"రసము శోధించి చారణలు గావించి,
యసమౌషధంబుల రస తైలములను
దొఱల పాషాణ ద్రుతులను మర్దించి
నెఱయ మూర్ఛకు దెచ్చి మఱి చంపి కల్క
ముగ సాంగముగ బిండములను భావించి
తగు వజ్రమూష మందపుగాక దీర్చి"

ఇత్యాదిగా చెప్పిన రస ఘుటికా నిర్మాణ క్రమమంతా వైద్యక గ్రంథాలు వివరించిన శాస్త్రీయ పద్ధతే. రసబంధనానికి అష్టాదశ కర్మలు చెప్పినారు, శాస్త్రకారులు. శ్రీ గోవింద భగవత్పాదాచార్యులు రసహృదయతంత్రంలో

"స్వేదన మర్దన మూర్ఛా
స్థాపన నిరోధ నియమాశ్చ,
దీపన గగన గ్రాస
ప్రమాణ మథ చారణ విధానంచ.

గర్భద్రుతి బాహ్యద్రుతి
జారణ రసరాగ చారణంచైవ,
క్రామణ వేధౌ భక్షణ
మష్టా దశేతి రసకర్మ."[2] అని

వివరించారు. గోవింద భగవత్పాదులు శంకరులకు అద్వైత గురువులు మాత్రమే కాక రససిద్ధులైన యోగి పుంగవులు. రససిద్ధులందరూ రసగంధకాలను శివపార్వతులుగా భావించినవారు. రససిద్ధితో కాయసిద్ధి, జీవన్ముక్తి కలుగ గలవని నమ్మిన గోవింద భగవత్పాదులు రసాన్ని

"మూర్ఛిత్వా హరతి రుజం
బంధన మనుభూయ ముక్తిదో భవతి,
అమరీకరోతి సుమృతః
కో౽న్యః కరుణాకరః తస్మాత్."[3]

అని అమృత స్వరూపుడైన పరమాత్మతో పోల్చారు. తను మూర్ఛపొంది, ఇతరుల వ్యాధులు తొలగిస్తుందట; తను కట్టువడి ఇతరుల కట్లు తెంచు తుందట; తను మరణించి, ఇతరులను అమరులను చేస్తుందట రసం.

---

1. సంహితా 1.476-477
2. రసహృదయ తంత్రం : ద్వితీయావ బోధం. 1, 2 శ్లోకాలు.
3. రసహృదయ తంత్రం : 1-3

బెలిదేవి వేమనారాధ్యుల కథలో, పాముల ప్రసక్తిలో సోమన

"సుమహత్పురాణ వాసుకి మణినాగ
విమల కర్కోటక కుముదాక్ష కుముద
శలపోత కానిల శబలాశ్వతల ని
మలిన పిండకర వామన కుహకోట
నఖ మహోదర హవిర్ముఖ హేమశంఖ
నఖ హవ్యకర్ణ ధనంజయ సంచ
రక పరివర్త కార్యక శిఖి నిష్ఠ
రక మిత్ర కల్మషైరావత శబల
కౌల కౌశిక తక్షకాశేష శంఖ
పాల పుండ్రక ముద్గ కైలాసుతాది
నాగసహస్రము దెన్నంగ నష్ట
నాగంబులన నిరునాల్గు జాతులకు"

అని చెప్పిన నాగసహస్రాలు[1] పౌరాణికాలయినా, చివరి అష్టనాగాలు వైద్యులు చెప్పినవే. ప్రాచీనతముడైన సుశ్రుతుడు

"అశీతి స్త్వేవ సర్పాణాం భిద్యతే పంచధా తు సా,
దర్వీకరా మండలినో రాజవంతః తథైవచ.
నిర్విషా వై కరంజాశ్చ త్రివిధాస్తే పునఃస్మృతాః,
దర్వీకరా మండలినో రాజవంతశ్చ పన్నగాః.
తేషు దర్వీకరా జ్ఞేయాః వింశతిః షట్చ పన్నగాః,
ద్వావింశతిర్మండలినః రాజవంతః తథా పరే.
నిర్విషా ద్వాదశ జ్ఞేయాః వైకరంజోద్భవాస్సదా,
వైకరంజాః త్రయః సర్వే చిత్రమండల రాజితాః.

అని పెక్కుజాతులు చెప్పినాడు[2] కాని, తర్వాతి వారు మొత్తం మీద నాలుగు రెక్కల సంఖ్యకే దించినారు.

బసవని తల్లి మాదాంబ గర్భధారణ చిహ్నాలు సోమన ఎంత శాస్త్రీయంగా వివరించాడో:

---

1. పండితా. 1 436
2. సుశ్రుత, కల్పస్థానం, 4 9, 10, 11, 12 శ్లో.

"తగ గర్భ చిహ్నముల్ దానంకురించె
నమృతాంశుడగు పుత్రు డతివ గర్భమున
నమరియుండుట నొక్కొ యాకలి గాదు
జలజాక్షి కడుపున సద్భక్తి రుచికు
దలరుచి గోరుచు లరుచులై తోచె
పాండురాంగుని మూర్తి పడతి గర్భమున
నుండుటనో వెలుగొందె మైదీగ
పడతి శిలపు జూలు భవిపాకములకు
నొదబడకునికినో యొకిశ్చు పుట్టె
గ్రాలుచు సుతుని రాకకు నోరు దెఱచు
లీలనో సతి కావులింతలు పుట్టె
శివమూర్తి దనకు లోనవుటనో తవిలె
శివయోగ నిద్ర నా జెలువకు నిద్ర
కాలకంధరమూర్తి గడుపున నునికి
నో లలితాంగి చన్మొనలు నల్పెక్క
బెనుపుగ శివమూర్తి వనిత గర్భమున
దనరనో నడుము పేదటిమి వోనాడె
యోగీంద్ర హంసుడయ్యువిద గర్భమున
రాగిల్లుటనో నడవేగంబు వదలె."[1]

సుశ్రుతుడు గర్భధారణ లక్షణాలను

"స్తనయోః కృష్ణముఖతా రోమరాజ్యుద్గమ స్తథా,
అక్షిపక్ష్మాణి చాప్యస్యాః సమ్మీల్యంతే విశేషతః.
అకామతః ఛర్దయతి గంధా దుద్విజతే శుభాత్,
ప్రసేకః స్పదనం చాపి గర్భిణ్యాః లింగముచ్యతే."

అని వివరించినాడు.[2]

విష్ఠాది భక్తనేత్ర లాభ కథనంలో సోమన చెప్పిన నేత్ర వ్యాధు లన్నిటికి వైద్యక ఆకరాలున్నాయి. ఆ వ్యాధులను ఆధునిక వైద్యులు పరిశీలిస్తే, అప్పటి పారిభాషిక పదాలు, వ్యాధి పర్యాయాలు ఎన్నో లభిస్తాయి. కాళిదాసుడు

1. బసవ-31 (వావిళ్ళ)
2. సుశ్రుత, శరీరం 3-14, 15.

శివునితో నేత్రదానం పొంది నేత్ర రోగస్థులైన జనులను రండో అని చాటినాడట. అప్పుడు

"దవ్వవోయినకన్ను దడికన్ను బొరయ
గప్పిన స్గుడుక్క గన్నొడ్డు గన్ను
గ్రుడ్డి కన్నారిగన్ను గోడ్రెవ్వ గన్ను
బ్రొడ్డు కన్నును పూవువోయిన కన్ను
పొలగట్టిన గన్ను బ్రంగుడు కన్ను
గ్రాలు కన్నును నీరుగాఱెడు కన్ను
బ్రొందకన్నును బొరిబొరి బ్రుస్సు కన్ను
మ్రంద కన్నును బెక్కుమాదల కన్ను
బోటు గన్నును బ్రొంగవోయిన కన్ను
దూముగట్టిన కన్ను దూల గొన్కన్ను
మయిల కన్నును మసుమసుకని కన్ను
నయిరకన్నును బాయకదరెడి కన్ను
దోటువోయిన కన్ను దొలుగుడు కన్ను
దీటకన్నును మఱి తిమిరంబు రక్త
దోశంబు దుర్మాంస దోషంబు వాయు
దోషంబు బటలంబు దుర్దర్శి గృష్ణ
కాసయు ననెడి రోగంబు గన్నులును."

అదిగా గలవారు చికిత్స కోసం వచ్చారట.[1]

మాధవనిదానకారుడు తన నిదానం ప్రకరణంలో దాదాపు తొంభయి నేత్రరోగాలు పేర్కొని వాటిని ఉపసంహరిస్తూ,

"నవ సంధ్యాశ్రయా స్తేషు వర్త్మజాస్త్వేకవింశతిః,
శుక్లభాగే దశైకశ్చ చత్వారః కృష్ణభాగజాః.
సర్వాశ్రయా స్సప్తదశ దృష్టిజా ద్వాదశైవ తు,
బాహ్యజౌ ద్వౌ సమాఖ్యాతౌ రోగౌ పరమదారుణౌ.
భూయ ఏతాన్ ప్రవక్ష్యామి సంఖ్యారూప చికిత్సితైః."[2]

అని అన్నాడు. సోమనాథుడు చెప్పిన కంటి జబ్బుల కన్నిటికీ సంస్కృత పర్యాయాలు లభిస్తాయి.

1. పండితా, 2 108, 109 పు.
2. మాధవ నిదానం, నేత్రరోగ నిదానం; పు 553

సుశ్రుతుడు నేత్ర రోగాలు డెబ్బయి యారు (76) చెప్పాడు :—

"వాతాద్దశ తథా పిత్తాత్ కఫాచ్చైవ త్రయోదశ,
రక్తాత్ షోడశ విజ్ఞేయా సర్వజాః పంచవింశతిః.
తథా బాహ్యౌ పునర్ద్వౌ చ రోగాః షట్సప్తతి స్మృతాః."[1]

బెజ్జ మహాదేవి శివుని పసిపాపను చేసి నీళ్ళు పోయడం కౌమార భృత్యంలోని ప్రక్రియయే. ఇది మనకు అనూచానంగా వస్తున్నది. బెజ్జమహాదేవి

"తొంగిళ్ళపై నిడి లింగమూర్తికిని
నంగన గావించు నభ్యంజనంబు
ముక్కొత్తు చెక్కొత్తు ముక్కన్ను బులుము
నక్కొత్తు కడుపొత్తు నట వీపు నిమురు
బెరుగంగ వలెనని తరుణి లీద్వడగ
జరణముల్కరములు జాగంగ దిగుచు
నలుగులు నలుచు నక్కిలి గట్టివెట్టి
జలములు వీపున జఱచు నంతంత
వెగచి బెగడకుండ వెన్నుబ్రేయుచును
నొగి మస్తకమున నీరొత్తు దోయిటను
వదనంబు సొచ్చునో యుదకంబులనుచు
నడుము పొట్టను నోరికడ్డంబు పట్టు
జెన్నుగా పసుపార్చి చేయు మజ్జనము
కన్నులు జెవులును గాడంగ నూదు
నంగిటి ముల్లొత్తు నందంద వ్రేల
దొంగిళ్ళ గార్నీరు దోనెత్తి మిడుచు
బడతి చేనీర దూపొడిచి బొట్టిడును
మడది యంగుష్ఠంబు మన్నించ మెదిచి."[2]

నీళ్ళు పోస్తుంది శివునికి. నేడూ ముసలమ్మలు పల్లెటూళ్ళలో ఈ ప్రక్రియనే అనుసరిస్తున్నారు.

---

1. సుశ్రుతం, ఉత్తర స్థానం. 2-108, 109.
2. బసవ - పుట. 153, 154.

తలంటు ప్రాశస్త్యం గురించి వైద్యులు అనాదిగా మనకు చెబుతూనే వున్నారు. వైద్యక గ్రంథాలూ ఉద్ఘోషించాయి. వాగ్భటుడు

"అభ్యంగ మాచరేన్నిత్యం స జరాశ్రమ వాతహా,
దృష్టి ప్రసాదపుష్ట్యాయు స్స్వప్న సుత్వక్త్వ దార్ఢ్యకృత్."

అని అభ్యంగ ప్రయోజనాలు వివరించాడు[1] పిల్లలకు నూనె రాచి స్నానం పోయటం గురించి చెప్పనక్కరలేదు.

సోమన జ్వరాలను పెక్కింటిని ప్రస్తావించాడు, పిళ్ళె నాయినారు కథ మొదలయిన వాటిలో.

వల్నాటి చోళవంశ క్షయ కథనంలో సోడనరాధిపునికి రొమ్మున మూడు గ్రంథులు

"అరయంగ దుష్క్రియను మహోదరికి
వరుస జన్నులు మూడు వ్రటిల్లునట్టు
లొనర గోవగ్రంథియును మదగ్రంథి
యును దురితగ్రంథియును సోడనృపతి
యుదరమున బెరుగుచున్న చందమున."[2]

పుట్టాయట. ఆ ముమ్మొన వ్రణము సిద్ధమంత్రౌషధచ్ఛేదన దహన బద్ధ క్రియల చేత బాయదని స్పష్టమయిందట. ఈ ఛేదన దహనాదులు వైద్య సమ్మతాలు. సుశ్రుతుడు

"తచ్చ శస్త్రకర్మ అష్టవిధం. తద్యథా:- ఛేద్యం,
భేద్యం, లేఖ్యం, వేధ్యం, ఏష్యం, ఆహార్యం,
విస్రావ్యం, సీవ్యమితి........శస్త్రాను శస్త్రేభ్యః
క్షారః ప్రధానతమః ఛేద్య, భేద్య, లేఖ్య, కరగత
త్రి దోషఘ్న త్వాదిక్రియా వచారణాత్.
క్షారాదగ్నిర్గరీయాన్ క్రియాసు వ్యాఖ్యాతః.
తద్దగ్ధానాం రోగాణాం అపునర్భావాత్, భేషజ
శస్త్రక్షారైః అసాధ్యానాం తత్సాధ్యత్వాచ్చ."[3]

అని గ్రంథి చికిత్సలో తెలిపాడు. సోమన ఈ ప్రక్రియలన్నిటినీ క్షుణ్ణంగా తెలిసినవాడే.

---

1. అష్టాంగ, సూత్రస్థాన. 2.7
2. పండితా. 2.62, 63
3. సుశ్రుత సూత్ర 5.5

ఆంధ్ర దేశంలో నిత్యనాథ సిద్ధుడు మొదలుకొని అందరూ శ్రీశైలాన్ని బ్రహ్మాండమైన రసఘుటిగా స్తుతించినారు. దానిలో అసత్యమేమీ లేదు. సకల మూలికలకు, రసాదులకు ఆకరమది. కనుకనే సోమన కూడా పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో వైద్యోపయోగి మూలికలను, పత్రులను, పండ్లను కోకొల్లలుగా తెలిపాడు[1]

ఈ విధంగా సోమనాథుని వైద్య వైదుష్యాన్ని ఎంతేనా చూపవచ్చు. గురువర్యులు, శ్రీ తిరుపతి వేంకటేశ్వరాయుర్వేద కళాశాల ప్రధానాచార్యులు, కీర్తిశేషులు సి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి గారి సన్నిధానంలోను, ఆయుర్వేద మహోపాధ్యాయులు శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారి వలన, మిత్రుడు ఆయుర్వేద శిరోమణి ప్రస్తుతం మద్రాసు వెంకటరమణ ఆయుర్వేద వైద్యశాల ప్రధాన చికిత్సకుడు శ్రీ కాశీభట్ట రామనాథ దత్తవలన తెలుసుకొన్న కొన్ని విషయాలను తెలిపినాను. ఇంకా ఎంతో తులనాత్మక పరిశీలన జరుపవలసి వుంది.

[శివజ్యోతి, 1975]

1. పండిత-355-360.

# ఆంధ్రకేసరి ప్రకాశంగారూ - ఆనాటి మద్రాసు కుట్ర కేసూ

దాదాపు నాలుగు దశాబ్దాల మాట. భారత స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న సమయం. భగత్‌సింగ్ మొదలయిన వారిని బ్రిటిష్ ప్రభుత్వం దౌర్జన్యవాదులనే సాకుతో ఉరితీయించి ఎంతోకాలం కాలేదు. యువకుల నెత్తురు ఉడికిపోతున్నది. కిక్కిరిసే కారాగారంలో పడవేసే కరాళ శాసనాల కరకు కాలం.

దేశం ఇంత అల్లకల్లోలంగా ఉన్నా మైలాపూర్ సంస్కృత కళాశాలలో యథాప్రకారం పనులు సాగిపోతున్నాయి. గురువర్యులు లక్షణశాస్త్రిగారు కావ్యాదర్శపాఠం చెబుతున్నారు:

> "స్యాద్వపుః సుందర మపి
> శ్విత్రేణైకేన దుర్భగమ్"

అని కావ్యదోషాలను వివరిస్తున్నారు. నాకు చూడగా, దండి నిర్వచనం అలంకారికంగా కావ్యశరీరానికి గాక రాజకీయంగా దేశానికి అన్వయిస్తున్నట్టు తోచింది. నిజమే శరీరం ఎంత సుందరమైనా, శ్వేతకుష్ఠం ఒక చుక్క ఉన్నా దుర్భగమయినట్టు, కావ్యం ఎంత మధుర సుందరమయినా, ఒక దోషంతో కొరగానిదవుతుంది. అలాగే దేశం ఎంత అందంగా, విశాలంగా, జనసంకులంగా ఉన్నా ఒక్క స్వాతంత్ర్యమనేది లేకుంటే ఎంత దుఃఖ భాజనమయినా అవుతుంది - అని ఆలోచనలు పరుగెత్తుతున్నాయి.

## ఫలానా వారు ఉన్నారా?

ఇంతలో "ఫలానావారు ఉన్నారా?" అంటూ ఒక పెద్దమనిషి తరగతి గదిలోకి వచ్చాడు. ఆయన తెల్లటి పంట్లాము, షర్టు, కోటు ధరించి ఉన్నాడు- నాకేమి తెలుసు మఫ్టీలో ఉన్న సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరని. ఎవరో పెద్దమనిషి అనుకున్నాను. పాఠం ముగిసేవరకు కాచుకొని ఉన్నాడు. కొంత సేపటికి గంట కొట్టింది. కావ్యాదర్శపాఠం నుంచి లేచి మరొక తరగతికి వెళ్ళబోతున్నాను.

"ఇదిగో; నాయనా, ఒక్కమాట" అన్నాడు ఆయన, ఆప్యాయంగా. నేను సమీపించాను.

"నీతో మాట్లాడాలి" అన్నాడు ఆయన, నన్ను ఎగాదిగ చూస్తూ. నన్ను నేను చూచుకొన్నాను. గూడకట్టు పంచ పైన తువాలు, బుజాలమీదికి వ్రేగాడే జుట్టు, నుదుట మూడు ఊర్ధ్వపుండ్రాలు. నన్ను చూస్తూ ఆయన ఆశ్చర్యం మరుగుపరచుకొన్నట్టు అనిపించింది.

నేను ఆలోచనలో పడ్డాను. ఉన్న నాకాస్తంతబుద్ధినీ స్మృతిపథంలో దౌడాయించాను. ఆయన ఎవరో జ్ఞాపకం రాలేదు. మద్రాసు మహానగరం శ్రీరంగరామేశ్వరాదిక్షేత్రాల యాత్రకు ముఖం. హైకోర్టు పనిమీద ఎందరో వస్తుంటారు బంధువులు. నాకు తెలియనివారెవరో అయివుంటారు. "చూచిరాండి మావాణ్ణి" అని మానాయనగారో, మా అమ్మో అనివుంటే, యోగక్షేమాలు తెలుసుకొనడానికి వచ్చివుంటాడు - అనుకొన్నాను.

"నావెంట రావాలి" అన్నాడు. ఆయన కంఠంలో కొంచెం అధికారపుజీర వినిపించింది. నా బంధు కోటిలోని ఆప్తుడో, మరే సన్నిహితుడో అయివుంటే. అక్కడే కుశల ప్రశ్నలు వేసేవాడు గదా!

"క్లాసులు పూర్తికాలేదు" అన్నాను, వినయంగానే.

"మీ ప్రిన్సిపాలుగారితో చెప్పాను. రెండు మూడు గంటలలో తిరిగి రావచ్చు. ఎక్కువ పనేమీవుండదు" అన్నాడు ఆయన; అధికారం పాలు కొంచెం హెచ్చిస్తూ.

ఆయన ధోరణి నాకు అర్థం కాలేదు. ఆయన అధికారం పద్ధతి అంతకన్నా అర్థంకాలేదు. నన్ను అధికారం చేసినవారు ఇంతవరకు ఎవ్వరూ లేరు, నేను ఇంతవరకు అనుభవించింది ప్రేమ, వాత్సల్యాలే. నన్ను సత్యాగ్రహంలో అరెస్టుచేసిన కన్నయ్య నాయడుకూడా ఎంతో గౌరవంతో చూచాడు. "స్వామీ, మీరు అజెయిలు మెతుకులు మింగలేరు; కష్టపడుతారు. నామాట వినండి. జెయిలు సూపరింటెండెంటును మన్నన కోరండి!" అని ఎంత ప్రేమతోనో బుద్ధి చెప్పాడు. అలాంటప్పుడు, వీడెవడో నాతో పనివుంటే, అక్కడే మాట్లాడి పోవచ్చు గదా! నాపై అధికారం చూపవగినంత పెద్దరికం ఏమిటి?

ఇంతలో మరొకవ్యక్తి వచ్చాడు. ఆయనతో సంప్రతించాడు. ఇద్దరూ చెవులు కొరుక్కున్నారు. ఆయన నావైపు తిరిగాడు "ఏమీ భయం లేదు. బయలుదేరండి" అన్నాడు.

భయమా? నాకు, నా వంశానికి ఏకోశానా లేదే ఆ భయ్యమన్నే పదార్థం!

భయమనేదే ఉంటే మా పూర్వులు తాడిమర్రి సంస్థానాధీశులతో బ్రిటిషు ప్రభుత్వంపై పితూరీ చేయించేవారా? ఈ పెద్దమనిషి భయం అంటున్నాడే! ఆ భయం ఏమిటో ఎక్కడ ఉందో, చూద్దాం. పనీ ఏమిటో తెలుసుకొందాం - అనిపించింది. సరే, ఆయన వెంట వెళ్ళడానికి సిద్ధమయ్యాను.

చేతిలోని పుస్తకాలు గదిలో పడేసి, వారివెంట కదిలాను. వారు నన్ను ట్రాములో ఎక్కమన్నారు. ట్రాము కదిలింది. తిరుపల్లిక్కేణిలో దిగాము. ఫర్లాంగు నడిచాము. పార్థసారథి స్వామి తేరువీథి. ఒకఇంట్లో అడుగుపెట్టాము. లోపలి గోడమీద ఇత్తడి అక్షరాలతో ఒక ఫలకం మెరిసిపోతున్నది-పార్థసారథి అయ్యంగారు, సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ అని.

నా మెదడులో కొన్నివేల మెరుపులు మెరిశాయి. వివిధ రంగాల వ్యక్తులతో నాకు పరిచయం, స్నేహం కలిగాయి కారాగారంలో. అప్పటి దక్షిణాపథ నాయకులు, ఇతరులు ఎంతోమంది పరిచితులయ్యారు. అరవింద మహర్షి శిష్యుడు, అంతరంగిక కార్యదర్శి సురేంద్రమోహన్ ఘోష్, పెక్కు కుట్రకేసులనబడే వాటితో సంబంధమున్న జీవన్‌లాల్ చటర్జీ, సైన్యంలో విప్లవం తేవడానికి ప్రయత్నించిన మహా సాహసికుడు ప్రతూల్‌చంద్ర గంగూలీ, లాహోర్‌కుట్ర కేసులో శిక్షితులు కుందన్‌లాల్‌గుప్త, బట్కేశ్వర్ దత్-ఇంకా ఎందరో! సురేంద్రమోహన్‌ఘోష్ సంస్కృత సాహిత్య పరిచయం గలవారు. రవీంద్రుని సుప్రసిద్ధగీతి, గాంధీజీకి అత్యంత ప్రియమైనది "అకేలా చలో"ను నేను "ఏకాకి చల" అని అనువదించగా విని పొంగిపోయారు.

> "ఝుంఝూవాతే, రజనీ సమయే,
> నాలోకే సతి, ద్వారే పిహితే
> వజ్ర జ్వాలిత వక్షః పంజర
> ఏకాకి చల రే!"

అనే దాన్ని ఆయన పదేపదే చదివించుకొని ఆనందించేవారు.... ఇలా ఎన్నో తలపులు. మేమింకా కౌమరావస్థ వదలని వారం. వారంతా మాకుచేసిన ఉపదేశాలెన్నెన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని ఇతరులకు చెప్పదగినవి, కొన్ని చెప్పదగనివి. ఈ పోలీసులు అలాటి వాటిని పట్టుకొని కేసులు బనాయించదలచి నాలాటి వారిని ప్రశ్నించదలచుకొన్నారేమో! ఇంతలో....

"ఆచార్యులవారూ, కూర్చోండి." అన్నమాటలు వినిపించాయి. నా ఆలోచనా తంత్రి తెగింది. కూర్చున్నాను.

"మీకు ఫలానావాడు తెలుసా?" అడిగాడు ఆయన.

"తెలుసు" అన్నాను.

పొరపాటయిపోయింది. ప్రశ్నల వర్షం కురిసింది. ఏమి చెబితే ఏమి ప్రమాదమో! ఎవరికి నష్టమో! అంటీ అంటనట్టు సమాధానాలు చెబుతున్నాను. కోపంతో ఆయన ముఖం ఎర్రబడింది. కాని కోపాన్ని కొంత వాత్సల్యాలుగా మార్చుకొనే ప్రయత్నంలో నవ్వుముఖం పెట్టాడు.

## బుకాయింపు లెందుగ్గాని......

"చూడు నీ బుకాయింపులవల్ల ప్రయోజనం లేదు. నీ మిత్రులందరూ పట్టుబడ్డారు. నీవు నిజం చెబితే మంచిది. సంస్కృతం చదువుకుంటున్న వాడివి. ఎందుకు నీకు ఇదంతా" అంటున్నాడు ఆయన.

నేనేమీ మాట్లాడలేదు. అతని గొంతులో తీవ్రత ఎక్కువవుతున్నది. నేను ఆలోచనలో మునిగిపోతున్నాను. పాతకథ జ్ఞాపకం వచ్చింది. ఒకరైతు కాములు లేని గొడ్డళ్ళను దండగుచ్చి బుజంమీద వేసుకొని పోతున్నాడట- ముక్కలు ముక్కలు చేస్తాడు వీడు మనల్ని అని చెట్లన్నీ గడగడ వణికిపోయాయట. అప్పుడు ఒక ముసలిమాను అన్నదట - వెర్రి పీనుగుల్లారా! మనవాడు ఎదిరితో కలవందే, ఎదిరి కొమ్మయినా కదిలించలేడు - అని. దానితో చెట్లన్నీ కుదుటపడ్డాయట. అట్లాగే మా మిత్రుడెవడో మేము కుర్రతనంతో అనుకొన్నవీ, చేసినవీ గొప్పకోసం వాగి వుంటాడు. పోలీసులు వాటినే పెద్దవి చేసి జనానికి చూపదలచుకొని ఉంటారు. నాబోటి వాడిమీద ప్రయోగించ దలచుకొని ఉంటారు...............

"నీ మిత్రుడు ఎస్. పట్టాభిరామరెడ్డి లేడూ, అతడు చెప్పాడు, నీవు మంచివాడివనీ, తనకు సన్నిహితుడివనీ......."

ఛీ! వాడేమి మిత్రుడు!! పోలీసులకు లేనిపోని సంగతులు చెప్పేవాడూ, చెప్పి పట్టించేవాడూ, పట్టించి ఇరకాటంలో పెట్టించేవాడూ మిత్రుడేనా?........ నిశ్చయం చేసుకున్నాను. నా నుంచి ఒక్కమాటయినా రాగూడదని. ఇంతకూ నాకు తెలిసింది మాత్రం ఎంత? ఏమిటి?............

"మౌనంవల్ల ప్రయోజనం లేదు. పట్టాభి రామరెడ్డిని, ఎస్. కృష్ణన్ అనే మరొక యువకుణ్ణి ఇంగ్లాండుకు పంపిస్తున్నాము తెలుసా? వాళ్ళు చాలా బుద్ధిమంతులు. నీకు విదేశాలకు వెళ్ళదామని లేదూ? నిజం చెప్పు అంతా సరిపోతుంది...."

## ఇంతకూ నిజమంటే ఏమిటి?

ఆలోచిస్తున్నాను. ఏది నిజం? ఇంతకూ, నిజమంటే ఏమిటి?

"....మీరు చదువుకొన్నవాళ్ళుగదా. దౌర్జన్యమెందుకయ్యా? సత్యాగ్రహం

అన్నారూ, బాగుంది. ఖద్దరు కట్టారూ, బాగుంది. కత్తులూ, కటార్లూ పుచ్చుకొని ఈ దౌర్జన్యాలేమిటి? కాల్చుకోడాలు, చంపుకోడాలు, లూటీలు, దోపిడీలూ ఏమిటి?...."

ఇప్పుడు మాట్లాడక తప్పింది కాదు.

"లేదండి. మేము దౌర్జన్యాలేమీ చేయలేదు. దేశం గురించి అనుకోవడం, వీరుల పరాక్రమ సాహసాలు తలపోయడం దౌర్జన్యమయితే...."

"చాలు!" అన్నారు ఆయన. "ఈ సంగతే పోలీసు కమీషనర్ దొరగారి ముందు చెప్పు. ఈ అబద్ధాలు పనికిరావు. నిజం చెప్పి నీ మిత్రుల సంగతి తెలపడం మంచిది. లేకపోతే ఇరవై సంవత్సరాల శిక్షకు తక్కువ ఉండదు, జీవితమంతా నాశనం. నడు, కమిషనర్ దొరగారి దగ్గరికి...." అధికారం అరిచింది.

కారు సిద్ధంగా ఉంది. నన్ను పోలీసు కమీషనర్ కార్యాలయానికి పిలుచుకొని వెళ్ళారు. ఇక్కడా అదే తంతు. కాని, ఆయన-వైద్యనాథ ముదలియార్ అని జ్ఞాపకం-కోపపడలేదు. విషయ సంగ్రహణ చతురుడు. మహా శాంతంగా అన్నాడు.

"సంస్కృతం దేవభాష-చదువుకొంటున్నవాడు లేండయ్యా. సంస్కృత పాఠశాలకు పంపించండి. అవసరమైనప్పుడు పిలిపించుకొందాం." అన్నాడు ఆయన. నేను వెళ్ళిపోయాను. సంస్కృత కళాశాల ఎప్పటిలాగే సంస్కృత ప్రవచనాలతో కలకలలాడుతూనే ఉంది.

సాయంకాలమైంది. కుంటుకుంటూ వచ్చాడు ఒకాయన. మరొక సి.ఐ.డి. అనుకున్నాను. ప్రశ్నలకు సిద్ధమయ్యాను.

"మీరేనా, రామచంద్రుడు?" అడిగాడు ఆయన. ఔనన్నాను.

"మరెవరన్నా వచ్చారా మీ దగ్గరికి? ఏమైనా చెప్పారా? నేను మీకు మిత్రుణివంటివాడిని. పేరు పి. రామమూర్తి. వృత్తి వకాల్తా. మీ మిత్రుల తరపున వచ్చాను. మీరు పోలీసులకు ఏమంటే అవి అందివ్వలేదు కదా! చదివేది సంస్కృతం. పాపం! లౌక్యమేమి తెలుసు?...." అంటూ ఏమేమో లెక్చరు కొట్టాడు.

నేను ఆలోచించాను. ఈయన ఎవరో అపరిచితుడు. ఏమి మాట్లాడితే ఏమి తప్పో! వింటూ ఊరుకున్నాను.

"నా వెంట రాండి. మీకేమీ భయం లేదు. నేను జగన్నాథదాసుగారింటికి

మిమ్ముల్ని పిలుచుకొని వెళ్ళుతాను. కేసులో ఏవిధంగా మెలగాలో తెలుపుతారు ఆయన" అన్నాడు.

ఇదీ చూద్దాం. వచ్చేనష్టం ఏమిటి? ప్రాణాపాయంకన్నా పెద్దది జరుగదు కదా! ఈ కుంటివాడూ జిత్తులమారి అయితే, మరొక అనుభవం సంపాదించి నట్టవుతుంది-అనుకొన్నాను. ఆయన వెంట బయలుదేరడానికి సిద్ధమయ్యాను.

ఇద్దరం తిరువల్లిక్కేణితో బిగ్‌స్ట్రీటు చేరాము. ఒక ఇంట్లో ప్రవేశిం చాము. "బచ్చు జగన్నాథదాసు, హైకోర్టు అడ్వకేట్" అని వ్రాసిన బోర్డు వేలాడుతూంది. దివాన్‌ఖానాలో చాలామంది మూగి మాట్లాడుతున్నారు, చర్చించుకొంటున్నారు. అంతా బాగుంది రామమూర్తి (తర్వాత శాసనసభ్యుడు, పార్లమెంటు సభ్యుడు.) నన్ను వారికి పరిచయం చేశాడు. జగన్నాథదాసుగారు, పేరుమోసిన జాతీయవాది, న్యాయవాది అని నాతో అన్నాడు.

"ఇదిగో, నాయనా, మీరంతా ఒక ఘోరమైన కుట్రకేసులో చిక్కు కున్నారు అమాయకంగా. మిమ్మల్నందరినీ రక్షించడానికి- శ్రీ ప్రకాశంగారి పేరు విన్నావు గదూ!- ఆయన నాయకత్వాన కొందరు న్యాయవాదులం రక్షణ సంఘంగా [డిఫెన్స్ కమిటీ] ఏర్పడ్డాము. దానికి పి. రామమూర్తి ఈయన- కార్యదర్శి. కె. భాష్యం, పి. రాజగోపాలాచారి, ఎస్.ఎస్. మణి, సుసర్ల సూర్య ప్రకాశం, ప్రకాశరావు, మరికొందరు ప్రముఖ న్యాయవాదులు సభ్యులు" అంటూ అందరినీ చూపారు. నేను నమస్కరించాను.

"నీకు తెలిసిన విషయాలు పూర్తిగా మాకు చెప్పాలి. నీవు చిన్నవాడివి గనుక నిన్ను ఈ కుట్ర కేసులో తమ మొదటిసాక్షిగా వేసుకొన్నారు పోలీసులు" అన్నారు.

## గుండె జల్లుమంది

నా గుండె జల్లుమంది. ఒళ్ళు చెమట పట్టింది. ఏమిటీ కుట్ర కేసా! నేను మొదటిసాక్షినా పోలీసులకు? అందుకేనా వైద్యనాథ మొదలియారు అంతగా ప్రేమ ఒలకబోయడం! ఏమిటిదంతా? వీరంతా రక్షకులా? ఆంధ్రకేసరి వంటి వాడు రక్షణ సంఘ నాయకుడా? అంతా అగమ్యంగా ఉందే?....ఆలోచిస్తున్నాను.

"ఎస్. పట్టాభి రామరెడ్డి, ఎస్. కృష్ణన్ మీ అందరిమీదా ఏవేవో చెప్పారు. ఇద్దరూ ఈ కేసులో అప్రూవర్లు. పట్టాభి నీకు మిత్రుడట గదా. వాడు తిరిగి పోయాడు."

నేను గాభరాపడ్డాను. "వాడు ఏమేమి చెప్పాడో! ఎందరు అమాయకులను ఇరికించాడో? నానుంచి ఎవ్వరికీ ద్రోహం జరుగరాదు. నాకు తెలిసినవి చెప్పి

నా మిత్రులను రక్షించడం నా ధర్మం. కనుక మీరు ఎలా సెలవిస్తే అలా చేస్తాను" అన్నాను గద్గద కంఠంతో.

"మీవన్నీ వట్టి ఆలోచనలే. చేసిందేమీ లేదు. ఇతరుల సంగతి ఎలావున్నా, నీవరకు నీవు.... సంగతి ఇది" అన్నారు ఆయన.

మమ్మల్నందరినీ ప్రభుత్వము దౌర్జన్యవాదులుగా- టెర్రరిస్టులుగా చిత్రించింది. అప్పుడు అహింసోద్యమం ముమ్మరమైన రోజులు. కొందరు యువకులు 1932 లో తిరుచినాపల్లి జెయిలులో ఉన్నప్పుడు, అక్కడ డిటెన్యూలుగా ఉన్న సురేంద్రమోహనఘోష్, జీవన్‌లాల్ చటర్జీ, ప్రతూల్ చంద్ర గంగూలీ వంటివారితోను, లాహోరు కుట్రకేసులో శిక్షపొందిన బటుకేశ్వర్‌దత్, కుందన్ లాల్‌గుప్తవంటి వారితోను చర్చలు జరిపే అవకాశం వున్నందున ఆ దౌర్జన్య వాదుల సలహాతో దౌర్జన్య పద్ధతులతో ప్రభుత్వాన్ని పడగొట్టడానికి కుట్ర చేశారు. వారిలో ప్రముఖులు వీరు: ప్రముఖ కార్మిక నాయకుడు, ప్రస్తుతం ఫార్వర్డ్‌బ్లాక్ కార్యదర్శి ముకుందలాల్ సర్కార్, కె. గోపాలశాస్త్రి, కె. అరుణాచలం, టి. ఆర్. సుబ్రమణ్యం, జి. లోకనాథన్, టి. కణ్ణన్, కణ్ణాయిరం, ఎన్. రంగరాజన్, కె. నారాయణ నంబియార్, జి. బాలకృష్ణా రెడ్డి, డి. బలరామరెడ్డి, పి. బాలిరెడ్డి, దశరథరామరెడ్డి, జి. కాశయ్యశెట్టి, సి. జగన్నాథం, టి. బాపిరాజు, కె. రామానంద చౌదరి, బి. జోసెఫ్, వేలాయుధన్, తిరుమల రామచంద్రాచార్య [నేను] మొదలయినవారిపై కుట్ర కేసు మోపారు. నేను సంస్కృత పాఠశాల విద్యార్థిని కావడంవల్ల, అందరిలోకి చిన్నవాడిని కావడంవల్ల పోలీసులు నన్ను మొదటి సాక్షిగా వేసుకొంటే మంచిదని నన్ను, నాబోటివారిని కొందరిని సాక్షులుగా వేసుకొన్నారు. దీనికంతా మూలం పట్టాభి రామరెడ్డి, కృష్ణన్.

"అయితే నన్ను ఏమిచేయమన్నారు?" అడిగాను.

"నీకు ఈ కుట్రకేసు సంగతి ఏమన్నా తెలుసా? వివరంగా నీకు తెలుసా?"

## పోలీసుల ఆరోపణ

"వీరంతా నాకు తెలుసు. జెయిలులో ఏవేవో గప్పాలు కొట్టిన మాట నిజమే. కాని కుట్ర సంగతి నాకు తెలియదు. కుట్ర అనే మాట ఇప్పుడే వింటున్నాను." అన్నాను.

"ఆ సంగతే చెప్పవయ్యా. నాకేమీ తెలీదని న్యాయస్థానంలో" అని అన్నారు జగన్నాథదాసుగారు.

"సరే. కుట్రకేసు మోపారు అన్నారే. ఆ కుట్ర ఏమిటి?"అని అడిగాను.

"అయితే విను నీకు సంబంధించింది" అంటూ జగన్నాథదాసుగారు పక్కన వున్న కాయితాలు తీసుకొని చదివి వినిపించారు. దాని సారాంశమిది.

"వీరంతా నీకు తెలుసు. జెయిలులో పథకాలు వేశారు. భగత్‌సింగును ఉరితీసిన తర్వాత ఆయన సహచరులను అండమానుకు మార్చే ఏర్పాట్లు జరుగుతున్నాయి. అంతలోగా మీలో కొందరు విడుదలవుతారు. ఆ బందీలను అండమానుకు పంపాలంటే, మద్రాసు మీదుగా పంపాలి. కనుక వాళ్ళను మద్రాసుకు రైల్లో తీసుకుని వెళ్ళేటప్పుడు బిట్రగుంట-కావలి స్టేషనుల మధ్య తప్పించి దాచాలి. ఇదొక పథకం.

"ఈ పనులకు, ఆయుధాలకు, సహాయ సంపత్తికి డబ్బుకావాలి. దాని కోసం దుష్టులైన ధనవంతులు, వారసులు లేని ధనవంతుల ఇండ్లలో దొంగతనం చేయాలి. ప్రభుత్వం రెవెన్యూ డబ్బును కొల్లగొట్టాలి. ఒకవేళ పట్టుబడితే, పోలీసులు ప్రాణాలు తీసినా రహస్యం పొక్కరాదు — దానికి ఎన్నో శపథాలు సిరాతోను, రక్తంతోను వ్రాసుకొన్నారు.

"1933లో ఆగస్టు నెలలో ద్వీపాంతరవాస శిక్ష విధించిన భగత్‌సింగ్ సహచరులను తీసుకొని వెళ్ళుతున్నారని తెలిసింది. అప్పుడు నీవు నెల్లూరు మూలపేటలోని వేద సంస్కృత పాఠశాలలో విద్యార్థివి. రంగనాయకులపేటలోని స్వయంపాకులవారి సత్రంలో ఒక గది నీకు ఉచితంగా ఇచ్చారు. అక్కడ నీ బస. నీ సంస్కృత పుస్తకాలు — కౌముది, అభిజ్ఞాన శాకుంతలం, అష్టాంగ హృదయం మున్నగు వాటితోపాటు వాటి మరుగున నీ మిత్రుల పిస్తోలులు, కత్తులు కూడ వుండేవి. అయ్యవారా, నిన్నెవ్వరూ అనుమానించరు. నీ జుట్టు, పంచ, పైన వుత్తరీయం - కచ్చితంగా తొండరడిప్పొడి ఆళ్వారులాగ వున్నావు. కనుక భయపడబాక! - అనేవాడు మీ కాళయ్యసెట్టి. అతడు మీ అందరిలోకి సర్కారు తర్వాత పెద్ద. ఆరున్నర అడుగుల నిలువు. మళ్ళ కయ్యలమీద కూడ సైకిలును యమవేగంతో తొక్కేవాడు.

"ఒకరాత్రి మీరంతా బిట్రగుంట స్టేషను పరిసరాలకు వెళ్ళారు. చిమ్మ చీకటి. కాళయ్య మొదలయిన వాళ్ళంతా ఫలానాపని ఫలానావారికి అని నిర్ణయించారు. నీ పని ఎవ్వరైనా వస్తే తెలుపడానికి కొన్ని నివాదాలివ్వడం. రైలు వచ్చింది. రైలులోని నీ మిత్రులు గొలుసులాగి రైలు ఆపే ఏర్పాటు అదివరకే ఉంది గనుక, రైలు ఆ ప్రకారంగా ఆగింది, రైలు అధికారులు మహా ఆదుర్దాతో రైలు ట్రాకంతా తిరిగారు. నీవు ఒక చెట్టుమాటున ఉన్నావు. గంటసేపు

ఈ హడావుడి. తర్వాత రైలు కదలిపోయింది. నీ మిత్రులు నీవద్దకు వచ్చారు. ఏమి జరిగింది? — అని అడిగావు నీవు. ఈ రైలులో వారు లేరు. ప్రయత్నం వ్యర్థమయింది - అన్నారు నీ మిత్రులు. నీ కర్తవ్య నిర్వహణకు అవకాశమే కలుగలేదని బాధపడ్డావు.

"బుచ్చిరెడ్డిపాలెం వద్ద ఒక గ్రామం వుంది. ఆ గ్రామంలో ఒక సంపన్నుల ఇంట్లో మొత్తం నలుగురు విధవలున్నారు. వారి వయస్సు క్రమంగా 80, 65, 40, 25 సంవత్సరాలు. మహా పిసినిగొట్లు. వారి ఇంట్లో దోపిడి చేయడం పాపం కాదని మీరు నిర్ణయించుకొన్నారు.

"ఒక అమావాస్య రాత్రి. భోరున వర్షం కురుస్తూంది. మీరు నలుగురు ఒక జట్కాలో బుచ్చిరెడ్డిపాలెం వరకు వెళ్ళారు. వర్షం కొద్దిగా ఆగింది. అక్కడినుంచి నాలుగు మైళ్ళు నడిచారు. దాదాపు ఒంటి గంట. ప్రతివారి దగ్గర పిస్తోళ్ళు, చురకత్తులు ఉన్నాయి. మొత్తం నలుగురు. కాళయ్యసెట్టి 40 ఏళ్ళ వయస్కురాలిని బెదిరించి కట్టివేస్తాడు. బి. బాలకృష్ణారెడ్డి 65 సంవత్సరాల వృద్ధురాలిని బెదిరిస్తాడు. మరొకరు మరొక యువతిని, 80 ఏళ్ళ ముసలమ్మ కదలకుండా వుండేట్టు చూడడం నీ పని. ఆయుధాలు మహాపద వస్తే గాని వినియోగించరాదని నియమం.

"అంతా సవ్యంగా కుదిరింది. కాళయ్యసెట్టి గోడ దూకి పెరట్లోకి వెళ్ళి పాతకాలపు తలుపుల గడియను ఇనుప ఊచతో లేపి, తలుపు తీశాడు నెమ్మదిగా. మీరు మీ కర్తవ్య నిర్వహణలో ఉన్నారు. ఒక చిక్కు కలిగింది, మీ నాయకులకు ఆ ఇంట్లో కుక్క వుందని తెలీదు. దాని నోరు మూయించడం కష్టమయింది; ఒకటే మొరుగుడు!

"ఇంతలో మరొక ఘోరం కూడ జరిగింది. కాళయ్యసెట్టికి అప్పగించిన మధ్యవయస్కురాలు బలవంతురాలు. దొంగలు, దొంగలో! అని గొంతు పగిలేట్టు అరుస్తూ బూతులు తిడుతూ కాళయ్య పంచెను బొడ్డులో చేయివేసి గట్టిగా పట్టుకుంది. కాళయ్య ఆమె ఉడుముపట్టు విడిపించుకోలేక చురకత్తితో పంచెను చించి ఆమెను కింద పడదోశాడు. తాళంచెవి గుత్తి నీకు కేటాయించిన ముసలమ్మ వద్ద వుంది. నీవు పిస్తోలున్న చేత్తో ఆమెను అదిమిపట్టి, రెండో చేత్తో తాళంగుత్తి లాగావు. కాని ప్రయోజనం లేకపోయింది. వాళ్ళ కేకలకు, కుక్క మొరుగుళ్ళకు ఊరంతా కాగడాలు పుచ్చుకుని అరుస్తూ, కేకలు వేస్తూ వచ్చి మూగింది. రంగం నుంచి పారిపోవడం తప్ప గత్యంతరం కనిపించ లేదు. పరుగెత్తండి —— అన్నాడు బాలకృష్ణారెడ్డి. దొడ్డి గోడ దూకి పరుగెత్తారు మీరంతా. ఎటు పోతున్నారో తెలీదు. పరుగెత్తిందే దారి! వెంట ఊరివారు

చంపండి, నరకండి అంటూ బూతులు తిడుతూ తరుముకు వస్తున్నారు. దాదాపు నాలుగైదు మైళ్ళు పరుగెత్తి వుంటారు అడవిలో. పెన్న నీరు సరఫరా చేయడానికి పెద్ద పెద్ద గొట్టాలు అక్కడ కొన్ని పడి వున్నాయి. వాటిని ఇంకా అమర్చలేదు. వాటిలో ఎవరున్నారో, ఏముందో తెలియదు. మీరు వాటిలో దూరి తలదాచుకున్నారు. లోపల కంపు, బురద. వూరివారు అటూ ఇటూ దూరం నుంచే చూచి వెళ్ళిపోయారు. వాళ్ళు అంతగా దగ్గరికి వచ్చినప్పుడు కాల్పులు జరపాలని మీ నిర్ణయం. అలాంటి హింసకు అవకాశం కలుగలేదు. వాళ్ళకు మీ దగ్గర రావాలంటే భయమే కదా!

"గంటసేపు ఆ గొట్టాలలో కుక్కిన పేలలాగ కూలబడ్డారు. వర్షం కొంత తగ్గింది. మూడు గంటలన్నాడు గడియారం చూచి కాశయ్య. నడవగా పెన్న గట్టు కనిపించింది. పెన్న గట్టున కాళ్ళీడ్చుకుంటూ నెల్లూరు చేరి, సత్రంలో అడుగుపెట్టారు. చురకత్తులూ, పిస్తోళ్ళు గూట్లో పుస్తకాల మరుగున పడవేశారు. నీవు అలా చాపమీద వాలావో లేదో కళ్ళు మూతలు పడ్డాయి. వాళ్ళు వెళ్ళిపోయారు. బి. బాలకృష్ణారెడ్డి తాలూకాబోర్డు ప్రెసిడెంటు కుమారుడు.

"ఉదయం నీకు మెలకువ వచ్చింది. కాని, లేవలేకపోయావు. ఎందుకంటావు? పరుగెత్తేప్పుడు తెలీలేదు గాని, పాదాలనిండా ముళ్ళు; మొద్దుల్లా వాచిపోయాయి. కదలలేక పోయావు. నీవు వారం విద్యార్థివి. సత్యాగ్రహంలో జైలుకు వెళ్ళిన వైష్ణవ విద్యార్థులు తక్కువ గనుక నిన్ను అందరూ ప్రేమతో చూచేవారు. సత్రం ఎదుటే, కిడాంబి వీరరాఘవాచార్యులనే గొప్ప న్యాయవాది. ఆయన నిన్ను పుత్ర నిర్విశేషంగా చూచేవారు. ఆయన నీ కోసం తమ కారు డ్రైవరును పంపుతాడేమోనని గుబులు పట్టుకుంది నీకు. సత్రం ముందు గదిలో గుర్నాథం అనే విద్యార్థి వుండేవాడు. అతడు, నీవేదో దుర్వ్యసనాలలో పడి వుంటావని అనుమానించాడు. ఆ నొప్పులనుంచి తేరుకొనడానికి వారం పట్టింది. అయినా, నీవు పాఠశాలకు వెళ్ళడం మానలేదు, అనుమానిస్తారేమోననే భయంతో.

"మరొకసారి మీ ముఠా కోవూరు దగ్గర పట్టపగలే దోపిడీకి వెళ్ళింది. రెవెన్యూ శిస్తు డబ్బును అధికారులు నెల్లూరుకి చేరవేస్తున్నారు. మొత్తం ముగ్గురు వారు. వారిని కొందరు అటకాయించి మాటల్లో దింపడం, మరికొందరు డబ్బు కాజేయడం – ఇదీ పథకం. నీవు, కాశయ్య, మరికొందరు ఉన్నారు. దారినపోతూ వారిని పలకరించి మాటల్లో పెట్టడం నీవంతు పని. ఊరికి మూడు మైళ్ళు. ముళ్ళల్లో దారి. ఒకవైపు దట్టంగా చెట్లు. పరుగెత్తి కొంతదూరం పోతే దాక్కోడానికి ఏర్పాట్లు అన్నీ ఉన్నాయి.

"రంగంలోకి దిగారు మీరంతా. మిట్ట మధ్యాహ్నం. నీవు నీ పని నిర్వ హించావు గాని, ఎవరివల్ల ఏమి పొరపాటు జరిగిందో, వాళ్ళు అనుమానంతో పరుగెత్తసాగారు. కాళయ్య వాళ్ళు వాళ్ళని కొంతవరకూ వెంబడించారు. ఆ ప్రయత్నం వ్యర్థమైంది. ఇలా మరొకటి" అన్నారు జగన్నాథదాసుగారు.

## వట్టి గప్పాలు

ఇదంతా విని రామమూర్తి "వట్టి గప్పాలు కదూ?" అంటూ విరగబడి నవ్వాడు. నా ముఖం ఎర్రబడింది. ఇంతలో జగన్నాథదాసుగారు నన్ను చూసి "అబ్బాయీ! ఇదంతా సరే. పోలీసులు కొంత బనాయిస్తారు, అణుమాత్రం నిజం వున్నా. ఇదే కుట్ర అంటే" అన్నారు. దేశం కోసం చేసేది కుట్ర ఎలా అవుతుందని నా ప్రశ్న.

"బలేవాడివే. బ్రిటిష్ చట్టం ప్రకారం కుట్ర అంటే ఇదే. ఆ సంగతి అలా వుంచు. నీ మిత్రులను కాపాడుకోవాలని వుందా లేదా?" అనడిగారు జగన్నాథదాసుగారు గట్టిగా.

"ఉంది." అన్నాను దృఢంగా.

"అలా అయితే, ఇంతకు ముందు నీవు విన్న ఈ కథలేవైనా పోలీసులకు చెప్పావా?" అనడిగారు ఆయన. ఏదో చెప్పబోయి నడుమనే

"లేదు" అన్నాను.

"కోర్టులో నాకేమీ తెలీదని చెప్పాలి. మరేదైనా చెప్పావో అందరి ప్రాణాలు పోతాయి. ఇంతకూ మీవల్ల జరిగిందేమీ లేదు కనుక మిత్రుల ప్రాణ రక్షణ ముఖ్యం. ఆ విధంగా చేయి." అన్నారు ఆయన.

"పోలీసులు వేధిస్తారు జాగ్రత్త! నోరు తెరవకు. తెరిచావో రెంటనూ చెడ్డ రేవడవవుతావు. ఇటు మా విశ్వాసం కోల్పోతావు. అటు పోలీసులు నిన్ను వుపయోగించుకొని కుక్కను తరిమినట్టు తరుముతారు." అని హెచ్చరించాడు రామమూర్తి.

నేను సంస్కృత కళాశాలకు తిరిగి వెళ్ళాను. మనస్సునుంచి ఏదో బరువు దిగినట్లనిపించింది.

మైలాపూరు సంస్కృత కళాశాలలో నా చదువు సాగుతూనే ఉంది. దాదాపు ఆరు నెలలు గడిచాయి. ఆరు నెలలలోను వారం వారం రామమూర్తి ఎప్పుడో ఒకప్పుడు వచ్చి నా యోగక్షేమాలు కనుక్కుంటూను, సలహాలిస్తూనూ ఉన్నాడు. మద్రాసు పెనిటెన్షియరీలో నిర్బంధంలో ఉన్న నా మిత్రుల యోగక్షేమాలూ ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉన్నాయి. అయినా కళాశాల అధికారులు నన్ను ఒకకంట కనిపెడుతూనే ఉన్నట్టు నాకు తెలుస్తూనే ఉంది.

సి. ఐ. డి. అధికారులు మునిసందె వేళలో వచ్చి గుసగుసలాడిపోతున్నారు. నేను తప్పించుకొని పోతానేమోనని జాగ్రత్త పడ్డారు. నిజానికి నేను ఎక్కడికి పోగలను? రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యంలో ఎవరైనా తప్పించుకొని పోగలరా?

మద్రాసు కుట్రకేసును గురించి దేశంలోని పత్రికలన్నీ చాలా ప్రచారం చేశాయి. దక్షిణ భారతంలో అది మొట్టమొదటి కుట్రకేసు. కనుక పూర్తి వివరాలు తెలుపుతున్నాయి, నిందితులను రాక్షసులుగా చిత్రిస్తూ, చిలవలు పలవలుగా. అప్పుడు నాకు నా మిత్రులు చేసిన ఉపకారం మరు జన్మలలోనూ— జన్మ అనేది ఉంటే — మరువలేను. కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, దమ్మాల పాటి శేషగిరిరావు (ప్రస్తుతం శ్రీ చిదానంద భారతీస్వాములవారు), కాశీభట్ల రామనాథదత్త నాకు అంగరక్షకులుగా ఉండేవారు.

## మద్రాసు నగరమంతా మావైపే

చివరకు కుట్రకేసు విచారణ తేదీ ప్రకటించారు — 1933 వ సంవత్సరం సెప్టెంబర్ 8 వ తేదీ. ఆనాడు చూడాలి మద్రాసు నగర సంరంభం. ఇరవై మంది యువకుల ప్రాణాల రక్షణకు కంకణం కట్టుకొన్నది ప్రకాశంగారే అయినా, ఆయన వెంట ప్రచ్ఛన్నంగా మద్రాసు నగర మేధావులంతా ఉండే వారు.

పోలీసు అధికారుల సంగతి చెప్పనక్కరలేదు. కేంద్ర ప్రభుత్వ పోలీసు శాఖలోని ఉన్నతాధికారులంతా దిగారు.

కువ్వం నదీతీరంలో చింతాద్రిపేట ప్రాంతంలో ఒక గ్రంథాలయ భవనంలో కుట్రకేసు విచారణకు ప్రత్యేక న్యాయస్థానం ఏర్పాటయింది. భవనం పరిసరాలు పోలీసు బందోబస్తుతో మహాదుర్గమ మయింది. ఆ ప్రాంతంలో పిట్టయినా వాలడానికి వీలులేదు.

మద్రాసు పౌరుల ప్రేమపాత్రుడు ప్రకాశం. ఆంధ్రకేసరి ప్రకాశం పేరు ప్రజల నిత్యజపమయింది. ప్రకాశం వంటివారు చేపట్టిన తర్వాత ఎన్నిగుండెలు బ్రిటిషు ప్రభుత్వానికి యువకులను — దేశంకోసం మంచిని ఆలోచించిన యువకులను — శిక్షించాలంటే — అన్న ఊసడింపు రాష్ట్రమంతటా వ్యాపించింది. విచారణ దినం 1933 సెప్టెంబర్ 8 వ తేదీ రానేవచ్చింది. పోలీసు అధికారులు ఒక వైపు, రామమూర్తి, మిత్రులు మరొకవైపూ నన్ను విచారణకు వెనుకటి దినమే హెచ్చరించారు కోర్టుకు హాజరుకాకపోతే ప్రమాదమని.

స్పెషల్ మేజిస్ట్రేట్ కోర్టు విచారణ ప్రారంభమైంది. న్యాయస్థానం ప్రత్యేక రాజభక్తులతో కిటకిటలాడింది. రక్షణ సంఘం న్యాయవాదులు ఒక వైపు వరుసలో కూర్చున్నారు. మరొకవైపు వరుసలో ప్రాసిక్యూషన్ పక్షపు పోలీసు కమీషనర్, పబ్లిక్ ప్రాసిక్యూటర్ మొదలైనవారు కూర్చున్నారు. నా మిత్రులు ఉక్కు టోపీల రిజర్వు పోలీసుల వ్యానులలో వచ్చారు. నేను పోలీసుల కావలాతో ఒకచోట నిలబడ్డాను. కొన్నాళ్ళపాటు ప్రాసిక్యూషనువారు కేసు వివరించడం జరిగిన తరువాత సాక్షుల విచారణ ప్రారంభమయింది. ప్రకాశం గారు కోర్టులో సాక్షులను ప్రశ్నించడం మొదలు పెట్టారు, మొట్టమొదటి ప్రాసిక్యూషను సాక్షి నేను. నేను బోనులో నిలుచున్నాను. నిందితులైన నా మిత్రులందరూ నన్ను చూచి "జయ్, రామచంద్రాజీ" అన్నారు ప్రకాశం గారు లేచారు. ఆయన కొన్ని దశాబ్దాల క్రితమే బ్రిటిషు ప్రభుత్వం చర్యలకు నిరసనగా వకాలత్ వదిలినవారు. మమ్ములను రక్షించడానికే మళ్ళీ న్యాయస్థానంలో అడుగుపెట్టారు. ఆయన లేచి నిలబడి రంగువెలసిన ఖద్దరు శాలువను కుడి చేతితో తీసి సర్దుకున్నారు. ప్రకాశంగారి వేష భాషలను గురించి అదివరకే పత్రికలు చాల వర్ణించాయి దుబ్బు జుట్టుకు నూనెరాచి దువ్వారని, ఎప్పటిదో నల్లకోటు వద్దనుకున్నారని. ప్రాసిక్యూషన్ వర్గం భయకంపితమైంది క్రిమినల్ కేసులలో ప్రకాశం గారంటే పోలీసులకు అంతకు ముందే సింహస్వప్నం. పోలీసు అధికారులనోట తడి ఆరిపోయింది. స్పెషల్ మేజిస్ట్రేటు ముఖం తెల్లబడి పోయింది. ఆయన లేచి తన చేంబరులోకి వెళ్ళి దుస్తులు మార్చుకొని వచ్చారు. ఆయన పేరు మరచాను. ప్రకాశంగారు నన్ను క్రాసు పరీక్ష చేశారు. దాని సారాంశమే ఇక్కడ ఇవ్వగలిగాను, క్రమం జ్ఞాపకం లేనందున.

"ఏమయ్యా, ఎక్కడ చదువుతున్నావు?"

"మైలాపూర్ సంస్కృత కళాశాలలోనండి."

"ఏమి చదువుతున్నావ్?"

"సాహిత్య శిరోమణండి."

"నీ దగ్గర రివాల్వర్లు అవీ ఉందన్నారే, పోలీసువారు. నీవు రివాల్వరు ఎప్పుడైనా చూదావా?"

"........................"

"ధనుర్బాణాలు చదివి వుంటావు సంస్కృత కావ్యాలలో."

"ఔనండి."

"వాటి నైనా చూచి వుండవు."

"........................"

"పోలీసులు ఆరోపిస్తున్న కుట్ర సంగతి నీకు తెలుసా?"

"ఏమీ తెలీదండి."

ఇలా సాగింది క్రాసు పరీక్ష, గంటసేపు.

"యువర్ ఆనర్! ఏదో గురుకులంలో చదువుకుంటున్న సంస్కృత విద్యార్థిని, ఋషికుమారిని వంటివాడిని తోలుకొని వచ్చి, గాంధీ ఉద్యమంలో అరెస్టయి ఈ నిందితులున్న కారాగారంలో వున్నాడన్న సాకుతో పోలీసులు లేనిపోని సాక్ష్యాలు ఇప్పించడం ఏమి న్యాయమండీ?" అని మేఘగంభీర నిర్ఘోషంతో అన్నారు ప్రకాశం గారు. నిందితులు, రాజభక్తులైన ప్రేక్షకవర్గం కూడా గొల్లున నవ్వారు.

పోలీసులు చాల క్రుద్ధులయ్యారు. నన్ను బోను నుంచి దిగిపొమ్మన్నాడు మేజిస్ట్రేటు. నేను వినయంగా—

"అయ్యా, మేజిస్ట్రేటు దొరగారూ, నేను పోలీసుల మాట వినకుండా నిజం చెప్పాను. నేను వెలుపలకి వెళ్ళిన తర్వాత నన్ను బాధపెట్టి కసి తీర్చుకుంటారనే భయంతో సతమతమవుతున్నాను. తమరు రక్షించాలి." అని కోరాను.

"అలాంటి భయమేమీ లేదు. నీవు స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు." అన్నారు ఆయన.

"అలాటిది ఏమైనా జరిగితే నాకు చెప్పు." అన్నారు ప్రకాశంగారు నా వైపు తిరిగి. న్యాయస్థానం నుంచి వీథిలోకి అడుగుపెట్టాను. సరాసరి సంస్కృత కళాశాలకు వెళ్లాను. నాకన్నా ముందే వెళ్ళింది వార్త.

"నాయనా, నీవు పెద్ద నాయకుడివి (తలైవర్). మేము సర్కారు గ్రాంటుతో సంస్కృత కళాశాల నడుపుతున్నాము. నీబోటివాడు మా వద్ద ఉంటే, గ్రాంట్లు నిలిచిపోతాయి. నీవు వేరే చూచుకో నాయనా!" అన్నారు మా ప్రిన్సిపాల్ మహామహోపాధ్యాయ కరుంగుళం కృష్ణశాస్త్రిగారు. నేను నావల్ల అపరాధ మేమీలేదని, ప్రమాదంలేదని ఎంత వివరించినా ఆయన ఒప్పుకోలేదు. నేను కళాశాల నుంచి వెళ్ళిపోవలసి వచ్చింది.

నడివీథిలో పడ్డాను. ప్రతిచోటా నీళ్ళేగాని తాగడానికి ఒక చుక్కయినా నీళ్ళు లేదని ఒకానొక ఆంగ్ల మహాకవి అన్నట్లు విశాల ప్రపంచం నా ముందు ఉన్నా నాకు ధైర్యంతో సహాయం చేసేవారు ఎవ్వరూ కనిపించలేదు. పోలీసులు పగబట్టారు. పోలీసులలోనూ నాబోటి వారికి అభిమానులుంటారన్న విషయానికి తార్కాణం ఒకటి జరిగింది. నా ఆయుర్వేద గురువర్యులు శ్రీ చింతపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి బంధువు డాక్టర్ సురభి సుబ్రహ్మణ్యం నన్ను మద్రాసు నుంచి వెళ్ళిపొమ్మని రహస్యంగా వర్తమానం పంపారు. ఆయన బంధువొకరు ఉన్నత పోలీసు అధికారి. సురభి సుబ్రహ్మణ్యం ద్వారా నాకు వార్త పంపారు, నా భద్రత కోసం. అప్పుడు నాకు ఆశ్రయమిచ్చినవారు

భారతి పత్రిక సంపాదకులు తిరుమల వేంకట రంగాచార్యులుగారు. నా బందు మిత్రులు నేను ఎక్కడ అడుగుపెట్టినా అనుమానంతో, భయంతో చూచేవారు నన్ను. చివరకు నా రక్తబంధువులు కూడా తమ ఇళ్ళ అరుగు తాకనీలేదు నన్ను. అలాంటి భీకరసమయంలో, దౌర్జన్యవాది అని, విప్లవకారుడని ప్రభుత్వం ముద్రవేసిన వాడికి ఆశ్రయమివ్వడమనేది మహా సాహసమైన కాలంలో మూడు నెలలు మూడు యుగాలుగా కాపాడిన వేంకట రంగాచార్యులుగారి ధైర్యసాహ సౌదార్యాలను నేను ఏమని చెప్పగలను? ఎంత కృతజ్ఞత తెలిపినా ఇంతే అవుతుంది.

మూడునెలల తర్వాత వేంకట రంగాచార్యులుగారిని కష్టపెట్టడం భావ్యం కాదని, మిత్రులు డాక్టర్ సురభి సుబ్రహ్మణ్యం సలహా ప్రకారం మద్రాసు వదలి బళ్ళారికి వెళ్ళాను. బళ్ళారి రైలుస్టేషను దాటి ఆంధ్రనాటక పితామహ ధర్మవరం కృష్ణమాచార్యుల బంగ్లా కాంపౌండువైపు బయలుదేరాను.

నన్నొక హెడ్‌కాన్‌స్టేబులు నేను రైలుదిగినప్పటి నుంచి చాటుగా వెంబ డిస్తున్నాడని నాకేమి తెలుసు? పత్రికలలో పడిన నా ఫోటో చూచి వుంటాడు; విజిల్ వూదాడు. ఇద్దరు పోలీసులు వచ్చారు. నా చెరొకపక్క నిలబడి నన్ను పట్టుకొన్నారు. "నడవండి టౌన్ పోలీసుస్టేషనుకు?" అని మర్యాదగానే అన్నారు. హెడ్ కానిస్టేబుల్ విజయగర్వంతో ముందు నడిచాడు.

పోలీసుస్టేషను చేరాము. హెడ్ నన్ను అక్కడ ఏదో వ్రాసుకుంటున్న ఇన్‌స్పెక్టర్ ముందు నిలబెట్టి, ఎంతోకాలంగా పోలీసులకు కావలసిన అసామీ దొరికాడని సవినయంగా నివేదించాడు. ఇన్‌స్పెక్టర్ నన్ను ఎగాదిగా చూచాడు. చలువచేయని ఎర్రఖద్దరు పంచ, ఉత్తరీయం, ముడివేయక బుజాలపై జీరాడు తున్న జుట్టు, నామాలు - ఇది నా వేషం. కొంచెం నవ్వుతూ "ఏ అసామీ నయ్యా? బలే పట్టుకొని వచ్చావు ఏ వైష్ణవ గుడి పూజారినో?" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"కాదు సార్. అదే సార్. ఔను సార్. అదేదో మద్రాసు మోటారుకేసు సార్. బడా అసామీ సార్. మన పోలీసోళ్ళను మాయచేశాడు సార్." అన్నాడు హెడ్.

"ఏమి మోటారుకేసయ్యా? ఈ స్వామిని చూస్తే మోటారెక్కి వెళ్ళేవాడు గానే కనబడడే?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

నా గుండె వేగంగా కొట్టుకుంటూంది. ఏ మాత్రం ఆత్రం చూపినా, ఇన్‌స్పెక్టర్ అనుమానిస్తాడేమోనని, మౌనంగా అంతా వింటున్నాను. హెడ్ ఘటకేసును జ్ఞాపకపరచుకోడానికి గింజుకుంటున్నాడు. అతని అవస్థ చూచి

భరించలేక మోటారుకేసు కాదు, మద్రాసు కుట్రకేసు - అని అందిద్దామా అని అనిపించింది.

అరగంట గడిచింది వాదోపవాదాలతో. చివరకు ఇన్‌స్పెక్టర్ నన్ను ప్రశ్నించడం ప్రారంభించాడు - "ఎక్కడికి వెళ్ళుతున్నారు? ఎక్కడినుంచి వస్తున్నారు? ఏమి పని?" ఇత్యాదిగా. ప్రాణ విత్తమానభంగమందు బొంకవచ్చు నఘము పొంద దధిప - అని వ్యాసమహర్షి అనుమతించాడు గనుక, నిజానిజాలను మణిప్రవాళంగా చెప్పాను. నేను చెప్పినదాంట్లో నిజమైనది ఒక్కటే - కృష్ణమాచార్యుల బంగ్లా కాంపౌండులో మా పినతండ్రి శ్రీనివాస తాతాచార్యులుగారు ఉన్నారనేది.

ఇన్‌స్పెక్టర్ హెడ్‌వంక చూచి, "సరే. ఈయనను వెళ్ళనీ. బంగ్లా కాంపౌండే గదా? ప్రక్కనే. కేసు జ్ఞాపకం రాగానే పట్టుకోవచ్చులే." అన్నాడు. మంచికేసు వేళ్ళసందులోంచి జారిపోయిందే అన్నట్టు మొగంపెట్టాడు హెడ్. ఎక్కడ తప్పించుకు పోతావులే - అన్నట్టు నావైపు చూచాడు నేను అందరికీ సవినయంగా నమస్కరించి బదుకు జీవుడా అని అనుకుంటూ వచ్చివేశాను.

పోలీసుస్టేషను దాటి మలుపుతిరిగి బంగ్లా కాంపౌండు చేరాను. మా పినతండ్రిగారితో రెండు నిమిషాలు మాట్లాడాను. నా రాక వార్త వెంటనే సుడిగాలిలాగా బంగ్లా కాంపౌండంతా వ్యాపించింది. బంగ్లా కాంపౌండంటే, ఒక పెద్ద ఊరే. అందరూ నేనున్న ఇంటిముంగిట్లో మూగారు. వాళ్ళ దృష్టిలో నేనొక వీరుణ్ని. ప్రశంసా దృష్టితో చూచారు అందరూ నన్ను. పోలీస్ హెడ్ కాన్‌స్టేబిల్ బంగ్లా కాంపౌండుకు వస్తే నేను పట్టుబడడం తథ్యమనిపించింది. అక్కడ ఉండడం అట్టే క్షేమకరం కాదని గబగబా స్నానాదులు ముగించుకొని, రైలుస్టేషనుకు వెళ్ళి కదులుతున్న ఏదో రైలు ఎక్కాను, టిక్కెట్టు లేకుండానే. టికెట్ ఎగ్జామినర్ అడిగితే, "తొందరలో ఎక్కేశాను. నేను వస్తూండగా రైలు కదిలింది." అని క్షమాపణ చెప్పుకోవచ్చునులే అని అనుకున్నాను. వెంటనే బళ్ళారి వదలాలనేది ముఖ్యోద్దేశం. ఎక్కడికైనా వెళ్ళుదాం. అక్కడేదైనా సమస్య వస్తే చూచుకుందాం— అని గుండె దిటవు చేసుకున్నాను.

మా నాయనగారు అదివరకే పోలీసులకు తెలియజేశారు, తమకూ, దౌర్జన్యవాది అయిన తమ కుమారునికీ సంబంధం లేదని. కనుక స్వగ్రామమైన కంప్లీ కమలాపురానికి వెళ్ళడం అనవసరమనుకున్నాను. నే నెక్కిన రైలు ధార్వాడ రైలు. ధార్వాడలో దిగి, అటూ ఇటూ తిరిగాను. మళ్ళీ రైలెక్కి బెంగళూరు మీదుగా మద్రాసు చేరాను.

ఇలా మరి రెండుసార్లూ పోలీసులు వెంటబడ్డారు. నా అదృష్టమో, వాళ్ళ దురదృష్టమో మద్రాసు కాన్స్పిరసీ కేసు అనే రెండు మాటలు వారికి గుర్తు రాలేదు. బదికిపోయాను.

మా కుట్రకేసు స్పెషల్ మేజిస్ట్రేటు కోర్టులో విచారణ తర్వాత హైకోర్టు విచారణకు వెళ్ళింది. న్యాయమూర్తి పాకెన్‌హామ్ వార్డ్ 1934 జనవరి 8 వ తేదీన విచారణ ప్రారంభించారు. విచారణ తంతు ఏప్రిల్ 24 వ తేదీ వరకు జరిగింది. ఆయన నా మిత్రులకు నాలుగు సంవత్సరాలు మొదలు రెండు సంవత్సరాల వరకు శిక్షవిధించారు. హెచ్చు శిక్ష నాలుగు సంవత్సరాలు ముకుందలాల్ సర్కారుకు పడింది. చివరిసారిగా పెనిటెన్షియరీలో వారందరినీ 1934 ఏప్రిల్ చివర కలుసుకొన్నాను.

ఒక ధ్యేయంతో, ఒక ఆదర్శంతో కొన్నేళ్ళు కలిసి ఉండి ఘోర శిక్షలు పొందిన నా మిత్రులను తలచుకొన్నప్పుడల్లా దేశ స్వాతంత్ర్యం కోసం సర్వస్వం అర్పించిన యువత– సుందర భవిష్యత్తును సంభావించుకొంటూ, న్యాయధర్మాలకోసం ఎంతటి సాహసాలకైనా ఉద్యమించే యువత– నా ఎదుట సాక్షాత్కరించి దేహం తన్మయత్వంతో పులకిస్తుంది; మనస్సు దివ్య లోకాలకు రెక్కలల్లార్చుకొని పయనిస్తుంది.

ఆనాటి నా మిత్రులు నేడు వివిధ రంగాలలో నాయకులు. వారికి, మహా నాయకులు కాదగిన నవ యువకుల జీవితాలను రక్షించడానికి-రక్షించడానికే. దశాబ్దాల క్రితమే వదిలిపెట్టిన వకాల్తాను మరల చేపట్టిన ప్రకాశంగారి గంభీర కరుణోదార దివ్యమూర్తికి, ఆయన కనుసన్నలనే ఆనతులుగా భావించి, ఎంతటి త్యాగానికైనా సన్నద్ధులయ్యే న్యాయమూర్తులు బచ్చు జగన్నాథ దాసుగారు మొదలయిన న్యాయవాదుల కీర్తి మూర్తికి అంజలి ఘటిస్తున్నాను.

[ఆంధ్రప్రదేశ్, జూన్ 1972]

★★

# జీవికోపయోగి భాష

"ఇల విద్య లెన్నియైనను, కులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా?" అనేది మన ప్రాచీనుల మతం. ఈ కులవ్యవస్థను బట్టే వృత్తులు ఏర్పడ్డాయి. నిజానికి వృత్తులను బట్టే కులాలు ఏర్పడినా, విచిత్రమేమిటోగాని, కులం బలం పుంజుకొన్నది క్రమంగా. సంఘమంతా కులవ్యవస్థతో ఒక్కటిగా అయి, నిర్దిష్టమైన వృత్తులు ఏర్పడి, తదనుగుణమయిన విద్యలే అభ్యసింపబడుతూ ఎలాటి పోటీకి అవకాశం లేకుండా కొనసాగింది. చదువు చెప్పేవాడు మొదలు చెప్పులు కుట్టేవాని వరకూ, ప్రతివారూ సంఘంలో అత్యవసరమయినవారు గనుక, హెచ్చు లొచ్చు లేమీ లేవు. ప్రతివృత్తీ పవిత్రమైనదే, ప్రతి పనీ ఉన్నతమైనదే అనాడు.

కాని, సంఘంలో ఒకరివృత్తి మిన్న, మరొకరిది చిన్న అనే మనస్తత్వం ఏర్పడిన తర్వాత కొన్ని కులాలు తమ వృత్తులను రహస్యంగా ఉంచడం ప్రారంభించాయి. పృథు చక్రవర్తి భూమిని గోవుగాను, హిమాలయాన్ని దూడగాను చేసి హిరణ్యాది పాత్రలలో వివిధ వస్తుజాతం పిండినాడనే సాంకేతికతనాటి పవిత్రత పోయింది. అరణ్యాలలో గురుసన్నిధిని విషయ పరిజ్ఞానానికి శిష్యుడు సేవ చేసిననాటి పరిశ్రమ పోయింది. మానవ వ్యక్తిత్వ వికాసాన్ని విద్య ముఖ్యంగా ఉద్దేశించిందనే లక్ష్యమూ మాయమయింది. చాణక్యుడు హాస్యంగా ఒక చోట ఎత్తి పొడిచినట్లు ఆయా ఆశ్రమ విభాగంలో ధర్మార్థకామాలు సంపాదించాలనే దృష్టికి విఘాతం ఏర్పడింది. చాణక్యుడు

"ప్రథమే నార్జితా విద్యా
ద్వితీయే నార్జితం ధనమ్,
తృతీయే నార్జితో ధర్మః
చతుర్థే కిం కరిష్యతి?"

అన్నాడు. బ్రహ్మచర్య ఆశ్రమంలో చదవడం, గార్హస్థ్యంలో ధనం సంపాదించడం, వానప్రస్థంలో ధర్మం ఆర్జించడం అవసరం. ఇది జరుగనప్పుడు, నాల్గవసన్యాసాశ్రమంలో ఏమి చేస్తాడు? — అంటాడు చాణక్యుడు. మన ప్రాచీనుల లక్ష్యమైన విద్యాదృష్టి — పారమార్థిక దృష్టి — సన్నగిల్లింది. హిరణ్యకశిపు వంటివాడు, తన పిల్లలను చండామార్కుల వద్ద చదువ వేశాడు గాని, గురువు

లనే చదువు చెప్పడానికి తన యింటికి రమ్మనలేదు. ఇలాటి దృష్టి మాయమై కులాలకు ప్రాధాన్యం ఏర్పడింది.

ఈ ప్రాధాన్యంవల్ల, మన సత్త్వం స్వార్థాన్ని మరగడంవల్ల కొంత హాని జరిగినా, ప్రజల జీవనోపాధికి నష్టం కలుగలేదు. చదువు చెప్పేవాని కొడుకు చదువు చెప్పేవారుగా, కమ్మరం చేసేవాని కొడుకు కమ్మరం చేసేవాడుగా, ఇలాగే ఆయా పనులవారి సంతతి అవిచ్ఛిన్నంగా కొనసాగించింది. దీనివల్ల సంఘంలో ధనస్వామ్యాన్ని బట్టి హెచ్చుతగ్గు లేర్పడినా, విద్య, తత్ప్రవర్తిత మయిన వృత్తి విచ్ఛిన్నం కాలేదు. తండ్రి కుమారునికి తన విద్య, వృత్తి లోని మెలకువలు నేర్పి, అతనిని నేర్పరిని చేసేవాడు; అతడు తన కుమారునికి. ఇలా విద్యా, వృత్తి రహస్యాలు ఒకేచోట రక్షితాలై ఒక విధంగా కౌశలానికి కారణమయాయి; మరొకవిధంగా కాలుష్యానికి కారణమయాయి. ఈ కాలుష్యం కరుడు గట్టింది — జీవికోపయోగి కుల విద్యలు, కులవృత్తులు, చేతిపనులు చిన్నవి; కేవలం ఆముష్మిక విద్యలే మిన్నవి అనేంతవరకు. దీనికి సంఘంలో ఆర్థికంగానూ, బౌద్ధికంగానూ సుప్రతిష్ఠితులు ఆశయ ప్రోత్సాహాలిచ్చారు. తత్ఫలితంగా వృత్తులు - చేతి పనులు - ఈసడింపబడి, మెరమెచ్చుల పనులే మేలైనవనే భావం నాటుకుంది. ఏవో రెండు చిలుక పలుకులు నేర్వడం, ఏ రాజునో, పెద్ద మనిషి అనబడేవానినో ప్రశంసించడం, దానితో ప్రాపకం సంపాదించుకొనడం వంటి పద్ధతి ఏర్పడింది. దీనివల్ల జీవికోపయోగి వృత్తి విద్యలు మరింత మరుగు పడిపోయి, ఆయా కులాలలోనూ అవసన్నాలవుతూ, ఎట్లో ఊపిరి పోసుకుంటూ, పైవారి ఆపు ప్రాపులతో ఎట్లో మనుతూ వచ్చాయి.

ఈ పరిస్థితి కూడా విదేశీయుల పాలనతో తారుమారయింది. భారత దేశంలోని కుల, వృత్తి వ్యవస్థలలో కల్లోలం ఏర్పడింది. కొన ఊపిరితో ఉన్న సంప్రదాయం సంపూర్ణంగా విచ్ఛిన్నమయింది. అంతవరకు ప్రతి వృత్తికీ, ప్రతి శాస్త్రానికీ ఆలంబనమైన సంస్కృతానికి బలం తగ్గింది. పాశ్చాత్య దేశాలలో పారిశ్రామిక విప్లవం ఏర్పడిన పరిస్థితే మన దేశంలోను ఉత్పతిల్లింది. పరపాలనలో పరభాష ప్రధానమై, వివిధ వృత్తులను కల్పించడంతో, అదివరకు ఉన్న వృత్తివ్యవస్థ వ్యత్యస్తమయింది. అట్టడుగున ఉన్నవాడు ఆచార్యుడుగా, అధికారిగా రాగలిగాడు. పైమెట్టున పోతరించి ఉన్నవాడు పడిపోయాడు. దీనితో అదివరకు ఉన్న భాషా మర్యాదలకు, బోధన విధానానికి ముప్పు వచ్చింది.

మనకు అత్యున్నతాముష్మిక భావాలను, ప్రాచీన శాస్త్రాలను బోధించే పద్ధతి ఉన్నత ప్రమాణంలో పెరిగిందనేది నిస్సంశయం. ఇది కులాలవల్లి

వచ్చిన ఒకమేలు. వేదాంత విషయాలు, వాస్తు విషయాలు, ఆయుర్వేద, జ్యోతిష విషయాలు, యోగవిషయాలు బోధించడానికి తగిన పదసంపద ఉంది. జిజ్ఞాసువులు పరంపరగా ఆ విషయాలు గురుముఖంగాను, గ్రంథ ముఖంగాను నేర్చుకొన్నారు, నేర్చుకుంటున్నారు. ఆత్మ, అనాత్మ అంటే సామాన్యునికి స్థూలంగా అర్థమవుతుంది. రాశులు, నక్షత్రాలు అన్నా అర్థమవుతుంది. కాని ఇతర వృత్తుల మాటలు అంతగా తెలియవు; మరుగున పడ్డాయి. నేడు జీవన వ్యవస్థ పూర్తిగా మారింది. వృత్తులు మారాయి. చదువు చెప్పడం ప్రధానమైన వర్గంవారి వారసులు చర్మాల కార్ఖానాలకు యజమానులుగా ఉంటున్నారు. చర్మకారు లనబడినవారు, కర్మ బాహ్యు లనబడినవారు ప్రకృతి మర్మాలు తెలుసుకొనే శాస్త్రాచార్యులవుతున్నారు. సంఘం క్షిపణీ వేగంతో పరుగిడు తున్నది. సూక్ష్మంలో మోక్షం అన్నట్టు, చిట్కాలతో పనులు గడుపుకోవలసి ఉంది. కనుక అత్యవసరమైన భాషనే నేర్పాలి.

సాహిత్యం ఆపోశనం పట్టినవాడే గొప్పవాడనే భావం-భ్రాంతి-ప్రతి దేశంలోనూ నేటికీ ఉంది. ఆ విధంగానే ప్రతి విశ్వవిద్యాలయమూ ప్రతివిద్యా ర్థినీ తీర్చిదిద్దుదామనే కంకణం కట్టుకుంది. ఏటా లక్షల మంది పట్టాలు పుచ్చు కొనడం, అవి తమ జీవికకు ఉపయోగపడక నిరాశ ఆవరించడం, ఆ నిరాశా నిస్పృహలు వివిధవిధాలుగా రూపాలు తీర్చుకొనడం మనం నిత్యమూ చూస్తున్న విషయాలు. ప్రతివాడూ మహా పండితుడు కానక్కరలేదు; జీవిక నిర్వహించు కోలేక నిరాశపడనక్కరలేదు. వృత్తికి జీవికకు భాష నేర్చి బాగుపడితే చాలు.

పాశ్చాత్య దేశాలలో పారిశ్రామిక విప్లవం జరిగిన తర్వాత జీవికోపయోగి భాష విషయంలో శ్రద్ధ ఏర్పడింది, మనకు ఇప్పుడు అవసరమయింది. ఉదాహ రణకు: ఒక స్టెనోగ్రాఫరును తీసుకుందాము. ఒక పత్రికా విలేకరిని తీసు కుందాము. అతనికి మిల్టన్, చాసర్, తిక్కన్లతో అవసరం లేదు. నిత్యకృత్యాలకు అవసరమైన పరిమిత భాషతో, పరిమిత పదజాలంతో కార్యకలాపం నిర్వహి స్తాడు. వ్యాపారసాపారాలన్నీ ఈ పరిమిత పదజాలంతోనే కొనసాగుతాయి. కనుక, మనకు నేడు శరవేగంగా పోతున్న ప్రపంచంలో కావలసింది జీవికా నిర్వహణ, తదావశ్యకమైన భాష.

భాష అన్నప్పుడు నిత్యవ్యవహార నిష్ఠమా, గ్రంథ నిష్ఠమా అన్న వాదంతో నాకు అవసరం లేదు. పామరులకు గూడ సుబోధమై, విషయ నివేదన– వివరణ పరమైన భాష అని నా తాత్పర్యం. నేడు జీవికకోసం వివిధ విషయాలు నేర్చుకోవలసివస్తున్నది. ఒకే విషయానికి జీవితం అంకితం

చేయడం కష్టం. అట్లా చేసేవారు చేయనివ్వండి కాని, అందరూ ఆముక్త మాల్యదను ఈ చివరినుంచీ ఆ చివరివరకు కంఠస్థం చేయాలని అనలేము కదా! కనుక పరిమితమైన వృత్తిపదాలు, జీవికోపయోగి పదాలు చాలును; వాటితో నిత్యకృత్యం నడుస్తుంది. సాహిత్యాభిరుచితో, సాహిత్యంవల్ల మనస్సు వికసిస్తుందన్న ఉత్తమాశయంతో భాషా సాహిత్యాధ్యయనం చేయవచ్చు. కాని, అది నిర్బంధ పఠనీయం కానక్కరలేదు.

జీవికోపయోగి భాష అన్నప్పుడు, తదనుగుణంగానే అధ్యయనాధ్యాపనాలు సాగినప్పుడు, కొంతకాలానికి జాతి మనోవికాసం కుంఠితమై అవనతికి కారణం కాదా?— అని కొందరు పెద్దలు విద్యావేత్తలనబడేవారు ఆక్షేపించారు, ఆక్షేపిస్తారు. ముక్కోటి దేవతలకు ఇంద్రుడొక్కడే అన్నట్టు, దేనిలోనైనా పరాకాష్ఠ అందుకొనేవాడు, తత్ప్రయత్నం చేసేవాడు ఒకడో అరో ఉంటారే గాని, అందరూ ఉండరు. అయినప్పుడు అందరూ అన్నీ చదవాలని నిర్బంధం ఉండడమో, ఆ రీతిగా పాఠ్య ప్రణాళిక రూపొందించడమో ఉచితం కాదు.

పది మందికీ పనికి వచ్చే భాష అన్నప్పుడు, పది విషయాలూ చెప్పవలసిన భాష అన్నప్పుడు, పరిభాష అడ్డం రాదా?— అన్నది కుంటి ప్రశ్న. పరిభాష కాదు ముఖ్యం, భాష ముఖ్యం. పరిభాష, నేడు దేశ కాలాల ఎల్లలు దాటి పరివ్యాప్తమవుతున్నది. ఒక వస్తువును ఏ విధంగా సంకేతించుకొన్నా అర్థం ఒక్కటే. పరిభాష, భాషకు-పదిమందికీ పనికివచ్చే భాషకు పరిచారిక గాని, పట్టపురాణికాదు. పూర్వం సంస్కృత పరిభాషనే వినియోగించుకొన్నాము. నేడూ దానితోబాటు అంతర్జాతీయ పరిభాషనే వాడుకోవచ్చు. మన పూర్వులు ఎలాటి దురహంకారమూ లేక వివిధ శాస్త్రాలకు వివిధ విదేశాల పరిభాషలే కాక, సంప్రదాయాలూ వాడి, తమవి చేసుకొని, మనకు అందించారు. ఆ దారి మనకు ప్రయోజనకరమైనంతవరకు తొక్కుదాము; అంతర్జాతీయ మార్గంతో పాటు ఈ పరిభాషతో, పరిమిత భాషతో అపరిమితంగా సంఘానికి ప్రయోజనం ఉన్నప్పుడు, దాని వ్యాప్తికి పరిశ్రమిద్దాము.

సాహిత్యం మనోవికాసానికి సాధనమన్న మాట నిజమే. కాని, ఏవో రెండు మూడు కావ్యాలు చదివి, అంతే పరమార్థమయినట్లు ఇతర ప్రవృత్తులను, వృత్తులను ఈసడించి, తమ తెలివి తేటలు వెలిగించే వెర్రితలల వారిని నేటికీ పలుచోట్లా చూస్తున్నాము. పూర్వం కవి అన్నా, విద్వాంసుడు అన్నా అర్థం విస్తృతం. కవి అంటే పద్యాలు మాత్రం అల్లేవాడూ, ఏదో రచనలు చేసేవాడూ కాదు. అతడు ద్రష్ట, సకల విషయవేది. విద్వాంసుడన్నా అంతే; అనేక

విషయవేత్త. ప్రపంచం నేడు ఎంత సన్నిహితమౌతున్నదీ, జ్ఞానం ఎంత అనంతంగా విస్తరిస్తున్నదీ, ప్రజల సాన్నిహిత్యంవల్ల ఎన్ని నూతనాంశాలు తెలిసి, చిక్కులు విడిపోతున్నదీ గ్రహించినవారెవరూ, రెండు కావ్యాలు చదివీ, రెండు పంక్తులు వ్రాసీ మిడిసిపడే వారిలాగ ప్రవర్తించరు. కనుక ఏ సాహిత్యమయినా, భాష అయినా వృత్తికి, జీవికకు వినియోగపడేదయి వుండాలి. మానవుడు, మానవ సంఘం సకల విషయాలకు పరభాగాలన్నది పరమార్థం.

ఈ మానవ సంఘం నేడు వాయువేగ మనోవేగాలతో వివిధ రీతులుగా ముందుకు చొచ్చుకొని పోతున్నది. దానితోపాటు మన తెలుగు వారూ భుజం భుజం కలిపి ముందుకు సాగవలసి ఉంది. అందుకోసం, ఎన్నిరంగాలలోనో పోటీ పడవలసి ఉంది. దానికి పరిమిత భాషతో సన్నద్ధులు కావడం అవసరం. అదే జీవికోపయోగి భాష (**Functional Language**). దాని ప్రచారం కోసం, ప్రసరణకోసం మనం నడుంకట్టాలి. "అర్థ కరీ చ విద్యా" అన్న పూర్వుల మాటను సార్థకం చేద్దాం. తెలుగువారు వృత్తి విద్యలో వెనుకబడలేదని నిరూపించుకుందాం.

[ఆంధ్రప్రదేశ్ అధికారభాషా ప్రత్యేక సంచిక]

★★

# సుప్రభాత సుషమ

సుప్రభాత మంటే ప్రాభాతిక మంగళ గీతి. సుప్రభాత సంప్రదాయం మన దేశంలో అతి ప్రాచీన కాలంనుంచే వున్నట్లు కనిపిస్తుంది. రాజమందిరాలలో ప్రాభాతిక మంగళ గీతాలాపన, మేల్కొల్పులు బహుకాలంగా ఉంటున్నట్టే ఆధారాలు ఉన్నాయి.

ఇక సాహిత్య దృష్టితో చూస్తే వాల్మీకి రామాయణం పెక్కు సత్సంప్రదాయాలకు ఆకరమయినట్టే ఈ మేల్కొల్పులకూ ఆకరమయినట్టు తోస్తుంది. తాటకా సంహారానికి విశ్వామిత్ర మహర్షివెంట వెళ్ళిన రామలక్ష్మణులు దారిలో, అడవిలో ఒకచోట రాత్రి ఆకులు పరచుకొని పడుకొన్నారు. తెల్లవారింది. వారిని విశ్వామిత్రుడు 'కౌసల్య పుత్రుడా! రామా!' అంటూ మేల్కొల్పాడు వారు లేచి ప్రాతర్విధులు తీర్చుకొని అధ్వర రక్షణ ధురంధరు లయ్యారు.

"ప్రభాతాయాం తు శర్వర్యాం
విశ్వామిత్రో మహామునిః,
అభ్య భాషత కాకుత్స్థౌ
శయానౌ పర్ణ సంస్తరే.

కౌసల్యా సుప్రజా రామ!
పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల
కర్తవ్యం దైవమాహ్నికం.

తస్యర్షేః పరమోదారం
వచశ్శ్రుత్వా నరోత్తమౌ,
స్నాత్వా కృతోదకౌ వీరౌ
జేపతుః పరమం జపమ్.

(బాలకాండ-అధ్యాయం-23)

రామాయణాన్ని రఘువంశంలో అనుపదం అనుసరించిన కాళిదాసు అజుని మేల్కొల్పాడు వంధి మాగధులతో.

తం కర్ణభూషణ నిపీడిత పీవరాంసం
శయ్యోత్తర చ్ఛద విమర్ద కృశాంగరాగమ్,
సూతాత్మజాః సవయసః ప్రథిత ప్రబోధం
ప్రాబోధయ న్నుషసి వాగ్భి రుదారవాచః. (సర్గ-5, శ్లో-65)

అయితే, ఈ సుప్రభాత సంప్రదాయం దేవాలయాలలో ఎలా వచ్చిం దనేది వివాదాంశంగా ఉంది. వైఖానసాగమాలలో సుప్రభాతం చెప్పడం కనిపించదు, దేవాలయ నిత్యార్చనా విధిలో :

"ప్రతద్విష్ణు స్తవత ఇతి దేవాలయం గత్వా, ప్రదక్షిణం కరోతి. ద్వారపాలం ప్రణమ్య, కవాట బంధం యంత్రికయా నిరస్తమితి స్పృశ్య, హిరణ్య పాణిమితి కవాట ముద్ఘాటయతి, దివం విష్ణుణోత్విత్యంతః ప్రవిశ్య వైష్ణ వై ర్మంత్రైః దేవం ప్రణమ్య, శుభ్రా జ్యోతి రితి దీపముద్దీప్య, శామ్యం త్వితి పాణినా దక్షిణేన వా సంతాద్య, భగవతో బలేనేతి దేవం ప్రార్థయతి."

(వైఖానసే మరీచిప్రోక్తే నిత్యార్చనా విధి-పటలం 43)

"ప్రతద్విష్ణు స్తవతే వీర్యాయ" అనే మంత్రం పఠిస్తూ దేవాలయానికి వెళ్ళి, ప్రదక్షిణం చేసి, ద్వారపాలకులకు ప్రణమిల్లి, 'యంత్రికయా నిరస్తం' అనే వాక్యాలు చెబుతూ తలుపు తాకి, 'హిరణ్య పాణి' అనే వాక్కులతో దానిని తెరవాలి. తర్వాత 'దివం విష్ణుణోతు' అనే మంత్రం పఠిస్తూ లోపల ప్రవేశించి, వైష్ణవ మంత్రాలతో స్వామిని నమస్కరించి, 'శుభ్రా జ్యోతిః' అనే మంత్రంతో దీపం ఉద్దీపింపజేసి, 'శామ్యంతు' అనే మంత్రంతో చప్పట్లు చరచి 'భగవతో బలేన భగవతో వీర్యేణ' అనే సంకల్పంతో స్వామిని ప్రార్థించాలి. ఇదీ పై ఆగమ వాక్యాల అర్థం.

ఆగమంలో లేనిది దేవాలయాలలో ఎలా ప్రవేశించిందనే విచికిత్సతో చూస్తే, విశిష్టాద్వైతులవల్ల ఈ పద్ధతి చాల వైష్ణవ దేవాలయాలలో ప్రవేశించి నట్టుంది. రామాయణం పూర్తిగా ప్రపత్తి శాస్త్రమయిన తర్వాత ప్రతిదానికీ రామాయణం ఒరవడి అయినట్టు, సుప్రభాత గీతం 'కౌసల్యా సుప్రజా రామ'తో పఠించడం ఆచారమయింది.

ఆముక్త మాల్యద-అండాళ్ తిరుప్పావు ప్రాభాతిక గీతమే. అది శ్రీరంగశాయి దేవాలయంలో గానం చేయబడి ఉంటుంది. కాని అది ఉద్దేశ పూర్వకమయిన మేలుకొల్పుగా కనిపించదు. కనుక తొండరడిప్పొడి ఆళ్వార్-

భక్తాంఘ్రిరేణువే దీనికి మూలపురుషుడని, ఆ విప్రనారాయణుడు శ్రీరంగంలో ఈ విధంగా తమిళంలో ప్రాభాతిక గీతం ఆలపించి మేల్కొల్పినట్టు, ఆయన తనియన్‌లో-స్తుతిలో ఉంది. దానికి 'తిరుప్పళ్ళి యెళుచ్చి' అని పేరు-అంటే శ్రీశయ్యా ప్రబోధనం అని అర్థం.

"తమేవ మత్వా పరవాసుదేవం
రంగేశయం రాజవదర్హణీయమ్,
ప్రాబోధకీం యోఽకృత సూక్తి మాలాం
భక్తాంఘ్రిరేణుం భగవంత మీడే."

అని ఆయన సాంప్రదాయికస్తుతి వైష్ణవులు అనుదినం పఠించేది. విప్ర నారాయణుడు "అరంగత్తమ్మా పళ్ళి ఎళుందరుళాయే" (ఓ రంగ నాయకా శయ్యనుంచి మేల్కొని అనుగ్రహించు) అనే శీర్షికతో పది పాశురాలు చెప్పారు.

ఇది శ్రీరంగం దేవాలయంలో ప్రచారంలోకి వచ్చింది. మల్లిక్ కాఫూర్ దక్షిణ విజయంలో దేవాలయాలను ధ్వంసంచేస్తూ వెళ్ళినప్పుడు శ్రీరంగనాథుని ఉత్సవ విగ్రహాలను శ్రీ వేదాంత దేశికులవారు తిరుమలకు తెచ్చి రక్షించినట్టు, తర్వాత గోప దండనాథుని సహాయంతో తురుష్కులను వెళ్ళగొట్టిన తర్వాత పునః ప్రతిష్ఠించినట్టు చరిత్ర.

వేదాంత దేశికుల వారు తిరుమలలో వున్నప్పుడు శ్రీరంగం సంప్రదాయాలు చాలా వ్యాప్తిచెందాయి. వాటితో పాటు నిత్యార్చనా విధిలో సుప్రభాతం చేరి వుంటుందని అనుకుంటాను.

తిరుమలలో నేడు పఠించే సుప్రభాత స్తోత్రం మాత్రం అన్నమాచార్యుల వారు రచించిందనే వదంతి వుంది. ఆయనకు పెక్కు సేవలలో వేంకటేశ్వరుని మామగారుగా భాగం వుండేది గనుక ఆయన రచించి వుండవచ్చు. మంగళాశాసనం శ్రీమణవాళ మహాముని - రమ్య జామాతృ ముని రచించినట్టిది. ఏమైనా తిరుమలలో పఠించే సుప్రభాత స్తోత్ర కదంబంలో కొన్ని కొన్ని శ్రీమణవాళ మహాముని కాలంనుంచే వ్యాప్తి చెందినట్టివని మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం విద్వాంసులు శ్రీ తిరుమల అనందాన్ పిళ్ళై వేంకటాచార్యుల వారు అంటున్నారు.

ఇలా అనడానికి ఒక కారణం వుంది. శ్రీవైష్ణవుల దివ్య తిరుపతులలో ఒక్కటయిన తిరువేంద్రంలోగాని, కేరళలోని గురువాయూరు వంటి తక్కిన సుప్రసిద్ధ దేవాలయాలలోగాని తిరుమలలో వున్నట్టి సుప్రభాత సంప్రదాయం లేదు. అష్టపది మొదలయిన గీతాలు పాడే పద్ధతి ఉంది. అది ప్రాచీన ప్రాభాతిక మంగళ గీతాలాపనలో భాగం.

శైవ భక్తులయిన నాయనార్లలో శ్రీ మాణిక్య వాచకర్ శివ పెరుమాన్ తిరుప్పళ్ళిఎళుచ్చి చెప్పారని తద్జ్ఞులు అంటున్నారు.

అయితే వైయక్తికంగా సుప్రభాత పఠనం గొప్పదని వామన పురాణంలో (14వ అధ్యాయం) చెప్పినట్టు శబ్ద కల్పద్రుమం ఉదాహరించింది:

"సుకేశీ ఉవాచ:-
కింతదుక్తం సుప్రభాతం
శంకరేణ మహాత్మనా,
ప్రభాతే యత్పఠన్ మర్త్యో
ముచ్యతే పాప బంధనాత్."

అని సుకేశి ప్రశ్నించగా, ఋషులు శివుడు చెప్పిన విషయాలు తెలిపి "కుర్వంతు సర్వే మమ సుప్రభాతం" అని ఉపదేశించినట్టు తెలిపి,

"ఇత్థం ప్రభాతే పరమం పవిత్రం
యస్సంస్మరేద్వా శృణుయాచ్చ భక్త్యా,
దుఃఖప్రణాశో నను సుప్రభాతే
భవేచ్చ సత్యం భగవత్ప్రసాదాత్."

అని ఫలశ్రుతి చెప్పినట్టు ఉంది. ఇదే క్రమంగా దేవాలయాలకు ప్రాకిందన్నా తప్పు కాదు.

ఏమైనా, నేడు ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి దేవాలయంలోను విధిగా తిరుమల పద్ధతి సుప్రభాతం ఉషఃకాలంలో వినిపిస్తుంది. ఆ సంప్రదాయం పురస్కరించుకొని మిత్రులు శ్రీ యామిజాల పద్మనాభస్వామి శ్రీదేవీ సుప్రభాతం రచించారు భవతరణానికి. శ్రీ పద్మనాభస్వామి విజయనగర మహారాజ సంస్కృత కళాశాలలో మహోద్దండ పండితుల సన్నిధిలో సంస్కృత సాహిత్యం, సంగీతం అధ్యయనం చేసి, ప్రవీణులయిన విద్వాంసులు; పెక్కు రచనలతో లబ్ధ ప్రతిష్ఠులు. వీరి రచనా రామణీయకానికి ఈ దేవీ సుప్రభాతంలోని ప్రతి పద్య పాదమూ ఉదాహృతే. స్థాలీపులాకన్యాయంగా ద్విత్రి పద్యాలుట్టంకిస్తాను :

"శింజాన నూత్నమణి నూపుర భాసమాన
పాదద్వయీగతిభి రన్విత గీతశబ్దైః,
రంభా కరోతి నటనం విజయార్థబోధైః
శ్రీచక్రరాజ నిలయే! తవ సుప్రభాతమ్."

ఈ పద్యం భావానుగుణమయిన శయ్యతో భక్తులనే కాక, సామాన్య పాఠకులను కూడా ఆకర్షిస్తుంది.

జగచ్చైతన్య కరులైన సూర్యచంద్రులు శ్రీదేవి ఆస్థానులు. ముదల కోసం వేచివున్నారు. ఆమె కరుణాకటాక్షకలన లేనిదే వారు లోకయాత్రలో ప్రవర్తించరు అనే దానిని కవి సుషమా మధురంగా చెప్పారు :

> భానుః ప్రభాత సుషమారుణ బాల భానుః
> ప్రాలేయ భాను రుభయౌ సభయౌ సభాయాః,
> ద్వారి స్థితౌ కురు దయా మభయం భవేచ్ఛ
> శ్రీచక్రరాజ నిలయే తవ సుప్రభాతమ్."

పద గుంభన, శబ్దాలంకార సౌభాగ్యం ఈ పద్యానికి అభయమిచ్చింది. తోటక వృత్తాన్ని కవి ప్రాచీనుల రచనకు దీటుగా నడిపారు :

> "దరహాసలసన్ముఖ చంద్రకళా
> పరిదీపిత సర్వ జగద్భువనే,
> నవ కోకనదోత్సవకారి పదే
> సుపదే కురు మాం సుఫలం లలితే."

ఇలా ప్రతి పద్యాన్నీ ఉదాహరించవచ్చు. శ్రీ పద్మనాభస్వామి తమ సంస్కృత సరస్వతితో భక్తులనే కాక సామాన్య పాఠకులను కూడా ఆనందింప జేస్తూనే ఉండగలరనే నమ్మకంతో, ఆ నమ్మకానికి శ్రీదేవీ చరణానుగ్రహం వారి పద్య పరమాన్నంతోనే కోరుతూ విరమిస్తున్నాను :

> "విధివంచిత జన మండల పరిపూజన సుకృతౌ
> సముదావన ఫలసాధన బలమోదన సుగతౌ,
> మధుమోహన కరుణారస భర బంధురకిరణౌ
> పరమేశ్వరి! లలితే! తవ చరణౌ మమ శరణమ్."

[శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారి దేవీ సుప్రభాతానికి పీఠిక - 1969]

★★

# కవులు ఎప్పుడూ అనుచరులే!

ఇటీవల కొందరు తమకు ఇష్టమైన రచయితల యోగ్యతలను గోరంతలను కొండతలను చేస్తూ, వారు సంఘనాయకులని, నవ సమాజ నిర్మాతలని, క్రాంత దర్శులని ప్రచారంచేస్తూ ప్రజలను మభ్యపెడుతున్నారు. చరిత్రగతి తెలిసిన వారెవరూ ఈ మాటలకు, ప్రచారానికి మోసపోరు. నేడు గాని, నాడు గాని, ఏ నాడు గాని కవులు సంఘాన్ని ఎప్పుడూ నడిపించలేదు సరిగదా సంఘ నాయకులకు అనుచరులుగానే ఉన్నారు.

సంఘం అవసరాలనుబట్టి కళలు, సాహిత్యం మొదలైనవి ఏర్పడుతాయి' రూపు దిద్దుకొంటాయి. సంఘంలో ఏర్పడిన నీతిగాని, వ్యవస్థగాని కాలానుగుణం కాక మార్పుచెందవలసి వచ్చినపుడు గాని, క్రొత్త సంఘ నీతే ఏర్పడవలసి వచ్చినప్పుడు గాని దానిని దార్శనికుడు, లేక తత్త్వవేత్త మొట్టమొదటిసారిగా దర్శిస్తాడు. ఉన్న దానిలో ఈ లోపం వున్నది; మార్పులు అవసరం; మార్పులవల్ల కలిగే లాభం ఏమిటి? — మొదలైన విషయాలను సహేతుకంగా జనానికి వివరించడం కోసం ఆ దార్శనికుడు ప్రయత్నిస్తాడు. దార్శనికుడు అంటే కేవలం జగత్ సృష్టి స్థితి లయాలను గురించిగాని, బ్రహ్మసత్యత్వ జగన్మిథ్యాత్వాలను గురించిగాని ఆలోచించేవాడు మాత్రమే కాదు; సంఘ వ్యవస్థను, తత్పరిణామాన్ని, పరిణామ ప్రయోజనాలను సుదూర దృష్టితో ఆలోచించి నిర్ణయించే సంఘ సేవకుడు కూడా. ఈ దృష్టితో చూచినపుడు సంఘ శ్రేయస్సును ఏ కోణంనుంచి చూచేవానినైనా నేను దార్శనికుడు అంటాను. ఈ దార్శనికుని పరమ ప్రయోజనం మానవాళి సంక్షేమమే గనుక సంఘ సంక్షేమం కోసం చేయవలసిన పనులకు అవసరమైన సాహిత్యంతో తన కార్యక్రమం ప్రారంభిస్తాడు. కార్యవ్యగ్రుడైన అతనిని సాహిత్యమే ఆరాధిస్తుంది. ప్రయోజన గౌరవ లాఘవాలనుబట్టి, లక్ష్యశుద్ధినిబట్టి అతనిని పదజాలం తనంత తానే అనుగ్రహించి అనుసరిస్తుంది. అతని కార్యసాధన పద్ధతిని, ప్రయత్న ఫలోన్ముఖతను, సిద్ధినిబట్టి జనం ఆరాధిస్తుంది; కవులు, గాయకులు అతని పనిని తమ పనిగానే నెత్తిన వేసుకొని అతనికి అనుచరులై గొంతు విప్పుతారు. ఈ ప్రక్రియ ప్రపంచం పుట్టినప్పటినుంచి నేటి వరకు సూతరామూ మారలేదు.

సూర్యాదేవి పూషణ్ కుమారుని వరించింది. వారిరువురి ప్రేమ అచంచలమైనది. ఆమె అతనిని అభిసరించి పెండ్లాడింది. ఇది ప్రపంచంలోనే తొలి స్వయంవరమని నా అభిప్రాయము. వారిరువురి ఈ వివాహం సంఘంలో గొప్ప వ్యవస్థను ఏర్పరచింది. గృహిణికిగల స్థానం, భర్తృ బంధువులకుగల స్థానం నిర్ణయించింది. దూరదర్శులైన వారి ప్రతిజ్ఞలు, వాగ్దానాలు తరువాతివారికి వరవడులై, మంత్రాలై నేటికీ వివాహాలలో ప్రధాన వచనాలైనాయి. వారి మాటలకు, వారి అకుంఠిత దీక్షకు విస్తుపోయిన ఏ మహాకవో, మంత్రద్రష్టో, దానిని గానం చేసినాడు. అది ఋగ్వేదంలో శాశ్వతమైన స్థానం చేకూర్చుకొన్నది.

సంఘంలో కాలానుగుణంగా క్రొత్త నీతి సిద్ధాంతాలు బయలుదేరాయి. అదివరకు అన్న మరణిస్తే అన్న భార్యను దమ్ముడు కట్టుకునే వ్యవస్థపై జుగుప్స ఏర్పడింది. దార్శనికులైన ధర్మశాస్త్రజ్ఞులు ఈ పద్ధతి తప్పని నొక్కి చెప్పారు. దానితో సంఘంలో అన్న భార్య స్థానం తల్లిస్థాయికి హెచ్చింది. అది అప్పటి సంఘానికి అవసరమైనది. దానితో అన్న భార్యను తల్లిగా భావించాలనే నూతన నీతి సంఘంలో పాదుకొన్నది. దాని వైభవ వర్ణనమే వాల్మీకి రామాయణం. ఈ నూతన నీతి వాల్మీక్యుపజ్ఞం కాదు. వాల్మీకి అంతగా చెప్పిన రామాయణం ఉత్తర భారతంలో ఎంతగానో ప్రచారంలో వున్నా, క్రింది కులాల వారిలో అన్న తరువాత అన్న భార్యను వివాహమాడే పద్ధతి నేటికీ పోలేదు.

సంఘంలో కర్మకాండపై అశ్రద్ధ, అనాదరం పెరిగాయి. వర్ణ వ్యవస్థపై తిరుగుబాటు కలిగింది. "కొందరే ఉత్తములు, మరికొందరు అధములు ఎందుకు కావాలి?"—అనే ప్రశ్న పలువురిలో బయలుదేరింది. కేవలం ఆస్తికతా వాదంతో అన్యాయాలు చేయడం జనాన్ని రెచ్చగొట్టింది. ప్రజల హృదయంలో విప్లవం ప్రజ్వరిల్లింది. ఈ విప్లవ జ్వాలను అందుకొన్నాడు గౌతమబుద్ధుడు. తన వాదాన్ని తన ఆచరణతో ప్రచారం చేశాడు. ఆ మహా దార్శనికుని మార్గాన్ని కవులు, మేధావులు, చిత్రకారులు, శిల్పులు తమ రచనతో తీర్చిదిద్దినారు. ఇక్కడ కూడా నూతన వాదానికి తథాగతుడు ఆచార్యుడు కాగా, కవులు మొదలయినవారు అనుయాయులే అయినారు; దేశ విదేశాలకు వ్యాపింపచేసినారు.

కవికుల గురువని వేనోళ్ళ పొగడ్తలు పొందుతున్న కాళిదాస మహాకవి కూడా అనుయాయే అయినాడు గాని నాయకుడు కాలేదు. గుప్త సమ్రాట్టులు తమ కాలంనాటి వ్యవస్థనో, తాము మంచిదనుకున్న వ్యవస్థనో సుప్రతిష్ఠితం

చేయగా, దానిని కాళిదాసు ప్రాచీన వస్తువుల మరుగున సమర్థించినాడు. ఆనాటి కవిగాని, తరువాతి కవులుగాని, సంఘానికి నాయకత్వం వహించలేదు. సంఘ సంస్కర్తలో, శాసకులో, మతాచార్యులో, భక్తులో ధైర్యంతో సంఘంలో మార్పులుచేయగా దానికి వంతపాడడమో, గంతులు వేయడమో తప్ప కవి చేసినది ఏమీలేదు. దార్శనికుడే కవి అ...నప్పుడు, సంగతి వేరు. దీనికి మన చరిత్రలోని భక్త కవులను ఎందరినో పేర్కొనవచ్చు.

సంఘంలో అవసరాలనుబట్టే విశ్వాసాలలోను మార్పులు వస్తాయి. మన దేశంలో అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాల ప్రాదుర్భావం సంఘ అవసరాన్ని బట్టే. ఈ మత ప్రస్థానాచార్యులు కవితలో ఏ మహాకవికీ తీసిపోరు. కాని వారి లక్ష్యం కవిత కాదు. అపవర్గం. ప్రజలను ఈ సంసార తాపత్రయం నుంచి తాము నమ్మిన పద్ధతిలో సముద్ధరించడానికి వారు ప్రయత్నించారు. ఆ ప్రయత్నాలకు కవులు బాకాలు వూదారు; కావ్యాలు రచించారు; నాటకాలు ప్రదర్శించారు, జీవిత వైభవాలు వర్ణించారు.

19వ శతాబ్దంలోను, ఇరవైయవ శతాబ్దంలోను మన దేశంలో జరిగిన ఉద్యమాల సంగతి మనకు పైన పేర్కొన్న సిద్ధాంతాన్ని మరింత స్పష్టం చేస్తుంది. గొప్పగా జరిగిన సంఘ సంస్కరణోద్యమాలకు వీరేశలింగం పంతులు మొదలైన సంఘ సంస్కర్తలు నాయకులయ్యారే గాని ఏ కవి బ్రహ్మ నాయకుడు కాలేదు. వారి ఉద్యమం ఫలోన్ముఖం కావడం చూచి కవులందరు వెంటపడ్డారు. తిలక్‌వంటి దార్శనికుడు, గాంధీజీవంటి తత్త్వవేత్త స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించారే గాని కవులు ఎవరూ తొలుత గొంతు విప్పలేదు. వారికి సమకాలికులయిన మహా కవులు, మహా మేధావులు స్వరాజ్యం నా జన్మహక్కు, సత్యాగ్రహం వంటి ఉద్యమాలను గేలి చేశారు; ఈసడించారు. ఖద్దరు సిద్ధాంతం, ఖద్దరు మనిషి, ఖద్దరు బుద్ధి, ఉత్తర ధ్రువం తెలివి తేటలు - అని ఎగతాళి చేసిన తెలుగు మహాకవి ఒకరు నేడు సహస్రమాస జీవియై వున్నారు. గాంధీ సిద్ధాంతాలను, గాంధీ పద్ధతులను ఈసడించిన ఈయన దేశం స్వతంత్రం కాగానే గాంధీజీ సిద్ధాంతాలను, పద్ధతులను, ఆయన నడకను ఆయన నిర్కావి ధోవతిని, ఆయన బోసి నవ్వును, బోసినోటిలోని తొఱ్ఱను కూడా సుందర, లలితాతిలలిత పదజాలంతో వర్ణించి జాతీయ వాదులను వెనుకకు త్రోసి ముందుకు రావడానికి యత్నించారు : శిష్యవర్గంతో వాటిని - కవితలు, గేయాలు, నాటికలు మొదలైన వాటితో — ప్రచారం కూడా చేయించారు.

గాంధీజీ సత్యాగ్రహోద్యమానికి సేనాని కాగానే మొదట్లో సమకాలిక మేధావులందరు "ప్చ్" అన్నారు. మరికొందరు బాహాటంగానే విమర్శించారు. ఇది అయ్యేపని కాదు, ప్రపంచమంతా వ్యాపించిన బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఈ బడుగు ఎట్లా కదిలిస్తాడు? కొండతో పొట్టేలు ఢీకొనడం వంటిది కాదా? ఏమి వెర్రి వెంగళప్ప! - అని విధవిధాలుగా విమర్శలు చెలరేగినాయి.

గాంధీజీ కవికాదు — అంటే అధికారంలో వున్న అంశ పురుషులకు రచనలు అంకితమిచ్చే కవి కాడు. ఋక్కులలో చెప్పిన నిజమైన కవి. "కవిర్ మనీషి" అన్న పదాలకు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, మహామేధావి. విశ్వరహస్యాలను కరతలామలకంగా తెలిసిన విశ్వస్వరూపుడనే అర్థమేకాని రెండుమూడు గేయాలు వ్రాసి కేకలువేసేవాడు కాడు. ఇది అప్రస్తుతం. గాంధీజీ ద్రష్టఅయిన మహాదార్శనికుడు. భారతదేశ శ్రేయమే కాక విశ్వశ్రేయమే ఆయన లక్ష్యం. లేకపోతే అంతటి శత్రువును బ్రిటిష్ సమ్రాట్టులు ఆదరించి వుండరు. చీటికి మాటికి చిన్న అధికారంకోసం కంఠాలు ఛేదించుకొనే ఈ కాలంలో, మన పరిసరాలలోనే దుర్ఘటనలు తరచు జరుగుచున్న ఈ కాలంలో మహా దార్శనికుడైన గాంధీజీ విలువ ఎంతో మనకు తెలియ వస్తున్నది. ఆయన ప్రయత్నాలు ఫలోన్ముఖం అవుతున్నాయని పసికట్టగానే పలువురు మేధావులు, విశ్వకవులు తమ బిరుదులను, బహుమానాలను వదులుకొని ఆయన అంద చేరారు. ఆయన మాటలకు టీకా, టిప్పణులు, వ్యాఖ్యలు, భాష్యాలు వ్రాయసాగినారే కాని స్వతంత్రించి ఒక్క పలుకు పలక లేదు.

గాంధీజీ చరితం తలచుకొన్నప్పుడు భారత వర్షైకీకరణకు ప్రయత్నించిన కృష్ణుని చరితం ఎట్టఎదుట నిలబడుతుంది. తన కాలంలో పలువురు బలవంతులయిన రాజుల పరిపాలనలోవున్న వివిధ ప్రాంతాల బలం తగ్గించి, బలిష్ఠమైన కేంద్ర ప్రభుత్వం అవసరమని ఊహించిన మహారాజ నీతి దార్శనికుడైన శ్రీకృష్ణుడు వరుసగా ప్రతి బలిష్ఠుడైన ప్రాంతీయ పాలకుని పీచమడచి ఇంద్రప్రస్థాన్ని బలపరచి, దేశంలో తొలిసారిగా కేంద్ర ప్రభుత్వ వ్యవస్థను నిర్మించాడు. ఈ విషయాన్నే ఏ కవీ అంతకుముందుగాని ఆ సమకాలంలోగాని చెప్పలేదు సరిగదా ఊహించనైనా ఊహించలేమ. కృష్ణుని ప్రయత్నాలను గ్రహించిన మేధావులు అనగా — ఋషులు ప్రశంసించినారు; అతనిని దూరదర్శిగాను, పరమాత్మగాను కీర్తించినారు. తరువాత ఈ కవులనబడేవారు కర్రిగావున్న కృష్ణుని శ్యామసుందరుడని, అతని చిన్ననాటి చిలిపి, పోకిరిచేష్టలను లీలలుగాను వర్ణించినారు, అతడు ఏ చేష్ట చేసినా అదొక విలాసమని, ఏ కాకి రెక్క పెట్టు

కున్నా అదొక ఆభరణమని వర్ణించినారు. ఇవన్నీ అతడు జీవితమంతా సాధించిన విజయాలకు కవులు ఇచ్చిన కితాబులు. వ్యాసుడు అంత గొప్ప కవి, తర్వాతి వారికి మార్గదర్శకుడు గదా? సమకాలంలో నాయకత్వం వహించగలిగాడా? దార్శనికుడైన కృష్ణుడే నాయకత్వం వహించాడు. అతనికి వంతపాడాడు వ్యాసుడు.

ఈ విధంగా భారత చరిత్రగతిని పరిశీలించినపుడు దార్శనికులు, సంఘ సంస్కర్తలు, పరిపాలకులు సంఘంలోగాని పరిపాలన వ్యవస్థలో గాని నూతన పరిణామాలకు నాయకత్వం వహించినారే గాని కవులు ఎన్నడూ అగ్రేసరులు కాలేదని, పైవారికి అనుచరులుగానే వున్నారని స్పష్టమవుతున్నది. నాయకులు ప్రవచించిన విషయాలను కవులు, వ్యాఖ్యాతలు తమ వాక్చాతుర్యంతో రచనా వైవిధ్యంతో వివరించినట్టివారే కాని తమంతట తాము ఎప్పుడూ ప్రవక్తలు కాలేదు.

నిజం ఇట్లుండగా నేటి కవులు, తదనుయాయులు వాస్తవ స్థితిని గ్రహించక నేటి వుత్తమ పరిణామాలకు కవులే ప్రవర్తకులని ప్రచారం చేయడం, ఛోటా నాయకులను వీరాధివీరులుగా చిత్రించడం, గడ్డిపోచలను గండు మగలుగా తీర్చిన గాంధీజీతో పోల్చడం విచిత్రమేకాక అసహ్యంగానూ వుంది. ప్రజలు నిజం గ్రహించి కవుల స్థానమేమిటో, నూతన సిద్ధాంతాలను ప్రవచించి సంఘ శ్రేయస్సు చేకూర్చే దార్శనిక నాయకుల స్థానమేమిటో గ్రహించాలి. ఏతావతా, కవులు నాడు గాని, నేడు గాని, మరేనాడు గాని ప్రవక్తలు, నాయకులు కాలేదని, అనువక్తలు అనుచరులు, మాత్రమేనని స్పష్టం.

[భారతి, ఫిబ్రవరి 1976]

★★

# సోషలిస్టు పద్ధతి సమాజ వ్యవస్థలో కళ

సోషలిస్టు పద్ధతి సమాజ వ్యవస్థలో కళ ఏ స్వరూపంలో ఉంటుంది? అనే ప్రశ్నకు నేను 'సంపూర్ణంగా వికసిస్తుంది' అని సమాధానం చెబుతాను. ఒక వాక్యంలో సమాధానం చెప్పినంత మాత్రాన భవిష్యల్లలిత కళా స్వరూప మంతా మీ ముందు వివరించినట్టు, గీచి ముందు పరచినట్టు కాదు. కనుక నా దృష్టిలో సోషలిస్టు పద్ధతి సమాజ వ్యవస్థ ఏమిటో, కళాస్వరూపమేమిటో మనవి చేయవలసి ఉంటుంది.

మనిషి మనస్సు వికసించడంతో ఆవిర్భవించిన జీవి గనుక, కూడు గూడు గుడ్డలతో మాత్రమే సంతృప్తిపడడని సహృదయులైన మీ కందరికీ తెలుసు. ఉదాత్తభావాలు, ఉత్తమ సాధనాలు లేనప్పుడుగూడ మానవుడు తనకు తోచిన రీతులలో, చేజిక్కిన జేగురు మట్టివంటిపదార్థాలతో ఏవేవో స్వరూపాలు, రంగ వల్లులు గీచుకున్నాడు. ఇదే మానవజీవి మనస్సులోని కళాతృష్ణ. ఈ కళా తృష్ణకు పరమావధి ఆనందం పొందడం, ఆ ఆనందాన్ని పొరుగు వారికి పంచడమూను.

మనిషి మారను మారను ఆనందస్వరూప అవగాహనలోను, నిర్వచనం లోను ఎంతో మార్పు వచ్చింది. ఆనందాన్ని మన పూర్వులు ఎంతగా చర్చించి నిర్వచించారనడానికి తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లే తార్కాణం. ఈ ఆనందవల్లి బ్రహ్మానందం ఉత్తమోత్తమమని నిర్వచించడంలో పెద్ద చర్చ జరిపింది ఆనందం అంటే ఏమిటి అని. ఆ చర్చ దీర్ఘతరం గనుక, దానిలోని మానుషానందం గురించిన వాక్యాలు మాత్రమే నేను ఉదాహరిస్తాను :

> "యువా స్యాత్సాధుయువా ధ్యాయకః
> ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా
> విత్తస్యపూర్ణా స్యాత్ స ఏకో మానుష ఆనందః"

ఒక యువకుడు ఉన్నాడనుకుందాము. అతడు మంచి యువకుడు. బాగా చదువుకున్నవాడు. ఉత్తమ గుణాలు కలవాడు. చాలా చురుకైనవాడు. దృఢ సంకల్పుడు. ఆ సంకల్పాన్ని ఆచరణలో పెట్టగల బలం కలవాడు. దృఢ

గాత్రుడు. సమస్త సంపదలతో నిండిన ఈ భూమి అలాటివాని ఆధీనంలో ఉందనుకుందాము. అలాటివానికి కలిగే ఆనందం మానుషానందం.

ఇలాటి ఆనందం కోసమే మానవుడు తన నిత్యజీవితావసరాలు తీరిన తర్వాత ప్రయత్నించాడు. జంతువులు తమను ప్రకృతికి అనుగుణంగా తమంత తాము సరిదిద్దుకుంటాయి. మనిషి తన సమాజం ద్వారా ప్రకృతిని తకు అనుకూలంగా తీర్చిదిద్దుకుంటాడు. దానికోసం శ్రమిస్తాడు. తన సుఖమయ జీవనానికి భౌతికమైన వస్తుసముదాయాన్ని సిద్ధపరచుకొన్నట్టే ఆనందదాయక మైన కళలను సృష్టించుకొన్నాడు. దీనినిబట్టి మనం కళ అంటే ఏమిటో స్థూలంగా నిర్వచించుకోవచ్చు। ఆనందమిచ్చేది సౌందర్యం. సౌందర్య సంధాయకం కళ. దీనినే మిత్రులు రాంభట్ల కృష్ణమూర్తి "జగత్తును సౌందర్య దృష్టితో దర్శించి సుందరంగా చిత్రించేది కళ. కళారూపం ఏదైనా దాని సామాన్య ధర్మం ఇదే." అంటాడు.

కనుకనే మానవుడు తన అవసరాలు తీరిన తర్వాత జగత్సౌందర్యాన్ని అవగాహన చేసుకొని, జగత్తును సుందరంగా మార్చడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు. మానవుడు సమాజంలో భాగమనడం కొత్తగా చెప్పనక్కరలేదు. సమాజమంటే మానవుల గుంపు కాదు. మానవుని మనుగడకు, ఆనందానికి కావలసిన అవసరాలను సమకూర్చేది సమాజం. మానవుడు వ్యష్టిగా ఏమీ చేయ లేడు; కొంత కాలం ఉండవచ్చు పోవచ్చు. కాని, సమాజం జీవనదివలె నిరం తరం ప్రవాహశీలం. సమాజ పరిస్థితులు మెరుగయినకొద్దీ మానవుని శక్తిలోను, కళలలోను మార్పులు వస్తాయి. ఎన్ని మార్పులు వచ్చాయి, ఏయే కాలంలో వచ్చాయి, ఎందుకు వచ్చాయి అనే చర్చతో మిమ్మల్ని విసిగించను. ప్రపం చంలో ఏ మారుమూల ఏ మార్పు వచ్చినా, అది ప్రజా శ్రేయోదాయకమైతే, ఏనాటికైనా మరొక ప్రాంతాన్ని ప్రభావితం చేయడమనేది లోకరీతి గనుక మనదేశంలోను ఎన్నో మార్పులు వచ్చి, నేడు ప్రజలే ప్రజలను ప్రజల కోసం పరిపాలించే వ్యవస్థ ఏర్పడింది. ఇది మరింతగా విస్తరించి వికసించి ప్రజలందరికీ సమానావకాశాలు కల్పించి, సమానత్వానికి దారులు తీర్చడమే సోషలిస్టు పద్ధతి సమాజ వ్యవస్థ అని నేను నమ్ముతాను.

ఇలాటి వ్యవస్థ—నేను సంపూర్ణంగా నమ్మిన సోషలిస్టు పద్ధతి ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పడడానికి ఇప్పుడు పూర్వరంగం సిద్ధమయింది. ప్రతి రంగంలోను అభివృద్ధి కనిపిస్తున్నది. పంచాయతీలు మొదలు పార్లమెంటు వరకు ప్రజా స్వామ్య పద్ధతి సవ్యంగా సాగుతున్నది. ఆర్థికరంగంలో అట్టడుగువారిని మెట్టకు

లాగడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అక్షరమంటే ఏ జంతువు అనే స్థితిపోయి ప్రతివాడూ కనీసపు చదువు చదువుకోవడానికి సకలవిద్యా సౌకర్యాలు ఏర్పడ్డాయి. రాజ్యాంగం అలాటి సౌకర్యాలు ప్రతివారికీ కలిగించింది. పూర్వం కోటికి పడగలెత్తడం గొప్ప కీర్తి. కోటిరూపాయలు సంపాదించిన తర్వాత ధనవంతులు తమ వైభవసూచకంగా ప్రాసాదాలమీద ఒక పతాకం రెపరెపలాడించేవారట. ఇప్పుడు ఎక్కువ ధనసంపాదన, ధనం కూడబెట్టుకోడం మహాపాపం, మహాపరాధామూను. పూర్వం ధాన్యం నిలువచేసి, క్షామకాలంలో పదింతలు, నూరింతలు లాభంతో అమ్మడం అన్యాయం కాదు. నేడది నల్లబజారు. పూర్వం ముఖాన్ని చూచి జీతబత్తేలు. ఇప్పుడు సమానమైన పనికి సమానమైన జీతాలు ఇవ్వాలని శాసనమే ఏర్పడింది. కులాలు వృత్తితో ఏర్పడినట్టివే. వాటిని రూపుమాపాలి. జ్ఞానం ప్రధానం, జన్మ ప్రధానం కాదు అని ఉపనిషత్కాలంనుంచి ఎందరో దూరదర్శులు ఘోషపెడుతున్నా, నిజానికి అలాటి ప్రయత్నం గట్టిగా జరుగుతున్నదీ, జరిగింది నేడేనని నా విశ్వాసం. వర్ణవ్యవస్థ చాల బలమైన సీసపు పునాదులతో పడింది. గనుక త్వరగా రూపుమాసిపోవడం కష్టమైనా, పునాదులు మాత్రం బాగా బీటలువారింది; నేడు కాకపోతే, రేపైనా కూలిపోకతప్పదు. సమాజంలోని వ్యత్యాసాలు వేదకాలంలోలాగా కనిష్ఠస్థాయికి తగ్గాయి, ముఖ్యంగా ఆర్థికరంగంలో.

ఈలాటి స్వర్ణయుగ ప్రారంభంలో, ప్రాంగణంలో ఉన్న నేటి కళాకారుడు పూర్వపు అవరోధాలులేక ముందంజవేయగలస్థితిలో ఉన్నాడు. బుద్ధ జాతక కథలలోని ఒక కథలో చెప్పినట్లు ఏ రాజకుమారుడో యుద్ధరంగం నుంచి తిరిగి వస్తున్నప్పుడు నగర సింహద్వారంగుండా అంతఃపురం వరకు కట్టిన తడకలపై ఆ రాజకుమారుని విజయ వైభవం చిత్రించనక్కరలేదు. అర్ధ శతాబ్దంనాడు వైస్రాయి లార్డ్ వెల్లింగ్టన్ హైదరాబాదు నగరానికి వచ్చినప్పుడు దరిద్రం తాండవమాడుతున్న నగర భాగాలు ఆయన కంటబడకుండా నాంపల్లి స్టేషను నుంచి ఫలక్‌నుమా రాజప్రాసాదంవరకు దారికి యిరుప్రక్కలా పెద్ద తడకలు కట్టించి, వందలమంది చిత్రకారులను రప్పించి చిత్ర విచిత్ర దృశ్యాలు గీయించిన ప్రసిద్ధ చిత్రకారుడు ఖయ్యాం దురవస్థ చిత్రకారులకు నేడు ఉండదు.

మత ప్రసక్తిలేని మన లౌకిక రాజ్యాంగం బలపడి ప్రజాస్వామ్యం విస్తరించినకొద్దీ ప్రతివారికి కళారాధన వాంఛ కలుగుతుంది. కళానుభూతికి అవకాశాలు ఏర్పడుతాయి. సకల రంగాలలోను వ్యత్యాసాలు తగ్గించి ప్రజాస్వా

మ్యాన్ని విస్తరింపజేయడమే సోషలిస్టు పద్ధతి సమాజ వ్యవస్థ అని నేననుకుంటు న్నానని ఇదివరకే మనవి చేశాను.

ఈ వ్యవస్థలో కళ సమాజాశ్రయంగా వికసిస్తుంది. కళాకారుడు చాల వికసించి, ఇతరులనూ వికసింపజేస్తాడనడం నిశ్చయమని నా నమ్మకం. ఆ నిశ్చయంలోని అంశాలను ఈవిధంగా క్రోడీకరిస్తాను :

1. కళకు సామాజిక వాస్తవికత విషయమవుతుంది. మనదేశంలో ఎన్నో ఉపజాతులు ఉన్నాయి. వివిధ ఉపజాతుల పద్ధతులను ఏకంచేసే, మణి మాలలో దారంలాటి జాతీయత కళారీతి అవుతుంది. కళ ఏ రాష్ట్రానికారాష్ట్రం సంపూర్ణంగా వికసించినా, జాతీయభావన, సోషలిస్టు పద్ధతి సమాజమనే ఏకభావనా సూత్రబద్ధమవుతుంది.

2. ప్రజల సుఖమయ జీవితం పెరగడంతోపాటు వారి సౌందర్య పిపాసా, సౌందర్యోపాసనా ఆనాటికానాడు పెరుగుతాయి గనుక, చిత్రకారునికి చేతినిండా పని ఉంటుంది. కళాఖండాల సంచయం విషయంలో వ్యష్టిభావం పోయి, సమష్టిభావం ఏర్పడుతుంది. అంటే ఎవడో, ఏరాజో, సేనావతో తన సౌధాలం కరణకు కళాకారులతో వెట్టిచాకిరీ చేయించుకోవడం వంటిదికాక, ప్రతి కళా ప్రియుని ఇల్లూ, ప్రతి సమాజభవనమూ, కార్యాలయాలూ చిత్రాలంకరణ విలసితాలవుతాయి. గొప్పవారనబడినవారు ఏనాడో సేకరించి తమ భవనాలలో బందెలో పెట్టిన అపూర్వ కళాఖండాలు మ్యూజియంలకు తరలివస్తాయి. నగరాలలోనే కాక, ప్రతిచోట కళా సంగ్రహాలయాలు వెలుస్తాయి. ప్రభుత్వ సంస్థలు కళాకారుల కళా ఖండాలను సేకరించి భద్రపరుస్తాయి.

3. తరతరాల మానవజాతి రూపొందించి, సంగ్రహించిన సౌందర్య సంపద, వాస్తవికతా విధానం పునాదిగా కళాకారుడు సమాజ స్పృహతో సృష్టికి పూనుకుంటాడు. నవసమాజంపై అచంచల నిష్ఠతో, స్వేచ్ఛతో కుంచె ఎత్తు తాడు. వ్యక్తుల ఇష్టానిష్టాలకు లోబడి కళాసృష్టి చేసే దుర్గతి ఉండదు. మన దేశం, మన ప్రజలు, మన సమాజం అనే అభిమానం ఏర్పడుతుంది. తన అభివృద్ధికి, తన తోటి ప్రజల అభివృద్ధికి దోహదం చేసిన సమాజం కదా! తన ఉన్నతికి, తన వికాసానికి తోడ్పడుతున్న ప్రజలు కదా! ఎన్నో సహస్రా బ్దాలుగా, ఎన్నో కళా రీతులను పొదివికొని, ఎన్నింటి సౌందర్యాలనో భద్ర పరచుకొని తన కందించిన దేశం కదా! కనుక అభిమానంతో తదనుగుణంగా తన కళను రూపొందించుకొనే ప్రయత్నం చేస్తాడు; అప్పటికి సమాజాభిరుచికి, కళాకారుని అభిరుచికి భేదం అంతగా ఉండదు గనుక, దాదాపు ఒక్కటే కనుక.

4. నిజమైన ప్రణాళిక రూపొంది, నిజమైన కళాకారుని విలువ పెరుగు తుంది. ఇప్పుడు ప్రసిద్ధులైనవారు ఎంత మంది నిజమైన కళానైపుణ్యంతో

ప్రసిద్ధులైయారో మనకు తెలియని విషయం కాదు. కొంతమంది కళాకారులకు కుంచె కదపడం కంటె, కుర్చీలు కదపడం బాగా తెలుసు; రంగులు కలపడం కంటే హంగులు చేయడం బాగా వచ్చు. జగత్తును సౌందర్య దృష్టితో పరిశీలించడంకంటే అధికార జగత్తు మనో వికారాలను పరిశీలించి, పబ్బం గడుపుకోడం బాగా తెలుసు. సోషలిస్టు పద్ధతి సమాజ వ్యవస్థలో అలాటివారి ఆటకట్టని నా నమ్మకం. నిజమైన నైపుణ్యానికి నికరమైన గౌరవం, ఆదరం ఉంటాయి.

5. ఇప్పుడు జరుగుతున్న పోరాటాల చిత్రాలు చారిత్రక కళాఖండాలుగా విరాజిల్లుతాయి. ఈ సమయంలో మానవుడు - మనదేశంలోని సామాన్య మానవుడు మొదలు సంఘ వ్యవస్థలో నవచైతన్యం నింపాలనుకునే ప్రతి అభ్యుదయ వాదీ పడుతున్న, ఎదుర్కొంటున్న సంఘర్షణలన్నీ భావియుగానికి చరిత్రగా నిలుస్తాయి. అవి కళాసృష్టికి విషయాలవుతాయి.

ఈ వర్ణయుగ భావనకు ముందు కళాకారులు చేయవలసిన, లేక ఊహించవలసిన విషయం ఒక్కటుంది. ఆత్మాశ్రయత పేరుతో, వాస్తవికత పేరుతో, సహజవాదం పేరుతో, సాంకేతికత పేరుతో నేడు కళాకారులు ప్రజలకు దూరమై పోతున్నారు. ఈనాటి చిత్రకళలో రంగులే కాని రూపాలు కనిపించవు. రంగుల రంగరింపుతో చిత్రకారుడు వెల్లడించ దలచిన భావం చిత్రకారుని భావాలతో సాన్నిహిత్యం లేనివారికి అర్థంకావు. ప్రేక్షకులు వాటిని చూచి తికమక పడిపోతారు. కొందరు విమర్శకులు వాటిని సాంకేతిక ప్రావీణ్యంతో పరిమళిస్తున్నాయని మెచ్చుకుంటారు. కళాకారునికి ప్రజలతో సంబంధం ముఖ్యం. ప్రజల జీవితంతోను, వారి ఆశయాలతోను సంపూర్ణ పరిచయం ఉండాలి. ప్రజలతో సన్నిహితంగా ఉండని కళ, ప్రజలను రంజింపజేయదు; ఎక్కువ కాలం నిలువదు. ఒకవేళ నిలిచినా మ్యూజియం గదుల మూలలలో మాత్రమే నిలిచి ఉంటుంది కనుక కళాకారులు తమ సాంకేతిక ప్రావీణ్యంతో పాటు భావనలో ప్రజల సాన్నిహిత్యాన్ని సొంతం చేసుకోవాలని కోరుతున్నాను. అప్పుడే వారు ప్రజల హృదయాలను అధిష్ఠిస్తారు.

ఇప్పుడు మరొకమారు మొదటి ప్రశ్న వేసుకుంటాను. సోషలిస్టు సమాజ వ్యవస్థలో కళాస్వరూపం ఎట్లా ఉంటుంది? - అని. సర్వతోముఖంగా వికసిస్తుంది. కళాకారుడు మర్యాద, మన్నన చూరగొంటాడు - అని సమాధానం మరొకమారు చెబుతాను పునరుక్తి అయినా.

[1976 జనవరి 6, 7, 8, 9 తేదీలలో కళాభవన్‌లో జరిగిన ఆంధ్ర ప్రదేశ్ లలితకళా అకాడెమీ ప్రథమ కళాకారుల మహాసభలో చదివిన వ్యాసం. ఆంధ్రభూమి, 25-1-76]

★★

# నూతన దృక్పథం - కొమఱ్ఱాజువారు

తెలుగుజాతి సర్వతోముఖ వికాసానికి, ముఖ్యంగా తెలుగు సారస్వతాభ్యుదయానికి అహరహం కృషిచేసి, స్వల్ప జీవితంలోనే వివిధ రంగాలలో - సాహిత్యంలో, విమర్శలో, చరిత్ర రచనలో, శాసన పరిశోధనలో మౌలికమైన కృషి చేసిన మహనీయులలో ఒకరు కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు. ఆయన 1877 వ సంవత్సరం మే నెల 18 వ తేదీన కృష్ణా జిల్లా నందిగామ తాలూకా పెనుగంటి ప్రాంతంలో జన్మించారు.

ఆయన జన్మించేనాటికి 19 వ శతాబ్దంలో మూడువంతులు గడచిపోయాయి. కందుకూరి వీరేశలింగం పంతులుగారు ప్రారంభించిన సాంఘిక సాహిత్యోద్యమాల ప్రభావం జనంపై అప్పుడప్పుడే పడుతున్నది. ఆంగ్ల విద్యాభ్యాసం వల్ల కలిగిన సంస్కార దృక్పథం సంఘంలోని ఉన్నతవర్గాలకు నూతన దృష్టి కలిగించింది. విద్యావంతులపై నవీనోద్యమాల - బ్రహ్మసమాజ, ఆర్యసమాజ, దివ్యజ్ఞాన సమాజాల ప్రభావం ప్రసరించింది. ఈ ఉద్యమాలవల్ల ఆంధ్రప్రాంతంలోని సాంఘిక, సాంస్కృతిక రంగాలలో ప్రశంసనీయమైన ఫలితాలు ఏర్పడ్డాయి. 19 వ శతాబ్ది సమాప్తమయ్యే కాలానికి లక్ష్మణరావుగారు పట్టభద్రుడైన 23 సంవత్సరాల నవ యువకుడు. వీరేశలింగం గారి కాలంలో ప్రవర్తితమైన పెక్కు నూతన ప్రక్రియలను, ముఖ్యంగా చరిత్ర రచన, పరిశోధన, శాస్త్రీయ విజ్ఞానం మున్నగు వాటిని నూతన దృక్పథంతో ఉద్యమ స్థాయిలో సాగించడానికి పూనుకున్నారు లక్ష్మణరావుగారు. ఆయనతోనే సాహిత్య, సంఘసంస్కరణలలో జాతీయతా దృక్పథం కలిగిందనవచ్చు.

లక్ష్మణరావు గారి వంశం పేరు ప్రతిష్ఠలు సంపాదించి నట్టిది; పరమ మాహేశ్వరుల జననంతో పవిత్రమైనట్టిదీని. ఈ వంశం మూలపురుషుడు కొమఱ్ఱాజు. ఈయన 1530 ప్రాంతంలో మిగుల విఖ్యాతుడు. ఈయనకు ఏడవతరంలో శంకరుడు అనేవారు జన్మించారు ఈయన గొప్ప శివభక్తుడు. ఈయన దుర్గ మాట విని లెక్కజేయక శ్రీశైలం చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసిన శైవ దీక్షాపరుడు, "పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహోత్సవ స్వాంతుడు. చంద్రమఃకళామౌళి ప్రియుడు." ఈయన కుమారుడు నాగేశుడు,

ఈయన తరువాత లక్ష్మణరాయడు, ఈయన పుత్రుడు వెంకటప్పయ్య ఈయన సుపుత్రరత్నం లక్ష్మణరావుగారు. ఈయనకు తాతపేరు పెట్టారు.

తండ్రి వెంకటప్పయ్య మునగాల రాజాగారి వద్ద దివానానుగా ఉండే వారు. ఆయన లక్ష్మణరావు గారికి మూడేళ్ళు నిండకముందే పరలోకగతు లయారు. లక్ష్మణరావు గారికి ఒక జ్యేష్ఠ సోదరి, రెండేళ్ళు పెద్దది ఉండేవారు. తల్లి గంగమ్మగారు భువనగిరిలో పనిచేస్తున్న సవతి కొడుకు శంకరరావు గారి వద్దకు ముక్కు వచ్చలారని ఇద్దరు పిల్లలతోను చేరారు. అందువల్ల లక్ష్మణ రావు గారి చిన్ననాటి విద్యాభ్యాసం భువనగిరిలోను, దేవరకొండలోను జరిగింది.

లక్ష్మణరావు గారి మేనమామ లిద్దరిలో ఒకరు భండారు మాధవరావు, అప్పటి మధ్య పరగణా (సెంట్రల్ ప్రావిన్స్) రాజధాని అయిన నాగపూరులో పి.డబ్ల్యుశాఖలో ఇంజనీరుగా పనిచేసేవారు. రెండవవారు దండపాణి ఖడ్గపూరులో రైల్వేశాఖలో పెద్ద ఉద్యోగంలో ఉండేవారు. గంగమ్మగారు లక్ష్మణరావుగారి ఉన్నత విద్యాభ్యాసం కోసం తన సోదరుడైన భండారు మాధవరావు వద్దకు వెళ్ళింది. లక్ష్మణరావుగారు నాగపూర్‌లోని మారిస్ కళాశాలలో చేరి పట్టభద్రు లయ్యారు. ఇంతలో మాధవరావుకు పత్నీ వియోగం సంభవించింది. గంగమ్మ గారు తన కుమార్తె, లక్ష్మణరావుగారి అక్కయ్య అచ్చమాంబను తమ్మునికిచ్చి వివాహం చేశారు.

లక్ష్మణరావుగారు మారిస్ కళాశాలలో చదువుకొనే రోజులలోనే, మహా రాష్ట్ర భాషలో పాండిత్యం సంపాదించారు. మహారాష్ట్ర పత్రికలలో భావగీతాలు ప్రచురించేవారు. ప్రహసనాలు వ్రాసేవారు. ఒకసారి ఒక తమాషా జరిగింది. ఆయన విద్యార్థిగా ఉన్నప్పుడు భార్యా వియోగంపై ఒక భావగీతం ప్రచు రించారు. అది చదివి లక్ష్మణరావుగారికి నిజంగానే భార్యా వియోగం సంభ వించిందని నమ్మి, సహాధ్యాయులు, స్నేహితులు పరామర్శించడానికి వచ్చారట. ఆయన పకపక నవ్వి వారికి ఆశ్చర్యం కలిగించారట! అప్పటికి ఆయన అవివాహితులు! 'వృద్ధవివాహ్' అనే ప్రహసనం ప్రచురించగా దానిని చదివి మాధవరావుతో పరిచయమున్న ఒక ముసలి వైద్యుడు అది తనను ఉద్దేశించే వ్రాసిందనే కోపంతో మాధవరావు వద్దకు వచ్చి, పత్రిక చూపించి మండి పడ్డాడట! ఒక ముసలి మగడు తన భార్యను అనుమానంతో, బాదస్తంతో పెట్టే బాధలు ఆ ప్రహసనంలో వర్ణించారు లక్ష్మణరావుగారు. ఛలోక్తులతో, మాధవ రావు ఆ వృద్ధ వైద్యుని సమాధానపెట్టి పంపారట. దీనినిబట్టి లక్ష్మణరావుగారు మహారాష్ట్రలో సర్జనాత్మక కృషిలో ఎంతటి నిపుణులో మనం గ్రహించవచ్చు.

ఆయన మహారాష్ట్ర భాషలో చేయితిరిగిన రచయిత కావడమే కాక పరిశోధకుడుగాను, విమర్శకుడుగాను విఖ్యాతులయారు. మోరోపంత్ అనే కవి మహారాష్ట్రలో రచించిన మహాభారత కర్ణపర్వాన్ని ఆయన పరిష్కరించి ప్రచురించారు. పండితులు ఆయనను ప్రామాణికులైన పరిష్కర్తగా పరిగణించారు. సమాచార్, వివిధ జ్ఞానవిస్తార్‌లలో ఆయన వ్యాసాలు మున్నగునవి వ్రాయడమేకాక, వాటికి సంపాదకత్వం కూడ నిర్వహించారు. రామాయణంలోని పంచవటి ఏదనేవాదం చెలరేగినప్పుడు ఆయన బాలగంగాధర తిలక్ వంటి ఉద్దండ పండితులతో తలపడి భద్రాచలం సమీపంలోని నేటి పర్ణశాల ప్రాంతమే నాటి పంచవటి అని సోపపత్తికంగా నిరూపించి పండితులను ఒప్పించారు. మహారాష్ట్ర భాషారచనా వ్యాసంగంలో ఉన్న లక్ష్మణరావుగారు తమ మాతృభాష విషయంలో అశ్రద్ధ చూపలేదు. తాము అధ్యయనం చేయడమేకాక తమ సోదరి బండారు అచ్చమాంబ కూడ విదుషీమణి అయ్యేట్టు చేశారు.

లక్ష్మణరావుగారు 1900వ సంవత్సరంలో పట్టభద్రులయ్యారు. తల్లి గంగమ్మగారికి తన కుమారుడు తండ్రిలాగే మునగాల పరగణాకు దివానుగా ఉండాలనే కోరిక ఉండేది. ఆ కోరిక నెరవేర్చడానికి లక్ష్మణరావుగారు పూనుకున్నారు. నాగపూరు నుంచి మునగాలకు వచ్చారు. అప్పుడు మునగాల పరిస్థితి అల్లకల్లోలంగా ఉంది. రాజాగారు మరణించారు. సంస్థానం వారసత్వం ఎవరిదన్న విషయం వ్యాజ్యంలో పడింది. రాణి అచ్చమ్మారావుగారు నాయని వేంకట రంగారావును దత్తత తీసుకొన్నారు. రాణి పుట్టింటివారు ఆమెతో వ్యాజ్యానికి దిగారు. మైనరు వెళ్ళని వేంకట రంగారావు పక్షాన సంస్థాన నిర్వహణకు బ్రిటిషు ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. మైనరు రాజా బందరులో కళాశాలలో విద్యాభ్యాసం చేస్తున్నారు. ఇది అప్పటి పరిస్థితి. ఇది సర్దుకోడానికి కొంతకాలం పట్టింది. లక్ష్మణరావుగారు వేచిఉన్నారు. మైనరు రాజా వేంకటరంగారావుతో ఆయనకు స్నేహం కుదిరింది. ఆయన తెలివితేటలకు, ఉన్నత లక్ష్యాలకు మైనరు రాజాగారు ముగ్ధులయ్యారు. ఈలోగా లక్ష్మణరావుగారు 1903లో కలకత్తా విశ్వవిద్యాలయం ఎం.ఏ. పరీక్షలో తత్త్వశాస్త్రం ప్రధాన విషయంగా ఉత్తీర్ణులయ్యారు; దివాన్ పదవిని స్వీకరించారు. నాయనివారి మైనారిటీ వెళ్ళింది. పరగణా పరిపాలన చేతికివచ్చింది. కాని వ్యాజ్యాల బెడద మాత్రం పోలేదు. ఈ వ్యాజ్యాలు దాదాపు 42 సంవత్సరాల పాటు సాగాయట: ఇవి హైకోర్టుకు, ప్రివీ కౌన్సిలుకు కూడా వెళ్ళాయట.

లక్ష్మణరావుగారు దివాను కావడంవల్ల ఈ వ్యాజ్యాలకోసం మద్రాసులో వుండవలసి వచ్చేది. దీనివల్ల వరగణాకు మాత్రమేకాక తెలుగుదేశానికి, సాహిత్యానికి చాల మేలు చేకూరింది.

ఆ కాలంలో సంస్థానాధీశులు, జమీందారులు అంటే, బ్రిటీషు వారికి తాబేదార్ల వంటివారేనని చెప్పాలి. తమ రాజ్యాలు, జమీందారీలు నిలబెట్టుకోడానికి వారు బ్రిటిష్ వారిపట్ల భయభక్తులు చూపక తప్పేదికారు. కాని, రాజా నాయని వేంకట రంగారావు అలాటివారు కారు. గొప్పదేశభక్తులు. లక్ష్మణరావుగారూ దేశాభిమానులు, తిలక్, గోఖలేలవద్ద శిక్షణ పొందినవారూ కాబట్టి, ఆయన ప్రోత్సాహంతో ప్రజోద్యమాలకు సహాయపడేవారు రాజాగారు దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించాలని కూడా ఆయన సంకల్పించారు.

1905లో వంగరాష్ట్రాన్ని బ్రిటిష్‌వారు విభజించారు. దీనితో దేశంలో భయంకరమైన విప్లవజ్వాలలు చెలరేగాయి.రాజకీయోద్యమం దేశం నాలుగంచులా వ్యాపించింది. పాల్, లాల్, బాల్ అనే త్రిమూర్తులు బిపిన్ చంద్రపాల్, లాలా లజపత్‌రాయ్, బాలగంగాధర తిలక్ దేశవ్యాప్తంగా ప్రసంగించి ప్రజను బ్రిటిష్ వ్యతిరేకోద్యమోన్ముఖులనుగా చేశారు. అప్పుడు బిపిన్ చంద్రపాల్ దక్షిణ భారత పర్యటనలో ఆంధ్ర ప్రాంతానికి వచ్చారు. రాజా నాయని వేంకట రంగారావుగారు ఆయనకు రాజమహేంద్రవరంలో స్వాగతమిచ్చారు; ఆంధ్ర ప్రాంత పర్యటన ఏర్పాటు జరిపారు; బెజవాడలో బిపిన్‌చంద్రపాల్‌కు జరిగిన సన్మాన సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఉండి నిర్వహించారు. అంతేకాక 1907లో జరిగిన కృష్ణాజిల్లా రాజకీయ మహాసభలకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఉన్నారు. ఈ సభలకు ఆహ్వానసంఘ కార్యదర్శి లక్ష్మణరావుగారు. ఈ సంఘటనలనుబట్టి నాయని వేంకట రంగారావుగారు ఎంత ప్రగాఢ దేశభక్తులో ఆ కాలానికి ఎంతటి ధైర్యంతో ఎదురీదారో తెలుస్తుంది. వీరిద్దరూ అఖిలభారత కాంగ్రెస్ సభలకు హాజరయ్యేవారు.

లక్ష్మణరావుగారికి అభిమాన విషయం తత్త్వశాస్త్రమయినప్పటికీ పెక్కు సాహిత్యాలలోను, శాస్త్రాలలోను పాండిత్యం ఉండేది. చరిత్ర, భాషాశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, లలితకళలు, మతం, దర్శనాలు మున్నగువాటిలోను ఆయన ప్రశంసనీయమైన పాండిత్యం సంపాదించారు. హిందీ, బెంగాలీలలోను, ద్రవిడ భాషలయిన కన్నడ, తమిళాలలోను ఆయనకు మంచి ప్రవేశం ఉండేది. ఇంత జ్ఞానం, ఇంతటి దేశభక్తి ఉన్నవారికి దేశంకోసం, భాషకోసం గొప్పపనులు చేయాలని సంకల్పం కలుగడం సహజం. తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం

చేయాలనే ఉత్సాహాతిశయంతో ఆయన "విజ్ఞానచంద్రికా గ్రంథమండలి" అనే గ్రంథ ప్రచురణ సంస్థను 1906లో స్థాపించారు. దానితో రాజా నాయని వేంకట రంగారావు, లక్ష్మణరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, డాక్టర్ ఆచంటలక్ష్మీపతి గార్లు సభ్యులు; ఆదిరాజు వీరభద్రరావుగారు కార్యనిర్వాహక సహాయకులుగా ఉండేవారు. ఈ గ్రంథమండలి ప్రధాన కార్యాలయం మొదట హైదరాబాదు, తర్వాత మూడు నాలుగు సంవత్సరాలకు రాజకీయోద్యమాల కారణంగా మద్రాసుకు మార్చబడింది. మహాపురుషుల జీవితాలు, దేశచరిత్రలు, విద్యాభిరుచి కలిగించే మౌలికమైన నవలలు, వివిధ ఆధునిక విజ్ఞానశాస్త్ర గ్రంథాలు కారు చౌకగా ప్రచురించి పాఠకులకు అందజేస్తానని ఈ గ్రంథమండలి చేసిన ప్రతిజ్ఞను నిలబెట్టుకుంది. ఈ గ్రంథ మండలి ప్రచురించిన మొదటి గ్రంథం "అబ్రహాము లింకను." కడు బీద కుటుంబంలో పుట్టి స్వయంకృషితో పైకివచ్చి అమెరికా అధ్యక్షుడై నీగ్రో హక్కులకు మానవులంతా ఒక్కటేననే సూత్రంతో పోరాడిన అబ్రహామ్ లింకన్ జీవితాన్ని గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారు అత్యంత మనోహరోదాత్త శైలిలో వ్రాశారు. గ్రంథ మండలి సభ్యులు వ్రాసే గ్రంథాలకు ప్రతిఫలం ఉండేదికాదు. కాని, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు మొదట్లో మరొక జీవనోపాధి లేనందున ప్రతిఫలం పుచ్చుకొనేవారు. "అబ్రహాము లింకను" అప్పుడు ఆంధ్రదేశంలో జాతీయోద్యమం విస్తృతికి ఎంతగానో తోడ్పడిందనడంలో సందేహంలేదు.

ఈ గ్రంథమండలి ప్రచురించిన లక్ష్మణరావుగారి హిందూమహాయుగం, మహమ్మదీయ మహాయుగం అనే చరిత్ర గ్రంథాలు చరిత్రదృష్టిలోను, పరిశోధనలోను విప్లవం కలిగించాయి. సాహిత్యంలోను, ఇతరత్రాను లభించే చారిత్రకాధారాలను ఆయన సేకరించి, నిష్పక్షపాతంగాను, దేశభక్త్యుద్దీపకంగాను వ్రాశారు. ఉన్న విషయాలను యథాతథంగా చెప్పడమే చరిత్రకామని లక్ష్యంగా ఉండాలని ఆయన సిద్ధాంతం. కేవలం రాజకీయ సంఘటనలు, కాల నిర్ణయాలు, వంశవృక్షాల వర్ణనలు మాత్రమేకాక సాంఘిక, మానసిక పరిస్థితిని కూడ ఆయన వర్ణించారు. హిందువులలోవున్న అలసత్వం, అనైకమత్యం, దేశభక్తిరాహిత్యం, స్వార్థం దేశం బానిస కావడానికి కారణమని ఆయన వ్యాఖ్యానించారు. ఢిల్లీ నుంచి ఏడువందల మైళ్ళ దూరంలో వున్న దేవగిరికి మల్లిక్‌కాఫర్ దాదాపు పదివేల సైన్యంతో దండయాత్రకు బయలుదేరినప్పుడు ఆ దారిలోవున్న ఒక్క రాజయినా ఎదిరించలేదు కదా, ఎక్కడికి వెళ్ళుతున్నారు, ఎందుకు వెళ్ళుతున్నారు అని ఒక్కరయినా ఆలోచించినవారు లేదు కదా అని ఆయన వాపోయారు. పాశ్చాత్య చరిత్రకారులు, ఫెరిస్తా మొదలైన పారసీక

చరిత్రకారులు వ్రాసిన నిరాధారమైన వ్రాతలను ఆయన సహేతుకంగాను, సప్రమాణంగాను ఖండించారు. ఈ విధంగా విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి 30 గ్రంథాలు ప్రచురించింది; వీటిలో 15 విజ్ఞానశాస్త్ర గ్రంథాలు.

ఈ గ్రంథమండలి ప్రజలలో విజ్ఞానవ్యాప్తికి 1912 నుంచి మరొక గొప్ప పథకం ప్రారంభించింది. అది పరీక్షలు నిర్వహించడం. ఈ గ్రంథ మండలి ప్రచురించిన పుస్తకాలు, ఇతర గ్రంథాలు పాఠ్యపుస్తకాలుగా పెక్కు కేంద్రాలలో ఈ పరీక్షలు జరిగాయి. ఈ పరీక్షలలో ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులయిన వారికి బంగారు పతకాలు, వెండి పతకాలు, నూటపదార్లు, తక్కిన వారికి యోగ్యతా పత్రాలు లభించేవి. కందుకూరి వీరేశలింగం పంతులు, కట్టమంచి రామలింగారెడ్డి, పనప్పాకం శ్రీనివాసాచార్యులుగార్లు పరీక్షకులుగా ఉండేవారు. ఈ పరీక్షలలో ప్రథమ బహుమతులు పొందిన వారిలో కవితిలక కాంచనపల్లి కనకమ్మ, పరిశోధన పరమేశ్వర బిరుదాంకితులు శ్రీ నిడుదవోలు వెంకటరావు మున్నగువారున్నారు. ఈ మండలి నవలల పోటీలు జరిపి, ఉత్తమ చారిత్రక నవలలకు 500 రూపాయల బహుమతి ఏర్పాటు చేసింది. భోగరాజు నారాయణమూర్తిగారి 'విమలాదేవి'కి, కేతవరపు వేంకటశాస్త్రిగారి 'రాయచూరు యుద్ధా'నికి బహుమతులు వచ్చాయి.

తెలుగు సాహిత్యానికి లక్ష్మణరావుగారి మరొక గొప్ప ఈవి విజ్ఞాన సర్వస్వం. భారతదేశంలోని ఏ సాహిత్యంలోను విజ్ఞాన సర్వస్వ నిర్మాణమన్న భావన లేనప్పుడు ఆయనకు ఈ విషయం తోచడం, అది కార్యరూపం పొందడం ఆశ్చర్యకరమైన విషయాలు. ఆయనకున్న విజ్ఞానమంతా ఈ విజ్ఞాన సర్వస్వ నిర్మాణానికి వినియోగపడింది. సంస్కృతాన్ని ఆయన అధ్యయనం చేశారు. ఈ విజ్ఞాన సర్వస్వంలో ఆయన అథర్వణ వేదం, అచ్చతెలుగు, అలంకారం, అభిజ్ఞాన శాకుంతలం, అంకగణితం మొదలయిన వ్యాసాలు, చారిత్రక, ధర్మశాస్త్ర, ప్రకృతిశాస్త్ర, గణితశాస్త్ర, లలిత కళలు మున్నగు వాటిపై – 35 వ్రాశారు. మన దురదృష్టవశాత్తు మూడు సంపుటాలు పూర్తయ్యేలోపే ఆయనను అకాలమరణం కంబళించింది. ఈ వ్యాసాల పరిమితి దాదాపు పదకొండు వందల పుటలు. తెలుగులో విజ్ఞాన సర్వస్వం ప్రకటించిన తర్వాతే మహారాష్ట్ర భాషలో మరాఠీ జ్ఞానకోశ్ వెలువడింది. దీనిని ప్రచురించిన డాక్టర్ శ్రీధర్ వెంకటేశ్ కేత్కర్ లక్ష్మణరావుగారికి మిత్రులు. ఆయన మద్రాసుకు వచ్చి, లక్ష్మణరావుగారింట్లో చాలరోజులు బసచేసి, చర్చలు జరిపి తమ విజ్ఞాన కోశ్ రూపురేఖలు తీర్చిదిద్దడానికి సలహాలు పొందారు. "లక్ష్మణరావుగారు

తరచుగా ఉబ్బసమువల్ల బాధపడుచుండెడివారు. విజ్ఞాన సర్వస్వం రచన పనివల్ల ఆయన ఆరోగ్యం చెడిపోయినది. దానిని ఆయన లక్ష్యపెట్టక ఆ పనిలోనే నిమగ్నుడయియుండెను." అని శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు తమ స్వీయ చరిత్రలో వ్రాశారు. శాసన పరిశోధనలోను ఆయనది ముందంజే.

లక్ష్మణరావుగారు సంఘ సంస్కరణ వాదులు కావడంవల్ల, సంఘ సంస్కరణకు ప్రధాన కేంద్రం గ్రంథాలయం కావడంవల్ల మిత్రుని సహకారంతో 1901 లోనే హైదరాబాదులో శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం–గ్రంథాలయం స్థాపించారు. ఇది తర్వాత పెక్కు ఉద్యమాలకు ఆలవాలమయింది. ఈ సంఘ సంస్కరణ కార్యక్రమం ఆయన మద్రాసులో వున్నప్పుడు విస్తరించింది. మద్రాసులోని దేశాభిమానులు, సంఘ సంస్కరణాభిలాషులు అయిన పెద్దలు ఆయనఇంట సమావేశమయ్యేవారు. విద్వాంసులు వచ్చేవారు. కాంగ్రెసు మహాసభకు ఒకమారు అధ్యక్షత వహించిన జాతీయ నాయకుడు, సుప్రసిద్ధ న్యాయవాది శ్రీ ఎస్. శ్రీనివాసయ్యంగారు స్థాపించిన సంఘసంస్కరణ సమాజంలో లక్ష్మణరావుగారు సభ్యులుగా చేరి ఆ సమాజం వారు వెనుకబడిన వారికోసం నిర్వహించే రాత్రి పాఠశాలలో ఉచితంగా పని చేసేవారు. వంగ విభజనకు నిరసనగా ఆందోళన జరిపిన వంగ విద్యార్థులను అభినందించడానికి మద్రాసులో జరిగిన సభను ఏర్పాటుచేసిన వారిలో ఆయన ఒకరు. అప్పుడు విద్యార్థులు వసూలుచేసిన స్వదేశీ ఫండుకు విరాళాలు సేకరించడానికి లక్ష్మణరావుగారు తనవంతుగా చెన్నపురిలోని పగడాలవీధిని ఎన్నుకొని ఇంటింటికి వెళ్ళి అహోరాత్రం కృషిచేశారు. ఆయన చేసిన మరొక సంస్కారం విధవా వివాహం. తమ రెండవ మేనమామ భండారు దండపాణిగారి భార్య మరణించినప్పుడు ఆయనకు రెండవ కళత్రంగా వితంతువుతో తాము దగ్గర వుండి వివాహం చేయించారు. స్త్రీ విద్యకోసం గొప్ప కృషి చేశారు. ఆయన ప్రోత్సాహంవల్లనే భండారు అచ్చమాంబగారు అబలాసచ్చరిత్రమాల అనే గ్రంథమాలను వెలయించారు.

1923 లో ఆయన పూర్తిగా రోగగ్రస్తులయ్యారు. వైద్యులు విశ్రాంతి అవసరమని ఎంత చెప్పినా వినక పడుకునే పుస్తక పరిశీలన జరిపేవారు. మద్రాసులో ఆయన నివాసం అప్పుడు ఎగ్మూరు హైరోడ్డులోని వేదవిలాస్ భవనం. ఆయన వీరేశలింగంగారి వద్ద అతిథిగా వుండి కవులచరిత్ర ప్రథమ భాగాన్ని పరిశోధించి ప్రచురించారు. ఈ ప్రచురణలో లక్ష్మణరావుగారి సహాయం ఎంతో వుంది. ఆయన వీరేశలింగంగారు మరణించిన తరువాత నాలుగేళ్ళకు–

అనగా 1923 జూలై 23వ తేదీన అకాల మరణం చెందారు. ఆయన అకాల మరణంవల్ల తెలుగు సాహిత్యానికి, తెలుగునాట సంస్కరణోద్యమానికి ఘోర మైన నష్టం వాటిల్లింది.

లక్ష్మణరావుగారి అకాల మరణానికి ఒక్క ఆంధ్రదేశమేకాక పెక్కు రాష్ట్రాలు శోకించాయి. సుప్రసిద్ధ నవలా కారులు, పత్రికా సంపాదకులు శ్రీ అడివి బాపిరాజుగారు లక్ష్మణరావుగారికి అశ్రుతర్పణం చేస్తూ, ఆయన పాండిత్యం హిమాలయ పర్వతశ్రేణి విస్తృతికి, ఔన్నత్యానికి సమానమన్నారు.

"తనువు రుజావృతంబయిన
దార్ఢ్యము దప్పుచునున్న బాషపై
గనికరముంచి తీవ్ర కృషి
గర్షక రీతి నొనర్చి తత్ఫలం
బనిశము నాంధ్ర లోకమున
కై వినియోగ మొనర్చి యుంటి వీ
జననము సార్థకం బయి పొ
సంగెను లక్ష్మణరాయ ధీమణీ!"

అని శేషాద్రి రమణ కవులు విలపించారు.

"విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి సంస్థాపనముతో ఆంధ్రదేశమున సాంస్కృతికముగా ఒక నూతన శకమే ప్రవృత్తమయినది" అని సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రశంసించారు.

తమ పంచశతి కావ్యాన్ని లక్ష్మణరావుగారికి అంకితమిచ్చిన విశ్వనాథ సత్యనారాయణగారు ఆయనను సంస్మరిస్తూ:

"అధునాతన సంస్కృతికిని
ప్రధాన బీజమ్మ వీవు పాండిత్య పయో
నిధి వీవు మార్గదర్శక
సుధా రుచివి నిన్ను మరువ జొచ్చిరి యాంధ్రుల్."

అని ఆంధ్ర ప్రజల అజ్ఞానానికి వగస్తూ,

"నీ రచిత వ్యాసమ్ము లు
దారమ్మగు నీదు నాత్మ దర్పణములు నీ
సారమతి ముద్ర గల్గిన
యారంభంబులకు విజయ మగుత మహాత్మా."

అని కైమోడ్పు లర్పించారు.

కింకవీంద్ర ఘటా పంచాననులు, శతావధానులు శ్రీ చెళ్ళ పిళ్ళ వెంకట శాస్త్రి గారు

"గుణవంతుండు మనస్వి దీక్షితుడు
ప్రాజ్ఞుల్ జ్ఞప్తి యందెవ్వడున్
గణుతింపన్ గురియైన మానవుడు ప్రా
క్చారిత్ర వైజ్ఞానికా
గ్రణి స్వార్థంబు త్యజించి లోకమునకై
కష్టించి నట్టిండు ల
క్ష్మణరా వేబది నిండకుండ మునుపే
కాయమ్ము వీడెన్ గటా!"

అని కటకట పడ్డారు.

[ఆంధ్రప్రదేశ్, నవంబర్ 1977]

★★

# కులతత్త్వం: అప్పుడు, ఇప్పుడు

సమాజం నిలువ నీరు కాదని, దేశ కాల పరిస్థితులతో కలిగే మార్పులను తనలో ఇముడ్చుకొని ముందుకు సాగిపోయే జీవనది అని శాస్త్రజ్ఞులు చెబుతున్నప్పుడల్లా నాకు నవ్వు వస్తుంది.

మన సమాజం సంగతే చూద్దాం, శాస్త్రజ్ఞుల లక్షణం ఎంత అవ్యాప్త దూషితమో తెలుస్తుంది. మన సమాజంలో వర్ణాశ్రమ వ్యవస్థకు ఎలాటి దుర్ముహూర్తంలో వజ్రబంధం పడిందో కాని, సహస్రాబ్దాలు గడచినా, ఆ వజ్రబంధం ఈషత్తయినా సడలలేదు; సడలినట్టు ఒకప్పుడు కనిపించినా, అనుభవంలో మాత్రం మరీ బిగుసుకుని పోవడం స్పష్టమవుతుంది.

తత్త్వవిచారం పరాకాష్ఠ చేరిన ఆరణ్యకాల కాలంనుంచి సక్రుత్తుగా, బుద్ధుని కాలంనుంచి తీవ్రంగా కులతత్త్వాన్ని కూలదోయడానికి ఆందోళన సాగుతూనే వుంది గదా! మన సమాజంలోని భావనా ప్రవాహగతిలో మార్పు ఏమైనా వచ్చిందా? జాతి మనస్తత్త్వంలో మార్పు కలిగిందా? కులతత్త్వమనే కంచుకోటను ఢీకొన్న ప్రతి సాహసికుడూ తల పగిలో, తల పగలకుండానో మహాపురుషుడూ, మరొక మత ప్రవర్తకుడూ అయ్యాడే కాని, ఆ కంచుకోట లొత్తలు కూడా పడలేదు.

కుల మత ప్రసక్తిలేని రాజ్యాంగం రూపొందించుకుని ఆచరణలో పెట్టామని చెప్పుకునే మన నేటి నాయకులు మరీ ఆత్మవంచన పాలవుతున్నారు. వారి మాటలకు, చేతలకు పొత్తు కుదరడం లేదు. పెద్ద పెద్ద సమస్యల విషయంలోనే కాదు; ప్రతి చిన్న సంగతినీ కుల మత దృష్టితో పరిశీలించడం ప్రారంభించి, వర్ణ వ్యవస్థను మరొక స్టెయిన్‌లెస్ స్టీల్ మేకుతో బిగిస్తూ, విద్వేషానికి విత్తులు చల్లుతూ వుంటారు.

ఈ దృష్టికి మూలకారణం నేటి మన జీవిత విధానమే. మన దేశం, ముఖ్యంగా మన రాష్ట్రం వ్యవసాయంపై ఆధారపడినట్టిది. దానికి మూలస్తంభాల వంటివారు వ్యవసాయోపజీవులు. భూమి ఎక్కువగా ఎవరి చేతులలో వుంటుందో వారిదే పైచేయి. వారిని ఆశ్రయించే వుంటారు ఇరుగూ పొరుగూ. వీరు తమ స్వార్థ చింతతోనో, ఇతర కారణాలవల్లనో సామాన్యంగా మారరు. ప్రజల

జీవిత విధానాన్ని తీర్చిదిద్దగల శక్తి వున్న కులాలలో — మన స్తత్వంలోను, ఆలోచనలోను — మార్పులు లేనప్పుడు పరిసరాలన్నీ యథాపూర్వంగానే వుంటాయి; ఉప్పెన వంటిది, ఈదరగాలి వంటిది, ఝంఝూవాతం వంటిది ముంచుకొని వస్తే తప్ప. మన రాష్ట్రంలో అలాటి ప్రధానమైన కులాలవారు రెడ్లు, కమ్మవారు, కాపులు, రాజులు, వెలమలు.

"చెరువుకు కొత్తగా నీరు వచ్చినప్పుడు చెరువులోని కమలాలు నీటితో పాటు పైకి పోతాయి. నీరు తీసిన తర్వాత దానితోపాటు దిగలేవు రేకులు, వదలి రాలిపోయినా, తూండ్లు మాత్రం చాలాకాలం వికారంగా కనిపిస్తూ వుంటాయి." అన్నాడు హిందీ కవి రహీం. మన దేశంలో అన్ని కులాలు పాత ప్రాభవం పోయి చాలవరకు జీవచ్ఛవాలు అయ్యాయి. అయినా ఆ ప్రాభవం నాటి నిక్కులు మాత్రం చెక్కు చెదరలేదు. కాశ్మీర్ నుంచి కన్యాకుమారి వరకు భారతదేశం ఒక్కటేననే ఒకొక్క నాయకుని ప్రాంతాన్ని, తెగనూ, కదపండి. తమకంటే గొప్పవారు మరొకరు న భూతో న భవిష్యతి. కాశ్మీర్— ప్రకృతి సౌందర్యానికి, మానవ సౌందర్యానికి పుట్టినిల్లు. ప్రపంచానికి అమూల్యమైన సాహిత్యం, వినోద విలాసాలు అర్పించేవారం మేమేనంటారు కాశ్మీరులు. ఉత్తరప్రదేశ్ — రామాయణ భారతాలు జరిగిన ప్రాంతం. తాము రాముని వారసులమని, ధర్మరాజు దాయాదులమని అనుకుంటారు ఉత్తరప్రదేశ్ వారు. వంగరాష్ట్రం — సోనార్ బాంగ్లా. ప్రపంచంలో మేధావులన్నవారు పుట్టినది, పుడుతూన్నది, పుట్టబోయేది సోనార్ బాంగ్లాలోనే అని విర్రవీగుతారు వారు. ఇక శిఖ్కులు, పంజాబీలు — మేము లేకపోతే, భారతదేశానికి రక్షణ యేదీ? మేము ఒక్కొక్కరం ఒక ఉక్కు కోట — ఇది వారి వాదం. మహారాష్ట్రం — నిన్న మొన్నటివరకు మహారాష్ట్రులదే మన ఉద్యమాలలో నాయకత్వం. వారంతా పుట్టు నాయకులు. వారి ఛడావుల కొసలు తలయెత్తి వెనక్కు తిరిగినట్టే నేడు వారి ప్రవర్తనా వుంటుంది. గుజరాత్ — కృష్ణభగవానుడు అవతరించిన పవిత్ర స్థలం. దానికి తోడు గాంధీజీ జన్మించి పుణ్యం కట్టుకున్నారు. అంత గొప్ప జాతి వుంటుందా? మైసూరు — "మైసూరు జంభాలు" లనేది సామెత. ప్రతిదానికీ సభ్యత, నాగరికత సమకూర్చినవారు తామే. తమ "మహారాజరు" పుట్టి వుండకపోయి వుంటే, ప్రపంచమే వుండేది కాదు; మహా ప్రళయమే సంభవించి వుండేది. తాము తప్ప తక్కినవారంతా అనాగరకులు, అసభ్యులు. వారికి మాట్లాడడం తెలుసా?! మద్రాసు — తమిళగాన్ని (తమిళ ప్రపంచాన్ని) ప్రజాపతి బ్రహ్మాండం కంటే ముందు సృష్టించాడు. అయినప్పుడు సంస్కృతం కంటే తమిళు ప్రాచీనతమ మనడంలో సందేహం లేదు. ఆదిమతము మానవజాతి

తమిళజాతి. తమ అంతటి మేధావులు ప్రపంచంలోనే తక్కువ. ఇతరుల గొప్పతనం ప్చ్! ఆంధ్ర – ఆంధ్ర మహాపురుషుల సంగతి చెప్పనక్కర లేదు. ప్రపంచంలో వీరజాతి అనేది ఏదైనా వుందంటే అది తెలుగుజాతి. క్రీస్తు పూర్వం జరిగిన గొప్ప పనులన్నీ ఆంధ్రులవే. అసలు బ్రహ్మ పురుషోత్తముని నాభీకమలంనుంచి కళ్ళు తెరచి వూపిరి తీసుకున్నది తెలుగులో. వేదంలో ఆంధ్రులున్నారు. పురాణాల్లో ఉన్నారు. "మగధ పాలించారు. జావా సుమత్రాల నెగురవేశారు తమ జయ పతాక." తెలుగంత తియ్యనిభాష మరొకటి లేదు. ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ - అన్నాడు ఎవడో అందుకే. పాటకు తగిన భాష తేట తెలుగే. (ఎందుకో?)

దేశమంతా ఇంతగా పాతుకున్న పూర్వవాసన మన రాష్ట్రంలోని కులాలకు ప్రాకడం సహజం. అందులోను గత వైభవం, దాని ఛాయలు మిగిలిన రెడ్లవంటివారిలో ఈ రాజసం ఎలా పోతుంది?

విజయనగర చక్రవర్తులు, ముఖ్యంగా రెడ్డిరాజ్యాన్ని పడగొట్టిన తర్వాత, రెడ్లు గ్రామాధికారులుగాను, వ్యవసాయకులుగాను, సైనికులుగాను గ్రామజీవనం గడుపుతూ వచ్చారు. దొంగలను పట్టుకోడం, శిక్షించడం, తగవులు - తీర్పులు చెప్పడం, గ్రామరక్షణ వారి విధులు. కృష్ణరాయలు, రెడ్లు మళ్ళీ ఎక్కడ తల ఎత్తుతారోనని రెడ్లను - గ్రామాధికారం అనువంశికంగా వచ్చినది గనుక, దానిని తొలగించి గ్రామ వ్యవస్థను పాడుచేయడం ఉచితం కాదని కాబోలు - ఏ ఉన్నత పదవికీ నియమించక, కమ్మవారిని, గొల్లవారిని, బోయవారిని రాయబారులుగా, రాజ ప్రతినిధులుగా, పరిపాలకులుగా, సేనాపతులుగా, పాళెగారులుగా నియమించాడు. వర్షర్తు వర్ణనలో ఏదో ప్రసక్తి తీసుకుని వచ్చి, రెడ్లను హాస్యం గూడ చేశాడు :

"గురుగుం జెంచలి తుమ్మి కూరలే తగిరి సా
కుం దింత్రిణీ పల్లవో
త్కరమున్ గూడ పొరంటి నూనియలతో
కట్టావి కుట్టారికో
దనమున్ మెక్కి పసుల్ పొలములో
గ్రేపుల్ మెయిన్నాక మే
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభు
త్వైకాప్తి రెడ్లజడిన్."

(ఆముక్త. 4.134)

ఏ బీద రైతైనా గురుగు, చెంచలి, తుమ్మి, తగిరిన, చింతచిగురు నూనెలో వేయించుకుని, అరికబోనం తింటాడు. వానకాలం, చలి, ఏమి చేస్తారు బీదలు, ఆవు, గేదె, ఎడ్ల పేడ కడి విలువ ఎక్కువ. ఎరువులు, వంటచెరుకులు అవసరం. కనుక మేకెరువు ఎండించి కుంపటి రాజవేసుకుని చలి కాచుకుని ఉంటారు. రాజ్యం చిక్కింది గదా అని సింహాసనం ఎక్కినంత హుమ్మసుతో రెడ్లు మంచ మెక్కారట. కాకతీయుల కాలంనుంచి అవిచ్ఛిన్నంగా, అతి విస్తారంగా వున్న రెడ్డిరాజ్యాన్ని కూల్చివేశామనే సంతృప్తే కృష్ణరాయల మాటలలో కనిపిస్తుందే తప్ప మరేమీ కాదు. డబ్బుగల రెడ్లు అప్పుడూ, ఇప్పుడూ బాగానే ఉన్నారు.

"కప్పుర భోగి వంటకము
కమ్మగ నే పడియన్ భుజించి మేల్
దుప్పటి లట్లు మూరగల
తోరపు బచ్చడముల్ చెలంగగా
గొప్ప కడాని పైడి జిగి
గుత్తపు టుంగరముల్ కరంబులన్
ద్రిప్పుచు రచ్చ చేయుదురు
రెడ్డిదొరల్ తమి హెచ్చ నచ్చటన్."

—(రఘునాథ రామాయణము)

కృష్ణరాయల మాటలలోని 'ప్రభుత్వైకాప్తి' అన్న మనస్తత్త్వం మాత్రం నేడు కూడా రెడ్లలో పోలేదు. వారు రాష్ట్రకూటుల నాటివారు. రాష్ట్రకూట పదం, క్రమంగా రట్టకుడి, రట్టడి, రడ్డి అయిందని, అది 16వ శతాబ్దానికి (గద్ద - గెద్ద, గరిట - గెరిటలాగ ఆదిమ అకారం ఎకారమై) రెడ్డి అయి వుంటుందని చరిత్రకారుల వివరణ. రాష్ట్రకూటుల నాటి రాష్ట్రాలు, కూటాలు పోయినా, రెడ్లకు రాజసకూటం తరగలేదు. ఒక పెద్ద రెడ్డిని పరమయోగి విలాసంలో తాళ్ళపాక తిరువేంగళనాథుడు వర్ణించిన తీరు చూస్తే రాయల కాలంలోను భూస్వాములైన రెడ్ల రాణ తగ్గలేదనే స్పష్టమవుతుంది.

"పసపు చుంగుల తలపాగ నెట్టంబు
కనిబిని మెసగు బాగాల పిడియము
మిన్న దేరెడు దొడ్డ మెడ నూలు మిగుల
వన్నియ గల మాదవళి పచ్చడంబు
థళసరియ్యగు దేవదారి గంధంబు

వలకేల గనుపట్టు వంకుటుంగరము
డొల్లు బోగులును కాటుక కప్పు దేరు
పిల్లి గడ్డము వడిబెట్టు మీసలును
నలవడ నాందోళికారూఢుడగుచు
అలనాటి పూర్వికుడగు పెద్ద రెడ్డి."

ఈ ద్విపదలోని అందోళికలు నేడు పల్లెటూళ్ళలో లేవు గాని, తక్కిన వర్ణనమంతా చాలవరకు కనిపిస్తుంది. నేటి రెడ్లు - మోతుబరి రెడ్లు - ఆ ఠీవి తోనే ఉంటారు. వచ్చినవారిని ఆదరిస్తారు. ఇంత రాజసం వున్నా పూర్వ భాషిత్వం వీరి ప్రధాన లక్షణం. కుల మర్యాదలను అనుసరించి తామే ఎదుటి వారిని పలుకరిస్తారు, ఉచిత సంబోధనలతో. కాని, వారి పాతకాలపు తగవులు, తీర్పులు చెప్పే తీరు కొన్నిచోట్ల విపరీతమై ఇరుగు పొరుగువారి ఆస్తులు అతి సులభంగా, చాల చౌకగా కొట్టివేసే కార్యాలకు దిగజారింది. మర్యాదకు ఎలాటి లోపమూ వుండదు. మనతోనే అన్నిటికి ఊఁగొట్టిస్తారు. పెద్ద కులంవారు వారికి గుత్తకిచ్చిన తమ పొలం గుత్తలు వసూలు చేసుకొనడానికి వస్తారనుకోండి. కంబడి పరిచి, కూర్చోబెట్టి, యోగక్షేమాల వృచ్ఛ తర్వాత "సేద్యం ఎట్లా గుండాది? ఎవళ్ళికి సాగుకు ఇస్తారు? సత్తువ బాగా పెట్టల్ల. సేద్యం బాగా సేస్తే బాగా పండుతాది. నట్టు తీయించి వంకకు ఒడ్డు ఏయిస్తే బంగారు పండుతాది. ఈణ్ణే చేసుకుంటే...." అని ప్రారంభించి, ఉబ్బేస్తారు. "స్వామీ మీరు సరస్వతి కోసం పుట్టిండారు. ఈ కట్టం ఎట్టా పడతారు? వెన్నపూస తీసిండారే, దాన్ని కాచి నెయ్యి చుక్క వేసుకుని భోజనం చేయండి. ఒరేయ్! వక్కాకు కొండ్రారా. మద్దెనేళ ఫళారానికి పప్పులపిండి (వేయించిన సెనగపప్పు పిండి), పాలు, బెల్లం కలుపుకోండి.

"బాన్‌దేవుడు దయపెట్టలా. భూమంతూ వద్దు స్వామీ. ఎవడెవడూ చేసుకోనంటాడు. సిళ్ళపారుకు ఎత్తయిండాది. గడ్డ తీరువ తీయిస్తే శానా అవుతాది. నూర్ల రూపాయలు పడతాది. దేనికైనా మీరు ఎదురుగా వుంచే బాగుంటాది. మీకు వరస్థళంలో భోజనానికి, బొట్టుకు శాన ఇదవుతాది. మరి యేం చేస్తారో! మరి యేం చేస్తారో! ఒప్పందానికి యిచ్చిపోతారా? చూడండి. ఇప్పుడే మాట్లాడుకుంటే మంచిది. కాని సంచకారం (అడ్వాన్సు) అడుగుతారు. ఈసర్రి మీ మళ్ళో నాలుగెకరాలకి నల్లుము వడ్లు వచ్చిండాయి. అవైనా వుట్టి తాలు. దంచితే నూక. సేరుకు పావు కూడ గింజ ఎళ్ళుకోదు. తెగులు మీ మళ్ళోనే పుట్టిండావి. అటినుంచి మా మళ్ళోకి కూశా నూరారుగా సోకింది. మా

మళ్ళకు సత్తువ బాగుండాది. దేవుని పుణ్యాన దెబ్బ తగల్లేదు. అందుకే.... లెక్క గావల్నంటే కొండబోండి. పాపం మీరు శానా ఇబ్బందుల్లో వుంటే, లెక్కగొండబోండి. మరేం చేయల్లా."

అని దబ్బు అందిస్తారు. "స్వామీ, కొంచెం గుర్తు (ప్రోనోటు) రానిస్తే దేనికైనా మంచిది.... భూములు గబ్బుపట్టి పోయిండాయి. దీన్ని సాకిజా (బాగు) చేయించడానికి సంగమోటు (చాలా) దుడ్లు అవుతాయి. ఒక్కపని చేయించండి. పిల్లలోళ్ళు. మీతో అయ్యేదీ పొయ్యేదీ లేదు. బాకీకే భూమి కట్టించల్ల. అపుడు మీరు నొప్పి పడతారు. మాకూ మంచిది కాదు. అందుకోసరం ఒక పని చేయండి. యోచన చేయండి. నూటికిమించి యకరం తీసుకొనేవాడు లేడు. అందరూ మెత్తబడినారు వూళ్ళో. లగ్గీ (సంబంధం) ఉండేవాండ్ల అంచున దుడ్లు లేవు. అజూబాజూ వూళ్ళల్లో లావు రైతులు యాడుండారు? ఏముణ్ణా మా వూళ్ళోనే. మా వూరి గతి యిట్లయుండాదా? ఏమీ లే. దేవుడే గతి. నాకు ఒక్క ఉపాయం కనిపిస్తాది. మీరూ యోచన చేయండి. అవతల మీ యిష్టం. మీ కా దుడ్డుతో కసాలా జాస్తీ ఉండాది. పాపం! ఏమి చేస్తారు? పిల్లలోళ్ళు. నాకూ పుణ్యం వస్తాది. యకరా నూరు ప్రకారం ధైర్యంచేసి నేనే తీసు కుంటుండా. వడ్డీ సగానికి సగం తగ్గిస్తా. రాను పోనూ ఖర్చు లిచ్చి రిజిస్ట్రీ ఖర్చులు గూడ నేనే పెట్టుకొంటా. మీరు ఊఁ అంటే, రూపాయలిస్తుండా." ఇదీ వరుస. ఆ పాయకారి భూస్వామి (బ్రాహ్మణ సేద్యం సామెత మేరకు) వచ్చిందే లాభం అన్నట్టు యకరం వేయి రూపాయలు ధర వలికే భూమిని యెకరం వందకే తెగ నమ్మి పోతాడు.

కొంచెం చితికిపోయిన సాటి కులస్థుడైతేనో, తన యింట్లో సహపంక్తి గల కులస్థుడైతేనో విందులు, వినోదాలూ చేయిస్తారు రెడ్లు. భక్ష్యాలు (బొబ్బట్లు) చిత్రాన్నం, పరమాన్నం, తెల్లజొన్న రొట్టె, నించుడుగాయ (గుత్తివంకాయ) మొదలగునవి వండిస్తారు. వారిలో విశేష పదార్థం మొదట వడ్డించడం ఆచారం గనుక మొదట తీపి తినుబండారాలు, పిండివంటలు వడ్డిస్తారు. తీపు ఎక్కువగా తింటే మొగం మొత్తకుండా పచ్చి దోసకాయల కోసుంబరి (దోసకాయలు తురిమి, కొబ్బరికోరు, పెసరపప్పు కలిపిన అటు పచ్చడి - ఇటు కూరవంటి పదార్థం) లేక పచ్చి ఉల్లిగడ్డలు తరిగి రుచిగా తయారుచేసిన కోరువంటి వ్యంజనం నంజుకొనడానికి వడ్డిస్తారు. తర్వాత చిత్రాన్నం, తర్వాత మామూలు పదార్థాలు....

కొంచెం రాజకీయాల వాసనవున్న రెడ్ల పౌరుషం ఒకొక్కప్పుడు ఉగ్ర రూపం దాలిస్తే వచ్చే పరుష భాషణమూ వినదగిందే. పంచె ఎగజెక్కి, అంగీ

(చొక్కా) చేతులు పైకి తోసుకుంటూ, "నాయాల! ఏం జేసేవు? మగోడయితే ఎళ్ళుకో చూస్తాం. నీకు ఈ పొద్దు రాసిందాది.... ఈసారి ఎలెక్షన్ రానీ. నీ బదుకు అప్పుడు తెల్లారతాది. ఏమనుకుండావో! నా పిల్లోణ్ణి నెంబరుగా నిలబెడు తాను. మినిట్టరు రానీ! వాణి తాత రానీ! మానుకుండేది లేదు. కడాకి అడ్డ మొచ్చినోళ్ళందర్నీ 'పొలోలి'గా నరికేస్తాను. మన సంగతి అప్పుడన్నా తెలు స్తాది" ఇత్యాది. (ఈ సంభాషణంతా కేవలం పశ్చిమాంధ్ర మాండలికం.) వ్యవసాయం ప్రధాన వృత్తిగా ఉండి, భూమినే అంటిపెట్టుకున్న ఏ పెద్దరైతైనా ఇలాగే వ్యవహారజ్ఞత చూపుతాడనడం నిస్సందేహం.

అయినా, ఆంధ్రదేశంలో అటు తెలంగాణాలోను, ఇటు రాయలసీమలోను, సంఖ్యాబలం, ఆస్తిబలం వున్న కులం ఇదే. సాగరతీరంలో నెల్లూరు జిల్లాలోను, గుంటూరు జిల్లాలో కొంత వీరి ప్రాబల్యం ఎక్కువే. వీరిలో పంట, పాకనాడు, కొణిదె మొదలయిన శాఖాభేదాలు, వీరశైవ, వైష్ణవ మతభేదాలు ఏమి వున్నా, భూస్వామ్య లక్షణం ప్రధానం గనుక అన్ని ప్రాంతాల పెద్ద రెడ్లు ఆస్తిపాస్తుల విషయంలో ఒకే విధంగానే ప్రవర్తిస్తారనే అనుకుంటాను. పశ్చిమాంధ్రలో మాటలను కత్తిరించినట్టు పలకడం, సాగరాంధ్రంలో కొంచెం నాలుక మడత వేసి "యాందది" అన్నట్టు మాట్లాడడం, తెలంగాణాలో ఎవరో తరుముకొని వస్తున్నట్టు మాట్లాడడం అనే ప్రాంతీయ భేదాలు, మాండలిక భేదాలు ఉండ వచ్చు. తెలంగాణాలోని రెడ్లు సయాన కాకతీయుల వారసులు, గనుక, నిన్న మొన్నటివరకు లష్కర్‌లు, దర్బారులు నడిపించుకొన్నవారు గనుక మరీ ఠీవి ఎక్కువ. ఏమైనా వీరిలో వుండే సుగుణం పూర్వభాషిత్వం, ప్రాచీన సంస్కృతి అంటే గౌరవాదరాలూను.

ఇక కమ్మవారు: కమ్మవారు కాకతీయుల కాలంలో కొంచెంగాను, రాయల కాలంలో విశేషంగాను విస్తరించిన కులం. రాయలు వారిని బాధ్యతగల ప్రతి పదవికీ నియమించాడు. అందువల్ల వారు కమ్మనాడు (గుండ్లకమ్మ, పేరకమ్మ వంటి నదులమధ్య భూమి) నుంచి కన్యాకుమారి వరకు వలసపోయి నిలవదొక్కుకున్నారు. కాని, వీరి పుట్టి నేడు కృష్ణ, గుంటూరు జిల్లాలు. అక్కడినుంచి రాయలసీమకు వలస వచ్చారు. అటు మైసూరు రాష్ట్రానికి, తమిళదేశానికి, ఇటు హిందీ, మరాఠీ ప్రాంతాలకు వలస వెళ్ళారు. సాగరాం ధ్రంలో పెద్ద కమ్మ, చిన్న కమ్మ అనే ప్రధాన భేదాలు ఆర్థిక పరిస్థితినిబట్టి వచ్చినట్టివేననే అనుకుంటాను. రాయలసీమలో ఇల్లు వెళ్ళని కమ్మలు, గంప కమ్మలు, గోడకమ్మలు మొదలయిన భేదాలున్నాయి. ఆడవారి కుడిపైట,

ఎడమపైట, చీరకట్టులో రంగు చీరలు, తెల్లచీరలు మొదలయిన వాటినిబట్టి కూడా కొన్ని భేదాలు ఏర్పడ్డాయి.

వీరు కూడా తక్కిన వ్యవసాయోప జీవులలాగే వ్యవహరిస్తారు. రాయల సీమలో వీరికి రెడ్లంత ప్రాపకం లేదు; అక్కడ, వీరిలో రెడ్ల అనుకరణే కనిపిస్తుంది. వీరిలో కట్టుబాటు, క్రౌర్యం ఎక్కువ అంటారు. సాగరాంధ్రంలోని కమ్మవారిలో పల్లపు భూముల సంస్కృతి పూర్తిగా కనిపిస్తుంది. నాజూకుగా మాట్లాడడం, ఎదుటివారిని తమ అభిప్రాయానికి తిప్పుకొని ఊంగొట్టించే చాతుర్యం వీరికి ఉగ్గుబాలతోనే అబ్బాయి. వీరిని ఉత్తరప్రదేశ్, బీహార్‌లలోని కాయస్థులతో పోల్చవచ్చు. కాయస్థులు పాదరసంలాగ ఏ శాఖ అందే ఆ శాఖలో ఎగబాకి ముందుకు, పైకి పోతుంటారు. సర్కారు కమ్మవారిలో ఆ లక్షణాలు పూర్తిగా ఉన్నాయి. రెడ్లలో లేని "ఫానటిజం" సర్కారు కమ్మవారిలో కనిపిస్తుంది. రెడ్లలో "మనం గొప్ప" అనే ధీమా వుంటే, కమ్మవారిలో "మనమూ గొప్పే" అనే ఆత్మ ప్రత్యయంతో చేరిన "ఫానటిజం' వుంది. కులతత్త్వం ముమ్మరంగా వున్న నేడు ఇలాటి "ఫానటిజం" అవసరమేనేమో? బ్రహ్మసమాజం పుణ్యాన, ఆర్యసమాజం అండన, కలిసికట్టుతనంతోను ఈ కులం ఈ శతాబ్దంలో పొందిన జాగృతి, అభివృద్ధి రాయలకాలంనాటికన్నా అత్యధికం, అసమానం. దీనికి కారణం వీరి వ్యవహారజ్ఞత, వాస్తవిక దృష్టి. రెడ్లకన్నా వీరికి రాజకీయాల పరిజ్ఞానం ఎక్కువనే నా నమ్మకం. అందరితోను వ్యవహారరీతి పలకరింపులేగాని అత్యంతాదరం చూపినట్టుగా వుండరు : "బాగున్నారా? ఏం వచ్చినారు? పంటా పైర్లు ఎట్లున్నాయి? పొగాకు పత్తి ధరలు ఎట్లా పలుకుతాయి? ఇప్పుడే అమ్మితే మేలా? నిదానంగా అమ్మితే మేలా? మొన్న జరిగిన పంచాయతీ ఎలెక్షనులో మీవాళ్ళు నిలబడ్డారా?" (ఇది రాయల సీమ కమ్మవారి మాటలనుంచి.)

వ్యవసాయం జీవికగా వర్ధిల్లిన మరొక సంస్కారంగల తెగ బలిజలు. వీరిని సర్కారు ప్రాంతంలో కాపులని, రాయలసీమలో బలిజలని, తెలగాలని అంటారు. వీరు సాగరాంధ్రంలోను ప్రధానమైన, బలమైన తెగ.

కాపు అంటే భూమి పాలకుడు. భూమి పాలకులయిన ఈ కాపులు చాల ప్రాచీనమైన తెగ, అప్పటమైన తెలుగు తెగ. ఈ తెగ పేరుతోనే తెలుగు భాషకు, తెలుగు దేశానికి "తెలుగు" అన్న పేరు వచ్చిందనే వాదం వుంది. వీరు రైతులుగా, వ్యాపారస్థులుగా, ఉద్యోగులుగా, సైనికులుగా వున్నవారు. పూర్వం బౌద్ధ యుగంలో గహపతులుగా—గృహస్థులు, కాపులుగా—వున్న

వారు. బలిజ అనే మాటనుబట్టి వీరు ఒకప్పుడు వ్యాపార జీవులుగా వుండేవారని చెప్పవచ్చు. వణిక్ అనే మాట వణిజ్, బణిజ, బలిజ అని మారింది. ఈ కాపులను తాళ్ళపాక తిరువేంగళనాథుడు

"అప్పు డా మడి సేయు నా యూరి కాపు
ముప్పిరి గొను పగ్గముల చుట్టుతోడ
చుచ్చిన మునికోల గొంగడి ముసుగు
మచ్చల మచ్చల మట్టి కాసెయును
బలువైన కేలి యంబటికుండ తనకు
నలవడ నడగొండలన నొప్పుచున్న
మీఱైన యెద్దుల మెడకాడిమీద
కోడేరు వైచి నెక్కాని రొప్పికొనుచు
చనుదెంచె ..................................."

అని వర్ణించాడు. వ్యవసాయం చేసే ప్రతి రైతుదీ ఆనాడు ఇదే వేషమే. అయినా, ఇతడు భూస్వామికాని రైతు అయివుంటాడు.

ఈ కాపులు పౌరుష పరాక్రమాలు గల తెగ; నాగరకత, దానికి తగినట్టు మంచి పుటక వున్న తెగ. ఇది గోదావరి, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలోను, కృష్ణా, గుంటూరు జిల్లాల్లోను తక్కిన పెద్ద తెగలవారితో పోటీ పడుతూంటుంది అన్ని విధాల.

భూమ్యాశ్రితులైన తెగలలో ఒకరయిన వెలమలను గురించి ఒక్కమాట చెప్పవలసివుంది. "వెలమలు తెలుగుదేశమువారు కారు. ఆ లెక్కకు రెడ్లును అంతే! ఒకరు దక్షిణమునుండి, రెండవవారు ఉత్తరమునుండి వచ్చినారని తలంతును. రాష్ట్రకూటులు రెడ్లయిరి. దక్షిణ తమిళదేశము నుండి తెలుగు సీమకు క్రీస్తు శకం వేయి ప్రాంతంలో వచ్చి కాకతీయుల సేవలో చేరిన 'వెళ్లాళ' అను జాతివారే వెలమలై యుందురు. వెళ్లాళవారే వెలమలని వెళ్లాల జాతినిగూర్చి చర్చించుచు థర్‌స్టన్ వ్రాసెను. (కాస్ట్స్ అండ్ ట్రైబ్స్ ఆఫ్ సౌత్ ఇండియా.) క్రొత్తగా వచ్చినందున వారిని రెడ్లు తక్కువగా చూచి, వారితో ద్వేషము సంపాదించుకొనిరి. శ్రీనాథుని కాలములో వెలమలు రెడ్లతో సమానులుగా పరిగణింపబడిరి....రెడ్లకు, వెలమలకు నోరుగంటిపై రుద్రమదేవి కాలంలో, తురకల దండయాత్రా కాలములో స్పర్థలు ప్రారంభమై నిత్యాభివృద్ధి గాంచి, ఉభయుల రాజ్యాల నాశనమునకు దారి తీసెను. రుద్రమదేవి వెలమలకు ఒక విశిష్టతను - రెడ్లకిచ్చిన విశిష్టత నేమో కల్పించెను. వెలమలు వీరవైష్ణవు

అయినట్లును, రెడ్లు వీరశైవులుగా నుండినట్లును కానవస్తున్నది" అని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో వ్రాశారు. (పుటలు 44—45.)

వెలమవారు ఇతర ప్రాంతంనుంచి వచ్చి, ఎవరితోనూ చేరక, అందరి వైరానికి గురికావడంవల్లనే కాబోలు, వీరిలో టెక్కు, నిక్కు ఎక్కువ. ఎవరితోనూ చేరని తెగలకు ప్రపంచమంతటా ఇలాటి స్వాతిశయం ఉండడం చూస్తున్నాము.

ఏ వెలమ పెద్దమనిషి దగ్గరికైనా—దర్శనానికైనా అందాం—వెళ్ళండి. రెడ్లలాగ, ఇతరులలాగ పూర్వభాషిత్వం కనిపించదు. మాట్లాడినా, నీవు, మీరు అనే సర్వ నామాల, సంబోధనల ప్రసక్తి లేకుండా, ప్రసక్తి రానీయకుండా, జాగ్రత్తగా మాట్లాడ్డం వారి పెద్ద తెలివితేటలు. ఎదుటివాడిని మీరు అనడం తన గౌరవానికి భంగం. నీవు అంటే, వాడు ఎదురు తిరిగి తనని నీవు అని అంటే ఏమిటి గతి? అందువల్ల నిషేధాక్షరిలాగ నీవు, మీరు అనే మాటలను నిసేధిస్తారు. "ఎప్పుడేంటి రాక?", "భోజనం అయినట్టేనా?", "పిల్లా జెల్లా క్షేమమేనా?"— ఇలా వుంటుంది కుశల ప్రశ్నల ధోరణి, తమకంటే తక్కువవాడయితే, "ఏం రా, బాగున్నావా? కూడు తిన్నావా?" అని ప్రశ్న పరంపర. తాము తినేది భోజనం, వాడు తినేది కూడు.

కలవారయిన వెలమలు మాత్రమే కాదు; లేనివారు గూడ, సామాన్యులైనవారైతే అయినా, ముందుగా పలకరు. మనం పలకరించే దానినిబట్టి ప్రవర్తిస్తారు. తిండికి లేకపోయినా, పికిలిపిట్టను చేతిమీద ఎక్కించుకుని విహరిస్తారు. మధ్యయుగాల జమీందారి విధానం పూర్తిగా మూర్తీభవించినట్టు వుంటారు. "మీసాల బువ్వ" సామెత పూర్తిగా వర్తింపజేస్తారు. కొంప కూలిపోతూంటుంది. ఒకటి రెండు చీకటి గదులు కూడా ఉండవు. అది లోగిలి. దానిని "మా లోగిలి" అంటుంటారు బడాయిగా.

మనతో చదువుకుంటుంటారు. పనిపాట్లు చేస్తుంటారు. ఇక్కడ మామూలుగానే పలకరిస్తుంటారు. తమ స్థానాలలో "తమ తమ నెలవులు దప్పిన తమ మిత్రులు శత్రువులౌట" అన్న సుమతి శతకకారుని మాటగా, ఎక్కడలేని గాంభీర్యంతో ప్రవర్తిస్తారు. నా స్నేహితుడొకడు ఇంజనీరింగ్ కాలేజీలో చదివేవాడు. ఆయన వెలమదొర. సరదాగా మాట్లాడేవాడు కాలేజీలోను, హాస్టలులోను. ఒకమారు ఒక పెద్ద వెలమ దొరగారి ఇంట్లో ఇద్దరం

కలుసుకున్నాము. ఎన్నిసార్లు పలకరించినా పలకలేదు. నాతో మాట్లాడితే తన పరువు పోతుందన్నట్టుగా ప్రవర్తించాడు. నాకు మొదట్లో ఆశ్చర్యం కలిగింది. తత్త్వం గ్రహించిన తర్వాత ఓహో అనుకున్నాను. నేను మాత్రం తక్కువ తిన్నానా? అందరికన్నా గొప్పవాణ్ణి. ఎందుకు మాట్లాడాలి అందరితోను వెకిలిగా. ఆ టెక్కులు ఏమీ లేక సర్వసామాన్య ప్రజలలాగ ప్రవర్తిస్తూ, ఎదుటివారిని గౌరవించే గొప్ప వెలమ మిత్రులూ ఉన్నారు, నాకు.

రాజులు కూడా మన రాష్ట్రానికి కొత్తవారనే నా నమ్మకం. వీరి ఆచారాలు, వ్యవహారాలు, సంబంధాలు, గోత్రాలు చూస్తే ఇది స్పష్టమవుతుంది. వీరి ఆచారాలలో రాజస్థాన సంప్రదాయాలు, మాటలు, మొగల్ సంప్రదాయం బాగా పాతుకున్న తర్వాత, రాజపుత్ర సంస్కృతితో మేళవించిన తర్వాత వ్యాపించిన మాటలు ఎంతో రూపం మార్చుకొని కనిపిస్తాయి. హిందీలో దాదా అంటే పెద్దవాడు; వృద్ధుడు; తాత— దీనిని దద్దా అని కూడ వ్యవహరిస్తారు. అదే మన రాచవారు వాడే దద్దయ్య. యోగక్షేమాలు కనుక్కొనడానికి వాడే ఖులాసా అనే మాట ఖైరియత్, ఖైర్‌సల్లా అనే హిందీ పలుకుబడినుంచి వచ్చిందని నా నమ్మకం. "అల్లా అల్లా ఖైర్‌సల్లా" అనేది సామెత. రాచవారిది మరీ ఫ్యూడల్ మనస్తత్త్వం. నవాబుల హయాం తెలుగుదేశంలో పూర్తిగా పాతుకున్న తర్వాత కూడా రాచవారు ఇలా వుండేవారని

"కొంద సిగలు తలగుడ్డలు పాకోళ్ళు
చలువ వస్త్రములు బొజ్జలు కటార్లు
కాసెకోకలు గంపెడేసి జందెములును
తలవారు జలతారు డాలుహార్లు
సన్నపు తిరుచూర్ణ చిన్నెలు కట్లాలు
జొల్లు వీడెములును వల్లెవాటు
దాడీలు వెదురాకు తంహా సొగసుకోర్లు
సంచుకు దొరగార్లటంచు పేర్లు

సమరమును జొచ్చి రొమ్ము గాయమున కోర్చి
శాత్రవుల ద్రుంచనేరని క్షత్రియులకు
నేల గాల్పన ఆ వట్టి యెమ్మెలెల్ల
మదన గోపాల..............................."

వేణుగోపాల శతక కర్త ఆక్షేపించారు. ఈ వర్ణనలోని వేషం, మనస్తత్త్వం ఇప్పుడు లేవనుకొండి.

రాచవారిలో తండ్రి, కొడుకు స్వేచ్ఛగా మాట్లాడుకోరు. స్వేచ్ఛగా ఏమిటి, అసలు మాట్లాడుకోరన్నా తప్పు కాదు.

దద్దయ్యలు (పెద్దరాజులు) వీథులలో అరుగుమీద కూర్చున్నప్పుడు ఎవరైనా సైకిళ్ళమీద పోయినా వారికి కన్ను కుడుతుంది. "ఎవరా అబ్బాయి? అలా పోతాడే?" అని గింజుకుంటారు. దిగిపోవాలి. కాని కోపం పైకి కనిపించనీయదు. మీసాలమధ్య దాచుకుని మునిముని నవ్వులు నవ్వుతారు. "మాటలు దీర్ఘముగా నున్ను, దేశీయమై రహస్యముగానున్ను పలుకుతారు....మనుష్యులు స్వభావముగా దౌష్ట్యము చేయదలచినా, మంచి తీయని మాటలు మాత్రం వదలరు" అని ఏనుగుల వీరాస్వామయ్య 'కాశీయాత్రా చరిత్రము'లో వ్రాశారు. చంపేటంత కోపం వచ్చినా, "అయ, ఆయా, చిత్తం" అనే వినయ వచనాలు పలకడం మానరు.

ఆడవారయితే మరీ ఘోషా. ఎనభై సంవత్సరాలు దాటిన వగ్గైనా ఎవరరైనా పరాయివాడు కనిపిస్తే, పదహారేళ్ళ బాలాకుమారిలాగా లోపలికి పరుగు తీస్తుంది. ఔరా అనిపిస్తుంది. మరీ విడ్డూరమేమిటంటే, అంట్లు తోమే దాసీదానినైనా సరే, "ఏమమ్మా" అని కూడా అనరాదు. "ఏమండీ వెంకాయమ్మ గారండీ, అంట్లు తోమారేమండీ? బాగా తోమండి" అనాలి. బండి తోలుతున్న రాజుగారైనా "కూటికి తక్కువైతే, కులానికి తక్కువా?". "వెంకట్రాజు గారండీ, బండిని కొంత వడిగా పోనిద్దురూ!" అని కోరాలి.

అగ్రవర్ణం వారమని చెప్పుకుంటున్న బ్రాహ్మణుల వ్యవహారం మరీ విపరీతం. ఆధునిక పద్ధతులన్నిటినీ అనుసరిస్తూ, ప్రతి సేవక వృత్తికీ పోటీ చేస్తూ కూడా తాము వశిష్ఠ వామదేవ అంగీరస శతమర్షణాది ఋషుల వారసులమని అనుకుంటారు. పొట్ట పొడిచినా, పొట్ట కోసినా ఒక మంత్రం ముక్క వుండదు. నోరు కూడా తిరుగదు. గుళ్ళల్లో అర్చనకు గోత్రమేమిటని అర్చకుడడిగితే "ఏమిటే మన గోత్రం?" అని సహధర్మచారిణిని అడుగుతారు. నేటి రాజకీయాలలో నేమో గోడమీది పిల్లి, దేహళీదీపం, గాలివాటు గాలిపడగ.

ఇలాటి అహంకారంవున్న తెగంతో లుకలుకలాడే మనకు విమోచనం ఉంటుందా అని నాకు అనిపిస్తూ వుంటుంది. అన్నిటినీ మించి మన విశిష్టత— మనం మన సంస్కృతిని లక్ష్యం చేయం. ఎదుటివాడి సంస్కృతిని, భాషను, దేనినీ గౌరవించం. కార్యసాధకునికి వుండవలసిన ముఖ్య లక్షణం పట్టు విడుపులు. తమిళులు, మలయాళీలు, తదితరులు కార్యసాధకులు. తమకు ఇతరులతో సమానంగా వర్తించే విషయాలనే చర్చించి, అభిప్రాయ భేదాలు

వదలి, ఎదుటి వారిని గౌరవించి, తామూ గౌరవం పొంది, పని పూర్తిచేసుకుని వెళ్ళుతారు. తెలుగువాడు అభిప్రాయభేదం వున్న అంశాన్నే నొక్కి నొక్కి వాదించి, ఎదుటివారి భాషను, తిండిని, సంస్కృతిని అసహ్యించుకొని, విమర్శించి, వారికి అసహ్యం కలిగించి, వారి సహకారం కోల్పోయి, పని పాడు చేసుకుని వస్తాడు.

ఒక పని ఒకడు చేయడం సులభం; పదిమందితో చేయించడం, పదిమందితో కలిసి చేయడం సులభం కాదు. పదిమందిని ఏకోన్ముఖంచేసి పని చేయించినవాడు సర్వకాలాలలోను పెద్దవాడవుతున్నాడు. అలాటి కలిసి కట్టుతనం మనకు ఎప్పుడు వస్తుందో!

ప్రపంచం ముందుకన్నా సన్నిహితం అవుతున్నది. దేశంలోని వివిధ ప్రాంతాలతోను, ప్రపంచంలోని వివిధ దేశాలతోను తెలుగువారికి సన్నిహితత్వం ఏర్పడుతున్నది. ప్రతి జాతిలోని శాఖలు, తెగలు తన శతాబ్దాల గూటినుంచి వెలువడి ముందుకు వెళ్ళడానికి ప్రయత్నిస్తున్నాయి. తెలుగువారిలోని కులాలూ, తెగలూ ఈ సదవకాశాన్ని వినియోగించుకుని తమ గొప్పదనపు— కుహనా గౌరవపు— గూడు వదలి వెలుపలికి వస్తాయా? మూడు తేపలుగావున్న తెలుగునాడు త్రివేణిగా కలిసి ముందుకు ఉరకడానికి ప్రయత్నిస్తుందా? ఆ సుముహూర్తం ఎన్నటికో!

[భారతి, సెప్టెంబర్ 1966]

★★

# సాహిత్యవ్యాప్తి : ప్రమాణాల పరిరక్షణ

దేనికయినా ప్రమాణాలు ఎవరైనా కర్ర పట్టుకొని బెదిరిస్తే ఏర్పడేవి కావు. ఇది ఇలాగే వుండాలి అనే సుగ్రీవాజ్ఞలకు ఏదీ లొంగదు. అలా లొంగేట్టయితే, ప్రపంచంలో ధర్మబోధ ఎంత జరిగినా, ఇంకా అన్యాయం ఎందుకుంది? మానవుడు రోజుకొక చట్టం చొప్పున ఎందుకు చేయవలసి వచ్చింది? వస్తున్నది? మనుస్మృతి మొదలు భీమస్మృతివరకు ధర్మశాస్త్రం ఎందుకు పెరగవలసి వచ్చింది? కనుక ధర్మశాస్త్రాలు, దండనీతులు ప్రమాణాలను పరిరక్షించలేవని మనం గ్రహించినట్టే గదా?

సాహిత్యం కూడ దీనికి అపవాదమేమీ కాదు. ఎందరు ఎన్ని లక్షణాలు రచించి బంధించినా, ఏ రచనా ఆ బంధాలకు కట్టుబడలేదు. కావ్య ప్రయోజనం గురించి కాని, కావ్యం విలువలు గురించి కాని ఎవరిమాటా నిలువలేదు, ఎవరిదీ వరాస్త్రమూ కాలేదు. ప్రమాణాలు, ప్రయోజనాలు పరస్పర సంబద్ధాలు గనుక ప్రమాణాలకు ముందు ప్రయోజనాలను గురించి ఉట్టంకిస్తాను.

"ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ,
కరోతి కీర్తిం ప్రీతిం చ సాదుకావ్య నిషేవణమ్."

సాధుకావ్య (మంచి కావ్య) సేవనం ధర్మార్థ కామమోక్షాలలోను, కళలలోను ఏది గ్రాహ్యం, ఏది అగ్రాహ్యం అనే విచక్షణతను, కీర్తిని, ప్రీతిని కలిగిస్తుంది– అనే భామహుని మాటను మనం చదివినప్పుడు, ఇవి సాధించడానికి మరొకటి లేదా?– అనే ప్రశ్న ఉదయిస్తుంది; దీనికి సాహిత్య దర్పణకారుడైన విశ్వనాథుడు

"చతుర్వర్గ ఫలప్రాప్తిః వేదశాస్త్రేభ్యో నీరసతయా దుఃఖాదేవ పరిణత బుద్ధీనామేవ జాయతే; పరమానంద సందోహ జనకతయా సుఖాదేవ సుకుమార బుద్ధీనామపి పునః కావ్యాదేవ."

వేదశాస్త్రాలు నీరసమయినవి, వాటివల్ల కష్టంతో పరిణత బుద్ధులైన మానవులు చతుర్వర్గ ఫలప్రాప్తి పొందుతున్నారు. కావ్యాలు పరమానంద సందోహ జనకాలు గనుక వాటివల్ల పామరులకు సులభంగా చతుర్వర్గ ఫలప్రాప్తి కలుగుతుంది - అని సమర్థించాడు. అయినా ఎన్ని కావ్యాలు ఎందరి

మనస్సును మార్చాయి? కావ్యాలే మానవుల మనస్సును మార్చేటట్లయితే ఒక్క కావ్యం చాలు.

ఇతర మతస్థులు అందంగా కావ్యాలు రచించి జనాన్ని తిప్పుకొంటారని భయపడి కాబోలు "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని ధర్మశాస్త్రాచార్యులు శాసించారు? దీనికి సమాధానమన్నట్టుగా సేతుబంధకారుడు వాకాట ప్రవర సేనుడు....

"పరివడ్ఢఇ విణ్ణాణం
సంభావిజ్జఇ జసో, విసప్పంతి గుణా,
సువ్వఇ సుపురుస చరియం
కిం తం జేణ న హరంది కవ్వాలావా.

పరివర్ధతే విజ్ఞానం;
సంభావ్యతే యశః; అర్ఘ్యంతే గుణాః;
శ్రూయతే సుపురుష చరితం;
కిం తత్ యేన న హరంతి కావ్యాలాపాః."

విజ్ఞానం వృద్ధి పొందుతుంది; కీర్తి వ్యాపించి గౌరవం కలుగుతుంది. గుణాలు పొందవచ్చు. సత్పురుషుల చరిత్రలు వినవచ్చు. కావ్యాలకు ఆకృష్టం కానిది ఏమిటి?- అని అన్నాడు. ప్రవరసేనుడు కావ్యాన్ని మైత్రితో పోల్చి మైత్రిని చివరంటా నిలుపుకొనడం ఎలా సాధ్యం కాదో, కావ్యాన్ని మొదటి నుంచి చివరిదాక నిర్వహించడం సాధ్యంకాదన్నాడు.

"అహినవ రాయారద్ధా
చుక్కఖ్ఖలిఏసు విహడిత పరిట్ఠావియా,
మెత్తి అ పముహ రసిఆ
ణివ్వోఢుం హోఇ దుక్కరం కవ్వకహా.
అభినవ రాగారబ్ధా
చ్యుత స్ఖలితేషు విఘటిత పరిస్థాపితా,
మైత్రీవ ప్రముఖ రసికా
నిర్వోఢుం భవతి దుష్కరం కావ్యకథా."

ఇక ఆనందవర్ధనాచార్యుడు ధ్వని అనే అపూర్వ ఆలోకం కాంతి

"ప్రతీయమానం పునరన్యదేవ
వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్,

యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం
విభాతి లావణ్య మివాంగనానామ్."

లలనల దేహంలో అవయవాతిరిక్తమైన, అవయవ సౌష్ఠవాదులకు మించిన లావణ్యం మిసమిసలాడుతున్నట్టు మహాకవుల వాక్కులలో పదపదార్థాతిరిక్తమైన మరొక అర్థం భాసిస్తుంది అని అన్నాడు. "కావ్యార్థ వివేకో యో యం చేతశ్చమత్కృతి విధాయి.... సహృదయోదయలాభంచ." కావ్యార్థ వివేక మనేది చేతశ్చమత్కృతి విధాయి - మనోవికాసం కలిగించేది.... దీనివల్ల సహృదయులు ఏర్పడడమనే మరొకలాభం-అనీ అన్నాడు ఆనందవర్ధనుడు.

అభినవగుప్తాచార్యులు కావ్యాలకు ప్రీతి ప్రధానమని, ఇదే వేదాదులను కావ్యంనుంచి విడదీసే టటువంటిదని, ఆ ప్రీతి అనేది ఆనంద మేనని అన్నారు.

ఇక మమ్మటాచార్యుడైతే బండగా కావ్య ప్రయోజనాన్ని ఇలా వివరించాడు :

"కావ్యం యశ స్సేర్థకృతే
వ్యవహారవిదే, శివేతర క్షతయే,
సద్యః పరనిర్వృతయే
కాంతాసమ్మితతయోపదేశ యుజే."

కావ్యంవల్ల కీర్తివస్తుంది. డబ్బువస్తుంది. వ్యవహారజ్ఞానం తెలుసుకోవచ్చు. అమంగళం నిహతమవుతుంది. వెంటనే ఇతరులను సంతోషపెట్టవచ్చు. కాంత చెప్పినట్టుగా ముచ్చటగా చెప్పవచ్చు - అని. పాపం! ఇతనికి కీర్తి, డబ్బు ప్రధాన ప్రయోజనాలయాయి.

ఇక, సర్వమూ రసదృష్టితో చూచిన రాజశేఖర పండితుడు "వాక్యం రసాత్మకం కావ్యం" - రసాత్మకమైన వాక్యమే కావ్యం - అని నిర్వచించాడు.

ఇక, పాశ్చాత్యుల భావాలు చూద్దామా, ప్రాచ్యుల భావాలతో అవీ సరిసమానంగానే కనిపిస్తాయి:-

కేవలం ఆనందమే కావ్యప్రయోజనం - అంటాడు కేస్టల్ వెట్రా.

ఆనందకరమైన బోధే కావ్యప్రయోజనం - అంటాడు స్కాలిజర్.

ఉపదేశించడం, ఆనందించడం, ఆనందపరచడం కావ్య ప్రయోజనాలు- అన్నాడు ఫిలిప్ సిడ్నీ.

ఆనందం ముఖ్యప్రయోజనమని, ఉపదేశం అనుషంగిక ప్రయోజనమని అంటాడు జాన్ డ్రైడెన్.

ఆహ్లాదకరంగా ఉపదేశించడమే కావ్యప్రయోజనం-అంటాడు డాక్టర్ జాన్సన్.

ఆనందం ఎప్పుడు కావ్యాన్ని వెన్నాడుతూ ఉంటుంది- అంటాడు షెల్లీ.

విజ్ఞాన వినోదాల సమ్మేళనం కావ్యప్రయోజనం-అన్నాడు హొరేస్.

ప్రాచీన ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికులందరూ లలితకళలు స్వయంభువులని; అవి సంఘాన్ని తీర్చిదిద్దుతాయని భావించడంవల్ల ఈలాటి కొలబద్దలు దాచి, ప్రయోజనాలకోసం, సూత్రాల నిర్ణయంకోసం ప్రయత్నించారు. ముఖ్యంగా ప్రాచ్యులు శబ్దాన్ని బ్రహ్మగా భావించేవారు గనుక, ధ్వనిని - రస స్వరూపమయిన ధ్వనిని సాక్షాత్తు పరమాత్మగానే భావించేవారు గనుక, ధ్వని ప్రతీయమానమవుతుందని, శబ్దంవల్ల-కావ్యంవల్ల కలిగే ఆనందం బ్రహ్మానంద సబ్రహ్మచారి అని ఏమిటేమిటో చెప్పారు. బ్రహ్మానంద స్వరూపం తెలియడానికి మనం తైత్తిరీయోపనిషత్తు ఆనందవల్లిలోని వాక్యాలు చూద్దాము:-

"యువా స్యా త్సాధుయువా అధ్యాయకః, ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్. సఏషో మానుషఆనందః." ఒక యువకుడు ఉన్నాడనుకొందాము. అతడు మంచి యువకుడు; బాగా చదువుకొన్నవాడు; అతడు ఉత్తమగుణవంతుడు; చాల చురుకైనవాడు; దృఢ సంకల్పుడు; ఆ సంకల్పాన్ని ఆచరణలో పెట్టగల బలంకలవాడు; దృఢగాత్రుడు; అలాటివానికి సమస్త సంపదలతో నిండిన ఈ భూమి అధీనమయి ఉందనుకుందాము. అప్పుడు, అలాటివానికి కలిగే ఆనందం మానుషానందం - ఇలాటివి ఎన్నో వేలయితే బ్రహ్మానందమవుతుంది.

వీరు కావ్యాత్మను ఏరూపంలో నిర్వచించినా, కావ్యప్రయోజనం ఏమని చెప్పినా భగవత్స్వరూపమైన శబ్దం సంఘాన్ని, మానవుణ్ని మార్చుతాయని నమ్మినవారు గనుక, ఆత్మసిద్ధాంతాన్ని ప్రతిదానికి అన్వయించడానికి ప్రయత్నించి, కళాస్వరూపావిర్భావ రహస్యాన్నే విస్మరించారు.

నిజానికి, కళ సంఘాశ్రయమే కాని, సంఘశాసకం కాదు. సంఘం - లేక సమాజం మారుతున్నకొద్దీ, దాని అవసరాలకొద్దీ కళలు ఏర్పడుతాయి; రూపుదిద్దుకుంటాయి. సమాజంలో ఏర్పడిన నీతి గాని, వ్యవస్థ గాని ఏకారణం వల్ల మారినా దానినిబట్టే కళలు తీగలు తాగుతాయి. మనిషి, మనసు వికసించడంతో అవిర్భవించిన జీవి గనుక, కూడు గూడు కూడులతో మాత్రమే సంతృప్తిపడడని సహృదయులైన వారికందరికీ తెలుసు. ఉదాత్తభావాలు, ఉత్తమ సాధనాలు లేనప్పుడుగూడ మానవుడు తనకు తోచిన రీతులలో చేజిక్కిన జేగురుమట్టితో ఏవేవో స్వరూపాలు గీసుకొన్నాడు; ఏవేవో కూని

రాగాలు తీసుకొన్నాడు. అదే మానవజీవి మనస్సులోని కళాతృష్ణ. ఈ కళాతృష్ణకు పరమావధి ఆనందం పొందడం. తన సుఖమయ జీవితానికి భౌతికమైన వస్తు సముదాయాన్ని సృష్టించుకొన్నట్లే, ఆనంద సంధాయకమైన కళను సృష్టించుకొన్నాడు. ఆనందమిచ్చేది సౌందర్యం. సౌందర్య సంధాయకం కళ. దీనినే మిత్రుడు రాంభట్ల కృష్ణమూర్తి 'జగత్తును సౌందర్యదృష్టితో దర్శించి సుందరంగా చిత్రించేది కళ' అని సూత్రీకరించాడు. మానవుడు తన అవసరాలు తీరిన తర్వాత, జగత్సౌందర్యాన్ని అవగాహన చేసుకొని తన పరిసర జగత్తును సుందరంగా మార్చడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఈ ఆనందాన్ని సమకూర్చేది, అతని మనుగడకు ఆలంబనమైనది సమాజం. మానవుడు వ్యష్టిగా ఏమీ చేయలేడు. సమాజం జీవనది; నిరంతర ప్రవాహశీలం.

ఈ సమాజంలోని మార్పులను, విలువలనుబట్టే తక్కిన కళలలాగే సాహిత్యమూ పుడుతుంది. అది అపౌరుషయమేమీ కాదు.[1] మానవుడు సుఖమయ

---

1. పూర్వం నిప్పు మానవునికి వరమాయుధం అది అన్ని కష్టాల నుంచి రక్షించే దిక్కు, దైవం. యజ్ఞానికి పురోహిత స్వరూపి. అదే హోత. అవే అధిదేవత. ఋత్విక్కు. నిప్పు లేకుంటె మనుగడ అసాధ్యం. ఇప్పుడూ అంతే· కాని, ఇప్పుడు వంట వార్పులకు, తక్కిన వాటికి అత్యవసరమనుకోండి. క్రూర మృగాలబారినుంచి ఆత్మరక్షకు, శత్రువులపై దాడికి - మరెన్నిటికో అగ్ని ఆధారం అప్పుడు. అది అప్పటి సంఘం అత్యవసర వస్తువు. కనుకనే అప్పటి సంఘంలోని భావాన్ని మధుచ్ఛందుడు. ..

"అగ్నిమీళే పురోహితం
యజ్ఞస్య దేవం ఋత్విజం
హోతారం రత్నధాతమం."

అని గొంతెత్తి ఉంటాడు-సంప్రదాయం ప్రకారమైతే ఈ మంత్రాన్ని దర్శించాడు. ఇది మానవుని తొలి ఛందోరూపం; తొలికవిత. దీనిని గురించి ఒక చిన్న అవాంతర ఉపగాథ చెబుతాను. లండన్‌లో తొట్ట తొలుత డిక్టఫోన్ కనిపెట్టినప్పుడు, దానిలో మొట్టమొదటిసారిగా పెద్దవానితో మాట్లాడిద్దామనుకొని మాక్స్‌ముల్లర్‌ను పిలిపించారట. కొత్తగా కనుగొన్న యంత్రం కదా! చాల పెద్ద పెద్దవారు సమావేశానికి వచ్చారట. మాక్స్‌ముల్లర్ అగ్నిమీళే పురోహితం - అని ప్రారంభించారట. ఏదో పెద్దమనిషి అని పిలిపిస్తే బానిసల భాష మాట్లాడుతున్నాడే అని అందరూ ఈసడించుకొన్నారట. అప్పుడు మాక్స్‌ముల్లర్ దాని విశిష్టతను వివరించి, మానవుని తొలి కవితాగళం ఇదేనన్నాడట.

జీవితం గడపడానికి కొన్ని నిత్యమైన విలువలు - నిత్యమనదగకంటే విలువలు అందాము-ఏర్పడుతాయి; మానవుని మానవుడుగా చూడడం, నిజం చెప్పడం- ఈ నిజానికి ఎన్నో నిర్వచనాలున్నాయి—వంటివి. ఇవి సంఘంలో ఒక వ్యవస్థిత జీవితం—సువ్యవస్థిత జీవితం సాగించడానికి అవసరాలు. మంచి, చెడూ అనేవి నిరంతరం సంఘర్షిస్తూ సమాజంలో మార్పులకు కారణమవుతాయి. ఇవి కళా కారుల చేతుల్లో సుందరరూపం దిద్దుకుంటాయి. ఒకప్పుడు అన్న మరణిస్తే, అన్నభార్యను తమ్ముడు పెళ్ళాడేవ్యవస్థ ప్రబలంగా ఉండేది. ఇది కాలాను గుణంగా జుగుప్సాకరమైంది. దార్శనికులు దీనిని ఖండించారు. దానితో అన్న భార్యకు సంఘంలో తల్లిస్థానం ఏర్పడింది. దానితో నూతననీతి ఏర్పడింది. దాని వైభవ వర్ణనమే వాల్మీకి రామాయణం. ఈ నూతనరీతి వాల్మీక్యుపజ్ఞం కాదు. వాల్మీకి అంతగా చెప్పిన రామాయణం ఉత్తరభారతంలో - ఎందుకు దేశమంతా ఎంత ప్రచారంలో ఉన్నా, కిందికులాలవారిలో అన్న మరణిస్తే తమ్ముడు అన్న భార్యను పెండ్లాడే పద్ధతి ఇంకా పోలేదు?

కర్మకాండపై జుగుప్సకలిగింది. వర్ణవ్యవస్థపై తిరుగుబాటు చెలరేగింది. కొందరే ఉత్తములా? తక్కినవారు అధములా?- అనే ప్రశ్నలు సమాజంలో పెల్లుబికినవి. అస్తికతావగుంఠనంతో జరుగుతున్న అన్యాయాలకు జనం గుండె మండింది. ఈ మంటల్లో అవిర్భవించినవాడు సిద్ధార్థుడు. అతడు తన ఆచరణతో నూతనమార్గం చూపాడు. ఆ మార్గదీధితుల ప్రవాహమే సౌందరనంద కావ్యం.

ప్రపంచంలో గాని, మనదేశంలో గాని ప్రవర్తిల్లిన ఏ ఉద్యమాన్ని పరిశీలించినా, తదనంతర కళారీతులను పరిశీలించినా సంఘం మార్పులను సాహిత్యం అనుసరిస్తూ వచ్చిందనే స్పష్టమవుతుంది.

పూర్వం ప్రజలను కనడం పరమార్థం. ప్రజలకోసమే గృహమేధు లయ్యేవారు. "దశాస్యాన్ పుత్రానాధేహి పతిమేకాదశం కృధి" - పదిమందిని కని, భర్తను పదకొండవవానిగా చేసుకో - అని వివాహమంత్రాలు ఆశీర్వదిస్తాయి వధువును. ఈ సంప్రదాయం రఘువంశంలో సుందరరూపం ధరించింది. దిలీపుడు సంతానంకోసం పడినపాట్లు నేడు మనం శత్రువుకు కూడ కోరం. పాత సాహిత్యంలో సంతానంకోసం, సంతాన సాధనంకోసం ఒలికించిన సౌందర్యం అంతా ఇంతా కాదు.

కాని, నేడు సంతానం వద్దు. "రెండు మేలు, మూడు చాలు" అనేది నేడు ప్రభుసమ్మితంగా ప్రచారమవుతున్నవాక్యం. "ప్రజయా హి మనుష్యః పూర్ణః" అనే వేదవాక్యం గతి ఏమైంది? సంతాన నిరోధం భ్రూణ

హత్యవంటిది. వ్యర్థంగా వీర్యపాతం చేయడం మహాపాపం కాదా! మరి కోటాను కోటి ప్రజలు ఈ పాపానికి ఒడిగడితే పాపఫలం ఎవరికి చెందుతుంది? సంఘంలో పూర్వం మహాపుణ్యం అనుకున్నవి నేడు మహాపాపంగా పరిణమించిందే! మరి సాహిత్యవేత్తలు గూడ వాటిపై కవితలు, నాటికలు, నృత్య నాటికలు, మహాకావ్యాలు గూడ వ్రాస్తున్నారే? అయినప్పుడు, ఈ కవుల క్రాంత దర్శిత్వం, నాయకత్వం ఏమేమయినట్టు? సంఘాన్ని మార్చగలిగినట్లా? సంఘం గాడిలోబడి కొట్టుకుపోయినట్టా? ఏది ప్రమాణం? ఎవరు ప్రమాణం?

కనుక సంఘంలోని పరిణామాలనుబట్టే, కళారీతులు అవిర్భవిస్తాయి. ఆ కళారీతులు తక్కినవారికి కొంత మార్గదర్శకాలు కావచ్చు; కాని, మరొక మహోద్యమం వచ్చినప్పుడు పాతవేమీ నిలువవు.

అయితే, రామాయణంవంటి వాటికి నేటికీ ఇంత ప్రాచుర్యం ఎందుకు?— అనే ప్రశ్న ఉంది. మానవుడు సమాజంలోని కొన్ని పరిస్థితులకు గురయి, ఆదర్శవాది అవుతాడు. లోకంలో తన ఎదుట అన్యాయం జయించడం, న్యాయం పరాజితం కావడం చూస్తున్నాడు. కాని, అవశుడై ఏమీ చేయలేడు. న్యాయం జయిస్తే బాగుండునని అనుకుంటాడు, ఆదర్శంవైపు మొగ్గుతాడు. తనకు అనుకూలమైనది, తాను కోరినది ఎక్కడున్నా, దానికోసం అర్రులు చాచుతాడు. రామునివంటి కొడుకుండాలని ప్రతి తండ్రి కోరుకుంటాడు. సీత వంటి లోకోత్తర సుందరి, అడవులలోను అనుచారిణిగా ఉండగల నిబ్బరం కలది, ఎన్ని ప్రలోభాలకైనా లొంగనిది అయిన భార్య అంటే ఎవరికైనా ఇష్టమే. పాపం పదమూడు సంవత్సరాలలోను ఆ యిల్లాలు కోరింది ఒక్కగా నొక్క జింకను!

అలాటి భార్య వుంటే ఎవరికి ఇష్టం వుండదు! ఇక రాముని వంటి భర్త కావాలని ఏ ఇల్లాలయిన కోరుకోదూ మరి? సకలగుణ సంపూర్ణుడు, పుంసాం మోహనరూపుడు, అన్నిటికీ మించి మహాశూరుడు, శరణన్నవానిని మన్నించే వాడు, ఇలాటి మగనితో అడవులలో విహరించడం, నిశ్చింతగా జీవితం గడపడం ఏ మహిళ కోరదు! ఏ మహిళ గర్వించదు!

అదర్శమనేది అతిశయోక్తిగానే ఉంటుంది. లక్ష్మణుని విషయంలో వాల్మీకి ఈ ఆదర్శాన్ని మరీ అమాయికత్వంగా చెప్పాడా అనిపిస్తుంది. "తమ్ముడూ! ఈ నగలు మీ వదినవేమో చూడవోయీ!" అని అడిగాడు రాముడు లక్ష్మణుణ్ని.

"నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే,

నూపురే త్వభిజానామి
నిత్యం పాదాభివందనాత్."

అన్నయ్యా, నాకు వదినె బాజూబంధులు తెలీవు. చెవుల కమ్మలు తెలీవు. నిత్యం పాదాలకు నమస్కారం చేయడంవల్ల అందెలు మాత్రం గుర్తుపట్టగలను— అన్నాడట లక్ష్మణుడు.

సుగ్రీవునివంటి మిత్రుణ్ని, ఆంజనేయునివంటి బంటునూ నా మటుకు నేను కోరుకుంటాను. నాకు సుగ్రీవునితో సరితూగే మిత్రులున్నారనుకోండి; అదే నా భాగ్యం! కాని బంట్లు మాత్రం లేరు.

లోకంలో ఏమి జరిగినా, తన భావనలో మాత్రం మానవుడు ఏవేవో కలలు గంటాడు. రచయిత, కళాకారుడు ఆ కలలను సౌందర్య దృష్టితో దర్శించి సుందరంగా చిత్రించినప్పుడు; తను అనుకున్నది ఎదుట ఈ రూపంలో వచ్చింది గదా అని సంతోషిస్తాడు. తాను అన్యాయాన్నో, న్యాయాన్నో చేయలేడు; కనుక ఎవరైనా చేసినా, చేసినట్టు కథ విన్నా ఆనందిస్తాడు. కళాకారుడు గూడ తను చిత్రించదలచిన దానిని, సంఘంలోని సత్తునో, అసత్తునో సమష్టిగా చేసి చూపిస్తాడు. దానితో శ్రోతృప్రేక్షక పాఠకుల మనస్సు రంజితమవుతుంది. దీనిని నాట్య శాస్త్రజ్ఞులు లోకధర్మి, నాట్యధర్మి అన్నారు పారిభాషికంగా. నాట్యధర్మం లోక ధర్మానికి భిన్నంగా ఉంటుంది. దానితో ఆకృష్టుడవుతాడు. ఈ విధంగా మానవునికి ఆదర్శం ఇష్టం. నిజానికి ఆదర్శం లేకపోతే మానవుడు ముందుకు పోవడమూ కష్టమే. ఈ ఆదర్శ వాంఛ ఏ రూపంలోనైనా ఉంటుంది. దీనిని పోగొట్టలేము. కనుక రామాయణంవంటి వాటికి ఏనాడూ ఆదరం ఉంటుంది; వాటి కళా వైదగ్ధ్యం అలాటిది.

ఇంతకూ సాహిత్యంలో ప్రమాణాలనేవి సంఘాన్ని ఆశ్రయించే ఉంటా యని చెప్పడమే నా ఉద్దేశం. ఏమి మార్పులు కలిగినా ఆదర్శమనేది జనానికి ఆకర్షకమని మరొకమారు చెప్పడం అసమంజసం కాదు.

(నల సంవత్సరం ఉగాదినాడు హైదరాబాద్ ఎగ్జిబిషన్ గ్రౌండ్స్ హాలులో జరిగిన తెలుగు సాంస్కృతిక మహోత్సవాల గోష్ఠిలో చదివిన వ్యాసం.)

[భారతి, జూన్ 1976]

★★

# తెలుగు సాహిత్యం - గాంధీజీ

దేశాభిమానం, దేశభక్తి మనకు కొత్తవి కావు, నిజానికి ఎవరికీ కొత్తవి కావు.

"జననీ జన్మ భూమిశ్చ
స్వర్గాదపి గరీయసీ"

అనే సూక్తి ఏనాటిదో! ఇక అచ్చం తెలుగువాడు చెప్పిన

"స్వస్థాన వేషభాషా
భిమతా స్సంతో రసప్రలుబ్ధ ధియః"

అనే సూక్తి మనకందరికీ కంఠపాఠమే.

కాని, ఈ వాస్తవాలు, సూక్తులు శతాబ్దాల విదేశ పరిపాలనతో, కాలం తెచ్చిన స్తబ్దతతో మరుగైపోయి మన జాతి నిద్రాణమైంది. అలాటి సమయంలో జాతీయోద్యమం తలయెత్తి మరొకమారు జాతిని సుప్రభాతం పాడి, జాగరితం చేసింది. 1907 లో సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో లోకమాన్యుడు "స్వరాజ్యం నా జన్మహక్కు" అనే నినాదమిచ్చి దేశాన్ని మంత్రముగ్ధం చేశాడు. ఆ నినాదమొక మంత్రంలాగ భారతావనిలో ప్రతిధ్వనించి ప్రజల హృదయ కుహరాలలో అనురణించింది.

సాహిత్యం సమకాలీన ప్రజాజీవిత ప్రతిరూపమే గనుక ఈ అనురణనం సాహిత్యంలోను గుంఫితమైంది. 'తిలక్ మహారాజ విజయం' వంటి నాటకాలు, కావ్యాలు బయలుదేరాయి. గుంటూరు జిల్లాలో దామరాజు పుండరీకాక్షుడు, తూర్పుగోదావరి జిల్లాలో సోమరాజు రామానుజరావు వంటివారు నాటకాలు ప్రదర్శిస్తూ అప్పటి రాజకీయ నాయకుల ఆహార్యంతో ప్రేక్షకులను ఉర్రూతలూపించేవారు.

ఇక ఆంధ్ర నాటక పితామహుడు ధర్మవరం రామకృష్ణమాచార్యులు సూరత్ కాంగ్రెస్ మహాసభలో పాల్గొన్న తర్వాత బళ్లారిలో "పీపుల్సు అసోసియేషన్" అనే సంఘం స్థాపించి, ఆయనే అధ్యక్షత వహించి స్వరాజ్య వాంఛను సమర్థిస్తూ తీర్మానాలు చేశారు. ఈ జాతీయభావాలు ఆయన నాటకాలలో ప్రతిఫలించాయి. పాంచాలీ స్వయంవర నాటకంలో ద్రుపదుడు విదేశీ గుడ్డల పోటీకి

తట్టుకోలేక తమ మగ్గాలను మూలబడవేసిన సాలీల దుస్థితికి దుఃఖిస్తాడు. విదేశీ వస్త్రాలపై పన్ను విధించవలెనని, భారతీయ వస్త్రాలనే భారతీయులు కొనవలెనని శాసనం చేయవలసిందిగా మంత్రి ఆలోచన చెబుతాడు.(చతుర్థాంకం, ద్రుపద మంత్రి సంభాషణ.) అభిజ్ఞాన మణిమంత నాటకంలో ఉప్పు పన్ను ప్రసక్తి తెచ్చి దానిని తొలగించాలని వాదం చేయబడింది. (ద్వితీయాంకం, సదాచార నాగరికుల సంభాషణ.) అంటే ఇదంతా గాంధీజీ దక్షిణాఫ్రికా నుంచి భారతదేశానికి రాకపూర్వమే. రామకృష్ణమాచార్యులు అన్ని నాటకాలలోను సంఘ సంస్కరణ భావాలు, జాతీయత అక్కడక్కడ పొటమరిస్తూనే వుంటాయి.

ఈ జాతీయత గాంధీజీ దక్షిణాఫ్రికా నుంచి భారతదేశానికి తిరిగిరావ డంతో ప్రజ్వరిల్లింది. ఆయన వచ్చిరాగానే 1915 లోనే ఒక్కసారి భారతదేశ మంతటా పర్యటించారు. ఆయన నాయకత్వానికి 1917 లో చంపారణోద్యమం తోనే అంకురార్పణమయినా, 1920 లో నాగపూరు కాంగ్రెస్ మహాసభలో సహాయ నిరాకరణ నిర్ణయం ఆమోదితం కావడంతో సంపూర్ణత్వం పొందింది. ఆ నాయకత్వం గడ్డిపోచలను గండుమగలుగాను, మట్టిగడ్డలను మహావీరులుగా చేసి, రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదిరించేటట్టు చేసింది, కేవలం నిశ్శస్త్ర నీతితో, సాత్త్విక నిరోధంతో. నన్ను తు.చ. తప్పక అనుసరిస్తే, సంవత్సరంలోపల స్వరాజ్యం మీ ముంగిట్లో తంగేటి జున్ను అవుతుందని ఉద్ఘోషించాడు ఆయన. జనం ఆయన దక్షిణాఫ్రికా విజయగాథలను విన్నది గనుక నమ్మి అనుసరించింది.

ఆ ప్రజాసంరంభం సమకాలిక సాహిత్యంలో వివిధవిధాలుగా ప్రతిఫలిం చింది. దేశోద్ధారకుడు ఆంధ్ర దినపత్రికలోను, వారపత్రికలోను, సంవత్స రాది సంచికలలోను గాంధీజీ జీవితాన్ని, రంగుజాతులు తలెత్తుకొనేటట్టు చేసిన ధీరుని గాథలను, ప్రవచనాలను నిర్భీకంగా ప్రచురించడం, ప్రచారం చేయడం జనాన్ని వెన్నుతట్టాయి.

ఈ విధంగా గాంధీ మహావీరుడు, గాంధీ మహాత్ముడు తెలుగు సాహి త్యంలో తొట్టతొలుత సాక్షాత్కరించింది సుగృహీత నామధేయులు శ్రీ రాయ ప్రోలు సుబ్బారావుగారి "భగవాన్ మోహన్‌దాస్ కరంచాసాంధ్ర గాంధీ" అనే వ్యాసంలోనని నా నమ్మకం. రాయప్రోలువారి హృదయం అదివరకే జాతీయతో న్ముఖం గనుక, గాంధీజీ, భారతీయుల శ్రేయస్సంకోసం కంకణం కట్టుకున్న గాంధీజీ, దక్షిణాఫ్రికా కారాగారంలో మగ్గడం సహించకపోయింది. ఈ వ్యాసం

1914 ఉగాది సంచికలో ప్రచురితమయింది. "అద్యమగు ప్రేమకు సన్నిహిత కళ సాత్త్విక స్థైర్యము. నాడు భాగవతాగ్రేసరుడగు ప్రహ్లాదు డీ ధర్మరహస్య మును వెల్లడించెను. నేడు భగవాన్ మోహన్‌దాస్ కరుణాసాంద్ర గాంధీ ఆధునిక నాగరిక ప్రపంచమునకు ప్రబోధించుచున్నాడు." అనే మాటలతో ఈ వ్యాసం సమాప్తమయింది.

తర్వాత వెలువడినవి శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి పద్యాలు. గాంధీజీ 50వ జన్మదినోత్సవంనాడు ఇవి ఆయన చదివారు. ఇవి విజయ నగరం నుంచి వెలువడే భారతమాత వారపత్రికలో 1919 అక్టోబర్ 2న ప్రచురితమయాయి.

గాంధీజీ నాయకత్వంలో జాతీయోద్యమం ముమ్మరమయిన తర్వాత ఆయనపై కవితా పుష్పాలు ఎన్నో కురిశాయి. వాటిలో చెప్పుకోదగినదొకటి శ్రీ మంగిపూడి వేంకటశర్మగారి "గాంధీ శతకము."

శ్రీ దేశోద్ధారకుని భారతి సారస్వత మాసపత్రిక గాంధీ త్రివర్ణ చిత్రంతో గాంధీ శతకంతో 1924 జనవరిలో ప్రారంభమయింది ఈ పద్యంతో.

"విరుపమ కల్యాణ గుణా
భరణా జనకాభయోగి వందిత చరణా
పురుషార్థ భరితచరితా
కరుణామృత పూరితాత్మ గాంధిమహాత్మా."

ఏ భావమైనా మనఃఫలకంలో శాశ్వతంగా గీచినగీటుగా హత్తుకొని పోవడానికి, ఉత్తేజానానికి ఛందోబద్ధం కావడం అవసరం. మానవుని మనోవికాసంతో ఛందస్సు కూడా జనించింది. ఈ అవసరం వున్నంతవరకు ఛందఃప్రభావం తరగదు. కనుక అసంఖ్యాకంగా గేయాలు, పద్యాలు వినిపించాయి.

"కొల్లాయి గట్టితేనేమి,
మా గాంధీ
కొమటై పుట్టితేనేమి
వెన్నపూసా మనసు
కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై
బ్రహ్మ తేజస్సూ."

అని బసవరాజు అప్పారావుగారు ఆలపించారు. దువ్వూరి, జాషువా మొదలయిన వారు కంఠమెత్తారు.

శ్రీ వేలూరి శివశాస్త్రిగారి వంటి ప్రాచీన పండితులు గూడా మోహన దాసుని వ్యక్తిత్వంతో సమ్మోహితులయారు. ఆయన గాంధీజీ ఆత్మకథను తెలిగించారు.

అది ఆధారంగా శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు గాంధీజీ ఆత్మకథను "బాపూజీ ఆత్మకథ" అనే ఛందో మకుటంతో అలంకరించారు. ఈ కావ్యానికి పీఠిక వ్రాసిన డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు "తిక్కనతో సజాతీయు డైనవాడు మన చౌదరి. అనగా సరిసమానుడని యతిశయోక్తి బలికి యపాయము దేను. ఆ వర్గమున నగ్రాసనము లేకున్నను అసనత్వము గలవాడు. దేశప్రేమమును, మహనీయ కార్యదీక్షను పురికొల్పు గ్రంథములలో నీయాత్మ కథకు మించినది ఈ దేశమున, ఈ కాలమున మరియొందు లేదు. తుమ్మల సీతారామమూర్తి మహాత్ముని ఆస్థాన కవి. ఈ స్థానము శాశ్వతము" అని ప్రశంసించారు.

గాంధి ఇర్విన్ ఒడంబడిక తర్వాత గాంధిజీపై ఎన్నో గేయాలు, ఖండికలు వర్షించాయి.

"జయగాంధీ గుణకంధీ
ప్రేమసంధీ గాంధీ.
కటితట బానితసురుచిరచేలా
దేశహితంకరణోన్నత శీలా."

వంటి గీతాలతో ఆంధ్ర దిగంతాలు మార్మోగాయి.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

"....బోసినోటి కోమటి
.........................
దశావతార భరలజ్జానమ్రుడై పోయెడున్."

అని గొప్పగా చెప్పారు.

గాంధీజీ హరిజనోద్యమం మన దేశంలో పండితులతో చాలమందికి హృదయ సంపాకానికి కారణమయింది. మంగిపూడి వేంకట శర్మగారు "నిరుద్ధ భారతము" అనే అస్పృశ్యతా ఖండన కావ్యం వ్రాశారు. అది పండిత పామరులందరికీ అనిరుద్ధంగా మాన్యమైంది.

"బుద్ధుడు మున్ను భారతపు
భూమిని మాత్రమె యుద్ధరించె నే
డిద్దర నెన్న మానవుల
హీనత మాన్పగ నుద్భవించె వి

ద్వద్దనులారః గాంధి యవ
తారముగాని మరొండు గాదు మీ
రిద్ధవిచారులై యనుస
రించి తరింపుడు శంక లేటికిన్?"

అని శర్మగారు అస్పృశ్యతను పాటించే పండితులను హెచ్చరించారు.

శర్మగారు 1912 ఉగాది సంచికలో నిమ్నజాత్యుద్ధరణము, పంచమ విలాపము అనే ఖండికలు రచించారు.

గాంధీజీ నిర్యాణం చెందినప్పుడు దేశప్రజల దుఃఖం కట్టలుతెగి పారింది. తెలుగుకవుల ఆవేదనంతా మాటలతో చెప్పలేము. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, ఆయన సతీమణి కవయిత్రి శ్రీమతి కనకమ్మగార్ల దుఃఖం "గాంధీజీ మహాప్రస్థానం" అనే కావ్యంగా ప్రవహించింది. దానిలో

"ఒక సుమమ్ము నందనోద్యానమందుండి
యిలకు డిగియె దెబ్బదేండ్ల క్రింద
అనుదినము క్రొత్తలగు తావులను నించి
వచ్చినట్టి త్రోవబట్టి పోయె
.... .... .... .... .... ....
దానితావులతో సమస్తమ్ము జగము
గమగమాయించె నొక హోరుగాలి వీచె
మతదురావేశమంత సుమమ్ము వ్రాలె
సర్వమయు దివ్యపాదకంజముల యందు."

అని ఉదాత్త సుందరంగా కరుణరసం జాలువారింది.

శ్రీ దాశరథిగారు దుఃఖభారంతో—

"కేల్మోడ్తున్ బ్రతుకెల్ల త్యాగ
హవనాగ్నిన్ వ్రేల్చి ఆహారమే
పల్మార్వీడి మహోపవాసముర
ప్రాక్పాశ్చాత్య లోకమ్ములన్
కేల్మోడ్పించిన తాపసేంద్రుని మనః
కేదారమం దెంతగా
తాల్మిల్ పండినవేమొ శత్రు
వును సైతం బట్టె మన్నించుటల్."

అని చేయెత్తి నమస్కరిస్తాము. గాంధీ హంతకునీ ఏమీ అనలేకపోతారు.

గాంధీజీ సూక్తులతో ఎంతో సాహిత్యం పెరిగింది. శ్రీ దేవులపల్లి సీతారామశాస్త్రిగారి "గాంధీ సుభాషితములు" ఈ కోవలో చెప్పదగినది.

గాంధీజీ సిద్ధాంతాలయిన సత్యాహింసలు వస్తువుగా వచ్చిన కావ్యాలు, ఖండికలు, కథలు, నవలలు ఎన్నో। వాటిని పేర్కొనడానికి, వాటి చరిత్ర వ్రాయడానికి ప్రత్యేక సిద్ధాయి అవసరం.

భారతదేశ ప్రజలఉత్కృదయాలను, వాటితోబాటు భాషాసాహిత్యాలను ఏలిన మహాత్మాగాంధీ వంటి ఉదాత్తచరితుడు ఇక ఎంతోకాలానికి గాని అవతరించదేమో। అవతరించిననాడే భారతజాతి, తెలుగుజాతి ఇంతకన్నా అభ్యుదయం సాధిస్తుంది.

[ఆంధ్రపత్రిక, 2-10-1968]

★★

# అనువాదం : దానిలోని చిక్కులు

తెలుగుభాషలో అనువాదాలు ప్రధానంగా ఐదు భాషల నుంచి వచ్చాయి- సంస్కృతం, ప్రాకృతం, బెంగాలీ, ఇంగ్లీషు, ఇటీవలి కాలంలో హిందీ భాషల నుంచి. మరాఠీ, కన్నడ, తమిళ భాషలనుంచి చెప్పుకోదగినంతగా అనువాదాలు రాలేదు.

అనువాదం చేసేటప్పుడు ఆయా భాషలలో పాండిత్యమేకాక విషయ పరిజ్ఞానం, అన్నింటికన్నా మించి చారిత్రక దృష్టి అవసరం. పదాలు చరిత్రతో పాటు స్వరూపం మార్చుకోకపోయినా, అర్థంలో, అర్థచ్ఛాయలలో మార్పులు సంతరించుకొంటాయి. దీనికి సంస్కృతపదాల అనువాదం సంగతే చూద్దాం:- యజమానః అనే పదానికి వేదకాలంలో యజ్ఞం చేసేవాడని అర్థం; ఇప్పుడు ఆస్తి హక్కుదారుడని అర్థం. యజ్ఞం చేయించేవారిలో ఒక ప్రత్యేకమైన పని చేసేవాడు అధ్వర్యుడు; ఇప్పుడు దాదాపు అధ్యక్షుడని అర్థం. చరిత్ర తెలియక చారిత్రకాంశాలు అనువదించేటప్పుడు ఇప్పుడున్న అర్థాన్ని ఆ కాలపు సాహిత్యానికి అన్వయించినప్పుడు అనేకానర్థాలు కలుగుతాయి. ఉదాహరణకు - పుర అంటే పట్టణం అని నేటి అర్థం. ఋగ్వేదకాలంనాడు వేలాదిగా పట్టణాలు వెలయడానికి అవకాశం లేదు. అయినా, వేదాలను అనువదించిన మాక్స్‌ముల్లర్ మొదలు నేటిదాక ఇప్పుడున్న అర్థాన్నే అతిప్రాచీన కాలానికి అన్వయించి, పెక్కు తప్పుడర్థాలకు తావిచ్చి, చరిత్రను తలక్రిందులు చేశారు. ఋగ్వేదం నాటి పురాలన్నీ అసురులకు చెందినవి. అసురభాషలో పుర - పురు - బురు అంటే అక్షన్యాయంతో - అంటే పాచికలు వేసి లెక్కలు కట్టిన పద్ధతితో పంచిపెట్టిన కమతం అని అర్థం. ఈ అర్థం చెప్పుకొన్నప్పుడు, ఋగ్వేదంలోని 'నవశాకం నవతి పుర ధ్వంసీ దశవేశ్మాని' అన్న మంత్రానికి చక్కని అర్థం కుదురుతుంది. ఇంద్రుడు 99 కమతాలు ధ్వంసంచేసి పదిఇళ్ళను పట్టుకొన్నాడు అని దీని అర్థం. అలాకాక పుర అంటే నగరం అని తీసుకుంటే, 99 పట్టణాలు ధ్వంసంచేసి పదిఇళ్ళు పట్టుకున్నాడని తేలుతుంది. ఇళ్ళతో ప్రయోజనమున్నవాడు అన్ని పట్నాలను ధ్వంసం చేయడం, పది ఇండ్లు ఉంచడం పరమ మూర్ఖతకు చిహ్నమవుతుంది.

ఇలాగే ఔచిత్యంలేని అనువాదాలను గురించి వీరేశలింగంగారు అతి తీవ్రమైన విమర్శ చేశారు. ఇది మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి పంచతంత్రానువాదం గురించినది. ఆ అనువాదం సారాంశం తెలుపుతాను. మహాత్ముడైన గరుత్మంతుని జన్మదినోత్సవానికి పక్షులన్నీ పరస సాగుతూంటే, ఒక కాకి వెంట వర్తకుడు కూడా బయలుదేరాడు. కాకి దుష్టపక్షి; వర్తకుడు సాధువు. ఒక అమ్మి తట్టలో పెరుగు పెట్టుకొని పోతుండగా, కాకి పెరుగుతిన్నది. దానిమీద అమ్మి కోపించి రాయి విసరగా, జిత్తులమారి కాకి తప్పుకుంది. పాపం సాధువయిన వర్తకుడు చచ్చిపోయాడు - ఇదీ అనువాద సారాంశం. ఇంతకూ పక్షులు బయలుదేరుతుంటే, వర్తకుడు వాటివెంట ఎందుకు బయలుదేరి వెళ్ళాడు? కాకిమీద పడవలసిన రాయి వర్తకునిమీద పడి అతడు ఎలా చచ్చాడు? ఈ సమస్యలేవీ వేంకటరత్నం పంతులుగారికి పట్టలేదు. సంస్కృతంలో వర్తకః అని వుంటే, వర్తకుడు అని ఆయన అనువదించారు, అంతే. వీరేశలింగంగారు ఈ అనౌచిత్యదోషం చూపించి, అమరకోశంలోని "కోయష్టికః తిత్తిరికో వర్తకో వర్తులాశ్రయః." అన్న శ్లోకం ఉదాహరించి, వర్తకః అంటే తిత్తిరిపిట్ట అని అర్థం చెప్పారు.

దీనినిబట్టి అనువదించడానికి భాషా పరిచయం ఒక్కటే కాకుండా ఔచిత్యమనేది ప్రాణమని తెలుతుంది. ఏ భాష నుంచి అనువదించినా, ఇంగితం, ఔచిత్యంలేని అనువాదకుని చేతుల్లో - అతడు ఎంత పండితుడైనా - అనువాదం నిలువునానీల్గి చస్తుంది.

ఇలాగే ఇటీవల తెలుగు పత్రికారచయితలు నా మిత్రులు చాలామంది ఔచిత్యరహితమైన అనువాదం చేశారు. రావీనదికి వరదలు వచ్చాయి. ఆ వరదలలో నదిఒడ్డున ఉన్న 30 వేల స్లీపర్లు (Sleepers) పాకిస్తాన్ వైపునకు కొట్టుకొని పోయాయి - ఇదీ వార్త. కొన్ని తెలుగు పత్రికలవారు తమ సర్జన శీలతను జోడించి రావీనదిఒడ్డున 30 వేల మంది యాత్రికులు శయనించి ఉన్నారని, హఠాత్తుగా అర్ధరాత్రి వచ్చిన వరదలలో వారంతా పాకిస్తాన్ వైపు కొట్టుకొని పోయారని అనువదించారు. స్లీపర్లు అంటే, పండుకొన్నవారు అనుకొన్నారు గాని, రైలుపట్టాల క్రింద పరచే కొయ్యదిమ్మలని ఆలోచించలేదు.

సుప్రసిద్ధ పురాతత్త్వవేత్త, పండితుడు అయిన డాక్టర్ సంకాలియావంటి వారికే ఇలాటి అనౌచిత్యదోషాలు దొర్లాయి. సంకాలియా భోజుడు వ్రాసిన సమరాంగణ సూత్రధారను సంస్కరించి ప్రచురిస్తూ చిత్రకళాధ్యాయంలో ఉన్న "అండకం" అన్న పదాన్ని గోపుర శిఖరమని అపార్థం చేసుకొని

Cupola అని అంగ్లార్థం ఇచ్చారు. అదే గ్రంథంలో గోపుర శిఖరానికి 'అమలకం' అని భోజుడు వాడాడు. ఉత్తర భారతంలో గొడరీతి దేవాలయ శిల్పాలలో గోపుర శిఖరం ఉసిరికకాయలాగా తొనలు తేలి ఉండడం అందరికీ తెలుసు. కనుక దానిని అమలకం అనడం సహజం. చిత్రకళా పరిభాషలో 'అండకం' అంటే 'outline' అని అర్థం. అదే గ్రంథంలో ముఖాండకం, కాయాండకం అని భోజుడు వాడాడు కనుక క్యుపోలా అన్న అర్థం సరికాదు. అండకమంటే గుండ్రటి గీత, వర్తులం. తలచెక్కడానికి శిల్పి రాతిమీద చిన్న వర్తులాన్ని, దేహం - గొంతునుంచి నాభివరకు చెక్కడానికి పెద్ద వర్తులాన్ని గీచుకొని పని ప్రారంభించేవాడు. ఇది outline తప్ప మరొకటి కాదు. ఈ శిల్ప సంకేతమే చిత్రకర్మకు అనువర్తించింది.

సాంకేతిక జ్ఞానం లేనివారు కేవలం భాషాపరిజ్ఞానంతో సంస్కృత శాస్త్రాలను అనువదించడంవల్ల అనేక అపార్థాలు, అనర్థాలు వచ్చి, ఈనాడు రూఢమయిపోయాయి. చిత్ర శాస్త్రంలో తాళం అంటే జేన. ధనువు అంటే వేలికణుపు. 80 ధనువుల పొడువు ఉన్నాడంటే, 80 సెంటీమీటర్ల పొడవని అర్థం. దీనికి - ధనువుకు-విల్లు అని అపార్థం చేసుకొని, విల్లుకు రెండుగజాల పొడవు లెక్కించి, 80 ని రెట్టించి, 160 గజాల పొడవుగల వారుండేవారని సిద్ధాంతం చేశారు. అలాగే తాళమంటే జేన అనే అర్థం విస్మరించి సప్తతాళ ప్రమాణం అంటే ఏడుజేనల పొడవు అనడానికి బదులు ఏడు తాడిచెట్ల ప్రమాణమని అనువదించారు.

సప్తపర్ణి అనేది రెమ్మచివర వీవనలాగా విప్పుకొని ఉండి ఎప్పుడూ పచ్చగా ఉండే చెట్టు. దానికి ఏడాకుల అరటి అని అనువదించడమేకాక ఇటీవల మధ్యధరాప్రాంతంనుంచి వచ్చిన అరటిలాంటి ఒకానొక అలంకార వృక్షాన్ని సప్తపర్ణి అని సిద్ధాంతాలు చేస్తున్నారు. దీనిని ఎడారి తాటిచెట్టు - desert palm అని అంటారు.

వ్యవసాయశాస్త్రాన్ని అనువదించిన విద్వాంసులు 'కరిదష్టకపిత్థం' అంటే ఏనుగు మింగిన వెలగ అని అనువదించారు. దానిమీద కథలు, గాథలు అల్లారు. వ్యావసాయిక పరిభాషలో కరి అంటే కాండంతొలిచే పురుగు. దానిని stem borer అంటారు. తెలుగులో ఉండే కరివేపాకును - కరి అంటే నలుపు అనే అర్థం మాని, గజనింబమని సంస్కృతీకరించారు.

అనేక తెలుగు గ్రామనామాలు వాటి వాస్తవార్థాన్ని ఊహించలేక, శబ్ద

సారూప్యాన్నిబట్టి సంస్కృతీకరించడమూ జరిగింది. ఇవన్నీ ఆయా శాస్త్ర పరిజ్ఞానం లేనందువల్ల వచ్చిన లోపాలు.

సంస్కృతవాక్య నిర్మాణ పద్ధతి తెలుగులోకి వచ్చి, సరళమైన భాష వాడినప్పటికీ, అర్థంకాని కొత్తభాషను సృష్టించింది. రాముని గురించి వెళ్ళెను, రామునిచే చంపబడిన వాడాయెను - ఇటువంటివన్నీ ఏ సంస్కృత గ్రంథ వ్యాఖ్యానం చూచినా, ఏ పురాణ కాలక్షేపం విన్నా కోకొల్లలుగా కనిపిస్తాయి.

ఇంగ్లీషు నుంచి అనువదించేటప్పుడు మరొక విధమైన ఇబ్బందులు ఎదురవుతాయి. శాస్త్రాలు అనువదించేటప్పుడు అనేక పారిభాషిక పదాలు మన భాషలో లేవు. సాంకేతిక పదాల సృష్టిలో ఒక క్రమపద్ధతి ఏర్పడలేదు. దాని నుంచి తెలుగులో అనూదితాలైన శాస్త్రాలకన్నా ఇంగ్లీషే సులభమనిపిస్తుంది. పాఠ్యగ్రంథాల అనువాదం సరీ ఇదిగా ఉంటూంది. అనువాదకులు కొన్ని ఇంగ్లీషు పదాలు యథాతథంగా ఉంచుతున్నారు; కొన్నిటిని అనువదిస్తున్నారు. ఇంక కొందరు రెండింటిని సమనిస్తున్నారు. ఉదాహరణకు : **Carbon** ను కర్బనం అంటున్నారు. **Carbon - Dioxide** ను కర్బనద్వ్యామ్ల జనదము అని సమనిస్తున్నారు. నిత్యజీవితంలో రూఢయిన ఆంగ్లపదాలను కూడా పాఠ్య గ్రంథాలలో అనువదించడంవల్ల కొత్త రకం భాష తయారయింది. సాంకేతిక పదాల సమన్వయం లేకపోవడం వల్ల తెలుగులో విజ్ఞానశాస్త్రాలు ఒక్కొక్కప్పుడు విజ్ఞానానికి బదులు అజ్ఞానాన్ని ఇనుమడింప చేస్తున్నాయి.

ఒక విజ్ఞాన సర్వస్వం మన తత్త్వశాస్త్ర సంపుటంలో మన తత్త్వశాస్త్ర సంబంధమైన అసోసియేషన్ **Association** అన్న పదాన్ని సంఘం, సమాజం అని అనువదించారు. **Associatiaon of thought** భావ సమాజమని, **Association of Words** ను శబ్ద సమాజం అని అనువదించారు. వీటి అర్థమేమో ! సంగం అంటేనే **Association.** ప్రసంగం అంటే, భావాల పరస్పర వినిమయం వల్ల కలిగిన సంబంధం. అనుషంగం అనే మాట ప్రాచీన బౌద్ధ వాఙ్మయంలోను, తత్త్వశాస్త్రంలోను భావ సంబంధానికి ఉంది. దీనిని వాడ వచ్చుగదా ! కొత్త కొత్త భావాలు ప్రచారం చేసేటప్పుడు అనువాదాలకన్నా ఇంగ్లీషు పదాలే సులభమనిపిస్తుంటాయి.

**Dialectors** అంటే పూర్వపక్ష సిద్ధాంతవాదానికి గ్రీకులు పెట్టిన పేరు. **Dialectics** అంటే రెండు పరస్పర విరుద్ధమైన వాటి సమ్మేళనమని అర్థం. దీనికి ఈనాటి అనువాదం గతితర్కమని. ఈ అనువాదంలో **Dialectics** లో

ఉండే ద్వయ అన్నపదం మృగ్యం. పదంలో లేని గతి వచ్చి పడింది. హిందీ వారు దీనిని 'ద్వంద్వాత్మకవాద్' అని అనువదించారు. ఇది మూలానికి కాస్త దగ్గరగా ఉంది.

Materialism అనే పదాన్ని భౌతికవాదమని అనువదిస్తున్నారు. Physics కు భౌతికశాస్త్రమని అనువదిస్తున్నారు. నిజానికి ఈ రెండింటికీ చాలా దూరపు చుట్టరికం. ఇంగ్లీషులో mater, material, materialism అనేవి ఒక కుదురునుంచి పుట్టిన పదాలు. కాని తెలుగు వీటిని వరుసగా పదార్థం, వస్తువు, భౌతిక వాదం అని అనువాదాలు చేయడంవల్ల కుదురు తప్పి, వాటి పరస్పర సంబంధం ఏ నాటికీ మన మనసుకు పట్టదు. ఇది సాంకేతిక పదాల అనువాదంలో వచ్చిన అవకతవకలు. Mater అనేది లాటిన్ పదం. దానికి సమానార్థక సమాన ధ్వని పదం సంస్కృతం నుంచి తీసుకుంటే, దానినుంచి ఎన్నో పదాలు సృష్టించుకోవచ్చు.

యూరపులో శాస్త్రజ్ఞులు ఏ దేశం వారయినా, ఏ భాషవారయినా, తాము కనిపెట్టిన శాస్త్రీయ విషయాలకు జీవద్భాషలు కాని గ్రీకు, లాటినుల నుంచి పదాలను స్వీకరిస్తారు; పదబంధాలు నిర్మించుకొంటారు. జీవద్భాషలో పదాలు నిర్మించుకొనడం వల్ల కొన్ని ఇబ్బందులు వస్తాయి. అవి ప్రజల నోళ్ళలో నలిగి శబ్ద స్వరూపమూ, అర్థ స్వరూపము కూడా త్వరత్వరగా మారిపోయే సంభవముంది. అందుకోసం వాడుకలో లేని భాష నుంచి, ముఖ్యంగా గ్రీకు, లాటినుల తోబుట్టువైన సంస్కృతం నుంచి సాంకేతిక పదాలను ఏరుకుంటే ఈ ఇబ్బంది ఉండదు. ఉదాహరణకు రాజకీయాలలో వాడే Capital అనే పదం. దీనిని మనం పెట్టుబడి అంటున్నాము. Capital, Capitalist, Capitalism, Capitalisation అనే పదాలకు పెట్టుబడి, పెట్టుబడిదారు, అనే పదాలు అతుకుతాయి. కాని Capitalisation కు పెట్టుబడీకరణం అని అనవలసి ఉంటుంది. ఇది ఎంత అసహ్యంగా ఉంటుందో ఆలోచించండి. కాని, సంస్కృతంలో ఉండే పరిపణం అనే పదాన్ని, పెట్టుబడికి పర్యాయమైనదాన్ని-వాడితే, పరిపణం, పరిపణీ, పారిపణ్యం, పరిపణీకరణం లాంటి ఎన్నో పద పల్లవాలను సృష్టించుకొనే అవకాశం ఉంటుంది.

ఇంకొకవైపు మనకు హిందీ వాక్య నిర్మాణ పద్ధతి తెలుగులోకి వస్తున్నది. హిందీ తెలుగులలో తత్సమశబ్దాలు స్వీకరిస్తున్నందువల్ల హిందీ వారు వాడిన తత్సమశబ్దాలను యథాతథంగా తెలుగులోకి తీసుకువస్తున్నారు. సంస్కృత శబ్దాలు ఆయా ప్రాంతాలలో విభిన్నార్థాలలో ఉంటున్నాయి.

ఉదాహరణకు : సంసార్ అనే పదం. ఇది హిందీవారికి జగత్తు. తెలుగు వారికి కుటుంబం. తమిళవారికి ధర్మపత్ని. కేరళులకి మాటామంతీ. ఇలా ఇన్ని అర్థాలున్న ఈ పదం హిందీ నుంచి ప్రపంచమని తెలుగులోకి అనువాదంలో అవతరిస్తున్నది. అలాగే ఉపరతి అనే సంస్కృత పదం అర్థం తెలుగులో కామశాస్త్ర సంబంధమయింది. కన్నడంలో శీలవతి. మహారాష్ట్రంలో పశ్చాత్తాపం. అస్సామీలో మృత్యువు. ఇలా భారతీయ భాషల్లోని ఆయా తత్సమాలను ఆ ప్రాంతాల రూఢ్యర్థం బట్టి అనువదించవలసి వస్తుంది. కేవల భాషాజ్ఞానం చాలదు, దేశాచార పరిజ్ఞానం కూడ అవసరం. రాహుల్ సాంకృత్యాయన్ సుప్రసిద్ధ నవల 'ఓల్గా సే గంగా'ను అనువదించిన అల్లూరి సత్యనారాయణరాజుగారు 'పీపల్ వృక్ష' అన్న పదాన్ని పిపాల్ వృక్షం అని అనువదించారు. పీపల్ పిప్పల అనే సంస్కృత పదం నుంచి పుట్టింది. రావిచెట్టని అర్థం. పీపల్ వృక్ష అనే మిశ్రమ సమాసాన్ని సంస్కృత సమాసమని భ్రాంతి పడడంవల్ల ఈ తప్పు దొర్లింది. హిందీ నుంచి అనువాదాలలో ఇలాటివి కోకొల్లలు.

ఇంగ్లీషు నుంచి అనువదించేటప్పుడు చాల ఇబ్బందులు వస్తుంటాయి. గ్రీకు పౌరాణిక సంకేతాలు, వృత్తుల పదబంధాలు ఇంగ్లీషు వాడుకలోకి చాల వచ్చాయి. వాటిని అనువదించేటప్పుడు 'ముక్కస్య ముక్కః'గా చెప్తే పాఠకునికి ఏమీ అర్థం కాదు. కొన్నిటికి భారతీయ సమానార్థక పదాలు దొరుకుతాయి గాని చాలవాటికి దొరకవు. అలాంటప్పుడు మూలంలోని అందం అనువాదంలోకి రాకపోగా, వికృతమయ్యే ప్రమాదం ఉంది. సామాన్యంగా అలవాటులోకి వచ్చిన పురాణ సంకేతాలివి :–

Sowing Dragon's teeth, Clearing Aegian's stables, Herculian task, Trozen horse, Achilles heel, Hydra head, Furries, Prometheus, Pandora's box, Balder's death మొదలగునవి.

వృత్తుల నుంచి వచ్చినవి :- Sabotage, back ground, ground, harmony, simphony, hammering out, on the envil, in the crucible మొదలగునవి.

ఆధునిక శాస్త్ర విజ్ఞానం నుంచి వచ్చినవి :– Poles apart, catelictic, nucleus cell మొదలగునవి.

వీటిని అనువదించేటప్పుడు పెద్దచిక్కు ఏర్పడుతుంది. Showing Dragon's teeth అన్న దానిని చాలమంది డ్రాగన్ దంతాలు నాటినట్లు అని

# అలీ సోదరులు

"అలీ సోదరులు త్రికరణశుద్ధిగా భారతీయులు. అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం అవలంబించాలని ప్రబోధిస్తూ వచ్చారు. అంతరంగిక మిత్రులతోగాని, బహిరంగ సభలలోగాని అదే మాట చెబుతారు........ ఇంతవరకు అలీ సోదరులకంటే ఎక్కువ ధైర్యవంతులను, పరిశుద్ధాత్ములను సందర్శించే భాగ్యం నాకు కలగలేదు. వీరిద్దరికి మనో వాక్కాయ కర్మలలో పాపపుచింత ఎన్నడూ లేదు. చెప్పే దొకటి, చేసేది మరొకటి అన్న అపనిందకు వీరెన్నడూ గురికాలేదు. ఆ పద్ధతి వీరిలో కంచుకాగడా వేసి వెతికినా కానరాదు. నా మాట మీరు నమ్మండి.

"అయితే వారు నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు అని నమ్మే అమాయకులు. ఉన్నది ఉన్నట్టు చెప్పే స్వభావం వారిది. యధార్థవాది బంధు విరోధి అన్నమాట వారిపట్ల అక్షరాల నిజం. తమ ధైర్యం, క్రమశిక్షణ, పరిశుద్ధాత్మ- వీటిని ప్రజలలో వ్యాపింపజేయడానికి వీరు శ్రమపడినంతగా, ఇతరులెవ్వరూ శ్రమపడి వుండలేదని నేను త్రికరణశుద్ధిగా చెప్పగలను. అహింసాయుత సహాయ నిరాకరణోద్యమ భావనలను ప్రజల మనస్సులో నాటుకొనేటట్టు వీరికంటే ఎక్కువగా ఇతర ముసల్మానులెవ్వరూ ప్రయత్నించి ఉండలేదు. ఉండరు కూడా." (అం. గాం-294) అని గాంధీజీ మౌలానా మహమ్మదలీ, మౌలానా షౌకతలీలను ముక్త కంఠంతో ప్రశంసించారు. పెక్కు బహిరంగ సభలలో, పెక్కు సార్లు అలీ సోదరులు హృదయపూర్వకంగా హిందూ ముస్లిం ఐకమత్యాన్ని, దేశ దాస్య విమోచనాన్ని ఆశించి గాంధీజీకి అనుచరులై ఆయనకు అతి సన్నిహితులయ్యారు. గాంధీజీ ప్రశంసలకు ఇంతగా, నిర్ద్వంద్వంగా పాత్రమయిన అలీసోదరులు ఎవరు? భారత స్వాతంత్రోద్యమంతో వారి స్థాన మెట్టిది? - అనే విషయాలు తెలుసుకొందాము.

## అలీ సోదరుల పూర్వులు

అలీ సోదరుల పూర్వులు అప్పటి యునైటెడ్ ప్రావిన్సెస్ (ఇప్పటి ఉత్తరప్రదేశ్) లోని బిజ్‌నోర్ జిల్లా నజీబాబాద్ వాస్తవ్యులు. మర్యాదగల వంశంవారు. వీరి పితామహుడు అలీబక్ష్ 1857లో జరిగిన ప్రథమ భారత

ఉనువదించారు. ఇది జేసన్ కథ. అంతర్యుద్ధానికి బీజావాపనం చేయడం అని అర్థం. ఈసీడుడు డ్రాగనును చంపగలుగుతాడు. కాని, డ్రాగను చచ్చేముందు ఒక కోరిక కోరుతుంది- నా పళ్ళు చుట్టూ నాటమని. వాడు నాటుతాడు. దానితో వేలాది వీరులు వానిచుట్టూ, పుట్టుకువచ్చి తమలో తాము పోట్లాడుతూ, వానిమీద పడతారు. దీని అంతర్యంగా మిగిలిన అర్థం అంతర్యుద్ధానికి అంతః కలహానికి బీజావాపం చేయడం. దీనికి మనకు సమానమైనది ఏదుపంది ముండ్లు పెట్టటం అనవచ్చు. ఏదుపంది ముళ్ళు ఇంట్లో పెడితే ఇంట్లో వారికి అంతఃకలహాలు వస్తాయని నమ్మకం. **Achilles heel** పదబంధం మన పురాణాలలోని దుర్యోధనుని తొడలవలె ఎచిల్లెస్ తల్లి అతనిని మడమలు పట్టుకొని అమృతంలో ముంచుతుంది. దానివల్ల అతడు ఎక్కడ దెబ్బ తగిలినా అజేయుడవుతాడు. ఒక్క మడమలలో దెబ్బతగిలితే తప్ప. ఈ విషయం గ్రహించిన శత్రువు మడమలమీద కొట్టి అతనిని చంపుతాడు. దుర్యోధనుని గాంధారి ఒళ్ళంతా తడవి నిరామయుణ్ని చేస్తుంది. కాని, తొడలు తడవలేదట. అక్కడే భీముడు గదతో కొట్టి అతనిని గెలుస్తాడు. **Hydra head**ను మన రక్త బీజుని కథతో పోల్చవచ్చు. హైడ్రా అనేక శిరస్సులున్న నాగు. దాని ఒక తల నరికితే దాని స్థానంలో రెండు మొలుస్తాయి; రక్తబీజుని రక్తం ఒక చుక్క కిందపడితే ఎందరో పుట్టినట్టు. హైడ్రాను హెర్క్యులెస్ చంపుతాడు. ప్రస్తుతం ఇది ఒక చిక్కును తొలగిస్తే దానిచోట, దానినుంచి మరికొన్ని పుట్టడానికి వాడుతున్నారు. **Furries** మన ప్రమథ గణమో, భైరవ గణమో వంటి గ్రీకు పురాణ గణం. దాని అర్పటి క్రమంగా ఉద్వేగావేశాలకు ప్రతీక అయింది. **Prometheus** అనే వీరుడు **Olimpus** నుంచి అగ్నిని అపహరించి ప్రజలకు అందించినవాడు. ప్రజలకోసం మొదట తిరగబడ్డ విప్లవకారుడు. **Prometheus** అనే విశేషణం విప్లవ సంబంధమైన, ప్రజలకోసం వీరుడు తెచ్చిన అనే అర్థంలో మిగిలింది. ఈ **Prometheus** కు మన ఋగ్వేదంలోని ఒక మంత్రం సరిపోతుంది. మనకు అంగిరస గణం వాడయిన ప్రమంథుడు అగ్నిని తెచ్చినట్టు ధ్వనిస్తుంది.

> "త్వమగ్నే ప్రథమో అంగిరా ఋషిః
> దేవో దేవానాం అభవః శివ స్సఖా,
>
> (ఋ. మం 1, అను-7, సూక్త - 31)

ఈ మంత్రంలో ఉన్న ప్రథమ అనే పదాన్ని ప్రమంథగా మార్చుకొంటే చాల బాగని, ప్రొమెథియస్‌కు ప్రతిరూపుడే ఇతడని మిత్రులు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి అభిప్రాయం. **Pandora's Box** బయట పెడితే అనర్థాలకు కారణమన్న

అర్థం. పండోరా ప్రొమెథియస్ చెల్లెలు. ఆమెకు తండ్రి ఒక పెట్టె నిచ్చి, దానిని ఎప్పుడూ తెరవవద్దంటాడు. కాని, ఆమె ఉత్కంఠతో తెరుస్తుంది. దానినుంచి అనేకానర్థాలు, రోగాలు పుడతాయి; కాని దానిలో ఆశ అనేదీ ఉంటుంది. కనుక ఈ ప్రపంచం ఎన్నికష్టాలు, రోగాలూ ఉన్నా ఒక్క ఆశతో జీవిస్తున్నది అని అర్థం.

Balder's death. Balder మన వృత్రాసురుని వంటివాడు. ఇతడు Oak వృక్షం - ఇంద్రవృక్షంమీద పుట్టిన బదనికతో - Misleitoe తో మరణిస్తాడు.

Sabotage - అనే పదం ఫ్రెంచి రైతులనుంచి ప్రచారమైన మాట. ఫ్రెంచి రైతులు వర్షాకాలంలో నడవడానికి కొయ్యబూట్లను వాడేవారు, మన విశాఖజిల్లా రైతులు పూర్వం పావుకోళ్ళను వాడినట్టు. ఫ్రెంచి భాషలో ఆ కర్రబూట్లను శాబొట్ (Sabot) అనే వారు. ఆ రైతులు తమకు కిట్టని రైతుల భూములను తమ కర్రబూట్లతో తొక్కివేసేవారు. ఈ కసి తీర్చుకోడాన్ని sabotage అన్నారు. ఇది క్రమంగా ఎన్నో అర్థాలు పొందింది.

ఇలాటి పౌరాణికాది పదబంధాలకు సమానార్థకాలు చెప్పలేము; వాటి భావం మాత్రం చెప్పగలము.

ఇలాటివి తెలియక అనువదించినప్పుడు Mammoth meeting/అన డానికి మామోత్తుల సభ అని అనువదించడమూ జరిగింది. Marriage Contract అనడానికి కంట్రాక్టు వివాహం జరిగింది అని అనువదించారు. ఒక ప్రముఖుడు ఒక చైనా నాటకాన్ని అనువదిస్తూ ఒక రైతు Sweet heart ను మధుర హృదయమని అనువదించాడు. అన్నాలూయి స్ట్రాంగ్ అనే రచయిత్రి స్టాలిన్‌పై వ్రాసిన గ్రంథాన్ని ఒకరు అనువదిస్తూ, 'రుమేనియనులు యుద్ధం పూర్తయేదాక ఆగకుండానే స్లేట్స్ (Slates) ఏర్పరచుకొని ఎన్నికలు జరువు కున్నారు' అన్న వాక్యంలోని Slates ను 'పలుకలు పెట్టుకొని' అని అనువదించారు. Slates అంటే నియోజకవర్గాలు. ఒకొక్కప్పుడు సామాన్యంగా మనకు వాడుకలో ఉన్న పదాలు విశేషార్థాలలో వాడినప్పుడు ఇలాటి ఇబ్బందులు వస్తాయి. ఇలాటి సందర్భాలలో అనువాదకుడు క్షణం ఆగి ఆలోచించవలసి వస్తుంది.

ఇక ఇంగ్లీషు అనువాదం చేసి చేసి ఇంగ్లీషు వాక్య సరళి అలవాటు పడినవారు ఉన్నారు. వీరు స్వతంత్రంగా వ్రాసినా, ఆంగ్ల వాక్య సరళి ఎంతగా పాతుకుపోయింది అనడానికి ఇటీవల వెలువడిన విశాలాంధ్ర కమ్యూనిస్టు మహాసభ ప్రత్యేక సంచికనుంచి ఒక ఉదాహరణ: 'బహుశః తెలుగు జర్న

లిజం సమగ్ర చరిత్రను భావి చరిత్రకారులు రచించినప్పుడు అందులో సువర్ణాక్షరాలతో చంద్రంగారు వ్రాసిన ఈ మహోత్కృష్ట రచనను పేర్కొన వలసి ఉంటుంది.' — (27-1-72 పుట 29) చంద్రంగారు వ్రాసిన ఒకానొక వ్యాసం సువర్ణాక్షరాలతో లిఖించదగింది— అని వ్యాస రచయితలు చెప్పాలను కున్నారు. కాని, 'చరిత్రలో చంద్రంగారు సువర్ణాక్షరాలతో వ్రాసిన వ్యాసం' అని చదువరి గ్రహిస్తాడు — భ్రాంతిపడతాడు.

కనుక అనువదించేటప్పుడు, ఉభయ భాషలలోనూ సమాన పరిజ్ఞానమే కాదుండా, చారిత్రక, సామాజిక, సాంకేతిక పరిజ్ఞానం, ఔచిత్య దృష్టి, ఉభయభాషా మర్యాదలు, ఉభయ ప్రజల మనస్తత్వాలలోని అంశాలు—ఇవన్నీ తెలిసి ఉండాలి. లేనిపక్షంలో అనేక లోపాలు, స్ఖాలిత్యాలు కలుగుతాయి. అలా కాక, పైన పేర్కొన్నవి తెలిసినట్లయితే అనువాదానికి మెరుగులు వస్తాయి. దీనికొక ఉదాహృతి ఇచ్చి నా వ్యాసం ముగిస్తాను :—

మిర్జా అబ్దుల్ కాదర్ బేదిల్ పాట్నాలో పుట్టాడు.20 లో ఢిల్లీలో మరణించాడు. ఇతడు తజిక్ జాతీయుడు. ఇతడు భారతదేశ ప్రణయ గాథను తీసుకొని 'కౌముదీ—మదన్' అనే కావ్యం పార్సీలో వ్రాశాడు. అందులో ఒక భాగాన్ని ఆంగ్లానువాదంనుంచి తెలుగులోకి ముత్యాలసరాలలో అనువదించారు మిత్రులు రాంభట్ల కృష్ణమూర్తి. ఒకచోట, కథాగమనాన్ని బట్టి అనువాదకునికి అనుమానం వచ్చింది. శ్లేష వాడి ఉంటాడనే నమ్మకంతో పార్సీ మూలం పరిశీలిస్తే నమ్మకం రూఢమయింది.

ఈ కథలో ఒక గమకి తన సంగీతంతో రాజును అలరిస్తాడు. రాజు సంతోషించి తన ముత్యాలహారం అతని మెడలో వేస్తాడు ఇంతలో ఒక నర్తకి వచ్చి రాజు ఎదుట నృత్యం చేస్తుంది. ఆ నృత్యానికి గమకి ముగ్ధుడై రాజు బహూకరించిన ముత్యాలహారాన్ని ఆ నర్తకి కాళ్ళకి కడతాడు. అప్పుడు అతడనే మాటలు :

"మెచ్చి నరపతి నాదు పదముల
కిచ్చినట్టి ఉపాయనమ్మిది
నీదు పదముల చేరి కడు
శోభలొనగూర్చున్."

ఇక్కడ పదములంటే పాటలు, పాదాలు. ఈ శ్లేష ఆంగ్లానువాదంలో లేక పోయినా తెలుగు అనువాదంలో చాలా చక్కగా అతికింది. పార్సీ మూలంలో

'పొయ్' అని ఉంది. ఇది పద్య చరణానికి, చరణానికి శ్లేష. ఇలాటి అనువాదం ఉభయభాషల, ప్రజల సంస్కృతుల, సంప్రదాయాల పరిజ్ఞానం ఉన్నప్పుడే సాధ్యం.

అనువాదం అనుసృష్టి కావాలి గాని, ఇటాలియన్ సామెత అన్నట్టు చిత్తశుద్ధిలేని అనువాదకుడు ఉభయ భాషలకు ద్రోహం చేసేవాడుగాను, షేక్స్పియర్ తన 'మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీం' లో బాధపడినట్టూ ఉండరాదు.

[నేషనల్ బుక్ ట్రస్ట్ మే, 1970 లో హైదరాబాద్‌లో నిర్వహించిన అనువాద సదస్సులో చదివిన వ్యాసం.]

★★

స్వాతంత్ర్య సమరంలో (సిపాయి విప్లవంలో) బ్రిటిష్‌వారికి తోడ్పడ్డాడు దానికి సంతసించి బ్రిటిష్ ప్రభుత్వం ఆయనకు ఒక జాగీరు బహూకరించింది. అది మొరాదాబాద్ సమీపంలో వుండేది. కనుక ఆయన నజీబాబాద్ నుంచి 1857 తర్వాత తన జాగీరుకు తరలి వెళ్ళాడు.

ఆయన జాగీరు పక్కనే రామ్‌పూర్ సంస్థానం వుంది. ఆ సంస్థానాధీశ్వరుడు నవాబ్ యూసుఫ్ అలీఖాన్ నాజిమ్ అలీబఖ్‌ష్‌కు మిత్రులు. అలీబఖ్‌ష్ కుమారుడు అబ్దుల్ అలీఖాన్. ఆయన సత్య ప్రవర్తన, నాగరిక పద్ధతి చూచి ముగ్ధుడైన రామ్‌పూర్ నవాబు ఆయనను తన ఆస్థానోద్యోగిగా వుంచవలసిందని అలీబఖ్‌ష్‌ను కోరారు. ఆ కోరికను అంగీకరించి అబ్దుల్ అలీఖాన్ తన తండ్రి జాగీరు నుంచి రామ్‌పూర్ సంస్థానానికి తరలి వెళ్ళాడు. షౌకతలీ రామ్‌పూర్‌లో 1873 మార్చి 10 వ తేదీన జన్మించారు.

అబ్దుల్ అలీఖాన్ 1880 లో కలరాతో మరణించాడు. అప్పటికి ఆయన వయస్సు 31. అప్పటికి ఆయనకు ఒక కుమార్తె, ఐదుగురు కుమారులు. పెద్ద కుమారునికి 13 సంవత్సరాల వయస్సు. వికలాంగుడు. కడగొట్టు సంతానానికి రెండు సంవత్సరాలయినా నిండలేదు. ఇతడే మహమ్మదలీ. అబ్దుల్ అలీఖాన్ భార్య అబదీ బానో బేగం వయస్సు 27 ఏళ్ళు. తర్వాత రాజకీయాలలో ఆమె పేరు బీఅమ్మన్ (తల్లి) అని ప్రఖ్యాతి చెందింది. పిల్లల పెంపకమంతా ఆమె మీదే పడింది. ఆమె ధైర్యశాలిని, దృఢ సంకల్ప. ఆమె విద్యావంతురాలు కాకపోయినా, తన కుమారులు విద్యావంతులు కావాలని నిశ్చయించుకొంది.

అప్పుడు ముస్లిం సంఘంలోని పెద్ద మనుష్యులు తమ పిల్లలు సాంప్రదాయికమైన మత దృష్టితో నిర్వహించే మద్రసాలలో చదివితే చాలునని భావించేవారు. కనుక, తమ పిల్లలకు ఆధునిక విద్య నేర్పే స్కూళ్ళకు పంపేవారు కారు. అబదీ బానో బేగం తన పిల్లలను స్కూలుకు పంపదలిస్తే, బంధువులందరూ తీవ్రంగా ప్రతిఘటించారు. కాని, ఆమె వారిని లెక్కచేయక, సమీపంలోని బరైలీ నగరంలోని స్కూలుకు తన కుమారులలో ఒకర్ని పంపింది. రెండవ కుమారుడిని కూడా పంపదలచినప్పుడు, కుటుంబానికి రక్షకుడుగా వుంటున్న ఆమె బావగారు షౌకతలీ "ఒక కుటుంబంలో ఒక నాస్తికుడు చాలదా? నేను స్కూలు ఖర్చు భరించలేను మరొకరికి" అంటూ అడ్డుతగిలాడు.

## షౌకతలీ విద్యాభ్యాసం

కాని వజ్ర సంకల్పురాలయిన తల్లి తన పొరుగునవున్న ఒక హిందూ

వడ్డీ వ్యాపారి ఇంటి పనిమనిషి సహాయంతో తన ఒంటిమీది నగలు కుదువబెట్టి రెండవ కుమారుడు షౌకతలీని స్కూలుకు పంపింది. షౌకతలీ బరైలీలో కొన్నేళ్ళు చదివిన తర్వాత 1883 లో అలిగఢ్‌కు వెళ్ళారు.

షౌకత్‌అలీ కాలేజీలో క్రికెట్ ఆటలో గొప్ప ఖ్యాతి సంపాదించారు. 1895 లో ఆయన పట్టభద్రులై ఉద్యోగంలో చేరారు. ఉద్యోగంలో ఉన్నా ఆయన తన కాలేజీ వ్యవహారాలలో శ్రద్ధ తీసుకునేవారు; కళాశాల విద్యార్థుల సంఘం కార్యదర్శిగా ఎన్నికయ్యారు. "ఓల్డ్ బాయ్" అనే పేరుతో వెలువడు తున్న విద్యార్థి సంఘం పత్రికకు సంపాదకులుగా వున్నారు. షౌకతలీ 17 సంవత్సరాలు ఉద్యోగం చేసిన పిదప ఉద్యోగంనుంచి విరమించి, ఎం. ఎ. ఓ. కాలేజీని సంపూర్ణ విశ్వవిద్యాలయం చేయడానికి జరిగిన కృషిలో ప్రజాభి ప్రాయాన్ని, విరాళాలను సేకరించడానికి సర్ ఆగాఖాన్ ప్రయత్నించినప్పుడు ఆయనకు కార్యదర్శిగా దేశమంతటా పర్యటించారు.

## కాబా సేవకుల సంఘం

ఆయన 1913లో "అంజుమన్ ఖుద్దమ్-ఇ-కాబా" (కాబా సేవకుల సంఘం) అనే సంఘం స్థాపించారు. ఈ సంఘం ప్రధాన లక్ష్యాలు ఇవి : సౌదీ అరేబియా పూర్వ పాలకులు ఒట్టామన్‌లతో అంతర్యుద్ధం చేస్తున్న సౌదీ సైనికులవల్ల మక్కాలోని కాబా భవనానికి ఎలాటి ప్రమాదమూ రాకుండా చూడడం, హాజ్ యాత్రకోసం మక్కాకు వెళ్ళే భారతీయ ముస్లింలకు సౌక ర్యాలు కలిగించడం. ఈ సంఘం కార్యదర్శిని ఖదీమ్ (సేవకుడు) అని, అధ్యక్షుణ్ని ఖదీముల్-ఖుద్దమ్ (సేవకానుసేవకుడు) అని వ్యవహరించేవారు. షౌకతలీ ఈ సంఘానికి మొదటి ఖదీమ్‌గా ఎన్నికయ్యారు. ఆయన ఆధ్యాత్మిక గురువు (ముర్షిద్), ప్రముఖ లక్నో విద్వాంసుడు మౌలానా ముహమ్మద్ అబ్దుల్ బరీ ఖదీముల్-కుద్దుస్ (అధ్యక్షుడు)గా ఎన్నికయ్యారు. సోదరుడు మహమ్మద్ అలీ అనారోగ్యంగా వున్నందున ఆయన నడుపుతున్న ఆంగ్ల వార పత్రిక 'కామ్రేడ్', ఉరుదూ దినపత్రిక "హమ్‌దర్ద్" నిర్వహణ బాధ్యత కూడా ఈ సంఘసేవతోపాటే స్వీకరించాడు షౌకత్‌అలీ.

## కారాగారవాసం—విడుదల

ఇంతలో ప్రథమ ప్రపంచ సంగ్రామం చెలరేగింది. టర్కీపట్ల బ్రిటిష్ ప్రభుత్వం ప్రతికూల వైఖరిని అలీ సోదరులు - షౌకత్‌అలీ, మహమ్మదలీ తీవ్రంగా విమర్శించ సాగినారు. భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రతి

కూలంగా ముస్లింలను రెచ్చగొడుతున్నారనే ఆరోపణతో వారిని ప్రభుత్వం 1915 మే 30 వ తేదీన అరెస్టుచేసి రాజకీయ బందీలుగా వేర్వేరు స్థలాలకు పంపింది. షౌకత్ అలీకి ప్రభుత్వ శాఖనుంచి వస్తున్న ఉపకార వేతనం ఆపి వేయబడింది. యుద్ధానంతరం బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలోని రాజకీయ పరిస్థితిని అదుపులో పెట్టలేకపోయింది. కనుక రాజకీయ బందీలను విడుదల చేయక తప్పలేదు. అలీ సోదరులు కూడా 1919 డిసెంబరు నెలలో విడుద లయ్యారు.

## ఖిలాఫత్ ఉద్యమం

అప్పుడు సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా ఉంది. గాంధీజీ దేశమంతటా పర్యటనకు పూనుకున్నారు; ప్రచారంచేసి ప్రజాభిప్రాయం సమీక రిస్తున్నారు. విడుదలయిన తర్వాత అలీ సోదరులు ప్రముఖ స్వాతంత్ర్యయోధు లయ్యారు. షౌకతలీ గాంధీజీకి సన్నిహితులై భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరారు. గాంధీజీని, కాంగ్రెస్‌ను ముస్లింలకు పరిచయంచేసి, వారిలో జాతీయ భావాలు కలిగించడానికి అలీ సోదరులు దేశమంతటా పర్యటన జరిపారు. ముస్లింలకు గాంధీజీపట్ల భక్తి విశ్వాసాలు కలుగడానికి ప్రధాన కారణం అలీ సోదరులే. షౌకత్ అలీ అఖిల భారత ఖిలాఫత్ సంఘం కార్యక్రమ ప్రచారం కూడా చేశారు. ఈ అఖిల భారత సంఘాన్ని జాతీయ ముస్లిం నాయకుడు చౌద్రీ ఖలీకుజ్జమా‹ 1919 లో స్థాపించారు.

ఈ సంఘం గురించి కొంచెం వివరించాలి. ప్రథమ ప్రపంచ సంగ్రామంలో బ్రిటిష్ ప్రభుత్వానికి, దాని మిత్రరాజ్యాలకు ప్రతికూలంగా పోరాడిన టర్కీ సామ్రాజ్యం దాదాపు విచ్ఛిన్నమయిపోయింది. ఖలీఫాగా వ్యవహరించిన టర్కీ సుల్తాన్ దాదాపు ఇతరుల చేతిలో కీలుబొమ్మయ్యాడు. ఈ సామ్రాజ్యాన్ని ఒట్టామన్ సామ్రాజ్యం అన్నారు. దీన్ని ప్రథమ ఉస్మానలీ క్రీ.శ. 1300 లో స్థాపించాడు. ఇది 1919 వరకు కొనసాగింది. ఈ సమ్రాట్టును ఖలీఫా అనే వారు. ఖలీఫా సామ్రాజ్యం ఖిలాఫత్. ఖిలాఫత్‌ను బ్రిటిష్, దాని మిత్రరాజ్యాల బారినుండి పూర్తిగా నాశనమయిపోకుండా కాపాడడానికి ఖిలాఫత్ ఉద్యమం ప్రారంభమయింది. చివరి ఖలీఫా అసమర్థుడయి ఇతరుల చేతి కీలుబొమ్మ అయినందుకు ముస్లింలలో చాల అసంతృప్తి బయలుదేరింది. గాంధీజీకి ముస్లింల పట్ల సానుభూతి ఉండడమే కాక, ఆ ఉద్యమానికి తోడ్పడడంవల్ల దేశంలో హిందూ ముస్లిం సమైక్యం వర్ధిల్లగలదని భావించారు. అందువల్ల ఆయన ఢిల్లీలో జరిగిన ఖిలాఫత్ మహాసభకు అధ్యక్షత వహించారు.

## కాకినాడ కాంగ్రెస్–ఖిలాఫత్ సభ

1923 డిసెంబరు నెలలో అఖిలభారత కాంగ్రెస్ మహాసభతోపాటు అఖిలభారత ఖిలాఫత్ మహాసభ కూడ కాకినాడలో జరిగింది. దీనికి షౌకతలీ అధ్యక్షత వహించారు. ఆ మహాసభలో భారతీయ సాంఘిక పరిస్థితిని చక్కబరచడానికి సాంఘికార్థికవర్గాన్ని నెలకొల్పాలని తీర్మానించారు. ఈ తీర్మానానికి అనుగుణంగా "హిందుస్తాన్ సేవాదళ్" అనే సంస్థ నెలకొల్పబడింది. దీని ప్రథమ సమావేశం 1924 లో బెల్గాంలో జరిగింది. దీనికి షౌకతలీ అధ్యక్షత వహించారు. 1925 లో జరిగిన ద్వితీయ సమావేశానికి అధ్యక్షుడు శ్రీ టి. సి. గోస్వామి.

## చిత్తశుద్ధికి ఆదర్శం

షౌకతలీ సహజంగా ముక్కోపి. తాను నమ్మిన విషయంలో ఎవరితోనూ రాజీపడేవారు కారు. దీనివల్ల కాంగ్రెసును సర్వస్వంగా భావించిన ఆయన భావిస్వతంత్ర భారతంలో ముస్లిముల ప్రతిపత్తి విషయమై ఏర్పడిన అభిప్రాయ భేదాలవల్ల కాంగ్రెసునుంచి విడిపోవలసి వచ్చింది. ఆయన కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి బొంబాయిలో స్థిరపడ్డారు. కొంతకాలంపాటు అదే ఆయన కార్యకలాపాలకు ప్రధాన కార్యస్థానమయింది. ముస్లింల సమస్యలను చర్చించడానికి 'ఖిలాఫత్' అనే ఉరుదూ దినపత్రికను నడిపారు. ఈ దినపత్రిక మొదట్లో వారపత్రికగా వుండేది. ఇది అఖిలభారత ఖిలాఫత్ సంఘం సందేశం వ్యాప్తికి 1920లో "ఖిలాఫత్- ఇ-ఉస్మానియా" అనే పేరుతో ప్రారంభించబడినది.

షౌకతలీ కాంగ్రెస్నుండి విడిపోయి, బహిరంగంగా ప్రతిపక్షంలో చేరినా, జీవితమంతా మర్యాదగల ప్రత్యర్థిగానే ఉన్నారు. ఆయన తన శత్రువులకు వెన్నుపోటెప్పుడూ పొడవలేదు. ఆయన కాంగ్రెస్తో వేరయి పోవడాన్ని కాంగ్రెస్ ప్రతికూల వర్గాలవారు తమస్వార్థానికి వినియోగించుకోవాలని ప్రయత్నించారు. కాని, ఆయన వారికి లొంగిపోలేదు. ఆయన జీవితం చివరిదశలో కేంద్ర లెజిస్లేటివ్ కౌన్సిలుకు ఎన్నికయ్యారు. ఆయన నిరంతరం పోరాడుతూ, 1938 నవంబర్ 26న ఢిల్లీలో కాలధర్మం చెందారు. ఆయన భౌతికదేహాన్ని ఢిల్లీలోని జామామసీదు సమీపంలో ఖననం చేశారు.

## గాంధీజీ ప్రశంసలు

గాంధీజీ షౌకతలీ స్వభావాన్ని, చిత్తశుద్ధిని గొప్పగా చిత్రించారు. ఆయన 1920 లో అలీసోదరులతో దేశపర్యటన జరుపుతూ మద్రాసు నగరానికి

వచ్చినప్పుడు ఖాన్‌బహదూర్ ఖుద్దూస్ భాషా అధ్యక్షతన జరిగిన సమావేశంలో ప్రసంగిస్తూ, షౌకతలీని గురించి చేసిన (షౌకతలీ సమక్షంలోనే) ప్రస్తావన వినండి :-

"మా మిత్రుడు షౌకతలీకి దండోపాయంలో విశ్వాసం ఎక్కువ. ఆయన బ్రిటిష్ సామ్రాజ్యంపై కత్తిదూసి పోరాడగల ధైర్యశాలి. ఆయన నాతో కలిసి వున్నంతవరకు, సహాయ నిరాకరణాన్ని విశ్వసిస్తున్నంత వరకు ఎట్లాంటి దౌర్జన్యానికీ పూనుకోడు. ఆంగ్లేయులపైగాని, తదితరులపైగాని దండోపాయం విధించడు. తన సంప్రదాయాన్ని అనుసరించి అన్నమాటను ఆయన తప్పడు. ఆయన సహాయ నిరాకరణవ్రతం ఆపి ధార్మావ్రతంగా ఆచరిస్తున్నాడు. హిందూ దేశమంతా దీనిని అవలంబించవలెనని కోరుతున్నాను. సమయం వచ్చినప్పుడు కత్తి దూసేటందుకు ఆయన సంసిద్ధమే. ఒకవేళ అతడు దౌర్జన్యం చేయడానికి ప్రయత్నిస్తే, నేను సన్యసించి ఈ ప్రపంచం విసర్జించి అడవికి పోయి అక్కడే మరణించగలను. మానవునికి స్వార్థత్యాగమే పరమావధి. నేను దానినే అవలంబిస్తాను. షౌకతలీ కూడా స్వార్థత్యాగమే అవలంబించివాడు అదే మనకు శరణోపాయం."

## మహమ్మదలీ విద్యాభ్యాసం

మహమ్మదలీ 1878 డిసెంబర్ 10వ తేదీన రామ్‌పూర్‌లో జన్మించారు. ఆయనకు రెండేళ్ళు నిండకముందే తండ్రి అబ్దుల్ అలీఖాన్ మరణించారు. మహమ్మదలీ చిన్ననాటి విద్యాభ్యాసం బరేలీలో జరిగింది. తర్వాత ఆయన అలీగఢ్‌లో చదివారు. అలహాబాద్ విశ్వవిద్యాలయంలో చదివి 1896 లో బి. ఎ. లో యునైటెడ్ ప్రావిన్సెస్ (ఇప్పటి ఉత్తరప్రదేశ్)లో సర్వప్రథములుగా వచ్చారు.

అప్పటి పద్ధతి ప్రకారం పట్టభద్రులైన వారికి ముఖ్యంగా ప్రథమశ్రేణిలో వచ్చిన వారికి పెద్ద పదవులు వెంటనే వచ్చేవి. అలాగే మహమ్మదలీకి డిప్యూటీ కలెక్టరీ ఉద్యోగమో, రెవెన్యూ ఆఫీసర్ ఉద్యోగమో సులభంగా వచ్చేది. కాని, పెద్దన్న షౌకతలీ (ప్రభుత్వ శాఖలో ఆఫీసరు) తమ్ముడిని, ఇంగ్లండుకు పంపి ఐ. సి. ఎస్. చేయించాలనుకున్నారు. అందువల్ల మహమ్మదలీ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి వెళ్ళి లింకన్ కళాశాలలో చేరారు. కాని ఆయన ఐ. సి. ఎస్. (ఇండియన్ సివిల్ సర్వీస్) పరీక్షలో ఉత్తీర్ణుడు కానందున స్వదేశానికి తిరిగి

వచ్చారు. వివాహం చేసుకుని సంవత్సరంపాటు ఊరికే వుండి మళ్ళీ ఆక్స్‌ఫర్డ్‌కు వెళ్ళి చరిత్ర పాఠ్యాంశంగా బి. ఎ. ఆనర్స్ పట్టా పుచ్చుకొన్నారు.

స్వదేశానికి తిరిగిరాగానే రామ్‌పూర్ సంస్థానంలో ప్రధాన విద్యాశాఖాధికారిగా నియమితులయ్యారు. కాని, రామ్‌పూర్ సంస్థానంలోని దర్బారు రాజకీయాలకు ఆయన ఇమడలేకపోయారు. కనుక త్వరలోనే ఆ పదవికి రాజీనామా యిచ్చారు. తర్వాత రెండేళ్ళపాటు ఏ ఉద్యోగమూ లేకుండా పెద్దన్న షౌకతలీ ఇంట్లో వున్నారు. ఊరికే ఉండడం ఎందుకని న్యాయశాస్త్ర పరీక్షకు వెళ్ళారు. కాని దానిలో ఉత్తీర్ణులు కాలేకపోయారు.

## బరోడా సంస్థానంలో ఉద్యోగం

అప్పటి బరోడా మహారాజు కుమారుడు, సంస్థాన వారసుడు కుంవర్ ఫతేసింగ్ ఆక్స్‌ఫర్డ్‌లో మహమ్మదలీ సహపాఠి. కనుక ఆయన సిఫార్సుపై బరోడా సంస్థానంలో ఆబ్కారీ శాఖలో అధికారిగా నియమితులై కొన్నాళ్ళు పనిచేసి, తర్వాత కుంవర్ ఫతేసింగ్‌కు పర్సనల్ అసిస్టెంట్‌గా నియమితులయ్యారు. ఫతేసింగ్ పట్టి తాగుబోతు. మహమ్మదలీ దుర్వ్యసనాలు లేనివారు గనుక ఆయన సాహచర్యంవల్ల తన కుమారుడు ఫతేసింగ్ తాగడంమాని బాగుపడుతాడని బరోడా మహారాజు భావించారు. ఆ ఆలోచనతోనే మహమ్మదలీని ఆ పదవికి నియమించారు. మహమ్మదలీ నిరంతరం సారాయిలో మునిగితేలే ఫతేసింగ్‌ను ఉద్ధరించకపోయినా, తన పరిపాలనదక్షతతో మహారాజు అభిమానం సంపాదించగలిగారు. ఆయన బరోడా ఉద్యోగంలో ఉన్నప్పుడు వ్యవసాయరంగంలో పెక్కు సంస్కరణలు ప్రవేశపెట్టారు. ఆయన అక్కడ ఎంతో గౌరవంతోను, రాజాదరంతోనూ ఉన్నా, ఏడేళ్ళకన్నా ఎక్కువ వుండలేకపోయారు.

కారణమేమిటంటే, ఆయన రచనలే. బరోడా సంస్థానంలో చేరిన కొన్నేళ్ళకు ఆయనకు రచనపై అభిరుచి కలిగింది. సమకాలీన సమస్యలపై ప్రఖ్యాత ఆంగ్ల పత్రికలకు వ్యాసాలు వ్రాయడం ప్రారంభించారు. బొంబాయి నుంచి వెలువడే 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రికలో ఇప్పటి అసంతృప్తిపై నా భావాలు (Thoughts on the present discontent) అనే ఆయన వ్యాసం 1907 లో ధారావాహికంగా ప్రచురితమయింది. దానిని అప్పటి వైస్రాయి లార్డ్ మింటో ప్రశంసించారు. బరోడా సంస్థానాధీశులు మహమ్మదలీ క్రమంగా రాజకీయాల్లో ప్రవేశించడం జరుగవచ్చునని ఊహించి రచనను ప్రచురణకు పంపడానికి ముందు తమకు చూపాలని ఆదేశించారు. మహమ్మదలీకి ఈ

నిబంధన నచ్చలేదు. పదవిని పరిత్యజించి పత్రిక నడుపుదామనుకొని రాజీనామా పంపారు. మహారాజు ఆయన రాజీనామాను ఆమోదించక జీతంలేకుండా రెండేళ్ళు సెలవు తీసుకోమన్నారు; రెండేళ్ళలో మనస్సు మారుతుందేమోనన్న అభిప్రాయంతో. మహమ్మదలీ బరోడా ఉద్యోగాన్ని వదులుకుంటున్నారనే వార్త తెలియగానే కొన్ని సంస్థానాలు ముఖ్యమంత్రి పదవిని స్వీకరించవలసిందని కోరాయి. కాని ఆయన అంగీకరించలేదు.

## కామ్రేడ్ — హమ్దర్ద్

మహమ్మదలీ స్వప్నం 1911 లో గాని ఫలించలేదు. ఆయన "కామ్రేడ్" అనే ఆంగ్లపత్రికను కలకత్తానుంచి ప్రారంభించారు. ఆయన ఆంగ్లభాషా పాండిత్యమూ, పత్రికా రచనా చమత్కృతి కారణంగా 'కామ్రేడ్' పత్రిక త్వరలో జనాదరణ పొందింది. 'కామ్రేడ్' ఇంగ్లాండులోని సుప్రసిద్ధ పత్రికలకు దీటయినదని పలువురు ఆంగ్లేయులే ప్రశంసించారు. 1912 లో మహమ్మదలీ తన వారపత్రికను కలకత్తా నుంచి ఢిల్లీకి తరలించారు. 1912 అక్టోబరు 12వ తేదీన ఢిల్లీనుండి మొదటి సంచిక వెలువడింది. కలకత్తానుంచి వెలువడు తున్నంతవరకు 'ఈ పత్రిక అందరికీ నచ్చాలి, ఎవరిపైనా పక్షపాతం లేనిది' అనే విధానం అనుసరించేది, కాని, ఢిల్లీకి వచ్చిన తర్వాత ఈ విధానం అట్టేకాలం కొనసాగలేదు. ప్రతి సంచికలోను బ్రిటిష్‌వారికి ముస్లిం ప్రపంచంమీద, ముఖ్యంగా టర్కీమీద గల విద్వేషవైఖరిపై సంపాదకీయమో, వ్యాసాలో వుండేవి. దీని ఫలితంగా 1914 లో పత్రికల చట్టంక్రింద 'కామ్రేడ్' నిషేధించ బడింది. దీనిని తర్వాత పదేళ్ళకు 1924 లో మహమ్మదలీ పునరుద్ధరించారు. కాని, ఆయన అనారోగ్యంవల్ల, రాజకీయ కార్యకలాపాలలో నిమగ్నుడై ఉండ డంవల్ల, తగిన సమర్థుడైన ఉప సంపాదకుడు దొరకనందున ఈ పత్రిక రెండేళ్ళకన్నా ఎక్కువగా ఉండలేకపోయింది.

మహమ్మదలీ ఢిల్లీకి వచ్చిన తర్వాత "హమ్దర్ద్" అనే ఉరుదూ దిన పత్రికను గూడ 1913 లో ప్రారంభించారు. ఇది అడపా దడపా ఆగిపోతూ, వెలువడుతూ 1929 ఏప్రిల్ వరకు బతికింది. బతికినన్నాళ్ళూ ఆంగ్ల పత్రికా రచన సత్సంప్రదాయాలను గొప్పగా కాపాడుతూ జనాదరణ పొందింది.

## దేశానికి అంకితం

మహమ్మదలీ కలమూ, పలుకూ కరుకైనవి. భారతదేశానికి, ముస్లిం ప్రపంచానికి హానికరమైనదని ఆయన భావించిన బ్రిటిష్ ప్రభుత్వం యొక్క

చర్యను తూర్పార పట్టడంలో ఏమరుపాటు చెందేవారు కాదు. దీనివల్ల ఆయనను 1915 మే 30వ తేదీన ప్రభుత్వం అరెస్టుచేసి, ఢిల్లీ సమీపంలోని మోహరౌలీలో నిర్బంధంలో ఉంచింది. మోహరౌలీ ఎల్లలు దాటి రారాదని ఉత్తరువు చేసింది. పిదప ఆయనను అక్కడినుంచి మధ్యపరగణాలలోని (ఇప్పటి మధ్యప్రదేశ్) ఛింద్వాడాకు తరలించారు. అక్కడ ఆయన 1919 డిసెంబర్ వరకు రాజకీయ బందీగా వున్నారు. ఆయన ఛింద్వాడానుంచి విడుదల అయిన తర్వాత కేవలం పత్రికా రచయిత మాత్రమే కాదు జాతీయ నాయకులుగా మారిపోయారు. అప్పటినుంచి ఆయన దేశ స్వాతంత్ర్యంకోసం బ్రిటిష్‌వారితో పోరాడడంలోనే సర్వశక్తులనూ, జీవితాన్నీ వెచ్చించారు; అహోరాత్రం కారాగారాలలోనో, దేశ విదేశాలలో రాజకీయ చర్చల్లోనో, సభలలోనో గడిపారు.

## ముస్లింలలో జాతీయతా ప్రచారం

భారతీయ మహమ్మదీయులలో జాతీయతా జాగృతి కలిగించి, మహమ్మదీయులు కలిసికట్టుగా దేశ స్వాతంత్ర్యంకోసం బ్రిటిష్ వారితో తలపడడమనే ఏకైక లక్ష్యంతో మహమ్మదలీ రాజకీయాలలో ప్రవేశించారు. ఛింద్వాడానుంచి విడుదలయిన పిదప ఆయనకు రాజకీయంగా కనువిప్పు కలిగింది. భారత దేశంలో బ్రిటిష్ పరిపాలన స్థిరంగా వున్నంతవరకు తమ లక్ష్యాలు సిద్ధించడం కల్ల అని ఆయనకు నిశ్చయం కలిగింది. కనుక ముస్లింలు బాగుపడాలంటే పెద్ద రాజకీయ పక్షమైన భారత జాతీయ కాంగ్రెసే శరణ్యమని విశ్వాసం కలిగింది ఆయనకు. ఈ విశ్వాసంతో జాతీయ కాంగ్రెస్‌లో చేరారు. ఖిలాఫత్ ఉద్యమంలో గాంధీజీ సహకారం సంపాదించగలిగారు. మరొకవైపు గాంధీజీ నాయకత్వాన్ని ముస్లింలు అంగీకరించేట్టుగాను చేశారు.

## జామియామిలియా తొలి వైస్‌ఛాన్సలర్

ఆయన చాలాకాలం గాంధీజీకి చాలా సన్నిహితులుగా వున్నారు. సహాయ నిరాకరణోద్యమంలో ప్రధానపాత్ర వహించారు. ఆ సందర్భంలోనే ఆయన అలీగఢ్ ముస్లిం విశ్వవిద్యాలయం నిర్వాహకులకు బ్రిటిష్ ప్రభుత్వంతో తెగతెంపులు చేసుకోవాలని నచ్చజెప్పడానికి ప్రయత్నించారు. ఈ విషయంలో ఆయన సఫలుడు కాకపోయినా పెక్కుమంది విద్యార్థుల హృదయాలను చూరగొనడంలోను, విశ్వవిద్యాలయాధికారులలో కొందరి మనస్సులు మార్చడంలోను కృతకృత్యులయ్యారు. ఈ విశ్వవిద్యాలయం వదలిన వారితో అలీగఢ్‌లోనే జామియామిలియా ఇస్లామియా అనే పేర మరొక విశ్వవిద్యాలయాన్ని

వెలసింది. దానికి మహమ్మదలీ తొలి "షేఖ్ ఉల్-జామియా" - వైస్ఛాన్స్లర్‌గా నియమితులయ్యారు. తర్వాత ఈ విశ్వవిద్యాలయం ఢిల్లీకి తరలించబడింది. మహమ్మదలీ రాజకీయాలలో నిమగ్నులయి వుండటంవల్ల చాలాకాలం వైస్ఛాన్సలర్ పదవిలో ఉండలేకపోయారు. కాని, ఆయనకు జీవితాంతం ఆ విశ్వవిద్యాలయంతో సన్నిహిత సంబంధం వుండేది.

## అస్వతంత్ర భారతంలో అడుగు పెట్టను

మహమ్మదలీ తమ అన్నగారు షౌకతలీలాగే మత విషయంలోగాని, రాజకీయాలలోగాని తాను నమ్మిన వాటిపై ఇతరులతో రాజీపడే స్వభావం కలవారు కారు. అందువల్ల 1920 దశాబ్దంలో మత, రాజకీయాలలో కలిగిన విభేదాలు ఆయనను తన సర్వస్వం అనుకున్న భారత జాతీయ కాంగ్రెస్ నుంచి, ఇతర రాజకీయ సంస్థలలోని ముస్లింనాయకుల నుంచి దూరం చేశాయి. కుండ బద్దలుకొట్టినట్టు చెప్పే ఆయన తీరు ఎవరికీ నచ్చలేదు. అందువల్ల అంత్యదశలో ఆయన అన్నివిధాలా ఒంటరివారయ్యారు. భారతీయ ముస్లిములకు ఒకప్పుడు కిరీటంలేని రాజుగా వున్న మహమ్మదలీ రాజకీయంగా నిరాదృతులై హతాశులై, శారీరకంగా మధుమేహంతో క్రుంగిపోయారు. అయినా ఆయన ఉత్సాహం కొరవడలేదు. 1930 లో జరిగిన రౌండ్ టేబుల్ మహాసభ తొలి సమావేశానికి హాజరయ్యారు; ఏమాత్రం శ్రమపడినా మృత్యువు తప్పదని తెలిసినా, భారతీయ ముస్లింల సమస్యను తాము తప్ప మరెవరూ వివరించలేరని విశ్వాసంతో.

ఆ మహాసభలోనే ఆయన "భారతదేశం స్వతంత్రమైతేనే గాని మళ్ళీ అడుగుపెట్టను" అని ఎలుగెత్తి చెప్పారు. తర్వాత రెండు రోజులలోనే ఆయన మరణించారు. 1931 జనవరి 4 వ తేదీన, ఏ ముహూర్తాన ఆయన అన్నాడోగాని, భారతదేశానికి తిరిగి రాలేదు. ఆయన భౌతికకాయం ముస్లిం పవిత్ర క్షేత్రమయిన జెరూసలెంలో ఖననం చేయబడింది.

## అలీ సోదరుల అరెస్టు ఉదంతం

అలీ సోదరుల రాజకీయ జీవితంతో తెలుగుదేశానికి ప్రత్యేక సంబంధం వుంది. మహమ్మదలీ 1921 లో వాల్తేరులో అరెస్టు కావడం, 1923 లో కాకినాడ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించడం దీనిలో ముఖ్యమైనవి.

1921 జూలై 8 వ తేదీన అఖిలభారత ఖిలాఫత్ మహాసభ కరాచీలో జరిగింది. దానికి అధ్యక్షత వహించిన మహమ్మదలీ చాలా సాహసవంతమైన

ఉపన్యాసమిచ్చారు. దానికి కరాచీ ఉపన్యాసమని ప్రసిద్ధి కలిగినది. ఆ ఉపన్యాసం ఆధారంగా షౌకతలీపైన, మహమ్మదలీపైన కేసు పెట్టబడింది. ఈ ప్రసంగాన్ని కాంగ్రెస్ పెక్కు సభలలో పునశ్చరణ చేసింది.

ఆ సమయంలోనే అలీ సోదరులను అరెస్టు చేశారు. మౌలానా మహమ్మదలీ అస్సాం నుండి మద్రాసుకు వెళుతుండగా దారిలో వాల్తేరు స్టేషనులో 1921 సెప్టెంబరు 14న అరెస్టు చేయబడ్డారు. ఆయనను కొన్నాళ్ళు సబ్ జైలులో ఉంచి విడుదలచేసి, మరల అరెస్టుచేసి, కరాచీకి తీసుకొని వెళ్ళారు.

"గాంధీ మహాత్ముడు, మౌలానా మహమ్మదలీ, ఆయన భార్య, మౌలానా ఆజాద్, సుభాష్‌గార్లు 1921 సెప్టెంబర్ 13 సాయంకాలం కలకత్తా మెయిల్‌లో కలకత్తా నుండి బయలుదేరి 14వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు వాల్తేరు స్టేషనుకు వచ్చినారు. అప్పుడు స్టేషను ప్లాట్‌ఫారమ్ అంతటా మిలటరీవారు వేచి ఉన్నారు. వారు మహమ్మదలీని అరెస్టుచేయడానికి నిలిచి ఉన్నట్టు ప్రజలు ఊహించారు. రైలుబండిలో నిద్రపోతున్న మహమ్మదలీని వారి సహచరులలో ఒకరు నిద్రలేపి వేళాకోళంగా 'మీ సమయం ఇప్పుడు వచ్చింది' అని ఆయనతో చెప్పినారు. ఈలోగా విశాఖ జిల్లా కాంగెసు నాయకులు మౌలానా మహమ్మద్ అలీ, గాంధీజీ వున్న పెట్టెను సమీపించి స్టేషను వెలుపల చిన్న ఉపన్యాసం ఇవ్వవలసిందని ప్రార్థించినారు. వారి ప్రార్థన నంగీకరించి ఇద్దరూ ప్లాట్‌ఫారం మీదికి వచ్చినారు. ప్లాట్‌ఫారంమీద అడుగుపెట్టడంతోనే విశాఖపట్టణం జిల్లా పోలీసు సూపరింటెండెంటు మౌలానాను ఆపి అరెస్టు వారెంటు చూపించగా, మౌలానా ఆ వారంటును గాంధీజీకి చదివి వినిపించారు. శిక్షాస్మృతి 107, 108 సెక్షన్‌ల క్రింద సత్ప్రవర్తనకు జామీను పుచ్చుకునే నిమిత్తం, ఆయన అరెస్టు చేయబడుతున్నట్టు వారంటు వుంది. అప్పుడే మౌలానా ఆ ఉద్యోగస్థునితో కూడా నడిచినారు. కొంతసేపయిన తర్వాత మహమ్మదలీ భార్య, ఆయన అంతరంగిక కార్యదర్శి ఆయనతో కొన్ని నిమిషాలు మాట్లాడి మళ్ళీ వచ్చి, మెయిలులో కూర్చున్నారు. మహమ్మదలీ అరెస్టు, ఆయన సైనికులను తిరుగుబాటు చేసేందును ప్రోత్సహించినారనే ఆరోపణపై జరిగింది.

"మహమ్మదలీపై అరెస్టు వారెంటు జారీ చేసేటప్పుడు పోలీసు ఉద్యోగి గడగడా వణికిపోయినాడు. ఆయన విశాఖపట్టణం సెంట్రల్ జెయిలులోకి వెళ్ళిన తరువాత, అక్కడి అధికారులు ఆయనను గౌరవంగానే చూచినారు. పి. సి. వెంకటపతిరాజు, వసంతరావు, బుచ్చి సుందరరావు మున్నగు నాయకులు చెరసాలకు వెళ్ళి మహమ్మదలీని దర్శించారు. మహమ్మదలీ మహాత్మునికి

తమ కృతజ్ఞత తెలుపుతూ దేశీయులకు శాంతి సందేశం పంపారు. విశాఖపట్టణం లోని పాఠశాలలను, కళాశాలలను విద్యార్థులు బహిష్కరించడంవల్ల అవి ఖాళీ అయినవి. పట్టణంలో సభలు జరిపి, మహమ్మదలీని అభినందిస్తూ తీర్మానాలు చేసినారు. ఆంధ్రకవి ఉమర్ అలీషాగారు గంభీరోపన్యాసం చేశారు.

"సెప్టెంబర్ 17వ తేదీ ఉదయం 5.40 నిమిషాలకు రిజర్వు పోలీసులు మహమ్మద్ అలీని విశాఖపట్టణం జెయిలునుంచి మోటారెక్కించి రైలుస్టేషనుకు తీసుకొనిపోతుండగా వేలకొద్దీ ప్రజలు వీధులలో బారులు తీర్చి ఆయనను అభినందించినారు. తరువాత పోలీసులు ఆయనను రైలులో ఎక్కించి కరాచీకి తీసుకొని పోయారు." (ఆం.గాం. - పుట 297.)

1921 సెప్టెంబరు 15 సాయంత్రం మద్రాసులో తిరువల్లిక్కేణిలో సముద్రతీరంలో గాంధీజీ బహిరంగసభలో ప్రసంగిస్తూ, అలీ సోదరుల నిర్బంధాన్ని ప్రస్తావించి "మహమ్మదలీ నిర్బంధంవల్ల సహాయ నిరాకరణోద్యమంలో మనం మొదటి విజయం సంపాదించాము" అన్నారు.

1921 ఏప్రిల్‌లో బెజవాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభ ప్రత్యేక సమావేశానికి వచ్చిన నాయకులలో అలీ సోదరులు వున్నారు. దారిలో వారంతా రాజమహేంద్రవరంలో దిగారు. అక్కడ ఒక బహిరంగసభ జరిగింది. సభ జరుగుతుండగా, స్థానిక పోలీస్ ఇనస్పెక్టర్ సభచుట్టూ గుర్రంమీద ప్రదక్షిణం చేయడం చూచి మహమ్మదలీ సభనుంచి వెళ్ళుతూ, తన పూలమాలతీసి ఆయన మెడలో వేసిపోయారు.

గాంధీజీ రాజమండ్రి సభలో ప్రసంగిస్తూ, "హిందూ ముస్లిం సఖ్యం అంటేనేమో నేనూ మౌలానా షౌకతలీ భారత ప్రజానీకానికి విశదం చేస్తున్నాము. మేమిద్దరమూ మా మతాలలో నిష్ఠగలవారమే. నేనూ హిందూ సనాతనధర్మ వాదిని. ఆయన ఇస్లాం మతస్థుడు...." అన్నారు. (ఆం.గాం. 221)

## కాకినాడ కాంగ్రెస్ అధ్యక్షత

కాకినాడ కాంగ్రెసుకు మౌలానా మహమ్మదలీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. ఈ మహాసభ 1923 డిసెంబర్ 28న జరిగింది. దేశభక్త శ్రీ కొండా వెంకటప్పయ్యగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు. జవాహర్‌లాల్ నెహ్రూ, సైఫుద్దీన్ కిచ్లూ, గంగాధరరావు దేశ్‌పాండే, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య కార్యదర్శులు. ఈ సభలో శాసనసభ ప్రవేశించాలనేవారికి, కూడదనేవారికి హోరాహోరీ పోరాటం జరిగింది. కాంగ్రెస్ అధ్యక్షుడుగా మహమ్మదలీ, ఖిలాఫత్ మహాసభ అధ్యక్షుడుగా షౌకతలీ, వయోవృద్ధురాలు వారితల్లి ఉభయవర్గాలకు సమాధానం

కుదర్చడానికి ప్రయత్నించారు. సభలో సహాయ నిరాకరణోద్యమం కొనసాగించా లని తీర్మానించినా, శాసనసభకు వెలుపలేగాక లోపలకూడ సహాయ నిరాకరణ వాదం అవలంబించవచ్చునని వ్యాఖ్య చేయడం జరిగింది. బార్డోలీలో అంగీక రించిన నిర్మాణ కార్యక్రమం కొనసాగించవలెనని తీర్మానించారు.

మహమ్మదలీ వ్యక్తిత్వం నిరూపించే విశిష్టమైన ఉదంతం ఒకటి—చాల మందికి తెలియనిది-కాకినాడ కాంగ్రెస్‌లో జరిగింది. మహాసభ జరుగుతుండగా మధ్యాహ్నమయింది. వెంటనే మహమ్మదలీ ప్రార్థనకు వెళ్ళారు. ఆయన ఇస్లాం సంప్రదాయాన్ని తూచా తప్పక పాటించేవారు. ప్రపంచ విఖ్యాత విజ్ఞానశాస్త్రజ్ఞుడు దేశభక్తుడు అయిన సర్ ప్రఫుల్ల చంద్ర రాయ్ అధ్యక్షపీఠం అలంకరించి కార్యక్రమం యథావిధిగా నిర్వహించారు. ఈ విషయాన్ని ఆయన తన ఆత్మ చరిత్రలో సగర్వంగా స్మరించినారు.

## త్యాగధనులు

అంతటి త్యాగధనులను, అభిప్రాయభేదాలు కలిగినా వైరం కలిగినా, సజ్జనత్వాన్ని విడనాడని వారిని, భారతీయులందరూ ఒక్కటేనని నమ్మిన వారిని తలచుకొని నేటి పరిస్థితిని సింహావలోకనం చేసినప్పుడు నా మనస్సు ఉసూరు మంటుంది. అభిప్రాయ భేదాన్ని శత్రుత్వంగాను, త్యాగాన్ని తెలివి తక్కువగాను భావిస్తున్న కాలమిది. నేటి యువకులు— స్వాతంత్ర్యా నంతరం జన్మించి, పారతంత్ర్యకాలపు దేశస్థితిని ఊహించలేని నేటి యువకులు అప్పటి నాయకుల త్యాగ నిరతిని, పరమత సహనాన్ని కొంతకు కొంతైనా అలవరచు కుంటే, దేశం ఎంతో ముందుకు పోతుంది.

(ఈ వ్యాసానికి ఉపకరించిన గ్రంథాలు: (1) "ఆంధ్ర ప్రదేశ్‌లో గాంధీజీ" : సంపాదకులు, శ్రీ కొడాలి ఆంజనేయులు. (2) కాంగ్రెస్ చరిత్ర : డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య. (3) నా జీవిత కథ - నవ్యాంధ్రం : శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు. (4) Dictionary of National Biography : Editor: Sri S. P. Sen, (5) Life and Experienses of Bengali Chemist : Sir P. C. Ray)

[ఆంధ్రప్రదేశ్ - డిసెంబర్ 1978]

★★

# మహారాష్ట్ర కీర్తన కళ

కీర్తనం అంటే సామాన్యార్థం-చెప్పడం, ఒకరి గుణగణాలు చెప్పడం అన్నమాట. భగవంతుని గుణగణాలు చెప్పడం భగవత్కీర్తనం. హరికథా కీర్తనం భక్తుని హృదయ ఆవిష్కరణకు మార్గం గనుక అష్టవిధ భక్తిభావాలతో ఒక్కటయింది. ఈ భక్తిభావ ప్రకటనమయిన కీర్తనం మహారాష్ట్రంలో విశిష్ట స్వరూపంతో వికసించింది; విశిష్ట సంప్రదాయంగాను పరిణమించింది.
మహారాష్ట్రంలోని మహాత్ములు ఆత్మోద్ధరణకు, సాటి మానవుల విమోచనానికి ఈ కీర్తన పద్ధతిని సాధనంగా చేసుకున్నారు. ఇది కేవలం మత సంబంధమైనదే. రాజకీయాలకుగాని, తదితర లౌకిక ప్రయోజనాలకుగాని దీనిని వినియోగించి అపరిశుద్ధం చేయగూడదు.

ఈ కీర్తన రెండు భాగాలు : మొదటిది పూర్వరంగం, రెండవది ఉత్తర రంగం. పూర్వ రంగంలో కీర్తనకారుడు తను చెప్పదలచిన మతతత్త్వ విషయాలు పీఠికాప్రాయంగా తెలియజేస్తాడు. వాటికి దృష్టాంతంగా తను చెప్పిన విషయాలు శ్రోతల మనస్సులో గాఢంగా నాటుకోడంకోసం, ఉత్తర రంగంలో ఒక పురాణకథను వర్ణిస్తాడు. ఈ పురాణగాథే ఉత్తరరంగం. రెండు రంగాలమధ్యన హాస్యకథలు, పిట్టకథలు, కట్టుకథలు, ఛలోక్తులు విసరడం ఉంటుంది. కీర్తనకారులే ప్రధానకథకు- ఉత్తరరంగకథకు అవిరోధంగా ఈ కథలను తమ చాతుర్యంతో కల్పించడమూ కద్దు. కథలో వివిధవృత్తాలు, వచనాలు కావ్య ప్రబంధ సౌరభం వెదజల్లుతాయి. శ్రోతల చంచల మనస్సు చెదరిపోకుండా ఆకట్టుకోవడానికి సంగీత ప్రవచనాకారుడు "పుండలీక వరద హరి విఠలే" అనే నినాదం తరచు చేస్తాడు. శ్రోతలు గూడా అనునినాదం చేస్తారు. ఒకొక్కప్పుడు కీర్తనకథకుడు శ్రోతలను ప్రోత్సహించి తనతోపాటు గీతగానం చేయించడమూ కద్దు.

సంత్ ఏక్‌నాథ్ భక్తుడు, మహాత్ముడు, కీర్తనకారుడూను. ఆయన 16వ శతాబ్దంలో వున్నవాడు. ఆయనే ఈ కీర్తన సంప్రదాయానికి, కీర్తనకళకు మూలపురుషుడని, ప్రవర్తకుడని మహారాష్ట్ర విద్వాంసులు చెబుతారు. ఆయన భక్తిని, కవితను, సంగీతాన్ని మేళవించి కీర్తనను విలక్షణంగా తీర్చి సాహిత్య

స్థాయికి తెచ్చారు. భక్తివల్ల ఆస్తికసామాన్యం, సంగీతంవల్ల కళాపిపాసువులు, కవితవల్ల విద్వద్బృందమూ ఆకర్షితులవుతారని, అందరినీ అవర్జింపచేయ వచ్చునని ఆయన కీర్తనను "సంగీత ప్రవచనం"గా చేసినట్టు తోస్తుంది.

ఏక్‌నాథ్ లక్ష్యం ప్రపంచ జనోద్ధరణం గనుక, ఆయన కీర్తన వస్తువు అలౌకికమే కాని, లౌకికం కాదు.

"సుగుణ చరిత్రే పరమ పవిత్రే హరిచీ వర్ణావీ॥
సజ్జనబృంవే మనోభావే అధీ వందావీ॥
సంతసంగే అంతర రంగే నామ బోలావే।
కీర్తనరంగీ దేవా సన్నిధ సుఖేచి డోలావె॥"

అనేది ప్రసిద్ధమైన ఆయన ఒక గీతక. పరమ పవిత్రమైన ఉత్తమ హరి చరిత్రలను వర్ణిద్దాము. మొదట సజ్జన బృందాన్ని వందనం చేద్దాము. మనః పరిపాకంగల సత్పురుషుల సమాజంలో హరికీర్తన చేద్దాము. కీర్తన ప్రియుడైన దేవుని సన్నిధిలో సుఖడోలికలు ఊగుదాము అని దీని అర్థం. దీనినిబట్టే కీర్తన వస్తువు ఎలాంటిదని ఆయన ఉద్దేశించాడో స్పష్టమవుతుంది. ఈ గీతం మహారాష్ట్ర కీర్తన సంప్రదాయానికి మూల బంధమయింది. ఏక్‌నాథ్ పెక్కు పురాణ గాథలను కీర్తనలుగా రచించి కీర్తించారు.

తర్వాత, తుకారాం మొదలయిన భక్తులు ఏక్‌నాథ్ సంప్రదాయాన్ని అనువర్తించి ముందుకు సాగారు. భక్తిప్రచారానికి, మానవ జాతి సముద్ధరణకు కీర్తన పద్ధతి మహారాష్ట్రంలో రాచబాట అయింది. ఏక్‌నాథ్ తర్వాత తుకారాం అంతటి కీర్తనకారుడుగా పరిగణితుడయ్యాడు.

ఆధునికులలో మహారాష్ట్రులు కృతజ్ఞతతోను, గౌరవంతోను పేర్కొనే కీర్తనకారులు అవుంధ్ సంస్థానాధిపతి బాళా సాహెబ్ పంత్ ప్రతినిధి. బాళా సాహెబ్ కీర్తన సాహిత్యానికి అమూల్య సేవ చేశారు. ప్రాచీన కీర్తనల రక్షణ, ప్రచారం, ఇది మహారాష్ట్రుల మతధర్మ కళా విశేషమన్న దృష్టితో ఈయన నిర్వర్తించడమేకాక స్వయంగా కీర్తనను ఎంతో ఆసక్తితో చెప్పేవారు. ఆయన వెంట ఆయన కుమార్తెలు— రాజకుమారికలు నిలబడి వంత పాడేవారు.

కీర్తన రచనకు పూర్వరంగోత్తరరంగాలు వున్నట్టే, కీర్తన చెప్పడానికి కూడా పద్ధతి వుంది. దీనిని సంగీత ప్రపంచం అని ఇదివరకే అన్నాను. సంగీతానికి ప్రాధాన్యం హెచ్చిన తర్వాత పెక్కు వాద్యాలూ దీనికి చేరాయి. ఏక్‌నాథ్ తంబూరా తప్ప మరే జంత్రవాద్యమూ వాడి వుండరేమో! ఆయన గొప్ప కవి, గాయకుడు, అన్నిటికీ మించి అలౌకిక శక్తులుగల భాష్యా గనుక ఆనా

వర్ణన కష్టమై వుండదు. తుకారామ్ కూడా అంతటివాడే. ఆయన ఏ తంబూరానో, ఏక్‌తారానో శ్రుతికోసం వాడి వుంటారు. ఏక్‌నాథ్‌కు వెనుక పాట (వంతపాట) పాడినవారు వున్నట్టు తెలియదు. తుకారామ్‌కు కూడా వెనుకపాటవారు లేరు. ఆయన ఇల్లాలికి కీర్తనలంటేనే గిట్టదు; ఆయన వెనుక నిలబడి వెనుకపాట పాడే భక్తి కూడానా? ఏ శిష్యులో వెనుకపాట, మృదంగం వాయించి వుంటారు.

కాని అవుంధ్ సంస్థానాధిపతివెంట రాజకుమారికలు పాడడం చూచి, స్త్రీలు కూడా వంతపాడే సంప్రదాయం అలాగే వచ్చి, కీర్తనకారునివెంట స్త్రీలు, పురుషులూ ఒకరిద్దరు వుండడం అలవాటయిందని అంటారు. వీరిని స్త్రీ అయితే 'సాథిన్' అని, పురుషుడైతే 'సాథీ' అని అంటారు. సాథీ అంటే సహచరుడు. తర్వాత పక్కవాద్యాలలో ఆధునికమైనవి కూడా కీర్తనలో చేరాయి: తబలా, హార్మోనియం, వీణ, ఫిడేలు మొదలయినవి. హార్మోనియం దక్షిణభారతంలో అంతగా సంగీత విద్వాంసుల ఆదరణ పొందలేదు గాని ఉత్తర భారతంలో విడనాడరాని వాద్య మయింది.

కీర్తన ఏక్‌నాథ్, తుక్కారామ్‌లవంటి మహాత్ముల కాలంలో భక్తి ప్రధానంగా వున్నా, క్రమంగా సంగీతం, రంజకత ప్రధానమై కళగా పరిణమించింది గనుక మరికొన్ని మర్యాదలూ చేరాయి. పూర్వరంగ ప్రారంభంలో అతిథేయుడో, మరే పెద్ద మనిషో వచ్చి, కీర్తనకారునికి పాదాభివందనం చేసి, కీర్తన జరుపవలసిందిగా ప్రార్థిస్తాడు. పూలదండలు వేసి సత్కరిస్తాడు. పూర్వ రంగం మధ్యన అతిథేయుడు గౌరవ చిహ్నంగా కీర్తనకారునికీ, సాథిన్‌కు, సాథీకి నొసట తిలకం దిద్ది, నూతన వస్త్రాలు బహూకరిస్తాడు. పూర్వరంగం తర్వాత హారతి ఎత్తుతారు. హారతి పళ్ళెంలో భక్తులు, అభిమానులు అయిన శ్రోతలు తమకు తోచిన నాణేలు వేయవచ్చు. ఇది భగవత్కైంకర్యం కోసం వినియోగించాలని తాత్పర్యం.

కీర్తనకు మత వేదాంత భక్తి ప్రచారమే ప్రధానం. అవి చక్కగా ప్రజల మనసుకు రావడానికి, రంజకంగా ఉండడానికి పాటలు, సంగీతం, పిట్ట కథలూ మొదలయినవి చేరాయి. ఈ పవిత్రమైన కీర్తన పద్ధతిని దురదృష్టవశాత్తు నేడు లౌకిక రాజకీయ విషయాలకు కూడా కొందరు వాడుతున్నారు. కాని దానిని మహారాష్ట్ర విద్వాంసులు, భక్తులు సక్రమమైన పద్ధతిగా పరిగణించరు.

అదృష్టవశాత్తు ఈ కీర్తన సంప్రదాయాన్ని యథాపూర్వంగా అకలుషితంగా పరిరక్షిస్తున్న కీర్తనకార వర్గంవారు శ్రీ జి. ఏ. ఫడ్‌కే. (ఈయన మద్రాసు రోటరీ క్లబ్ అధ్యక్షులు, ప్రముఖ పారిశ్రామికులు, మూడు దశాబ్దాలుగా చెన్నపురిలో వుంటున్నవారు.) ఈయన ఏటా వినాయక చవితి ఉత్సవాలలో

మద్రాసులోని రెండాల్స్ రోడ్డులో వున్న మహారాష్ట్ర మండల్‌లో కీర్తన చెబు తున్నారు. మొన్నటి గణపతి ఉత్సవాలలోను, గడచిన సెప్టెంబర్ 24 వ తేదీన, కీర్తన చెప్పారు. కీర్తన వస్తువు శర్మిష్ఠ-దేవయాని. వినాయక విగ్రహం ముందు నాలుగైదు గంటలపాటు నిలబడి— సప్తతి పూర్తికి దగ్గరిల్లుతున్న శ్రీ ఫడ్కే కీర్తన చెప్పడం, అడుగడుగునా, తమ చతురోక్తులతో, అవాంతర కథలతో శ్రోతలను రంజింపజేయడం- అనేవి ప్రశంసనీయమైన విషయాలు. శ్రీ ఫడ్కే సతీమణి శ్రీమతి ఇందిరాబాయి ఫడ్కే, మూడు దశాబ్దాలుగా మద్రాసులో స్థిరపడిన శ్రీ భిడే (కంట్రాక్టరు) శ్రీ ఫడ్కేకు వెనుక పాటగాళ్ళుగా సాథీలుగా వున్నారు. శ్రీమతి ఫడ్కే, శ్రీ భిడే తమ బాధ్యత బాగా నిర్వహించారు.

మన హరికథా సంప్రదాయం ఈ మహారాష్ట్ర సంప్రదాయంనుంచే వచ్చిందని తోస్తుంది. మనం భక్తిలోను, భక్తుల సంఖ్యలోను ఇతర రాష్ట్రాల వారికి ఏ విధంగానూ తీసిపోము. పురాణ పఠన శ్రవణాలు, హరిహరగాథలను వివిధ రీతులుగా ఆడిపాడడం మనకు కొత్తేమీ కాదు. పాల్కురికి సోమన బసవ పురాణంలో అన్నట్టు ఇష్ట దైవ కథలను

"మేటియై చను భక్త కూటువలందు
పాటలుగా కట్టి పాడెడువారు
ప్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల
విస్తారముగ జేసి వినుపించువారు
అటుగాక సాంగ భాషాంగ క్రియాంగ
పటు నాటకంబుల నటియించువారు"

వుండనే వున్నారు. కాని, భజన కూటువులలోని పాట, ప్రస్తుతోక్తుల గద్య పద్యకావ్య విస్తారం, నటన- మేళవించిన హరికథ ఉన్నట్టు కనిపించదు. ఈ లక్షణాలు కొంత పట్టే బుర్రకథ వుంది. కాని, దాని లక్ష్యం, వస్తువు, వక్కా వాద్యాలు వేరు. అది వీర రస ప్రధానం.

వైష్ణవ మతం ఆంధ్రదేశంలో వ్యాపించిన తరువాత దాసర్లు మొదలయిన వారి వేషాలను "కావి కుప్పసము తొడిగి, కొవ్పు బయలు బడకుండ ఖండకాటి (చీరపేలిక) బిగించి, జమిలిపూసల కంటె పెట్టుకొని హరీ హరీ యనుచు నడి చెను" అని విప్రనారాయణ చరిత్రలో దాసరి సాని వర్ణన కనిపిస్తుంది. కాని, హరికీర్తనకారుని వేషం కనిపించడం లేదు. ఎందరి వేషభాషలో వర్ణించిన శుకసప్తతి, హంస వింశతులలోను కీర్తనకారుడు కనిపించదం లేదు. అందువల్ల

మహారాష్ట్రీల ప్రాబల్యం బాగా ఏర్పడిన తర్వాత ఈ హరికథా కీర్తనం ఆంధ్రదేశంలో వ్యాపించి వుంటుం దనుకుంటాను

కాని, ఏ కొత్తదనం చూచినా, స్వీకరించి సొంతం చేసుకుని అభివృద్ధికి అందుకుపోయే దొడ్డగుణం గల తెలుగు వారు ఈ మహారాష్ట్రి హరికథా కీర్తన పద్ధతిని కూడా సొంతంగా భావించి, హరికథగా పెంపొందించుకున్నారు. కీర్తి శేషులు శ్రీయుతులు అజ్జాడాదిభట్ల నారాయణదాసు, లక్ష్మణాచార్యులు, నెల్లూరు రామదాస్, కుంటిమద్ది కృష్ణమాచార్యులు, మోపిడి వేంకటాచార్యులు, పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, శ్రీమతి కదిరి బుచ్చమ్మవ్వ వంటి గొప్ప హరికథకులు ప్రభవించారు. ఈ హరికథా కథనకళ నిరంతరాయంగా వికసిస్తూనే వుంది.

కళ, శాస్త్రం, మనదైతేనేమి? పెరవారిదయితే నేమి? ఏకనాథ్ అన్నట్టు "ఏకా జనార్దనీ భావచీ అవడీ"— జనార్దనునిపై భక్తే ప్రియ వస్తువు కావడమూ, సమర్థ రామదాస స్వామి అన్నట్టు— "భావబలే తరలే మానవ" భగవద్విశ్వాస బలంతో మానవులు తరించడమూ హరికథా లక్ష్యాలు కదా!

[ఆంధ్రపత్రిక, 24.9 1966]

★★

# బౌద్ధంతో మొదలైన తెలంగాణా చరిత్ర

తెలంగాణా చరిత్ర బుద్ధుని సమకాలీన చరిత్ర. నిజామాబాద్ జిల్లాలోని నేటిబోధన్‌లో బవరి అనే విద్వాంసుడు ఉండేవాడు. అతడు బుద్ధుని చరిత్రను కర్ణాకర్ణికగా విన్నాడు, బుద్ధుని తథాగతి - సత్యమార్గం - అతనికి నచ్చింది. తన శిష్యులను బుద్ధుని దర్శించి, అతని అష్టాంగ మార్గాన్ని ఆకళించుకొని రమ్మని రాజగృహానికి పంపాడు. వారు బుద్ధుని సన్నిధానంలో కొంతకాలం ఉండి, అతని తథాగతిని యథావత్తుగా గ్రహించి బోధన్‌కు తిరిగి వచ్చారు. సంతృప్తితో బవరి పండితుడు ఆ మార్గాన్ని అనుసరించాడు. ప్రజలలో ప్రచారమూ చేశాడు. బుద్ధుని సమకాలంలోనే అతని ఉపదేశాలు వేలమైళ్ళ దూరంలో ఉన్న తెలంగాణా ప్రజలను ప్రభావితం చేశాయన్నప్పుడు, మంచివట్ల వారి అభిముఖ్యం ఎంత నిశితమైందో మనం అంచనా వేయవచ్చు.

## ప్రాగైతిహాసిక యుగం

తక్కిన ఆంధ్రదేశంతోపాటే తెలంగాణాలోను ప్రాగైతిహాసిక కాలంలో మానవుడు మూడులక్షల సంవత్సరాల నుంచి నివసిస్తున్నట్టు తెలుస్తున్నది. వరంగల్, కరీంనగర్, నల్లగొండజిల్లాలలో జరిగిన తవ్వకాలలో శిలాయుగపు ఆయుధాలు, పరికరాలు లభించాయి. డోర్లగల్లు - ఆత్మకూరు కనుమ దగ్గర శిలాయుగ పరికరాల పరిశ్రమ విశేషంగా సాగింది. తెలంగాణా ఆదిమానవుడు శిలాయుగం నుంచి మరికొంత ముందడుగు వేసి, నూతన శిలాయుగంలో ప్రవేశించి, ఆహారాన్ని పండించుకొని దేశ ద్రిమ్మరితనం తగ్గించుకొని కొండల మీద, కొండ అడివారాలలోను నివాసాలు ఏర్పరచుకొన్న చిహ్నాలు కూడా వరంగల్లు, నల్లగొండ జిల్లాలలో తవ్వకాలు జరిపిన పురావస్తు శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. మరికొంత సభ్యత ఏర్పడిన తర్వాత తెలంగాణా మానవుడు లోహయుగంలో ప్రవేశించి కంచు, ఇనుము పరికరాలను నిర్మించుకొన్నాడన డానికి తెలంగాణా అంతటా ముఖ్యంగా వరంగల్లు, కరీంనగర్, నల్లగొండ జిల్లాలలోని "రాకాసి గుళ్ళు" నిదర్శనం.

చరిత్రయుగం తెలంగాణాలో బౌద్ధంతో ప్రారంభమయింది. బోధన్ శాతవాహనులకు ముందే, శుంగకాణ్వుల కాలంలోనే ప్రసిద్ధమైంది. ఇది అస్మక దేశంలోని ప్రధాన పట్టణాలలో ఒక్కటి. అక్కడి నుంచి తెలంగాణా అంతటా బౌద్ధం వ్యాపించింది. గుమ్మడిదుర్రు, ఫణిగిరి మున్నగు ప్రాంతాలలో జరిగిన తవ్వకాలలో వెలువడిన బౌద్ధ స్తూపావశేషాలు, బుద్ధ విగ్రహాలు ఈ వ్యాప్తికి నిదర్శనం. ఆంధ్ర బౌద్ధులలో తర్వాత ఏర్పడిన చైత్యక, అపరశైలేయ, రాజగిరీయాది శాఖలలో రాజగిరీయులు రాచకొండవారయి ఉంటారని లేక యాదగిరిగుట్ట ద్వారమైన రాయగిరివారు అయినా కావచ్చునని తెలుగుభాషా సమితి విజ్ఞాన సర్వస్వం ప్రధాన సంగ్రాహకులు శ్రీ చిలుకుర్తి శేషగిరిరావు భావిస్తున్నారు.

బోధన్ పట్టణం, తర్వాత జైన మతానికి కూడా ఆటపట్టయింది. అక్కడి నుంచే జైనం కొలనుపాక మున్నగు ప్రాంతాలకు వ్యాపించింది. బోధన్‌లో గొప్ప గోమటేశ్వర విగ్రహం ఉండేదని, దానిని చూచిన తర్వాతనే హొయసళుల కాలంలో శ్రవణ బెళగొళ గోమటేశ్వర విగ్రహం వెలసిందని అంటారు.

మరొక సంగతి. జైనులు మత ప్రచారానికి ఎక్కడికి వెళ్ళినా మొదట ఒక సరోవరం తవ్వించేవారు. దానితీరంలో తీర్థంకరుల విగ్రహాలు స్థాపించేవారు. కొలనుపాక, అంటే కొలను ఉన్న పాక - పూరు. కొలనున్న జైనుల వర్ధశాల అని అర్థం. దీనికి ప్రతికృతి అయిన శ్రవణ బెళగొళ కూడా అలాటిదే. బెళగొళ అంటే తెల్లని, స్వచ్ఛమైన కొలను. శ్రవణ బెళగొళ జైన శ్రమణుల కొలను. కొలనుపాకలో మేఘచంద్రాది ప్రసిద్ధ జైనాచార్యులున్నట్టు జైనుల మతగ్రంథమైన అనంత పాసాదిక తెలుపుతున్నది. కాని బోధన్‌లోని గోమటేశ్వరుని విగ్రహంజాడ తెలియదు. జైన శైవ సంఘర్షణలో ముక్కలుముక్కలయిందేమో! కొలనుపాకలో మాత్రం జైన తీర్థంకరులలో ఒకడైన వృషభ నాథుని పచ్చరాతి విగ్రహం నేటికీ పూజలందుకుంటున్నది.

## సాతవాహనులు

సాతవాహనుల కాలం నుంచి తెలంగాణా చరిత్ర స్పష్టంగా తెలుస్తున్నది. తెలంగాణా సాతవాహనుల ఏలుబడిలోకి వచ్చినట్లు మెదక్ జిల్లా కొండాపురం, కరీంనగర్ జిల్లాలోని కోటిలింగాల, ధూళికట్ట, నల్లగొండ జిల్లాలోని సూర్యాపేట, ఫణిగిరి, వర్ధమానుకోట మున్నగుచోట్ల జరిగిన తవ్వకాలలో సాతవాహన చక్రవర్తుల నాణేలు, మట్టిబొమ్మలు, మట్టిపాత్రలు మున్నగునవి లభించడం నిరూపిస్తున్నవి. ఇటీవల 1982 అక్టోబరునెలలో రాష్ట్ర పురాతత్త్వ

శాఖ డైరెక్టరు డాక్టర్ కృష్ణశాస్త్రిగారు నల్లగొండజిల్లా, తుంగతుర్తి తాలూకా వర్ధమానుకోటలో కోటదిబ్బ అనే ప్రాంతంలో జరిపిన పరిశోధనలలో సాతవాహనుల కాలపు నిర్మాణాలు వెలువడ్డాయి. సీసంతో తయారయిన వర్తులాకారపు నాణేలు లభించాయి. వాటిపైన మధ్యన గుర్రం, చుట్టూ బ్రాహ్మిలిపిలోని శాసనం "మహాతలవరస వాజసామికస సవస...." అని ఉన్నాయి. ఈ నాణేల వంటి మట్టి ముద్రికలు కరీంనగర్ జిల్లా పెద్దబంకూరు త్రవ్వకాలలో దొరికాయి. దీనినిబట్టి క్రీస్తుపూర్వం రెండు మూడు శతాబ్దాలలో కరీంనగర్, వరంగల్, నల్లగొండజిల్లా ప్రాంతాలను మహా తలవర బిరుదాంచితులైన వాజసామికులు, అశ్వపతి వంశీయులు, సాతవాహన సామంతులు పాలించి ఉంటారని డాక్టర్ శాస్త్రి అభిప్రాయపడుతున్నారు. జనగామనుంచి సూర్యాపేటమార్గంలో ఇంతకు ముందు ఫణిగిరి, తిరుమలగిరి, గాజులబండ వద్ద బౌద్ధక్షేత్రాలు కనుగొన్నారు. మధ్య భారతదేశం నుంచి బౌద్ధ యాత్రికులు వర్దానది నుంచి ప్రాణహితానది ద్వారా గోదావరిదాటి కరీంనగర్ జిల్లాలోని కోటిలింగాలు చేరేవారు. అక్కడి నుండి పాశిగాం అనే గ్రామంవద్ద (కనుగొన్న) బౌద్ధక్షేత్రం దర్శించి, ఫణిగిరి, గాజులబండ, తిరుమలగిరి తీర్థక్షేత్రాలమీదుగా నాగార్జునకొండ, అమరావతి చేరేవారని తెలుస్తున్నది. క్రీస్తుశకం ఆరవ శతాబ్దంలో భారతదేశాన్ని సందర్శించిన చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ పయనించిన మార్గం ఇదేనని స్పష్టమవుతున్నదని డాక్టర్ కృష్ణశాస్త్రి అభిప్రాయపడుతున్నారు.

సాతవాహనచక్రవర్తులలో 17వ వాడైన హాల సాతవాహనుడు తన కాలపు కవుల ముక్తకాలను 700 లను ఏర్చి దండగా కూర్చాడు. దీనిపేరు గాథాసప్తశతి. దీనిలోని అల్లయవంటి పేర్లు చూడగా వారు తెలుగువారయి ఉంటారేమోననిపిస్తుంది. సప్తశతిలోని గోదావరి ఒడ్డ శృంగారాలు, జనుపచేలు, పత్తిచేలు, కుసుమచేలు, కుండల కపిల బావులు చూడగా తెలంగాణా ప్రాంతం సుందర ప్రతిరూపమా అనిపిస్తుంది.

తవ్వకాలు జరిగిన ప్రాంతాలలో కొండాపురానికి విశిష్టత ఉంది. కొండాపురం హైదరాబాద్‌కు వాయవ్యంగా 43 మైళ్ళ దూరంలో మెదక్ జిల్లా కలబగూడు తాలూకాలో ఉంది. ఈ గ్రామానికి అరమైలు దూరంలోని ఒకవాగు చెరువులో కలిసే ప్రాంతంలోని ఒక దిబ్బను త్రవ్వారు. మానవ జీవితానికి సంబంధించిన సకల వస్తువులూ, ఇళ్ళ పునాదులు చైత్యాలతోసహా బయట పడ్డాయి. కొండాపురం చాలా ప్రాముఖ్యంగల ఆంధ్ర సాతవాహన కేంద్రమయి

ఉంటుందని, గ్రీకు రాయబారి మెగస్థనీస్ చెప్పిన ముప్పయి ఆంధ్ర మహా నగరాలలో ఒకటయి ఉంటుందని విశ్వసించడానికి తగిన ఆధారాలు దొరికాయి. పురాణకాలపు కుండిన నగరం ఇదేనని కొందరి వూహ. గౌతమీ పుత్రశాతకర్ణి, వాశిష్ఠీపుత్ర పులమావి నాణేలు లభించడంవల్ల ఈ ప్రాంతం, తెలంగాణాలో చాలా ప్రాంతం క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దం మొదలు క్రీస్తుశకం 218 తర్వాత వరకు సాతవాహనుల ఏలుబడిలో ఉంది.

సాతవాహనుల పిదప తెలుగుదేశాన్ని పాలించిన ఇక్ష్వాకు, బృహత్ఫలాయన, ఆనందగోత్రుల పరిపాలన తెలంగాణాలో ఉన్నట్టు కనిపించదు. సాతవాహన సామ్రాజ్య పతనానంతరం ఎవరికి వారు స్థానికులు మహా తలవరులై ఉంటారు. ఆభీరులు కొంత ప్రాంతం, ఇక్ష్వాకుల సామంతులుగా పాలించినట్టు ఆభీరవసుషేణుని శాసనంవల్ల తెలుస్తున్నది.

## తర్వాతి రాజులు

పిదప తెలుగుదేశాన్ని పాలించిన విష్ణుకుండినుల కాలంలో తెలంగాణాలో నల్లగొండ మున్నగు ప్రాంతాలు వారి ఆధీనంలో ఉన్నట్టు తోస్తుంది. నల్లగొండ జిల్లాలోని ఇంద్రపాలపురం వారి రాజధాని. వీరికి వాకాటులతో సంబంధ బాంధవ్యాలున్నందున మెదక్, నిజామాబాద్ ప్రాంతాలు వాకాటుల పాలనలో ఉండేవి. ఇటీవల కీసరగుట్ట త్రవ్వకాలలో వెలువడ్డ అవశేషాలనుబట్టి విష్ణుకుండినుల పాలన వాకాటుల సరిహద్దువరకు ఉండేదని స్పష్టం. సరిహద్దులలో ఎవరూ రాజధానిని నిర్మించుకోరు గదా! కనుక ఇంద్రపాలపురి వారి రాజధాని. ఈ వంశరాజులలో ఒకడయిన ఇంద్రవర్మ పేరుతో ఈ నగరం వెలసి ఉండవచ్చు.

మహబూబ్‌నగర్ జిల్లా, తత్‌పరిసరాలను 'చోళవాడి' అనేవారు. చోళుల కాలం క్రీస్తుశకం 480 ప్రాంతంనుంచి ప్రారంభమవుతుంది. కనుక ఇది కొంత కాలం చోళుల అధీనంలో ఉండి ఉంటుంది.

విష్ణుకుండినుల అనంతరం తెలంగాణాలో చాలాభాగం బాదామీ చాళుక్య, రాష్ట్రకూట, కల్యాణి చాళుక్యుల ఏలుబడిలో ఉంది. కల్యాణి చాళుక్యులు, రాష్ట్రకూటులు దుర్బలులయిన తర్వాత సామంతులు కొందరు స్వతంత్రులై స్వీయ రాజ్యాలు స్థాపించారు. అట్టివారు వేములవాడ చాళుక్యులు, ముదిగొండ చాళుక్యులు, కాకతీయులూను. వీరిలో మొదటి ఇద్దరు సామ్రాజ్యాలు స్థాపించలేక పోయారు. కాకతీయులు క్రీస్తుశకం 1158 నుంచి 1323 వరకు 165 సంవత్సరాలు ఒక సామ్రాజ్యాన్ని స్థాపించి పాలించారు.

## ముదిగొండ చాళుక్యులు

బాదామీ చాళుక్యవంశం వాడైన రెండవ సత్యాశ్రయ పులకేసి వల్లభుడు క్రీస్తుశకం 624 లో పూర్వదిగ్విజయ యాత్రకు బయలుదేరి వేంగికళింగాలను జయించి, తన సోదరులు కుబ్జ విష్ణువర్ధనుణ్ణి పిష్టపురం (పిఠాపురం)లో వేంగి రాష్ట్రానికి, రణమర్దనుని ముదిగొండ రాజ్యానికి రాజ ప్రతినిధులుగా నియమించాడు. ఈ వంశం వారు తమ తమ ప్రాంతాలలో స్థిరపడినా, ముదిగొండ రాజ్యం వారు వేంగీ చాళుక్యులకు లోబడే ఉండేవారు. కాని, చాళుక్య భీముని, రెండవ భీముని కాలాలలో ముదిగొండ పాలకులు రాష్ట్ర కూటులవల్ల చాల నష్టపడ్డారు. వీరి రాజ్యం రాష్ట్ర కూటుల రాజ్యానికీ, వేంగీ రాజ్యానికీ మధ్య ఉన్నందున రాష్ట్ర కూటులు వేంగిపై దాడి జరిపినప్పుడెల్లా ముదిగొండ రాజ్యానికి చాలా నష్టం కలిగేది. ముదిగొండ రాజ్యం నేటి ఖమ్మంజిల్లా ప్రాంతం; కృష్ణాతీరంలోని కొండపల్లి నుంచి వరంగల్లు జిల్లాలోని కొరవి వరకు వ్యాపించి ఉండేది. రాష్ట్ర కూటులు, చాళుక్యులకు సహజ శత్రువులు కనుక తూర్పు చాళుక్య రాజ్యాన్ని మింగడానికి సిద్ధంగా ఉండేవారు. వేంగిలో రెండవ అమ్మరాజు రాజ్యకాలంలో అతనికీ, సవతి అన్న అయిన దానార్ణవునికీ సంఘర్షణ వచ్చింది. అమ్మరాజు రాష్ట్రకూట కృష్ణుని సహాయం కోరాడు. ఇలాటి అదనుకోసమే కాచుకున్న రాష్ట్రకూట చక్రవర్తి తన సేనాపతి అయిన కాకతి గుండ సేనానిని దానార్ణవునిమీదికి పంపాడు. గుండసేనాని ముదిగొండవారి రాజ్యం ఆక్రమించుకొన్నాడు. పిదప వచ్చిన మార్పులో ముదిగొండ చాళుక్యులు పశ్చిమ చాళుక్యచక్రవర్తి తైలపుని సహాయంతో గుండనను చంపించి తమ రాజ్యం మరల సంపాదించుకొన్నారు. ముదిగొండరాజులు, కాకతీయులు పశ్చిమ చాళుక్యులకు లోబడే కలతలు లేకుండా ఉండేవారు. కాని, కాకతి రుద్రుడు స్వతంత్రుడైన పిదప ముదిగొండ చాళుక్యులను పూర్తిగా వోడించి, ఆ రాజ్యాన్ని తన రాజ్యంలో కలుపుకొన్నాడు. ముదిగొండ చాళుక్యులు కొంత కాలం కోస్తా ప్రాంతంలో కొలని రాజుల ఆశ్రయంలో గడిపి, మరల భద్రాచల ప్రాంతంలో స్వతంత్రులుగా తల ఎత్తారు. కాని, కాకతి గణపతి దేవుడు వారిని పూర్తిగా అణచివేశాడు.

## పొలవాస రాజులు

ఇప్పటి కరీంనగర్ జిల్లా జగిత్యాల సమీపంలోని పొలాస గ్రామాన్ని పూర్వం పొలవాస అనేవారు. ఇక్కడి సామంతులు క్రీస్తుశకం 1075 నుంచి

1160 వరకు చిన్న రాజ్యం పాలించారు. వీరి రాజ్యంలో జగిత్యాల, మంతెన, ములుగు, వర్కాల, నర్సంపేట తాలూకాలుండేవి. వీరు రాష్ట్రకూటులు. వీరికి, పొరుగున ఉండే కాకతి రాజులకు బద్ధవైరం. క్రీస్తుశకం 1127 లో భూలోకమల్ల సోమేశ్వరుడు చాళుక్య సామ్రాజ్యానికి చక్రవర్తి అయినప్పుడు అతని తమ్ముడైన యువరాజు తైలపుడు కందూరునాడులో రాజప్రతినిధి. ఇతడు స్వాతంత్ర్యం ప్రకటించుకొన్నప్పుడు పొలవాస సామంతులు మేడరాజు, గుండరాజు చక్రవర్తిని ధిక్కరించి, తైలపుని సమర్థించారు. 1138 లో భూలోకమల్లుని కుమారుడు జగదేకమల్లుడు చక్రవర్తిఅయి, తెలంగాణాలో చెలరేగిన విప్లవాన్ని అణచడానికి స్వయంగా తరలి వచ్చాడు. కాకతి ప్రోలరాజు చక్రవర్తి పక్షాన పొలవాస గుండరాజును యుద్ధంలో చంపాడు. కందూరు నాడంటే జడ్చెర్ల సమీపంలోని కందూరు. ఇది పూర్వం ఒక ప్రాంతానికి ముఖ్యపట్టణం. ఇక్కడ పశ్చిమ చాళుక్యుల రాజప్రతినిధిగా తైలపుడు ఉండేవాడు.

## వేములవాడ చాళుక్యులు

వేములవాడ చాళుక్యుల మూలపురుషుడు కూడా బాదామి సత్యాశ్రయ పులకేసి వల్లభుడే. వేములవాడ చాళుక్యులలో 8వ శతాబ్దంలో ఉన్నవాడు వినయాదిత్య యుద్ధమల్లుడు. ఇతని ప్రధాన పట్టణం కరీంనగర్ జిల్లాలోని వేములవాడ. యుద్ధమల్లుని కుమారుడు అరికేసరి. ఇతడు రాష్ట్రకూట నిరుపమ ధ్రువ చక్రవర్తి సామంతుడు; మహావీరుడు; చక్రవర్తికోసం పెక్కు యుద్ధాలు గెలిచాడు. ఇతని మనుమడు రెండవ అరికేసరి. ఇతడు గొప్ప రాజతంత్రజ్ఞుడు, పరాక్రమశాలి. రాష్ట్రకూట సామంతుడైనా, ఆ రాజవంశ కన్యను వివాహమాడాడు. ఈమె పేరు లోకాంబిక. ఇతనికి రాష్ట్రకూట చక్రవర్తి అయిన గోవిందరాజుతో వైరం ఏర్పడింది. ఇతడు గోవిందరాజును ధిక్కరించి, జయించి, అతని పినతండ్రి అయిన బద్దెగ అనే వాడిని రాష్ట్రకూట చక్రవర్తిగా ప్రతిష్ఠింప చేశాడు. అరికేసరి కర్నాట భాషా పోషకుడు. పంపడను మహాకవి ఇతని ఆస్థానంలో ఉండి భారతాన్ని జైన సంప్రదాయంతో అరికేసరి నాయకుడుగా విక్రమార్జున విజయమనే పేర రచించాడు. ఇది తెలుగువాడయిన పంపడు రచించిన తొలి కన్నడకావ్యం, తెలంగాణాలో అవతరించింది. ఇది 10వ శతాబ్దంలోని నన్నయ్య భారతానికి ఒక శతాబ్దం ముందు రచితమైంది. పంపని తమ్ముడు జినవల్లభుడు వేయించిన గంగాధర పర్వత కన్నడ శాసనంలో చివరన మూడు తెలుగు కందాలు చెక్కించాడు. అవే తెలుగులో తొలి కందాలు. వానిలో ఒకటి ఉదాహరిస్తున్నాను:

"జిన భవనంబు లెత్తించుట
జినపూజ ల్సేయుచున్కి జినమునులకు న
త్తిన యన్నదానం బీవుట
జినవల్లభు బోలగలరె జిన ధర్మపరుల్."

## కాకతీయులు

కాకతీయుల పుట్టు పూర్వాలపై విశేష పరిశోధన జరిపి, అపూర్వ విషయాలు కనుగొన్న డాక్టర్ పి. వి. పరబ్రహ్మశాస్త్రి తెలుపుతున్న విషయాలు క్రింద క్రోడీకరిస్తున్నాను :

కాకతీయులు మొదట్లో చాలా కాలము రాష్ట్రకూట రాజుల సేనాపతులు. కాకతీయ వెన్నమ రాజు నాల్గవతరం వాడయిన గుండరాజు రాష్ట్రకూట సేనాపతిగ వేంగీ దేశంపై దాడిచేసి మరణించాడు. ఇది సుమారు క్రీస్తుశకం 890–900 నడుమ జరిగింది. ఇతని కుమారుడు ఎర్రన. రాష్ట్రకూట రాజులు ముదిగొండ చాళుక్యులను కొరవి రాజ్యంనుంచి తరిమివేసి, ఎర్రనను దానికి పాలకునిగా నియమించారు. ఇతని కుమారుడు బేతరాజు. ఇతని కుమారుడు గుండమరాజు, ఇతడు గొప్ప యోధుడు. ఇతడే వేంగీ రాజయిన చాళుక్య అమ్మరాజును గెలిచినవాడు. కాని ఇతనిని తర్వాత ముదిగొండ చాళుక్యులు పశ్చిమ చాళుక్య చక్రవర్తి తైలపుని సహాయంతో యుద్ధంలో చంపారు.

గుండరాజు మరణించగానే కొరవిరాజ్యం ముదిగొండ చాళుక్యుల వశమైంది. అతని కుమారుడు బేతరాజు చాల చిన్నవాడు. అతనిని అతని మేనత్త కామసాని తన భర్త ద్వారా చాళుక్య చక్రవర్తికి విన్నవించి, అనుమకొండ ప్రాంతానికి రాజుగా చేసింది. దీనితో కాకతీయులలో మార్పు వచ్చింది. కాకతీయులు రాష్ట్రకూటులపట్ల అభిమానం వదలి చాళుక్యులకు విధేయులయ్యారు. పిదప బేతరాజు, పిదప అతని కుమారుడైన మొదటి ప్రోలరాజు, రెండవ బేతరాజు, దుగ్గరాజు, రెండవ ప్రోలరాజు క్రీస్తుశకం 1052 నుంచి 1157 వరకు నూట అయిదేళ్ళు సామంతులుగానే పాలించారు. రెండవ ప్రోలరాజు గొప్ప యోధుడు. ఇతడు తెలంగాణాలో చెలరేగిన విప్లవాలన్నిటినీ అణచివేసి కల్యాణి చాళుక్యచక్రవర్తి రెండవ జగదేకమల్ల ప్రతాప చక్రవర్తి అనుగ్రహం పూర్తిగా సంపాదించాడు. తెలంగాణాలో తనకు సాటి వీరుడు మరొకడు లేడని నిరూపించుకొన్నాడు. దీనితో కాకతీయ సామ్రాజ్యానికి గట్టి పునాది పడింది.

# స్వాతంత్ర్య ప్రకటన - రుద్రదేవుడు

రెండవ ప్రోలరాజు పెద్ద కుమారుడు రుద్రదేవుడు 1158 లో పట్టానికి వచ్చాడు. ఇతని కాలంలో కల్యాణి చాళుక్య చక్రవర్తి అయిన ద్వితీయ జగదేకమల్ల ప్రతాప చక్రవర్తిని అతని సోదరుడైన తైలపుడు త్రోసిరాజని సింహాసనం ఆక్రమించాడు. ఇలా ఉండగా, ఆరవ విక్రమార్కుని దౌహిత్రు డైన కళచురి బిజ్జలుడు మూడవ తైలపుని తరుమగొట్టి రాజ్యమాక్రమించాడు. కల్యాణి చాళుక్య సామ్రాజ్యం మూడు ముక్కలైంది. కాకతీయ రుద్రుడు వీరిలో ఎవరికి విధేయుడుగా ఉండాలో తేల్చుకోలేకపోయాడు. దురాక్రమణ దారుడైన బిజ్జలునికి తలవంచడం అతనికి నచ్చలేదు. కనుక క్రమంగా తెలంగాణాను ఆక్రమించుకోడం ప్రారంభించాడు. బిజ్జలుడు మైళగి అనే సేనా పతి ఆధీనాన గొప్ప సైన్యం పంపాడు. దానితోను, ఇరుగు పొరుగు వారితోను రుద్రదేవుడు పోరి, అందరిని జయించి, అనుమకొండ వేయిస్తంభాల గుడిలో విజయ శాసనం వేయించాడు. స్వాతంత్ర్యం ప్రకటించి, కాకతీయ సామ్రా జ్యాన్ని స్థాపించాడు. అతని రాజ్యానికి దక్షిణాన శ్రీశైలం వరకు, ఉత్తరాన గోదావరి, పశ్చిమాన బీదరు, తూర్పున ద్రాక్షారామం ఎల్లలు. రుద్రదేవుడు దేవగిరి యాదవ రాజులపై దండెత్తి ఆ యుద్ధంలో 1195 లో మరణించాడు. అతని పిదప అతని తమ్ముడైన మహాదేవుడు మూడు సంవత్సరాలు రాజ్యమేలి దేవగిరి యాదవరాజులపై దండెత్తి యుద్ధంలో మరణించగా, రుద్రుని కుమారు డైన గణపతిదేవుణ్ని 1199 లో విధేయులైన మంత్రి సేనాపతులు సింహాసనా సీనుణ్ని చేశారు. గణపతిదేవుడు 1199 నుంచి 1262 వరకు 63 ఏళ్ళు రాజ్యం చేసి, చోళులను, పాండ్యులను, కళింగులను జయించి, పెక్కు కోవెలలను నిర్మించాడు. దాదాపు తెలుగు దేశమంతా ఈయన రాజ్యంలో ఉంది. ఉత్తరాన గోదావరి, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన కాంచీ రాజ్యమూ సరిహద్దులు. గణపతిదేవునికి కుమారులు లేనందున, అతని కుమార్తె రుద్రమదేవి, గణపతి దేవుని తర్వాత 1262 లో రాజ్యానికి వచ్చి 1289 వరకు ఏలింది ఎదురు తిరిగిన సామంతులను అణచివేసి, రాజ్యాన్ని స్థిరపరచింది.

రుద్రమదేవికి కుమారులు లేరు. ఆమె తన దౌహిత్రుడైన ప్రతాప రుద్రుని దత్తు తీసుకుంది. అతడు 1189_1323 వరకు రాజ్యం చేశాడు. అతని కాలంలో కాకతీయ రాజ్యం పడమట బీదరు దాటి, దక్షిణాన కంచి, తూర్పున ద్రాక్షారామం, ఉత్తరాన కోటగిరి, పోలాస్ వరకు వ్యాపించి ఉండేది.

ప్రతాపరుద్రుని కాలంలో ఢిల్లీ సుల్తానయిన ఘియా జుద్దీన్ ఖిల్జి ఉలుగ్ ఖాన్ అనే సేనాపతిని పంపి వరంగల్లుపై దాడి జరిపాడు. ఆ దాడిలో కాకతీయులు వోడిపోయారు. ప్రతాపరుద్రుడు బందీ అయ్యాడు అతడు ఢిల్లీకి వెళ్ళే దారిలో యమునానదీ తీరంలో ఆత్మహత్య చేసుకున్నాడు. కాకతీయ సామ్రాజ్యం పతనమైంది.

కాకతీయ సామ్రాజ్యంలో కళా సాహిత్యాలు చాలా అభివృద్ధి పొందాయి.

[ఆంధ్రపత్రిక 2-11-1982]

★★

# కళాపూర్ణోదయం విశిష్టత

"చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను, సౌరభము చలువయు దలిర్పం
బొలుపెసగు కప్పురపు బలుకులకు గోమలత
నెలకొనిన, సౌరభము జలువ పసయుం గో
మలతయును గలిగి జగముల మిగుల బెంపెసగు
మలయ పవనంపు గొదమలకు మధురత్వం
బలవడిన, నీడు మఱి కలుగుననవచ్చు, గడు
వెలయగల యీ సుకవి పలుకులకు నెంచన్." (1-189)

అని మణికంధరుని కవితను కలభాషిణి స్తుతించే వ్యాజంతో, తానే తన కవితను గురించి చెప్పుకొన్న రీతిగా, సమకాలిక ప్రబంధకవుల తీరుతీయములకు భిన్నంగా కవిత చెప్పినవాడు పింగళి సూరన్న. తక్కిన ప్రబంధ కవులలోని వర్ణనశక్తితోబాటు వారికి లేని కథా కల్పనాశక్తి, వివిధ సందర్భాలను ఒక కొలికికి అనుసంధించే ప్రతిభ సూరన్నకు వెన్నతో బెట్టిన విద్య. కల్పనా శక్తికి తోడు భాషాశక్తి కూడ ఇతనికి ఉన్నది. కవిత ఎలా ఉండాలో- ఉన్నదో సూరన్న పై లయవిభాతిలో హృదయవిభాతిగా చెప్పినాడు. చల్లని వెన్నెలకు వాసన వుంటే; చల్లదనం, సువాసన వున్న కర్పూరపు పలుకులకు కోమలత వుంటే; కమ్మని, చల్లని, మెత్తని మలయాచలపు పిల్లగాలులకు తీయదనం అలవడితే, ఈ సుకవి వలుకులకు సాటిరాగలవు ఇవన్నీ - అని కవితా నిర్వచనాలను గూడ సూరన్న మణికంధర కవితా ప్రశంసా సందర్భంలోనే మరొక పద్యంతో గుదిగుచ్చాడనవచ్చును.

"పొసగ ముత్తెవుసరుల్ పోహళించినలీల
దమలోన దొరయు శబ్దములు గూర్చి,
అర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
నెరిగి నిర్దోషత నెసగజేసి,
రసభావములను నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతు లిమ్ముగ నమర్చి,

రీతుల నుచితంబులై తనరారెడు
ప్రాణంబులింపుగా బాదుకొల్పి
అమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియ క్రియలు ఘటించి
కవిత జెప్పగనేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసగని వారు గలరే." (కళా- 1,188)

కళాపూర్ణోదయం ఆంధ్రవాఙ్మయంలో అద్వితీయం కావడానికి ప్రధాన కారణం, మనుచరిత్రాదులవలె భాషాంతర పరివర్తనం కాకపోవడం, ప్రాచీన కథాధారితమూ కాకపోవడం, స్వకపోల కల్పన కావడమూనూ.

సూరన్న కళాపూర్ణోదయ రచనలో కాదంబరీకారుని ఫక్కీని అనుసరించినాడనడం యుక్తిసహంగా కనిపిస్తుంది. కాదంబరీకారుడు స్వకపోల కల్పిత రచనతో, పాత్రలతో కథను చెప్పించే నూతన ఫక్కీకను ప్రవేశ పెట్టాడు. సూరన్న కూడ ఈ ఫక్కీకను అనుసరించాడు. ఎక్కడికక్కడే పాత్రలు తమ కథను చెబుతూ విసుగు కలిగించక తమను తామే పోషించు కుంటాయి. ఫ్లాష్‌బ్యాక్ పద్ధతిరొమక విశేషం.

ప్రబంధకవుల మూసపోత రీతిని, పిండికొట్టినబాటను కాక అన్నివిధాల తనదైన విశిష్ట విధానాన్ని రూపొందించుకొన్న సూరన్న కాలదేశాదులు ఇంచుకంత తెలుసుకొందాము.

నిజామాబాద్ జిల్లాకు చేరువలో వున్న పింగళిగ్రామం సూరన్న పూర్వుల నివాసం కావచ్చునని పండితుల అభిప్రాయం. ఈ గ్రామంలో గోకనామాత్యుడనే కవి 'నందకస్తవం' అనే కావ్యం విష్ణుఖడ్గ స్తుతిగా రచించాడు. ఈయనను గురించి కథలు చాల ఉన్నవి. ఈయన ఇంట్లో పేకి అనే గంధర్వి (అతిమానుష శక్తిగల దేవాంశసంభూతురాలు) దాసిగా ఉండేదట. అది మానవసాధ్యం కాని పనులు చేసేదట. దానిని గోకయామాత్యుడు తానెప్పుడో దాచిన ఒక మణినిచ్చి వదలించుకొన్నాడట. ఈ కథ నిజమని సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నంలోని ఈ పద్యంతో సాక్ష్యమిచ్చాడు:

"పేర్వెలయంగ నా ఘనుడు పింగళి గోక బుధోత్తముండు గం
ధర్వి నొకర్తు బేకి యనుదానిని దాసిగ నేలె, యోగి తా
గుర్వనుభావుడై నెరపె గోపకుమారుని ఖడ్గవర్ణనం
బర్వపు నిండువెన్నెలలపై నెరి జూపెడు కీర్తి సంపదన్."
(1.14)

ఈయన వంశంవారు పూర్వాంధ్ర దేశంలోని గోదావరి కృష్ణాతీరాలకు వలస వెళ్ళారు. కృష్ణదేవరాయల కాలంలో పింగళి వంశంలో సూరన్న జన్మించాడు. దాదాపు క్రీ.శ. 1530 ప్రాంతానికి అనన్య సామాన్య పాండిత్య శౌండీర్యంతో చాటు ప్రబంధ రచనా పాటవంతో తొణికిసలాడే నవయువకుడయి వుంటాడు ఇతడు. సూరన్న మొదటి కావ్యం గిరిజాకల్యాణమని రంగరాట్ చందంలోని ఉదాహరణనుబట్టి తెలుస్తున్నది. తర్వాత ఇతడు విష్ణుసంబంధ మయిన గరుడపురాణం అనువదించాడు. దీనిని సర్వసాధారణంగా ఎవరూ చదువరు. దీనికి కారణం, దీనిలో జీవుడు మరణానంతరం జరిపే యాత్ర, అంత్యక్రియలు మొదలయినవి వివరించబడి వుండడమే. దీనిని సూరన్న ఎవరి కోరికమీద రచించాడో కాని అంతగా రాణకు రాలేదు.

క్రీ.శ. 1545 ప్రాంతంలో విజయనగరంలో ప్రబలుడై కృష్ణరాయలకు యుద్ధాలలో తోడయిన అకువీటి ఇమ్మరాజు మనుమడు పెదవెంకటాద్రి ప్రాప కంలో సూరన్న ద్వ్యర్థి కావ్యమయిన రాఘవపాండవీయం రచించాడు. ఇది కవే చెప్పినట్టు

"ఆంధ్రభాషా సంస్కృతాభిభాషాశ్లేష
యొక్కొక్కచోట, నొక్కొక్కచోట
నుచిత శబ్దశ్లేష, యొక్కొకచోట న
ర్థశ్లేష, యొక్కొక్కతరిని ముఖ్య
గౌణ వృత్తిశ్లేషఘటన, యొక్కొక తరి
నర్థాన్వయము వేరె యగుచునునికి,
శబ్దాన్వయ విభేద సంగతి యొక్కొక్క
తరి, నివి యొక్కొక్కతరిని రెండు
మూడు గూడుటయు నన సముజ్జ్వలముగ."

సకలవిధ శ్లేషలకూ ఆటపట్టు.

తర్వాతి కావ్యం కళాపూర్ణోదయం దాదాపు 1550 ప్రాంతంలో నంద్యాల కృష్ణంరాజుకు అంకితంగా రచించాడు. చివరిది ప్రభావతీ ప్రద్యుమ్నం. దీనికి హరివంశంలోని కథ, 12వ శతాబ్దంలో తిరువనంతపురం పాలించిన కేరళరాజు రచించిన ప్రద్యుమ్నాభ్యుదయమనే సంస్కృత నాటకమూ మూలం.

సూరన్న కథాకథన రీతిలో కాదంబరీకారుని అనుసరించాడని ఇదివరకే మనకు తెలుసు. ఒకటి పాత్రలతోనే కథను చెప్పించి నడిపించడం; రెండవది ఫ్లాష్‌బాక్ పద్ధతి. కట్టమంచి రామలింగారెడ్డిగా రన్నట్టు కథను వివరించే

పద్ధతులు రెండు - కాలక్రమానుసార కథనం, కాలక్రమం వదలి కార్యకారణ క్రమానుసార కథనం. వీనిలో రెండవది నేటి ఫ్లాష్‌బాక్‌లాగ సహృదయుల హృదయాలను రసప్లావితం చేస్తుంది.

కాలక్రమాన్ని బట్టి చూస్తే కళాపూర్ణోదయ కథకు మొదలు పంచమా శ్వాసంలోని సరస్వతీ చతుర్ముఖుల లీలాకేళి. కథ పూర్తిగా తెలియడానికి ఐదాశ్వాసాలు చదువాలి- కాదంబరి ఉత్తరార్ధం చదివినట్టు. సూరన్న తన కావ్యావతారికలో "మదీయశక్త్యనుసారంబుగ విచారించి యత్యపూర్వకథా సంవిధాన వైచిత్రీ మహనీయంబును, శృంగారరసప్రాయంబును, పుణ్య వస్తు వర్ణనాకర్ణనీయంబును నగు కళాపూర్ణోదయంబను మహాకావ్యంబు నిర్మింప గడంగితి" అని చెప్పుకొన్న ప్రకారం మూడు లక్షణాలతో - అత్య పూర్వ కథాసంవిధాన వైచిత్రి, శృంగారరసప్రాయత, పుణ్యవస్తు వర్ణనా కర్ణనీయతలతో అమూలాగ్రం కథలో ఎప్పటికప్పుడు ఔత్సుక్యం ప్రేరేపిస్తూ రచన కొనసాగుతుంది.

కథాప్రారంభమే అన్ని కావ్యాలలోలాగ ఒక ఊళ్ళో ఒక రాజు, ఆ రాజుకు ఒక రాణి అని కాకుండా కాదంబరిలాగ; నేటి సినిమాలాగ విచిత్రంగా- శ్రీకృష్ణుడు ద్వారకానగరంలో ఉన్న కాలంలో, ఆ ఊరి చివరనున్న ఉద్యాన వనంలో కలభాషిణి అనే వారవనిత ఉయ్యాల లూగడంతో ప్రారంభమవు తుంది. ఆ ఉయ్యాలలూగడాన్ని కవి కుణికంధరుడనే నారద శిష్యునితో వర్ణింపజేస్తాడు:

> "తమి బూదీగెల దూగుటుయ్యేలల బంతాలాడుచుం దూగు నా
> కొమరుంబ్రాయపు గబ్బిగుబ్బెతల యంఘ్రుల్చక్కగా జాగి మిం
> టి మొగంబై చనుదెంచు కీవి గనుగొంచే దివ్యమౌనీంద్ర నా
> క ప్రుగీ నేత్రలమీద గయ్యమునకుం గాల్దాచులా గొప్పెడున్."
>
> (1.149)

అని మణికంధరుండంటే, నారదుడు "అదేమిటి? వారల దోలా చలనోచ్చల చ్చరణముల్ త్రైవిష్టప స్త్రీల యౌదల దన్నంజను నట్లు మించెననినం దప్పేమి యొప్పే యగున్" అంటాడు. దీనితో రంభా ప్రసక్తికి, దానితో కయ్యానికి నారులు పోశాడు కవి.

సూరన్న ఉద్దేశంలో కళా పూర్ణోదయ కావ్యంలోని ఇతివృత్తం కళ సంపూర్ణంగా ఉదయించడమే. కళా వికసనాన్ని డాక్టర్ జి. వి. కృష్ణారావుగారు తమ కళా పూర్ణోదయ విమర్శ (సిద్ధాంత వ్యాసం) లో వివరించారు: 1. కావ్యం

లోని కథా సంవిధాన వైచిత్రి, 2. కవిత్వ నిర్వచన ప్రయత్నం, ఫలశ్రుతి, 3. మణిస్తంభుని పూర్వగాథ, ఉత్తర చర్యలు, 4. మణిస్తంభ సుముఖాసత్తుల పేర్లు, వారి దేశం, ఆరాధ్య దైవం, 5. సరస్వతీ చతుర్ముఖుల రహస్య కథ, 6. కళా పూర్ణుడు, అభినవ కౌముది, మధురలాలస, సుప్రసాదుడు, సరసుడు అనే పేర్లు, 7. కావ్యంలో సాహిత్య తత్త్వాలను వివరించడం, 8. శాస్త్రజ్ఞుల అనుగ్రహంతో తన కావ్యానికి ప్రచారం కావాలనడం, 9. కావ్యానికి కళా పూర్ణోదయమని పేరు పెట్టడం— ఇవన్నీ కళ పూర్ణంగా వికసించడాన్నే బలపరుస్తున్నాయి.

ఈ కళోదయం సరస్వతీ చతుర్ముఖ విలాస ఘట్టంలో కలుగుతుంది. ఈ ఘట్టం వంటిది ఆంధ్ర సాహిత్యంలో లేదు. వీరిద్దరూ విహరిస్తుండగా, సరస్వతి ప్రణయ కోపంతో అవ్వలి మొగమవుతుంది. అప్పుడామె ముఖం వారు విహరిస్తున్న మందిరం చుట్టూవున్న కాసారపు మణిస్తంభంలో ప్రతిఫలిస్తుంది. ఆ ప్రతిబింబమే కాసారపురంలోని రాజు కళాప్రపూర్ణుడు (ముఖచంద్రుడు).

ఈ ఘట్టాన్ని బట్టి సూరన్న దృష్టిలో కళ ప్రకృతికి ప్రతిబింబమూ కాదు; అనుకరణా కాదు; అతడు విశ్వజనీనమైన విషయాలను ఎన్నుకొని, తన ప్రతిభా వ్యుత్పత్తి శిల్పంతో శాశ్వతం చేస్తాడు. కళాకారుడు వాస్తవికవాది, స్వతంత్రుడు కావడంవల్ల బహిరంతర విషయాలకు స్పందిస్తాడు. అప్పుడు కళ ఉదయిస్తుంది. ఉత్తమ కళాకారుని సృష్టిలో కళ పూర్ణంగా ఉదయిస్తుంది.

సూరన్న కవితా తత్త్వంతో పాటు ప్రేమ తత్త్వాన్ని గూడ ఎడనెడ వివరించాడు. ప్రేమికుల మనస్తత్త్వ వైవిధ్యాన్ని సూరన్నలాగ ఆంధ్ర సాహిత్యంలో మరెవరూ విశ్లేషించలేదు. ఈ విషయంలోను ఇతనికి వివిధ ప్రేమతత్త్వ భాండాగారమైన కాదంబరే మార్గదర్శకమయి వుంటుం దనుకుంటాను. కలభాషిణి ఒకవైపు మణికంధరునిపై లగ్న అయినా, దైవత్వ ప్రీతితో, సౌందర్య పిపాసతో నలకూబరుని ఎడల మక్కువ చూపడం, సుముఖాసత్తి, మణిస్తంభుల నేర్ష్య ప్రేమ తీవ్రతను వర్ణించడం, సుగాత్రీ శాలీనుల స్వాభావిక నిరాడంబర ప్రేమ విశదీకరణం— సూరన్న ప్రేమతత్త్వ పరిశీలనకు ఉదాహరణలుగా చెప్పవచ్చు.

సుగాత్రీ శాలీనుల ప్రేమ ఘట్టం వంటి శుద్ధమైనది మరొకటి కానము. సుగాత్రి శారదా మందిర పూజాకారుని కుమార్తె. ఆమె భర్త శాలీనుడు ఇల్లరికం అల్లుడు. అతనికి నగానట్రా అంటే ఇష్టం లేదు. కాని, ఈ సంగతి తెలియని అత్తగారు కూతురును సకలాభరణ భూషితగా పడుకటింటికి

బంపగా, అతడు "తద్విభూషణాది మహిష దలకి పట్ట మదిని సంకోచించె, తరుణి యుండి యుండి తిరిగిపోయె." కాని ఆమె చెలికత్తెలు

"పొలతి అలిమగని పోడుము లేమియు
గలిగినట్టి చొప్పు గానరాదు
మీ తెరంగు జూడ మేల్మేలు దంపతు
లిరువురును వివేకు లేమి చెప్పు? (4–66)

కాంతు డుచితజ్ఞుడైనను
గాంతకు సిగ్గుపడ జెల్లుగాక కటకటా
కాంతుడు నిర్భీతికాడై
కాంతయు నట్లైన నెట్లు కాపురమింకన్? (4–67)

అని, "బంగారు వంటి ప్రాయము సంగతియే యకట రిత్త యయ్యెకు నాసగన్" అని ఎత్తి పొడుస్తారు. కాని సుగాత్రికి మగని మనసు గెలుచుకునే వెరవు తెలియక "నాకును మంగళ సూత్రం బీపాటి శుభస్థితి నుండుటయే పదివేలు" అనుకుంటూ గడుపుతుంది. శాలీనుడు ఇల్లటపు అల్లుడు గనుక అన్ని పనులతో పాటు తోట పనులు గూడ చేస్తూంటాడు అప్పుడు భర్త కష్టం చూడలేక తాను అతడు పనిచేసే తోటకు

"చని యాతడు దా జలిపెడు
పనులకు నీయకొనకున్న బలిమి గదంగెన్
దన సొమ్ములెల్ల నొక మరు
గున నిడి పిరిసుట్టు సుట్టుకొనిన వలుపతోన్. (4–97)

తోరంపు చనుదోయి త్రుళ్ళింతల నిడంగ
దగుచోట్లు గుద్దంట ద్రవ్వి త్రవ్వి
వ్రేగైన పిరుదు బల్విడి చలింపంగను
వడి నిట్టు నట్టులు నడచి నడచి
అడుసు తుంపురు చెక్కుటద్దంబులను బర్వ
మళ్ళకు మడవలు మార్చి మార్చి
నడుము లేదీవియ నకనకల్గుడువ నిం
పున దగు మోపులు మోసి మోసి
చిరు చెమట బేర్చు వింత క్రొమ్మెరుగుతోడ
గొమరు మేనొప్ప సారెకు గొప్పు వదల

నేమిటికి నైన దా మున్న యేగి యేగి
యెల్ల పనుల నొనర్చి నిం పెసక మెసగ." (4-99)

అప్పుడా సహజ సుందర మూర్తికి శాలీనుడు కరగిపోతాడు. ఆమె మరల ఆభరణాలు ధరించగా అతడు మరలా అనాసక్తుడవుతాడు. అతని ప్రేమతత్త్వం అందరికీ తెలియడానికి గాల కాలం పడుతుంది.

సూరన్న సుగాత్రీ శాలీనుల కథతో భార్యా భర్తల పరస్పర ప్రీతికి సహజ సౌందర్యం, గౌరవం మొదలయినవి ముఖ్యమని లోకానికి చాటినాడు. చివరకు శ్రీ కట్టమంచివారి మాటలతో ముగిస్తాను-

"భావనా శక్తిలోను, పాండిత్యంలోను సూరనార్యుఁడు ప్రబగల్భుడు. రెంటిని జూపింప నిశ్చయించిన వాడగుట నాంధ్రమున నసదృశంబగు కావ్యంబు కళా పూర్ణోదయంబు సృజింపబడియె........అందలి కల్పనలు, సందర్భములు మహేంద్రజాలముల ట్లాశ్చర్యకరములు. శైలీప్రావీణ్యమన్ననో వాచాతీతము. మౌనముగా గ్రోలి హృదయము పరవశముగా నానందింప వలయునే కాని. మాటల దమి యాఁబదు. పాత్రముల వచనములు మధుర సుధా ధారలు."

★★

# "స్వప్రియం తు పరిత్యాజ్య"

ఉత్తిష్ఠత సంనహ్యధ్వం
ఉదారాః కేతుభిస్సహ.
సర్పా ఇతరజనాః
రక్షాంస్యమిత్రా ననుధావత.
ఈశాం వో వేదరాజ్యం
త్రిషంధ్యే అరుణైః కేతుభిః సహ.
(అథర్వకాం. 11, సూక్త 10. మం. 1)

"లేవండి! జండా చేతపట్టుకొని శత్రువులను వెన్నాడండి!" అని యుద్ధం వచ్చినప్పుడల్లా వేదకవులు కంఠమెత్తి ముందుకురికారు.

మానవజాతి పరిణామంలో స్వంత ఆస్తి పుట్టినప్పుడే యుద్ధం పుట్టింది. దానితో మిత్రులు, అమిత్రులు పుట్టారు. సౌహార్ధం, దౌర్హార్దం పుట్టాయి. వీరాలాపాలు, విక్రమోద్ధతులు పెరిగాయి. వాటితోపాటే శాంతివాంఛ కూడా అవతరించింది.

మనకు ఒకరి భూమిమీద ఆశ లేదు! ఒకరి ధనంమీద కాంక్షనూలేదు; ఒరుల గొప్పతనం చూచి ఓర్వలేనితనం లేదు. ప్రశాంత వాతావరణంలో ప్రజ అందరికీ కావలసిన సుఖమయజీవన సాధనాలను సృజించుకోవాలని మన కోరిక. అందుకనే మన విదేశాంగ నీతికి అలీనత ఆలంబనం, శాంతి సమ్యగ్లక్ష్యం.

అయినప్పటికీ, ఇరుగుపొరుగున ఇలాటి లక్ష్యాలు లేనంతకాలం మన ఆశయాలకు అఘాతాలు కలుగుతూనే ఉంటాయి. భారతదేశం స్వతంత్రమయిన ఈ ఇరవైయయిదు సంవత్సరాలలో అనేక పర్యాయాలు మన శాంతికి భంగం కలిగింది. మన అభ్యుదయానికి ఆటంకాలు ఏర్పడ్డాయి. ఒకనాడు మన అంగంలో అంగమై రెండు పుష్కరాలక్రిందట విడిపోయిన మన సోదరులకు అక్కడి పాలకులు సుఖజీవనం సున్నచేశారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను చెరపట్టారు. బ్రతుకులు మెరుగుపరచుకోడానికి మనసోదరులు ప్రయత్నించినప్పుడల్లా వారిమనసుల్లో మనపై విద్వేషం నూరిపోశారు. కసినీ, కార్పణ్యాన్నీ నింపారు. వారి సుఖమయ జీవితానికి మనమే అవరోధాలు కల్పిస్తున్నట్లు నమ్మించారు.

ఆరేళ్ళ క్రిందట ఈ కసి పెరిగి పెరిగి యుద్ధంగా పరిణమించింది. ఆనాటి యుద్ధరంగంలో జననష్టంతోపాటు నూరుకోట్లవరకు ధననష్టం జరిగింది. మనలాగే శాంతిని కోరే మహాదేశం సోవియట్ యూనియను కృషిఫలితంగా తాష్కెంట్ ఒప్పందం జరిగి, యుద్ధం ముగిసింది.

మన పొరుగు దేశంలో గొర్రెలు తినేవారు పోయి బర్రెలు తినేవారు వచ్చారు, కసి తిరిగి కాలకూటంలా పెరిగింది. కాని, వ్యాకరణంతో ఆకలి తీరదని మురారి ఏనాడో చెప్పినట్టు కసితో కడుపు నిండదని, మన సోదరులు గ్రహించారు. పాలకులు సృష్టించిన భయభీత వాతావరణంలో కూడా తమ ఆశయాలను నిర్ద్వంద్వంగా ప్రకటించారు. స్వేచ్ఛా స్వతంత్ర ప్రశాంత వాతావరణంలో సుఖమయ జీవితావకాశాలు, ఇరుగు పొరుగు వారితో స్నేహ సౌహార్దాలు కావాలని కోరారు. ఈ కోరిక పాలకులకు భయం పుట్టించింది. ద్వేషం, యుద్ధం సిరలూ ధమనులుగా రూపొందించిన పాలకులు మతి చెడి, ధృతి చెడి తమ ప్రజలమీదికే విరుచుకుపడ్డారు. ఊహ ఉడిగి పోయినప్పుడు, అన్ని విధాల అశక్తుడయినప్పుడు మాత్రమే ఎవ్వడైనా దౌర్జన్యానికి దిగుతాడు. వాదబలం తగ్గినప్పుడేకదా 'శేషం కోపేన పూరయేత్' అనే నానుడి పుట్టింది. అశక్తదౌర్జన్యానికి పాల్పడిన పాలకులను నిలువరించలేని నిరాయుధులు అభయం కోసం మనను శరణుజొచ్చారు.

> "రక్ష త్వం వై ప్రజాధర్మం క్షత్రధర్మస్తు రక్షణం,
> కున్నృపైః పీడితాః తస్మాత్ ప్రజాః సర్వత్ర పాలయేత్."
>
> (భారతం, అనుశాసనిక)

దుష్టపాలకులు ప్రజలను పీడించినప్పుడు ఆ ప్రజలను అన్నివిధాల ఆదుకోవడమే ధర్మమని మహాభారత అనుశాసన పర్వంలో భీష్ముడు నాటి ధర్మరాజునే కాక, ధర్మాన్ని అభిమానించే నేటి పాలకులను కూడ అనుశాసింతాడు. అందుకనే, ఒకరు కాదు, ఇద్దరు కాదు, కోటి మంది పీడితులు, బంధువులను భార్యబిడ్డలను కోల్పోయిన ఆర్తులు మనదేశానికి వచ్చినప్పుడు, అది ఎంతటి భారమైనా భరించడానికి మనం సిద్ధమయ్యాము.

ఆరేళ్ళ క్రిందట మనతో యుద్ధంలో ఏమీ సాధించలేకపోయిన పొరుగు దేశపు నియంతలు ఈసారి తమ ప్రజలపైన ప్రత్యక్ష యుద్ధమే కాకుండా మన ఆర్థిక వ్యవస్థమీద పరోక్షయుద్ధం కూడా ప్రకటించారు. శరణార్థుల పోషణ కోసం నెలకు దాదాపు నూరుకోట్ల రూపాయలు వ్యయమవుతున్నా మనం ఎనిమిది నెలలపాటు సహించాం. ఇది చాలదన్నట్టు పొరుగున ఉన్న దురంత నియంతలు మనమీదనే యుద్ధం ప్రకటించారు.

ఇలాటి దశలో ఆదినుంచి శాంతిపరిరక్షణకు, ప్రజల సుఖమయజీవితానికి మనలాగే అంకితమైన ఒక్క సోవియట్ యూనియను తప్ప మరే మహా పాలకులూ ఈ నియంతలను అదేమన్న పాపాన పోలేదు.

ఆత్మరక్షణ కోసం ఆయుధాలు చేపట్టాము. మన సైనికులు లేదారు; సన్నద్ధులయ్యారు. మన జాతి గౌరవాన్ని చెబూని శత్రువులను వెన్నంటారు. ఈ యుద్ధంలో భృగ్వంగిరులు అథర్వణ వేదంలో

"ఈశాం వో వేద రాజ్యం త్రిషంధే అరుణైః కేతుభిః సహ"

అని చెప్పినట్లు అరుణకేతనధారి అయిన సోవియట్ యూనియను మనతో పూర్తి సౌహార్దం ప్రకటించిననాడే విజయం తథ్యమని తెలిపోయింది.

ఈ యుద్ధం మన స్వార్థం కోసం చేయడం లేదు. మనకు ఎవరి భూములమీద, ధనంమీద ఆకాంక్ష లేదు. కాని, మన దేశానికి కాందిశీకులుగ వచ్చిన వారిని సురక్షితంగా వారి దేశానికి పంపకం, అక్కడ చేరిన తర్వాత కూడా వారికి సురక్ష కల్పించడం మన కర్తవ్యం. మహాభారత ఆదేశం కూడా అదే.

"కారణా దేవ యోద్ధవ్యం నాత్మనః పరదోషతః,
సుయుద్ధే ప్రాణమోక్షశ్చ తస్య ధర్మాయ ఇష్యతే."
(అనుశాసన పర్వం)

ఒక ప్రత్యేక కారణం వుంటే తప్ప యుద్ధం చేయవద్దని మహాభారతం ఆదేశం. ఇప్పుడు మనం అకారణంగా యుద్ధం చేయడం లేదు. మన దోషాలను కప్పి పుచ్చుకోడానికి, ఇతరుల దోషాలను ఎత్తి చూపడానికిగాని యుద్ధం చేయడం లేదు.

"భయార్తానాం భయత్రాతా దీనానుగ్రహ కారణాత్,
కార్యాకార్య విశేషజ్ఞః నిత్యం రాష్ట్రహితే రతః."
(అనుశాసనపర్వం)

అని చెప్పినట్లు భయార్తుల భయ నివారణ కోసం, దీనులను ఆదుకోవడం కోసం, కార్యాకార్యాలు తెలిసి ఈ యుద్ధానికి పూనుకొన్నాము.

ఈ యుద్ధంలో మన పరమాశయం ఒక్కటే. మనలాగే మన పొరుగు వారు కూడా ప్రశాంత వాతావరణంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో తమ సుఖమయ జీవితం కోసం పాటుపడే పరిస్థితులు కలగాలి. అదే మనకు కావలసింది. అంతే కాని వారి భూమి మనకు వద్దు. వారి సంపద మనకు వద్దు.

అయితే వారి శ్రేయస్సు మనకు కావాలి. వారి స్నేహం మనకు కావాలి. ఆ భూమిలో మనకు శాంతి కావాలి. ఉభయ ప్రజల మధ్య సహకారం కావాలి. అందుకనే శాంతి స్నేహ సహకారాలకు అంకితమైన భారత - సోవియట్-యూనియనులు శాంతి సహకార సంధిని కుదుర్చుకున్నాయి.

ఈలాటి శాంతి స్నేహ సహకారాలే సకల జాతుల మధ్య సహజీవనానికి పునాదులు కావాలని మన ఆకాంక్ష.

అయినప్పుడు అనాదిగా శాంతి స్నేహ సహకారాలు పునాదిగా కవితలు, కావ్యాలూ అల్లిన మన భారతీయ రచయితలు ఈనాడు కూడా తమ మేధా శక్తిని దీనికి అంకితం చేయవలసి ఉంటుంది. వేద ఋషులవలె మన కవులు కూడా నేడు సౌహార్ద ద్రాఘిమ విచక్షణ చూపవలసి వుంది. ప్రజల మనస్సుల్లో స్నేహాన్ని నిలిపి సహకారాన్ని పెంచి, శాంతిని కుసుమింపజేయ వలసిన బాధ్యత మనపైన ఉంది. ధర్మం కోసం, న్యాయం కోసం, ఇరుగు పొరుగుల శ్రేయస్సుకోసం తప్పనిసరిగా తలపెట్టిన ఈ యుద్ధంలో జాతినేతలకు మన ప్రజలందరి సహకారం సంపాదించవలసిన బాధ్యత మన రచయితలది. కనిపించని మామిడి తోటల్లో వినిపించని కోయిలల కుహూరవాల ఊహలు కట్టిపెట్టి భారత ప్రజా సహకారవనంలో పుంస్కోకిలలు కావాలి.

ఈనాటి మన నేతలు భారత ఉపఖండంలో

"ప్రజానాం రక్షణార్థాయ ప్రజాహిత కరో భవేత్,
ప్రజాకార్యం తు తత్కార్యం ప్రజాసౌఖ్యం తు తత్సుఖం.
ప్రజాప్రియం ప్రియం తస్య స్వహితం తు ప్రజాహితం,
ప్రజార్థం తస్య సర్వస్వం ఆత్మార్థం న విధీయతే."

అని భారతంలో భీష్ముడు ధర్మరాజుకు ఉపదేశించిన సిద్ధాంతాలనే ఆచరణలో పెడుతున్నారు. తరతరాలుగా మన జాతి సంచయించిన మంచి అంతా ఈనాడు ఆచరణలో ఉన్నంతగా ఏనాడూ లేదు. ఇందుకు ప్రధాన బాధ్యులయిన మన నాయకులు అభినందనీయులు. మనం వారి సమకాలికులైనందుకు గర్విద్దాం.

"స్వప్రియం తు పరిత్యజ్య
యద్యల్లోకహితం భవేత్."

అని అనువచించినట్లు స్వలాభాన్ని విడనాడి ఈ క్లిష్ట సమయంలో లోకహితం కోసం గొంతెత్తుదాం.

[బంగ్లాదేశ్ అవతరణ యుద్ధసమయంలో వ్రాసిన వ్యాసం.]
[ఆంధ్రప్రదేశ్, జనవరి 1972]

★★

# నేను కీర్తిశేషుణ్ణయితే...!

ఔను! నేను చిరంజీవిని. నాకు చావు లేదు. ఆ మాటకు వస్తే ఏ రచయితకూ చావు లేదు. భర్తృహరి

"జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశఃకాయే
జరామరణజం భయమ్."

అని చెప్పింది నాబోటివాని కోసం కాదని ఎవరైనా అంటారేమో? "పాపీ చిరాయుః సుకృతీ గతాయుః" అనే సూక్తి అయినా నాకు అన్వయిస్తుంది గదా! మరి నాకు చావు ఎక్కడిది చెప్పండి?

## చావడమే సంభవించి వుంటే...

నేను చావడమే సంభవించి వుంటే, ఎప్పుడో జరగవలసింది; ఎన్నిసార్లో జరగవలసింది. "ధైర్యవంతుడు ఒకేసారి ఛస్తాడు. పిరికివాడు వదిసార్లు ఛస్తాడు" అని ఒక ఆంగ్లకవి అన్నాడు గాని, భయమంటే ఏమిటో ఎరుగని నేను కూడా చాలాసార్లు చచ్చేవాణ్నే; కాని చావలేదు. చిన్నప్పుడు హరిగోలులో ఒంటరిగా తుంగభద్ర దాటుతూ సుడిగుండంలో చిక్కుకున్నప్పుడే చావవల సింది; మద్రాసు కుట్రకేసులో చిక్కుకొని పోలీసులు వెంటాడగా, గ్రామైక రాత్రంగా, వారైక భుక్తంగా పరుగులు తీసినప్పుడే చావవలసింది; ద్వితీయ మహా సంగ్రామ కాలంలో సైనికుడుగా చేరి ఎవరి పొరపాటుకో కోర్టు మార్షల్ అయినప్పుడే చావవలసింది; నేపాల్ రాజధాని ఖాట్మండూ నుంచి కలప వ్యాపారం చేద్దామని మత్య పెట్టిన ఒక మిత్రుని కోసం కాన్పూరులో గంగా తీరంలో నెలపాటు తిండి తిప్పలూ లేక గంగాజలంతో కడుపు నింపుకొని కాచుకొని పడివున్నప్పుడే చావవలసింది; మీ ఉచిత సలహాలు దాచుకోండి సార్, అవసరమైతే అడుగుతాము, చెప్పండి – అని విద్యార్థిని, మిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి అన్నగారి కుమార్తె కె. రమాదేవి గద్దమాయించినప్పుడే సిగ్గుతో చావవలసింది.

అయినా చావు తప్పదనే అనుకుంటాను. నేను బతికి వున్నప్పుడే ఏమీ అనుకోని జనం చచ్చినంక ఏమనుకుంటుంది? ఏమనుకుంటే మాత్రం నాకేమిటి? ఈ సంసారంలో వున్నప్పుడే నాకూ ఏదీ అంటదు గదా! చచ్చిన తర్వాత నాకేమి అంటుకుంటుంది కనుక? మంచీ, చెడ్డా రెండూ ఉన్నాయి. మనిషి అంటే ఈ రెండింటి కలపోత గదా! పూర్తి మంచీ, పూర్తి చెడ్డా వుండదు మరి. ఇతరుల సంగతి నాకు తెలియదు గాని, నా మట్టుకు నేను ప్రతి విషయాన్నీ 49:51 నిష్పత్తితో చూస్తాను. ఒక్కశాతం మంచి ఎక్కువగా వున్నా మంచి వాడిగానే అంటాను ఎవరినైనా. అంత మాత్రాన నన్ను గూడ మంచి వాడని అందరూ అంటారనుకోను. నలుగురూ నాలుగు మాటలంటారని నాకు తెలుసు. ఏకం సత్ విప్రా బహుధా వదంతి– అని భగవంతుణ్నే నాలుగందాల అన్నారు గదా? నా చెడ్డ పనులను భద్రంగా కాపాడుకుంటూ వచ్చాను. అవి నేను చచ్చిన తర్వాత తెలుస్తాయి లెండి!

## పత్రికా రచయితగా

కనీసం పత్రికా రచయితగా నన్ను కొందరు తెగడుతారు, కొందరు పొగడుతారు. పుస్తక సమీక్షలు బాగా వ్రాసేవాడు పాపం! చీల్చి చెండాడేవాడు. ఆ మంచి పేరుతోనే ఛస్తే బాగుండును. ఇప్పుడు అంతా భజనే. మరొకటి లేదు. ఛస్తే వచ్చాడు లే- అనుకుంటారు; తమను పొగడలేదని మనసులోనే కుళ్ళేవాళ్ళు.

## మహా పండితుడు

అనేక భాషలు, అనేక విషయాలు, తెలిసి ఎంతో అనుభవవైవిధ్యం కలిగిన మహాపండితుడు. పోయాడు! పత్రికా రచయితలలో పండిత పరిశోధకుడు, పండితులలో పత్రికా రచయిత అనుకుంటారు; నా అసలు సంగతి తెలియనివారు. నేను ఒక్కొక్క వ్యాసం వ్రాయటానికి ఆరంభం పెద్ద అవస్థ కాగా, ఎన్నికాయితాలు చింపి పెంట పోస్తానో, దానిని ఎత్తలేక నా అర్ధాంగి అనంత లక్ష్మీదేవి ఏం రాతో, ఏం మోతో అని సణుక్కోడం వాళ్ళకేం తెలుసు?

'అబ్బ! మీ నుడి - నానుడి వుందే! ఎంచక్కా ఉందండి! ఒక్క పదం పట్టుకొని కథ కట్టడం ఎంత కష్టం! శాస్త్రం అతిక్రమించరు. ఇతర విషయాలు ఎలా జోడిస్తారండి! ఫైలాలజీనుండి ఆంత్రోపాలజీకి వెళ్ళుతారు అట్టే!- అని నేను పదవిలో వున్నప్పుడు పొగడి, పదవి విరమించగానే లింగ్విస్టిక్స్‌కు అంతగా సరిపోవండి మీ రాతలు. ఖండించలేమనుకోండి. అయినా ఆ మాత్రం ఎవరు పనిచేశారు చెప్పండి-అంటూ నీళ్ళు నములేవారు నేను చచ్చిన తర్వాత

పాపం! పోయాడు. ఒందిగా పరిశ్రమించిన ఒరిజినల్ థింకరండీ? — అని కొందరైనా కనికరించకపోరు.

నా లిపి పుట్టు పూర్వోత్తరాలు పుస్తకం చదివి ఆర్కియాలజీ, ఎపిగ్రఫీ ఇంటర్వ్యూలకు వెళ్ళి ఉద్యోగాలు సంపాదించినవారు మాత్రం ఏనాడైనా నన్ను స్మరిస్తారు; కొందరైతే, ఈ పత్రికవాడికి ఏం పొయ్యేకాలం! ఏవో అవాకులూ చెవాకులూ వ్రాసుకోక — అని విసుగూ పడతారు. ఇంతకూ ఎవరు ఏమన్నా, అదే మొదటి పుస్తకం తెలుగులో.

పండుగలనాడు నన్ను కొందరైనా స్మరిస్తారు. పండుగలను గురించి, వాటి పుట్టుపూర్వాలు తరచి, ఆధునికులకు కూడా నచ్చేట్టు వ్రాసిన మరొక పుస్తకం ఏదీ? పండుగలు మనజాతి జీవితంలో మన రక్తంతోపాటు జీర్ణించుకొన్నవి. కనుక పోవు. వాటి అంతర్యవిషయాలు తెలుసుకోడానికి నా పుస్తకమూ పనికి వస్తుంది. కనుక నన్ను మరుస్తారా- అని ధీమా.

## ఫిఫ్త్ కాలమిస్టును కాను

కొన్ని పత్రికలలో పనిచేశాను గనుక, నాతో పనిచేసిన కుర్రవాళ్ళు పెద్దలై ఇంకా పత్రికల్లో వున్నారు గనుక, నేను కాలాల తరబడి వ్రాశాను గనుక, గంటకు కాలం వ్రాయకపోతే జర్నలిస్టేమిటి?- అన్న సంపాదకుల సిద్ధాంతాన్ని తు చ. తప్పక పాటించిన కాలాంతకుడను గనుక, సంపాదకుణ్ణిగా చాలామందిని ప్రోత్సహించిన కింగ్ మేకర్ను గనుక, పత్రికలలో నా చావు కబురు అరకాలమైనా పడకపోదు. ఫిఫ్త్‌కాలమిస్టును కాను గనుక పత్రిక యజమానులూ నా చావుకబురు 1/5 కాలమంతైనా వేయించకపోరు. ఇంతకూ అవసరమైన విషయాలపై మౌనం వహించి, అనవసర విషయాలు ప్రకటించడం గదా పత్రికల పని. అనవసరమైన నా చావుకబురు తప్పక వేస్తారు. జర్నలిస్టుగా పనిచేసిందెందుకు ఇలా చావకపోతే!

## ప్రవాస జీవితం

పత్రికా రచయితకు ఏ ప్రమాదంలోనో మరణం తప్పదు గనుక నా మరణవార్త ఏ పత్రికలోనో చదివి, నా అర్ధాంగి, నా నిత్య ప్రవాసజీవితానికి అలవాటు పడింది గనుక అంతగా దుఃఖపడదు. నాన్న తి.రా. అని వ్రాస్తుంటారు కదమ్మా. తిరిగిరాడు అని ఆ పొడి అక్షరాల అర్థం - అని నా పిల్లలు సర్దుతారు. తిరుమల రామచంద్రునికి తీర్థవిధిన్ ఘటియించువాడ - అని ఆశువు చెప్పి, పద్యం బాగా కుదిరింది అని మురిసిపోయే మిత్రుడు కప్పగంతుల

లక్ష్మణశాస్త్రి మాత్రం ఏ విషపుఘడియలో చెప్పానో పద్యం, నిజంగా చచ్చాడే వీడు-అని విచారించకపోడు. (దురదృష్టవశాత్తు అతడే ముందుగా 1980 జనవరిలో కీర్తిశేషుడయ్యాడు.)

నా పుస్తకాలు ఏవైనా నిలబడుతాయా? కవిత్వమంటే కొట్టుకొంటున్న జనానికి నా పుస్తకాలు ఏమి నచ్చుతాయి? కాని ఇది నిలబడుతుంది; ఇది కూర్చుంటుంది; ఇది పడుకుంటుంది; ఇది పరుగెత్తుతుంది - అని భారతి స్వర్ణోత్సవ సంచికలో నిర్ణయాలు చేసిన నోరి నరసింహశాస్త్రిగారు నా పుస్తకాలు రెండు మూడు నిలబడుతాయని, మరి రెండు నడుస్తూ పోతాయని, మరి రెండు పడుకొని ఇక లేవవని అన్నారు. కనుక ఒకటి రెండయినా నిలుస్తాయి. మరణానంతర బహుమతీ రావచ్చు.... ఛా! ఏమిటీ కీర్తిషణ! నే చచ్చిన తర్వాత ఏం మునుచుకుపోతే ఏమ్!!

నా మౌలిక పరిశ్రమను చూచి ఆనందించి, నా పరిశోధన ప్రామాణికతను ప్రజలకు తెలియజెప్పేవాడు ఎప్పుడూ పుడుతూనే వుంటాడని నా విశ్వాసం.

> "ఉత్పత్స్యతే మమ తు కోపి సమానధర్మా
> కాలోహ్యయం నిరవధిః విపులా చ పృథ్వీ."

నా వంటివాడు తప్పక పుడతాడు, కాలం అనంతం, పృథివి విశాలమైంది - అని భవభూతి మహాకవి నోరు పారేసుకో లేదూ? అలా పుట్టాలని నా ఆశ. ఆ విధంగా నేను చిరంజీవిని; ప్రతి రచయితా చిరంజీవే.

[ప్రజాతంత్ర, 19.10.1975]

30 వ పుట ప్రారంభంలో కాళిదాస మహాకవి దిలీపుని అనడానికి మారు వాల్మీకి మహర్షి రామచంద్రుని అని, 199 వ పుటలో కావ్య నిర్వచనంలో విశ్వనాథ అనడానికి మారు రాజశేఖర అని తప్పులు దొర్లాయి.

★★

264

# ఈ వ్యాస సంపుటిని గురించి

మనపూర్వులు అరణ్యాలలోనే మనుగడ సాగిస్తూ నిత్య సత్యాలను దర్శించారు. ఆ సత్యాలను పొదివికొన్నవి అరణ్యాకాలయ్యాయి. వేడిని, వెలుగునూ వెలార్చిన అరణులూ అరణ్యకాలే.

వేడిమిని, వెలుగును కొందరు సహించలేరు, వాటిని అసహ్యించుకొంటారు, నిందిస్తారు. ఇలాటివారు వెనుకా ఉన్నారు, ఇప్పుడూ ఉన్నారు, ముందూ ఉంటారు, ఎప్పుడూ ఉంటారు; ఉండాలి.

"నిందక నియరే రాఖియే అంగన కుటీ సమాయ్,
బిన పానీ సాబన బినా నిర్మల కరై సుహాయ్."

నిందించేవాడిని ఇంటి ముగింట్లో పాకవేసి దగ్గర ఉంచుకోండయ్యా; అతడు మిమ్ములన్నా, మీ స్వభావాన్ని నీళ్ళూ, సబ్బూ అవసరం లేకుండా కడిగి వేస్తాడు- అన్నాడు కబీర్‌దాస్. ఎంత మంచిమాట!

కనుక, దోషజ్ఞులయిన కోవిదులకు, దోషైకదృక్కులయిన పురోభాగులకు స్వాగతం.

Printed at Lakshmi Ganapathi Printing Press,
SRT 199, 1-1-379-50/1, Jawahar Nagar, Hyderabad - 500 020.

